సూర్యనారాయణీయము

# ఆంధ్రభాషానుశాసనము

## ప్రథమభాగము

అనుశాసనకర్త:

రాజమహేంద్రవర రాజకీయ శాస్త్రకలాశాలాంధ్ర పండితులగు

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

ప్రథమ ముద్రణము

ప్రకాశకుఁడు:

కవితా వాసుదేవయ్య

అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే

శ్రీ సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రితము.

రాజమహేంద్రవరము

1926



[ వెల 0-10-0

# పీఠిక

'సూర్యనారాయణీయ' మను పేర దేశప్రసిద్ధిగాఁ జిరకాలపఠ
నీయముగా నుండఁబోవు నీవ్యాకరణమందలివిషయ మఖండము. రచ
నాపద్ధతి నూతనము, గంభీరము. ఆంధ్రభాషయందు వాత్సల్యముగల
వాఁడ నగుటచేఁ గారణాంతరములచేతను గార్యాంతరములచేతను
వ్యవధి చాలనివాఁడ నయ్యు నేదోయొకవిధముగా దీనికిఁ బీఠిక వ్రా
యఁ బూనితిని. దీనిని బాఠకు లాదరింతురుగాక.

వ్యాకరణమును వ్రాయుపద్ధతులు రెండు. చరిత్రానుసారముగ
వ్రాయుట యొకటి. సిద్ధాంతధోరణి రెండు. చరిత్రానుసారముగ
వ్రాయువారు భాష యేయేకాలముల నేయేమార్పులు చెందినదియు
వివరించి, పరిణామప్రకార మారసి, తమకాలమందలిస్థితి యిట్టి దని
తెలుపుదురు. మఱియు గుణదోషములనఁబడునవి స్వతస్సిద్ధములై
శాశ్వతత్వమును వహించినవి కావనియు, కాలానుసరణము లనియు,
ఆనాఁటి పాలీనాఁటివిషమగుటయు, నీనాఁటిపా లానాఁటివిషముగ నుం
డుటయు సంభవించుట ప్రకృత్యతీతము గా దనియు నిరూపింతురు. ఇం
కను వ్యాకరణముతోడ జ్యోతిషమును బ్రకటింపఁ దలఁచినసాహసా
త్ములు భావిపరిణామము లిట్లుండు నేమో యని యనుమానించుట
యుఁ గలదు.

కాలక్రమాగతము లైనవికారములను నిర్వచించినమాత్రమునఁ
బరిణామపద్ధతి సంపూర్ణము కానేరదు. ఆవికారములకు జనకములైన
హేతువులను విశదీకరించుట దానివిధి. ఈహేతువు లెన్నియో విధము
లు. కొన్నిమార్పులు స్వాభావికములుగఁ గాలకల్పితములై యుండును
మఱికొన్ని పరభాషాసంపర్కముచే సంభవించును. ఒకజాతిజనులు వల

సహోవుట, పరాక్రమమున నితరదేశము లాక్రమించుట, వాణిజ్యాదుల చే నితరరాష్ట్రములతో సంబంధముగలిగియుండుట, విదేశీయులు దౌర్బల్యకీయపీడితులమైనమన వశముచేసికొని వారిభాషలను నాగరకతను మనదేశమునఁ బ్రసరింపఁజేయుట, యిత్యాదిహేతువు లీసందర్భమున నెన్నియో యూహ్యములు. శాస్త్రకారుఁడు నిష్పక్షపాతబుద్ధితో సర్వసమనట్లు వివేక మొక్కటిమాత్రము వినియోగించి యీ కారణములను వీని ఫలములకు గూడ నారయవలయును.

హిందువులలోఁ జరిత్రాత్మకమైనదృష్టి చాలానఱకుఁదక్కువ అధికారమే ఆధారముగాఁగల యమోఘసిద్ధాంతములవిరచన వీరిమనస్సున కెత్తివచ్చిన మార్గము. ఈపార్శ్వదృష్టి యిట్లు ప్రబలియుండుటకుఁ గారములు లేకపోలేదు. నిరంకుశప్రభువులు నిరంకుశగురువులు, వీరికాళ్ళక్రింద జన్మాంతరములు పడియున్నవారికి హేతువాదము పరిణామపద్ధతులు నలవడుట దుర్ఘటము. ప్రభువులను పూజారులును తమమాట వేదమని విధించి విధేయత్వమును సాధించి, తమమతములు సవికారము లని యేర్పడినచో గౌరవభంగ మగు ననుభయముచేతఁ దమకల్పన లన్నియు నిర్వికారములు సనాతనములు నని ప్రకటించుటయ కాక, విద్యావ్యాపనమును నిర్మూలించినవారై స్వతంత్రయోజనలను మొలకెత్తనీయక, ఒక్కజ్ఞాపకశక్తికిఁ దప్ప మఱియేమనఃకళలకును వికాసము గలుగనీయక దాదాపు వెయ్యేండ్లు మాయఁగట్టినందున, విజ్ఞానము, ఉపజ్ఞ, నిరాఘాటపరిశోధనలు మనయందు శోషించి యున్నవి. సుమారు 900 వ, సంవత్సరమువఱకు దినదినవర్ధమానమై నూతనములైనకొమ్మలు చిగుళ్లు పువ్వులు పండ్లు వెలయించుచున్న హిందూమహావృక్ష మేసందర్భములచేత, నేహేతువులచేతఁ, బెరిగెడుశక్తిని గోల్పోయినదో యది యితిహాసమండలమునకుఁ జేరిన విచారము. ఏ

మెట్లున్నను, ఇప్పుడొకటి రెండుతరములుగఁ బునర్వికాసభాసురమై
యది తలిర్చుచున్నది. మనలోనినూతనకవిత్వములు విమర్శనలు చరి
త్రగ్రంథములు భాషాపరిశోధనలు మొదలగునవి నాయీయుత్సాహ
వాక్యమునకు దృష్టాంతములు.

మనజీవితము పునర్యౌవనము దాల్చి నవ్యకళాశోభిత మగుచు
న్న దనుటకుఁ దార్కాణముగఁ జూపఁదగినయుద్గ్రంథములలో శ్రీ
పుల్లాదిసూర్యనారాయణశాస్త్రిగారి 'ఆంధ్రభాషానుశాసన, మొక్క
టి. 'ఆంధ్రభాషానుశాసన పరిణామ ప్రకార, మని దీనికి ద్విజత్వసూచ
ద్వితీయనామకరణము చేయుదురు రేని గ్రంథముయొక్క స్వభావమిం
కను బరిస్ఫుట మగును. ఏలనఁగా, జారిత్రాత్మకదృష్టిపైఁ బరిణామ
పద్ధతిని బట్టి వ్రాయఁబడినవ్యాకరణ మియ్యది. ఈయాధునికాచార
సరీతిని రచింపఁబడినగ్రంథ మింకెద్దియు నాకుఁ దెలిసినది లేదు.
ఒకవేళ నెందయిన నుండెనేమో గాంభీర్యమునందును సర్వాంకషత్వ
మునందును దీనితో సమానముగా నుండుట వ్రికృత మరిది యనితోఁ
చెడిని. ఈశ్లాఘన యతిశయదోషభూయిష్ఠమై యున్నయెడల దాని
యువిచారణ కారోపింతురుగాని పక్షపాతమునకు వలదు.

పరిణామపద్ధతిప్రకారము వ్రాయుట కాధారములైన సామగ్రు
లు ప్రతిదినమును సేకరింపఁబడుచున్నవి. బిషప్ కాల్డువెల్లు, ద్రావిడ
భాషలసమీపబాంధవ్యమును స్థాపించి మార్గదర్శకుఁ డాయెను. ఫీ
లాలజీ యనఁబడుభాషాతత్త్వశాస్త్ర ప్రకారము మరాఠీ, తెనుఁగు
ద్రవము కన్నడము మొదలగుభాషలను బరిశీలించి వానియొక్కసా
దృశ్యములను శేషగిరిశాస్త్రిగారు మొదలగుకొందఱు పండితులు వ్యా
ఖ్యానించి యున్నారు. మఱియుఁ బ్రాచీనశాసనపరీక్ష లీకాలమున గొ
ప్పనాగరు శాఖగ నేర్పడి నెలవేర్పఁబడుచున్నవి. తెనుఁగుదేశము
న కే. వి. లక్ష్మణరావుగారు శ్రీజయంతి రామయ్యపంతులుగారు

ఐతిహాసిక మండలివారు, ఆంధ్రపరిషత్తువారు ఇత్యాదిమహనీయులు శాసనములప్రతిబింబములను బ్రచురించి యాయాకాలములందు లి: స్వరూపము లెట్లుండెను, ప్రయోగములు అర్థములు ఛందస్సులు నెట్లుండెను, అనువిషయములకు నిర్ధారణసూత్రము లేర్పఱచుటలో విశేషించి కృషిచేసి శాస్త్రాభిమానులమన్ననకుఁ బాత్రు లైరి. శ్రీ మానవిల్లి రామకృష్ణయ్యగారు ప్రకటించిననన్నెచోడుని కుమారసంభ వము భాషావిషయకవిచారణలలో నూతనయుగమును స్థాపించిన దన వచ్చును. శ్రీ నడకుదుటివీరరాజు ప్రభృతిపండితులు ప్రాచీనసంప్రదా యముల వితర్కించుచు నూతనాంశములను బ్రసిద్ధిపఱచుచున్నారు. రాజరాజనరేంద్రుని పట్టాభిషేకసంచికలో నన్నయభట్టుయొక్క ప్ర యోగవిశేషములు కనఁబడును. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో వీరరాజుగారు ఈపరిశోధనామర్యాదకు నన్నెచోడుని గుఱిగాఁజేసి యనేకవ్యాసములు వ్రాసియున్నారు. ఈ విశాలపరిపంచమున శ్రీ సూర్యనారాయణశాస్త్రిగారును స్వయంకృషిపైఁ బంటకుఁ దెచ్చి వస్తురాశి గుణమునందును బరిణామమునందును అమేయమై యున్న ఎన్నియోసంవత్సరములుగఁ దదేకనిష్ఠతో ఆర్జించినయర్థచయముఁ ను భాషాకైంకర్యార్థ మిందు మనభాగ్యమున సమర్పించి యున్నారు ఇట్లు నానాఁటికి భాషాజ్ఞానము విస్తరించుటయ కాక శాస్త్రవిధేయ మైనవికారముంగూడఁ దాల్చుచున్నది. ఈభాషాసామగ్రియింతటితో ముగియదు. దినదినాభివృద్ధిని గాంచుచు. అందుచే నీఁక నెట్టినూతన నుమానములు స్థాపింపఁబడఁనున్నవో యెవరి కెఱుక?

నేను విద్యార్థిగా నున్నకాలములో సాంప్రదాయమును ఉపన్ సించు సిద్ధాంతవ్యాకరణములే కాని చారిత్రాత్మకవ్యాకరణముల మందున నైన లేవు. తుద కింగ్లీషుభాషలో నున్నవిషయములైనఁ బ వర్తించి మాకెవ్వరును జూప రైరి. శ్రీపరవస్తుచిన్నయసూరిగా

పెట్టినదే భిక్ష. నన్నయభట్టీయమును స్పృశించుటయుఁ గలదు. కాని దేనిని జదివిన నొక్కఁటే భక్తిరసముతో వేదపారాయణము చేసి నమస్క్రియే కాని యుక్తిరసము స్వతంత్రవిమర్శనము లేదు. నిత్యము వికల్పము బహుళము ఆర్యవ్యవహారంబుల దృష్టంబులు గ్రాహ్యంబులు, అనివర్గీకరణ మున్నను, ఏకాంశముచేత నీవివిధపరిణామములు సంభవించెనో దాని నారయవలయు నన్న చిత్తవికార మైన మాకుఁగలిగినదిగాదు. తుదకు భాషాప్రయోగముల నైన ఆమూలాగ్రముగ నారసి సూత్రనిర్ధారణ చేయుటయుఁ వఱుచు గానరాదు. వ్యాకరణమనిననే తలనొప్పి. కారణములు చెప్పి చూపి విశదీకరించక మతమురీతిగా వల్లింపఁ జేసినయెడల శిరోవేదన కాక చిత్తవికాస మెట్లు కలుగును? కాలేజిక్లాసులలో నయితము వ్యాకరణ మనిన గ్రుడ్డిపాఠమనిపేరు. తుదకుఁ దర్కశాస్త్రసంబంధిగా నుండు కారకపరిచ్ఛేదమునైన హృదయాకర్షకముగాఁ జెప్పెడియాచారము లేదాయెను.

కారణాతీతమైన సనాతన సిద్ధాంతముగా వ్యాకరణము వ్రాసిన వారిలో నన్నయ్యయు చిన్నయ్యయు అగ్రగణ్యులు. ఆవ్యాకరణములును సప్రయోజనములు. వానియందు గౌరవభావ ముంచుట న్యాయమే. శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి పద్ధతి నవీనము,స్వతంత్రము. రియనుశాసనపరిణామప్రకారములోని నూతనాంశము లెల్ల వివరింపఁ బూనినయెడలఁ బీఠికకు మాఱుగా గ్రంథము వ్రాయవలసివచ్చును. ఈనాఁటివఱకుఁ బ్రోగైన సామగ్రులను వివేకముతో నుపయోగించి యున్నారు. ప్రతి ప్రకరణమునందును చారిత్రకదృష్టియు, అసాధారణ యోజనాశక్తియు విస్పష్టములు. ఇందు సుమారు 160 గ్రంథములలోని ప్రయోగములు క్రోడీకరింపఁబడియున్నవి. ఇం దన్నిప్రకరణములును జదువవలసినవే యైనను ప్రథమభాగములోని యవ్యయసంధిప్రక

రణములను ద్వితీయభాగములోని యన్ని ప్రకరణములును (అందును ముఖ్యముగా శబ్దకారక ప్రకరణములు) ఈశాస్త్రిగారియనన్యశాస్త్రపవిచారణవిన్యాసములకు మంచియుదాహరణములు. పండితులకును విద్యార్థులకును రసవంతముగ వ్యాకరణమును ద్రాక్షాపాకముగ నివేదించు గ్రంథమును రచించిన శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి నెంత ప్రశంసించినను అత్యుక్తి తటస్థింపదు.

ఆంధ్రవిశ్వవిద్యాపీఠము
బెజవాడ
9—9—26



ఇట్లు
పండిత విధేయుఁడు
కట్టమంచి రామలింగారెడ్డి.



# వి జ్ఞ ప్తి

—

...ర్యులారా!

ఇప్పటికిఁ బదియేనుసంవత్సరములనుండి వాదప్రతివాదములు ...ల్పుచున్న గ్రాంథికవ్యావహారిక భాషాపక్షములలో నేను గ్రాంథిక ...క్షమునకుఁ జేరినవాఁడను. అప్పటికి నిప్పటికిఁ గూడ నేను గ్రాంథిక ...వాదినే. కాని పైవివాదములు బయలువెడలినపిదప భాషాసంప్రదాయ ...జ్ఞానతోఁ దొల్లి లౌకికభాషగా నున్న సంస్కృతమునకు సంస్కా...రానుగుణముగా ననుశాసనములు చేసిన మునిత్రయమువారిసంస్కార...క్షవాక్యములు మననముచేసియుఁ బ్రయోగదృష్టితో నాంధ్రభార...ము మొదలుగాఁ బ్రాచీనార్వాచీనకావ్యము లనేకములు పఠించియు ...క్షణదృష్టితో నాంధ్రశబ్దచింతామణి మొదలుగాఁ బ్రాచీనార్వాచీన ...వ్యాకరణములు పరిశీలించియు, దేశకాలభేదమున లౌకికభాషలకు ...మార్పు నైజ మనియు మాఱినశబ్దములను బూర్వపూర్వకవులు ప్రమా...ముగా నుత్తరోత్తరకవులువాడుట సహజ మనియు నట్టివానికి నయ్యా...కాలముల లక్షణకర్తలను శాసనము చేయుట యాచారమనియు గ్రహించి ...సన్నయాదిప్రాచీనులు వాడినదే గ్రాంథికభాష కాదు, పెద్దనార్యుఁడు ...మున్నగు నర్వాచీనులు వాడినది గూడ గ్రాంథికమే" యని నిశ్చయించి ...ని, యర్వాచీనకవిప్రయుక్తము లైన బహుశబ్దము లసాధువు లనెడి ...వాదము సముచితము గాదని తలంచితిని. అట్లే కేవల శిష్టవ్యవహారము ...లోని యనేకశబ్దములును వానిరూపాంతరములును గూడ గ్రాహ్యము ...నెడివ్యావహారికభాషావాదమింకను సర్వజనసమ్మోదము పడయు ...అకు నంగీకార్యము గా దనియు నూహించితిని.

ఇట్లు భావించి పైయుభయ పక్షములకు మధ్యస్థుఁడనై, ఇంత ము న్నున్న వ్యాకరణము లతి సంక్షిప్తములును బరస్పరవిరుద్ధము నగుటచే భాషాతత్త్వము తెలుపఁ జాల కున్నవని యెఱిఁగియు, దేశ వృద్ధి కత్యావశ్యక మైనసాధనసామగ్రిలో ముఖ్యమై బహువిధజ్ఞాన ధక మైనయభినవవాఙ్మయ మవతరింపవలసియున్న యీ కాలము దెలుఁగు వా రందఱికిని మాతృభాషారచనము సుబోధము సుకర నగునట్లు సులభమార్గమున బోధింపఁ జూచునాయత్న మాంధ్ర యితలకుఁ గొంతవఱకైనను సహకారి కాకపోదని యూహించి ప్రా నార్వాచీనభాషాసంప్రదాయములను శక్తికొలఁది వివరించుచు నీయ శాసనము చేయ సంకల్పించితిని. నాసంకల్పము నీక్రిందఁ బేర్కొ పెద్దలవ్రాతలు బలపఱిచినవి.

బాలసరస్వతి అప్పకవి రంగరాజు గురుమూర్తిశాస్త్రి శేష శాస్త్రిమున్నగు లక్షణకర్తలు శిష్టవ్యవహారమందున్న భాషలో నే వ్రాసి వ్యాకరణవివరణములు తొలుత నాకుఁ జేయూఁత యిచ్చినవి.

కీ. శే. వీరేశలింగము పంతులుగారు స్వీయచరిత్రములో "పూ ర్వవ్యాకరణములన్నియుఁ బద్యకావ్యములకొఱకే వచనకావ్యము లేనికాలమునఁ బుట్టిన వగుటచే నందలి లక్షణము లనేకములు వచ కావ్యాభివృద్ధికిఁ దగ వనియు నిప్పటికాలమునకుఁ దగినట్టుగా వ్యాక ణమును మార్చుకోవలయు ననియు నే ననుకొని యీకాలమునకు వచనరచనాభివృద్ధికిని దగినట్టుగా నొకనూతనవ్యాకరణము వ్రాసి దాని లక్ష్యముగా నొకవచనకావ్యము చేయవలెనని పలుమాఱు తలపోసితిని" అనివ్రాసిరి. కీ. శే. వేరి కాశీనాథశాస్త్రిగారు 1912 లోఁ జెన్నపు రమున జరిగినపండితసభలో "శిష్టవ్యవహారమం దున్న తెలుఁగుభాష సంస్కారార్హ" మని యుపన్యసించిరి. ఈయభిప్రాయమునే మహ మహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు "ఆంధ్రభాష

సంస్కరణ' మనెడివ్యాసమున సయుక్తికముగా సప్రమాణముగా వివ
రించిరి. 1914 లో, ఎలమంచిలిలో జరిగిన విద్వత్సభలో "శిష్టవ్యవ
హారమం దున్నభాష గ్రామ్య మనుట శాస్త్రవిరుద్ధ" మనెడి యుప
పాదనమును బ్ర. వడ్లు లచినసీతారామశాస్త్రిగారు మొదలగువిద్వాంసు
లనేకు లామోదించిరి. 1915 లో బందరు కళాశాలలో జరిగిన పండిత
సభలోఁ దక్కిన పండితులవలెనే యార్వాచీన కవిప్రయుక్తము లైన
యనేక శబ్దములు గ్రామ్యము లగు నని చెప్పుచు నాసతీర్థ్యులగు శతావ
ధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు "ఈ ప్రయోగములలోఁ గొన్ని
దుష్టము లయ్యు నిటీవలివారియపరిశీలకత్వము వలన సత్ప్రయోగ
ములు గా నెన్నఁబడుచున్నవి. ఏది యెట్లయినను ఆయా విచారము
కవులకుఁ గాని సామాన్యరచయితల వ్రాఁతలయందు విశేషించి చూ
పఁగూడ దనువాదము సత్యదూరము గాదు." అని యభిప్రాయ
మిచ్చిరి. 1915 కాకినాడలో జరిగిన పండితసభలో సభ్యులయిన శ్రీ
...త్తిలి సూర్యనారాయణగారు "కేవల గ్రాంథిక భాషాభిమానినై
యుండియు సత్యము గ్రహించినపిదప నాపూర్వాభి ప్రాయమును
మార్చుకొని సద్గ్రామ్యము సజ్జనగ్రాహ్యమే యగునని నాయభిప్రాయము
వెల్లడించుచున్నాను" అనివ్రాసిరి. 1916 లో, కొవ్వూరిలో జరిగిన
సారస్వతమహాసభలో సభ్యులుగా నున్ననాసతీర్థ్యులును కీర్తిశేషులు
నగు శతావధాని దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు కీ. శే. రాజా కొచ్చర్ల
కోట వెంకటకృష్ణారావు బహదరుగారు. కీ. శే. వీరేశలింగము
పంతులుగారు కీ. శే. తల్లాప్రెగడ సూర్యనారాయణరావుగారు.
శ్రీ చిలుకూరివీరభద్రరావుగారు మొదలగువనేకవిద్వాంసులు "తెలుగు
మాటల సాధుత్వాసాధుత్వములు స్పష్టముగా బోధించే తెలుగువ్యాక
రణము, లేనందుచేతను ఉన్నవి పరస్పరవిరుద్ధములుగాను అసంపూ
ర్ణములుగాను ఉన్నందుచేతను వ్యాకరణమునకు మూలము ప్రయో

గములే యగుటచేతను తెలుగుగ్రంథములలోని ప్రయోగములు ప్రమాణముగా అంగీకరింపక తప్పదు. నేటివాడుకలోనున్న పదములు నూరు సంవత్సరములనుండి పెద్దలవాడుక చొప్పున ఉన్నట్లు నిదర్శనములున్నపుడు అవి నిర్దుష్టములుగా ఎన్నవలెను. నేడు తెలుగుదేశమందంతటను పెద్దలవాడుకలో ఏకరూపమున ఉన్న పదములు పూర్వకాలపుగ్రంథములలో కనబడకపోయినను నేటిగ్రంథములలో నున్నయెడ సాధువులే అనుతీర్పు నంగీకరించి యున్నారు. 1916 లోఁ జెన్నపురమునందలి కలాశాలలలోని పండితులు దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారు నరసింహముపంతులుగారు మొదలగువారు అధ్యాచీనకవిప్రయోగము లనేకములు సాధువు లనియు గ్రాహ్యము లనియు నంగీకరించిరి. ఇట్లే బ్ర. వ్రియాగ వెంకటరామశాస్త్రిగారు మొదలగు ననేక పండితు లభిప్రాయము లిచ్చియున్నారు.

ఇట్లున్న పండితాభిప్రాయము లూఁతగాఁ గొని పాఠశాల కలాశాలలలోని విద్యార్థులకును తక్కినభాషాభిలాషులకును సుబోధమగు నవీనపద్ధతి యేర్పఱచుకొని మూఁడుసంవత్సరములు నిరంతర దీక్ష వహించి యథామతిగా గ్రాంథికాంధ్రమున కీయనుశాసనము రచియించి యాంధ్రలోకమునకు సమర్పించినాను. కాని యిది సమగ్రము కాదు. వివిధమండలములలో వేలు వేలు తెలుఁగుల వాడుకలో నున్న యపారశబ్దజాలమున కాయామండలములలోని పండితుల పెక్కండ్రు కలిసి చేయఁదగినయనుశాసన మొక్కమాఱుగా సమగ్రముగాఁ జేయుట నా కొక్కనికి సాధ్యము గాదు. ప్రయోగమూలముగా నీ యనుశాసనము చేసినను కవిశిష్టప్రయుక్తములుగాఁ గనవచ్చుచున్న ఇస్తిని-వచ్చేనా-వస్తూపోతుంటేను-వస్తాఁడు-కూర్చొనును- మొదలగు పెక్కురూపముల కనుశాసనముచేయక నేను ప్రమాణముగా

గొన్న "ప్రయోగమూలంవ్యాకరణ" మ్మనువారోక్తి నిప్పటికి మీఱినవాఁడ నైతిని.

మఱియు నేననుశాసించినశబ్దములనీయనుశాసనరచనమునని పుడుపయోగింపక భాషాసంఘప్రిబాయవేత్తలయనుమతిపై దృష్టి నిలిపితిని. అర్వాచీనలాక్షణికులు కొందఱ అవలంబించినపద్ధతిని చదువరులు సులముగాఁ జదివికొని యర్థము గ్రహించుటకై తఱచుగా నిందు సంధి పాటింపలేదు.

ఈగ్రంథము వ్రాయునపుడు నాయొద్దనున్న ప్రయోగములకుఁ దోడుగా మఱికొన్ని ప్రయోగములు గూడ లభించిన మేలని తలఁచి నామిత్రులగు శ్రీచిలుకూరి నారాయణరావుగారి నడిగి కొన్ని గైకొని వారిమాటనుబట్టి శ్రీ రావుసాహేబు గిడుగు వెంకటరామమూర్తిపంతులుగారి కొకజాబు వ్రాసితిని. అది యందినంతనే నేను బ్రతిపక్షములోనివాఁడ నని శంకింపక చిరకాలపరిచితులగుటచే సద్భావము వహించి తా మీపదియేనుసంవత్సరములనుండియు బహుశ్రమ చేసి యాంధ్రవాఙ్మయ మంతయు సవిమర్శముగాఁ జదివి సంగ్రహించి యున్నయనేకప్రయోగములను నాకందఁజేసిన శ్రీపంతులుగారికిఁ గృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను.

బహువిధకార్యనిమగ్నులయ్యు నాంధ్రవాఙ్మయతత్త్వజ్ఞులగుటంజేసి యీయనుశాసనమందందు గొంత విని దీనికిఁబీఠిక వ్రాయ సమ్మతించిన యాంగ్లాంధ్రభాషాసంప్రదాయవేత్త లగు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డి ఎమ్. ఏ; ఎమ్. యల్. సి గారి యుదారహృదయత్వము నెంతయుఁ గొనియాడుచున్నాను.

ఈగ్రంథమునఁ గలయచ్చుతప్పులు గొన్ని శుద్ధపత్రికలోఁ జూపితినిగాని యింకను గొన్ని కల వని యెఱుఁగుదును. అట్టివానిని జదువరులు సవరించుకొందురుగాక యని కోరుచున్నాను.

ప్రతిష్ఠకై కాక కేవలము భాషాసేవయం దాదరముతో బహు శ్రమకు సహించి చేసినయిది ప్రథమప్రయత్న మగుటచే నిందు గొన్ని లోపములును దోషములు నుండకపోవు. అట్టివానిని గుణజ్ఞులును సహృదయులు నగుభాషాభిమానులు సమాదరబుద్ధితో నాకుఁ దెలియఁ జేసినయెడల వారియెడ నెంతయుఁ గృతజ్ఞుఁడనై యట్టివానిని బునర్ముద్రణమున నుచితరీతిని సవరించుకొందు నని విన్నవించు చున్నాను.

ఇట్లు
బుధజనవిధేయుఁడు
మల్లాది సూర్యనారాయణశాస్త్రి.



ఈయనుశాసనమునఁ జేర్కొన్న గ్రంథములను తత్కర్తలను దెలుపుపట్టిక. ఇందున్న గ్రంథ సంపూర్ణనామములను బట్టి గ్రంథసంకేతములను గ్రహించునది.

గ్రంథముపేరు—కవిపేరు

అచ్చతెలుఁగురామాయణము— తిమ్మకవి
అథర్వణవ్యాకరణము
అథర్వణకారికావళి
అధోక్షజఘక్కి—
అనంతునిఛందస్సు—అనంతుఁడు
అనిరుద్ధచరిత్ర—అబ్బయ్య
అప్పకవీయము
అహోబలపండితీయము
ఆంధ్రకౌముది—లక్ష్మీనరసింహకవి
ఆంధ్రనామసంగ్రహము—లక్ష్మణకవి
ఆంధ్రభాషాభూషణము—కేతన
ఆంధ్రభాషార్ణవము—వెంకనార్యుఁడు
ఆంధ్రరత్నాకరము
ఆంధ్రశబ్దచింతామణి
ఆముక్తమాల్యద—కృష్ణరాయలు
ఇందుమతీపరిణయము—కుమారధూర్జటి
ఉత్తరనైషధము—ధర్మయకవి
ఉత్తరరామాయణము—పాపరాజు
ఉత్తరహరివంశము—నాచన సోమన
ఉష—వే. వెంకటరాయశాస్త్రి
ఏలామాహాత్మ్యము తిరుపతివేంకటకవులు
కకుత్స్థవిజయము—అనంతభూపాలుఁడు
కవికర్ణరసాయనము—నృసింహకవి
కవిచింతామణి—తాతంభట్టు
కవిజనరంజనము—[illegible]న్న

కవిజనాశ్రయము—భీమకవి
కవిజనచకోరచంద్రోదయము—కాంతకవి
కవిరాజమనోరంజనము—అబ్బయ్య
కవిసంశయవిచ్ఛేదము—సూరకవి
కవిసంజీవిని—ము. రామన్న
కస్తూరిరంగశతకము
కళాపూర్ణోదయము—పింగళి సూరన్న
కారికావళివ్యాఖ్య—సీతారామకవి
కావ్యాలంకారచూడామణి—పెద్దన
కాశీఖండము—శ్రీనాథుఁడు
కాళహస్తిమాహాత్మ్యము—ధూర్జటి
కాళహస్తీశ్వరశతకము ,,
కుమారసంభవము—నన్నెచోడుఁడు
కువలయాశ్వచరిత్ర—చిననారాయణ
కృష్ణభూపాలీయము—చంద్రకవి
కృష్ణరాయవిజయము—కుమారధూర్జటి
కేయూరబాహుచరిత్ర—మంచన
చంద్రభానుచరిత్ర—మల్లన
చంద్రాంగదచరిత్ర—వేంకటపతి
చంద్రికాపరిణయము—మాధవరాయలు
చమత్కారమంజరి—వేంకటకవి
చంపూరామాయణము—వేంకటాచలపతి
చిత్రభారతము—చరిగొండ ధర్మన్న
చెన్నపురీవిలాసము—నృసింహకవి
చెన్న[illegible]య

జైమినిభారతము—పినవీరభద్రుఁడు

జ్ఞానవాసిష్ఠము—వేంకటరమణకవి

జ్ఞానప్రసూనాంబికాశతకము సర్వశాస్త్రి

తెలుఁగువ్యాకరణము—గురుమూర్తిశాస్త్రి

దశకుమారచరిత్ర—కేతన

దశావతారచరిత్రి—రామనమంత్రి

ద్రౌపదీపరిణయము—అ. రామకృష్ణకవి

నరసభూపాలీయము—మూర్తికవి

నరసింహపురాణము—హరిభట్టు

నరసింహవ్యాకరణము—నరసింహకవి

నిరంకుశోపాఖ్యానము—రుద్రయ్య

నిర్వచనవిచిత్రరామాయణము—వెంకటకవి

నిర్వచనోత్తరరామాయణము—తిక్కన

నీలాసుందరీపరిణయము—తిమ్మకవి

నృసింహపురాణము—ఎఱ్ఱన

నైషధము—శ్రీనాథుఁడు

పంచతంత్రము—నారాయణకవి

పట్టాభిరామాయణము—వెం॥ రామకృష్ణకవి

పండితారాధ్యచరిత్ర—పా॥ సోమన్న

పద్మపురాణము—మడికి సింగన్న

పరమయోగివిలాసము—తిమ్మరాజు

పాంచాలీపరిణయము—కాకమానిమూర్తి

పాండురంగమాహాత్మ్యము రామకృష్ణుడు

పారిజాతాపహరణము—నంది తిమ్మన

పార్వతీపరిణయము—రఘునాథరాజు

ప్రబంధరాజ వెంకటేశ్వరవిజయ విలాసము—వేంకటగవి

ప్రభావతీప్రద్యుమ్నము—సూరనార్యుఁడు

ప్రభులింగలీల—పిడుపర్తి సోమన్న

ప్రబోధచంద్రోదయము మల్లయ్యసింగయ్య

బసవపురాణము—పిడుపర్తి సోమన్న

బహులాశ్వచరిత్ర—వేంకటపతి

బాలవ్యాకరణము—చిన్నయసూరి

బాలసరస్వతీయము—

బిల్హణీయము—

భల్లాణచరిత్ర—వాలేశ్వరుఁడు

భాగవతము పోతనార్యుఁడు

భానుమతీపరిణయము—రంగరాజు

భారతము—కవిత్రయము

భీమఖండము—శ్రీనాథుఁడు

భోజరాజీయము—అనంతామాత్యుఁడు

మంగళాఁయి—కా. బ్రహ్మయ్యశాస్త్రి

మధురనాయకులదానపత్రములు—

మనుచరిత్ర—పెద్దనార్యుఁడు

మర్యాదరామచరిత్ర—వెంకమరాజకవి

మాతృభాషాసేవ—జ. రామయ్యపంతులు

మార్కండేయపురాణము—మారన

మిత్రవిందాపరిణయము—వేంకటాచలపతి

మృత్యుంజయవిలాసము—కూర్మనాథకవి

మొల్లరామాయణము—మొల్ల

యయాతిచరిత్ర—తెలగన్న

యుద్ధమల్లునిశాసనము

రంగనాథరామాయణము—

రంగరాట్ఛందస్సు—రంగకవి

రంగారాయచరిత్ర—నారాయణకవి

రఘునందనశతకము—

రాజారాజాభిషేకము—అం. నృసింహకవి

రాజవాహనవిజయము—కాకమానిమూర్తి

రాజశేఖరవిలాసము—తిమ్మకవి

రాధామాధవసంవాదము—వేంకటపతి

రాధికాసాంత్వనము—ముద్దుపళని
రామరాజవిజయము—అం. వెంకయ్య
రామస్తవరాజము—మల్లయామాత్యుడు
రామాభ్యుదయము—రామభద్రుడు
రామాయణము—భాస్కరాదులు
రుక్మాంగదచరిత్ర—ప్రౌఢకవిమల్లన
రుక్మిణీపరిణయము—తిమ్మకవి
రేఫఱకారనిర్ణయము—పెదతిరుమలయ్య
లంకావిజయము—లక్ష్మణకవి
వరాహపురాణము—మల్లయ్య, సింగయ్య
వసుచరిత్ర—రామరాజభూషణుడు
వాసిష్ఠరామాయణము—మడికిసింగన్న
విక్రమార్కచరిత్ర—జక్కయకవి
విజయవిలాసము—వేంకటకవి
విజ్ఞానేశ్వరీయము—కేతన
విప్రనారాయణచరిత్ర—మల్లయకవి
విష్ణుపురాణము—వెన్నెలకంటిసూరన్న
వీరనారాయణశతకము
వైజయంతీవిలాసము—తిమ్మయ్య
శబ్దరత్నాకరము—సీతారామాచార్యులు
(తారా) శశాంకవిజయము—వేంకటపతి
శశిరేఖాపరిణయము—వేంకటరంగకవి
శివరహస్యఖండము—వేంకటాచలపతి
శివరాత్రిమాహాత్మ్యము—శ్రీనాథుడు
శుకసప్తతి—కదిరీపతి
శృంగారశాకుంతలము — పినవీరభద్రుడు
శేషధర్మములు—తిమ్మయ్య
శ్రీకృష్ణజన్మఖండము—గో॥ వేంకటకవి
శ్రీకృష్ణభారతము—కృష్ణమూర్తిశాస్త్రి
శ్రీరంగమహాత్మ్యము—భైరవుడు
షట్చక్రవర్తిచరిత్ర—మల్లారెడ్డి
సంపంగిమన్నశతకము
సత్యవతీచరిత్ర—కం॥ వీరేశలింగము
సమీరకుమారవిజయము పుష్పగిరితిమ్మన
సర్వలక్షణసారసంగ్రహము—తిమ్మకవి
సానందోపాఖ్యానము—శివరామయ్య
సాంబనిఘంటువు—రంగకవి
సారంగధరచరిత్ర—వేంకటకవి
సారంగధరనాటకము—పా॥ లక్ష్మి నరసింహారావు
సుకవిమనోరంజనము— వెంకటరాయుడు
సుధాశరచ్చంద్రము — చిలకమర్తి లక్ష్మినరసింహము
సుభద్రాపరిణయము—జగ్గకవి
సుమతిశతకము
సురాభాండేశ్వరము—ఘట్టు ప్రభువు
సోమలదేవిశాసనము
హరవిలాసము—శ్రీనాథుడు
హరిశ్చంద్రద్విపద—గౌరన
హరిశ్చంద్రనలోపాఖ్యానము— రామరాజభూషణుడు
హంసవింశతి—అయ్యలరాజు నారాయణ
హిందూధర్మశాస్త్రసంగ్రహము— చిన్నయసూరి.

---

# విషయసూచిక.

## ప్రథమభాగము

శ్రీరస్తు

గణేశాయనమః

ఓన్నమః పరబ్రహ్మణే

# ఆంధ్రభాషానుశాసనము

## సంజ్ఞాప్రకరణము

### అవతారిక

శ్లో॥ వాణీం ధ్యాత్వా గురూ న్నత్వా
స్మృత్వా లాక్షణికాన్ కవీన్
మత్వా తదుక్తీ రచయా
మ్యాంధ్రభాషానుశాసనం.

సూత్రము:—ఇది ఆంధ్రభాషానుశాసనము. ౧

ఆంధ్ర దేశమునందు వాడఁబడునదియు, ఆంధ్రులనెడి యొక తెగ వారు వాడుకొనునదియు నగుభాష ఆంధ్ర మనఁబడును. ఒకరియభి ప్రాయ మింకొకరికిఁ దెలియుటకై జను లేర్పఱుచుకొనిన వాగ్రూప ములైన గుర్తులు భాష యనఁబడును. అది వాగ్రూపముగాను లిఖిత రూపముగాను గూడ నుండును. ఎఱుకులభాష కోయభాష మొదల గునవి కొన్ని కేవలము వాగ్రూపములు. తెలుఁగు తమిళము కన్నడ ము మున్నగునవి వాగ్రూపములును లిఖితరూపములును గూడ నగును.

అంధ్రులనెడియొక తెగవారికి నివాసమైనజనపదమునకు (అనగా ఉన దేశమునకు) ఆంధ్ర మనియు, వారిభాషకు ఆంధ్రభాషయనియుఁ

ధ్రొలుతఁ జేర్చు గలవు. తరువాతఁ గ్రమముగా ఆంధ్రు లనెడిమాట ఆ
ధ్రులై నది. ఆంధ్రులయొక్క భాష ఆంధ్రభాష. ఇది యిట్లుండును, ఇ
యిట్లుండదు, అని చెప్పుట యనుశాసన మనఁబడును. కాఁబట్టి ఇ
(అనఁగా ఈగ్రంథము) ఆంధ్రభాషానుశాసన మని పేర్కొనఁబ
చున్నది.

సూ:—శబ్దసిద్ధి లోకవ్యవహారమునుబట్టి గ్రహింపఁ దగును.

తెలుఁగుమాటల సిద్ధస్వరూపము లోకముయొక్క వాడుకన
బట్టి తెలియఁ దగును. లోక మనఁగా శిష్టలోక మని యర్థము. శిష్ట
వాడుకవలననే శబ్దముల సిద్ధరూపములు తెలియుచుండఁగా ని
ననుశాసన మేల యనరాదు.

సూ:—* సంస్కారార్థము నియమము.

నియమ మనఁగా, అనుశాసనము లేక శాస్త్రము. దీనికే లక్ష
మనియుఁ బేరు. ఇది సంస్కారము ప్రయోజనముగాఁ గలది. స
స్కారము శబ్దముల నాశ్రయించి యుండునది. అనఁగా వాడుకలో
వర్ణలోపవర్ణాగమాదులచేఁ గలుగుమార్పులే సంస్కారశబ్దమునఁ జెప్ప
బడును. ఇందు కొకయుదాహరణము.

వచ్చినవాఁడను అనుశబ్దము, వచ్చినాఁడను వచ్చినాను వచ్చాను
అనువిధముగా మాఱినది. ఇందలిమార్పే సంస్కార మనఁబడును

ఇది సుశబ్దము, ఇది యపశబ్దము, అనెడి పరిజ్ఞానము సంస్కా
మని కొందఱును, శబ్దసిద్ధియే సంస్కార మని కొందఱును వ్రాసిరి
ఈరెండుమతములు గూడ నిందు సమన్వయించును.

---

* వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయ ప్రకృతిభావ లక్షణ స్సంస్కారః
అని కాత్యాయనుని ప్రాతిశాఖ్యము.

"వచ్చినాఁడను వచ్చినాను అనునవి శిష్టవ్యవహారమందును, కావ్యములందును గనవచ్చుచున్నవి కావున సుశబ్దము లని తెలియు చున్నది. వచ్చాను అనునది శిష్టవ్యావహారిక మైనను సత్కవిప్రయుక్త ము కాలేదు కావున నపభ్రంశ మనఁబడుచున్నది. «బోగమమ్మోరుల తిరతమోాయి" ఇత్యాదులు కావ్యప్రయుక్తము లైనను, పరిహాసార్థము లగుటచే శిష్టసమ్మతములు కావు" అనెడి శబ్దపరిజ్ఞానమే ప్రయోజ నము గాఁ గలది నియమ మనఁబడును.

ఈసుశబ్దాపశబ్దపరిజ్ఞానమునకుఁ బూర్వవ్యాకరణము లుండఁగా మరల నీయనుశాసన మేల యనియు శంకింపరాదు. భాష ప్రవాహ గతిని మాఱుచుండుటయు మాఱినశబ్దజాలమం దర్హము లయినశబ్దము లను కవులు తమకావ్యములఁ బ్రయోగించుచుండుటయు, అట్లు శిష్టు లవాడుకలోను గ్రంథములలోను గనవచ్చుశబ్దముల కనుగుణముగా నయ్యాకాలములందు భాషాసంప్రదాయవేత్త లనుశాసనము చేయు టయు ననుధర్మములు, ఏజీవద్భాష కైనను దప్పవు. అతి ప్రాచీన మైన సంస్కృతమునకుఁ గూడ నిట్టిధర్మము గలదని మన మెఱుఁగుదుము.

తొల్లి భారద్వాజుఁడు గార్గ్యుఁడు శాకల్యుఁడు శాకటాయనుఁ డు మున్నగు మాన్యు లనేకు లయ్యాకాలములందు సంస్కృతభాషకు వ్యాకరణములు వ్రాసి యుండఁగా, వాని యందలిలోపము లరసియుఁ దమనాఁటికి భాషలోఁ గనవచ్చినమార్పు లవలోకించియు, వానికిఁ దగి నట్లుగాఁ బాణిన్యాచార్యులు మరల వ్యాకరణము రచియించిరి. దాని లోఁ గూడ లోపములను గనిపెట్టి పెక్కువేలశబ్దములకు వారికరూప మునఁ గాత్యాయనుఁడు మరల ననుశాసనము చేసెను. అట్లే ఆంధ్ర శబ్దచింతామణి అథర్వణవ్యాకరణము మొదలుగా రావిపాటి గురు

మూర్తిశాస్త్రి తెలుఁగువ్యాకరణమువఱకుఁ గలపూర్వలక్షణములం
భాషలో మాఱినశబ్దజాలమంతకును సమగ్రముగాఁ గాకపోయిన
కొంత కయినను భాషాసంప్రదాయము ననుసరించిన కొన్ని కొన్ని
సూచనలు గానవచ్చును. కాని, తరువాతివాఁ డయిన చిన్నయసూ
తనకుఁ బూర్వులు వ్రాసినయర్వాచీనవ్యాకరణములను తనకుఁ బూ
మహాకవులు ప్రయోగించిన ప్రయోగములను బరిశీలింపకయో పరి
ణింపకయో, ఆంధ్రశబ్దచింతామణిపక్కినే భాషను మిక్కిలి నిర్బ
ధించునట్టి బాలవ్యాకరణము రచియించెను. అదియు దానిపుత్రిక
నిపుడు ప్రచారములో నుండుటచేతను, దానినిబట్టి పూర్వకవులు
యోగించిన బహుశబ్దము లపశబ్దము లనెడిభ్రాంతి యిప్పటివారి
గలుగుటచేతను, దానిని వారించుటకును, పూర్వకవిసమ్మతములు తత్
ల్యములు నయినశిష్టవ్యావహారికములు సాధువులని తెలుపుటకును, -
యనుశాసన మావశ్యక మగుచున్నది.

సూ:—ప్రయోగశరణము వ్యాకరణము.

ఏభాషయొక్క యనుశాసన మైనను, ఆభాషలోని శిష్టప్రయో
గములును సుకవిప్రయోగములును దిక్కు గలది యగు నని పూర్వా
చార్యులవచనము. ఈయార్యోక్తి ననుసరించి యర్వాచీనకవులు తమ
గ్రంథములందు వాడిన పెక్కుశబ్దములకును గ్రంథస్థములు గాకున్న
బూర్వకవిప్రయుక్తములను బోలిన మఱికొన్ని సుశబ్దములకును సాధు
త్వము నిర్ణయించుచు నీయనుశాసనము చేయుచున్నాను. అందుచే
గ్రంథస్థమును తత్తుల్యము నయినభాష కనుశాసన మగుచున్న యి
గ్రాంథికాంధ్రభాషానుశాసన మని తెలియునది. కవులు ప్రయోగించి
శబ్దము లిం దుదాహరించునపుడు ప్రయోగములు గూడఁ దఱుచు
గాఁ జూపఁబడును. గ్రంథవిస్తరభీతిచేఁ గొన్నిటికిఁ జూపకపోయినను
అవి గ్రంథస్థము లనియే భావించునది. గ్రంథస్థములు గాని శబ్దమ

లుచ్చారించునపుడు ఇవి శిష్టులవాడుకలోని వని తెలుపఁబడును. భాషాసంప్రదాయమునుబట్టి యట్టివాని యౌచిత్యమును విద్వల్లోక మెఱుంగును గాక.

సూ:—ఆంధ్రమే త్రిలింగము. ౫

ఆంధ్రభాషయే త్రిలింగ మనుపేరఁ బరగుచున్నది. శ్రీశైలము దాక్షారామము కాళేశ్వరము ననెడి పుణ్యక్షేత్రములకును మహేంద్రగిరికిని నడుమను ప్రాంతములందు నున్న మనదేశము నకుఁ శైవక్షేత్రములలోని మూఁడు శివలింగములనుబట్టి త్రిలింగ మనెడిపేరు గలిగిన దని పూర్వులు వ్రాసిరి. ఇదియే దేశమునుబట్టి భాషకును సంజ్ఞయైనది.

1 ఈత్రిలింగపదమునుండి తెలుఁగు పదము పుట్టినది. ఇది క్రమముగా వాడుకలో తెనుఁగయినది. ఇవి రెండును గూడ భాషకు సంజ్ఞ లయినవి. మఱియు సంస్కృతపదములు ప్రాకృతపదములు మార్పు చెంది యీభాషలోఁ గలియుటచే దీనికి మనపూర్వులు వికృతి యనెడియింకొకపేరు కల్పించిరి గాని యాపేరంత యుచితము గా లేదు.

## వర్ణసమామ్నాయము

సూ:—2 సంస్కృతభాషకు వర్ణము లేఁబది. ౬

సూ:—అం దచ్చులు పదునాఱు, హల్లులు ముప్పదినాలుగు. ౭

---

1 త్రిలింగపదముకంటె తెలుఁగనెడిపదమే ప్రాచీనమైనదనియు తెలుఁగుపదమును సంస్కృతముగా మార్చుటచేతనే త్రిలింగపదము కలిగిన దనియుఁ గొందఱనుచున్నారు.

2 పాణిన్యాచార్యుల మతమునందు, ఌ-వర్ణమునకు దీర్ఘము లేదు. ళకారము లేదు. అందుచే ౡకారమునకు ళకారమునకు బదులుగా జిహ్వామూలీయము ఉప

అచ్చులు:—అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-ం-ః

హల్లులు:—క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ-డ-ఢ-ణ-త-థ-ద-

న-ప-ఫ-బ-భ-మ-య-ర-ల-వ-శ-ష-స-హ-ళ

సూ:—ం-ః-ఇవి ఉభయాక్షరము లనఁబడును.

అనుస్వారము, ం-విసర్గము,ః ఇవి రెండును అచ్చులు హల్లు కూడ నగు నని పూర్వులు నిర్ణయించిరి-అందుచే వీని కు యాక్షరము లనుపేరు గలిగినది. ఈరెంటికిని, అచ్చులకువలె ప్రత్యేకము పలుకుబడి లేదు. కాని, హల్లుమీఁద అచ్చు చేరునట్లుగా (క్+అ=క) వీనిమీఁద అచ్చు చేరదు. అచ్చు మీఁదనే యివి చేరును. (అ+ం=అం-అ+ః=అః) కాఁబ యివి యుభయాక్షరము లైనవి. అయినను, పెద్దలవాడుక బట్టి యివి యచ్చులలోఁ బఠింపఁబడినవి.

సూ:—ప్రాకృతమునకు వర్ణములు నలువదిరెండు.

ప్రాకృతి శౌరసేని మాగధి పైశాచి చూళికాపైశాచి అ భ్రంశము, అని యాఱువిధము లయినప్రాకృత మని యర్థము.

అచ్చులు:—అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఏ-ఓ-అం

---

ధ్మానీయము (ׅక—ׅప)అనెడి అర్ధవిసర్గములవంటి రెండక్షరములుఁ గలుత వర్ణసమా మ్నాయమునఁ జేరినవి. ఆపక్షమందును వర్ణము లేఁబదియే యగును. తరువాతఁ గొందఱు ఌవర్ణము దీర్ఘము గాక పోయినను ప్లుత మగునన్నయుద్దేశముతోను మంత్రశాస్త్రవ నంబు ఌకారము కల దనుతలఁపుతోను, ౡవర్ణమును శకారమును జేర్చి, విసర్గమ యొక్క రూపాంతరము లైనజిహ్వామూలీయోపధ్మానీయములను విడిచిరి. ఆపక్షమం దును ఏఁబదియే. మఱికొందఱు ౡకారమును క్షకారమును జేర్చి, జిహ్వామూలీయో పధ్మానీయములను విడిచిరి, ఆపక్షమందును సంస్కృతవర్ణము లేఁబదియే యగును. కానికకారషకారముల సంయోగమువలన నేర్పడిన:క్షకారము ప్రత్యేకవర్ణము కాఁ

హల్లులు:— క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ-డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ-బ-భ-మ-య-ర-ల-వ-శ-స-హ-ళ

ఈప్రాకృతభాషావర్ణములనుగూర్చి మతభేదము లనేకములు కలవు. 1

సూ:—అచ్చతెలుఁగునకు వర్ణములు ముప్పదియేఁడు, అం దచ్చులు పదునాలుగు, హల్లు లిరువదిమూఁడు. ౧౦

అచ్చులు:—అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ-ఁ-ం

హల్లులు:— క-గ-చ-ౘ-జ-ౙ-ట-డ-ణ-త-ద-న-ప-బ-మ-య-ర-ల-వ-స-హ-ళ-ఱ

ఁ-ం-అరసున్న నిండుసున్న లుభయాత్మకము లనఁబడును. పూర్వులయాచారమునుబట్టి వీని నచ్చులలోఁ జేర్చితిని. అకారమును

1 ఆంధ్రశబ్దచింతామణిలో ప్రాకృతమునకు వర్ణములు నలుపది యని యున్నది, ఈమతమునే యాంధ్రవ్యాకరణకర్తలు పెక్కండ్రు గ్రహించిరి. కొందఱిమతమున, ఎ-ఒ-లును, మఱికొందఱిమతమున, ఐ-ఔ-లును గల వని చిన్నయసూరి వ్రాసెను గాని, ఐ-ఔ- లే ప్రాకృతమందును గనఁబడలేదు. ఏ-ఓ-లు ప్రాకృతములో దీర్ఘములు గానే కాక హ్రస్వములుగాఁగూడఁ బలుకఁబడు నేమో తెలియరాదు.

శ-ష-స-య-ఇవి ప్రాకృతమున లే వని వ్యాకరణకర్త యగు హృషీకేశశాస్త్రి వ్రాసెను గాని ఇందు షకారము తప్పఁ దక్కినమూఁడును మాగధి మొదలగు వానిలోఁ గనఁబడుచున్నవి. దంత్యము లయిన, ౘ-ౙ-లు ప్రాకృతమునఁ గలవని అథోక్షజఫక్కిలో నున్నట్లుగా అహోబలపండితుఁడు వ్రాసెను గాని యది నిరాధారము. విసర్గ మున్న దని కొందఱు అందురు గాని యది గ్రంథములందు గనఁబడదు, కొందఱు దీనిని వర్ణసమామ్నాయమునఁ జేర్చిరి. ఙ-ఞ-ఈరెండును లేవని కొందఱూహించిరి గాని, తమతమవర్గములలోని వర్ణములతో సంయుక్తములై యుండు నని కొంద ఱనిరి. కొందఱు వర్ణసమామ్నాయమందే చేర్చిరి. ఇట్లే మతభేదము లింకను గలవు. ఆయావ్యాకరణములను కవిప్రయోగములను పాలీభాషావ్యాకరణమును జూచి పైవిధముగా వర్ణనిర్ణయ మొనరించితిని.

పూర్వులు వర్ణసమామ్నాయమునఁ జేర్చలేదు కాని యిది వర్ణాం
తర మని యందఱును సమ్మతించినట్లు కనఁబడుచున్నది. మఱియు
బూర్వశాసనములలో 'ఱ' అనువర్ణ మొకటి గనవచ్చును ఇది శకా
రమువలె మూర్ధన్యము అంతస్థము నగును. కాని యీవర్ణ ముచ్చ
రించునపుడు నాలుక మిక్కిలి మడఁగును. ఇది తరువాతఁ గొన్నిప
ములలో శకారముగాను మఱికొన్నిటిలో డకారముగాను మాఱినది
ఉదా—చోళుఁడు-క్రోడ్డి-

సూ:—సంస్కృతమునుండి తెలుఁగునకు వచ్చినవర్ణములు పదు
నెనిమిది. ౧౯

1 ఋ-ౠ-ఌ-ః-ఖ-ఘ-జ-ఛ-ఝ-ఞ-ఠ-ఢ-థ-ధ-ఫ-భ-శ-ష
ఇవి యన్నియు తత్సమపదములఁ గూడియు ఇందు కొన్ని
యన్యదేశ్యములను గూడియు, తెలుఁగునఁ జేరుచున్నవి.

ఉదా—ఋతువు - వృద్ధి-పితౄణము-క్లృప్తము-దుఃఖము - సుఖము-ఘ
ము-పఙ్కజము-ఛత్రము-ఝరము-ప్రజ్ఞ-కంఠము-గూఢము-రథ
ము-ధాత్రి-ఫలము-భీతి-శత్రువు-షష్ఠి-ఇట్టివి తత్సమములు.

ఠవర-ఠావు-ఠింగణా-ఢాక-మజ్ఝా - భళీ-ఇత్యాదు లన్యదేశ్య
ములు. మజ్జా-బళీ-యనురూపములు దేశ్యము లని నిఘంటువులందు
గొందఱు నిరూపించిరి. కాని యవి మజ్ఝా-భళీ-యనువానిరూపాంత
రములు. ఇట్లు, ఒత్తక్షరములతోఁ గూడినయన్యదేశ్యములు కొలఁది
మాత్రమే తెలుఁగునఁ గలవు.

సూ:—సంస్కృతమున లేక తెలుఁగున మాత్రమున్నవర్ణము లాఱు.
ఎ-ఒ-ఁ-చ-జ-ఱ-అనునవి. ౨౦

---

1 ఌకారము ప్లుతముగా సంస్కృతమున గ్రహింపబడినను సంస్కృతసమ
ములం దెందును గాని యుపయోగము లేమి నిందుదాహరింపక విడిచితిని.

సూ:—ఆంధ్రభాషకు వర్ణము లేఁబదియైదు. 13

తత్సమతద్భవదేశ్యాత్మక మైనయాంధ్రమునకుఁ బైని జూపిన సంస్కృతవర్ణములు కలియుటచే మొత్తమేఁబదియైదువర్ణము లయినవి.

అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ-ఁ-ం-ః
క-ఖ-గ-ఘ-ఙ-చ-చే-ఛ-జ-జే-ఝ-ఞ-ట-ఠ-డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ-బ-భ-మ-య-ర-ల-వ-శ-ష-స-హ-ళ-ఱ

సూ:—ఆ-ఖ-ఈరెం డక్షరములు తెలుఁగున నధికముగాఁ జేరినవి. ౧౪

ఇందు మొదటిది అచ్చు- ఇది హల్లులతోఁ గలిసి పలుకఁ బడును. ఏ-ఆ-స్థానములకు మధ్యస్థానమునఁ బలుకఁబడును. ఇది కంఠ తాలవ్యము. అనఁగా కంఠమునుండి దవుడలనుండి పుట్టిన దనుట.

ఉదా— తాటి+ఆకు = తాటాకు; మఱ్ఱి+ఆకు=మఱ్ఱాకు - మొద॥
ఇ-ఈ-లు, రెండునుగలిసినపుడు పైనిజెప్పిన పలుకుబడికొన్నిశబ్ద ములందు మాత్రమే వినవచ్చును. మామిడాకు-కొబ్బరాకు-ఇత్యాదులం దీపలుకుబడి వినఁబడదు.

కొట్టాఁడు-వెళ్లావు-ఇచ్చాను - మొదలయినవి వాడుకలోనివి. కొట్టినాఁడులోని నకారము లోపింపఁగా, కొట్టి+ఆఁడు=కొట్టాఁడు అని, ఇకారము ఆకారము కలియుటచేఁ బైపలుకుబడి వచ్చినది. ఈ యక్షరముతోఁ గూడినప్రక్రియలు గ్రామ్యములుగా గణింపఁబడు చున్నవి. మఱియు (చలిది-చల్ది - చద్ది) చద్ది+అన్నము=చద్దన్నము అందుగూడ ఇకారము అకారము కలిసినపుడు తాటాకులోని పలుకు బడియే వినవచ్చునుగాని యిట్టివి కొలఁదిగానున్నవి. “మేలుకాంచి చద్దన్నము మెక్కి” సామెత— రెండవవర్ణము హల్లు. ఇది యన్య

దేశ్యములతోఁ గలిసి యాంధ్ర దేశమునఁ బ్రవేశించినది. ఇది ష
రము వలె ఓష్ఠ్యము గాక పైపండ్లను క్రిందిపెదవియుఁ గలిసి ఉ
పలుకఁబడునట్టి అంతస్థము. కావున నిది వకారమువలె దంతో[ష్ఠ్య]
మగును. కాని పరుషోచ్చారణము గలది.

ఉదా:—కాఫీ-ఫర్లాంగు-ఫైంచి-సఫేదు-మొద—

*అధికముగాఁ జేరినయీ రెండు వర్ణములతోఁ గలిసి ఆంధ్రా
రము లేఁబదియే డగుచున్నవి.

సూ:—అ-ఇ-ఉ-ఋ-ఌ-ఎ-ఒ-ఇవి యేడును హ్రస్వములు.
హ్రస్వములనఁగా, పొట్టియచ్చులు, కుఱుచలు.

సూ:—ఆ-ఆ-ఈ-ఊ-ౠ-ఏ-ఐ-ఓ-ఔ-ఇవి తొమ్మిది దీర్ఘములు.
దీర్ఘములనఁగా, పొడుగచ్చులు, నిడుదలు.

మాత్ర యనఁగా అక్షరావయవము. క్-చ్-మొదలయి
మాత్ర లనఁబడును. ఒకమాత్ర పలుకుటకుఁ బట్టునంతటికాల
పట్టునట్టిఅచ్చు హ్రస్వము. రెండుమాత్రలు పలుకఁ దగినంతకాల

* సంస్కృతవ్యాకరణకర్తలు, కకారషకారముల కూడికయే క్షకార
చెప్పిరి కాని పలుకుబడిలో క-ష-వర్ణములు వేఱువేఱుగా వినఁబడక పోవుట
కొందఱు క్షకారమును వేఱువర్ణముగా గణించిరి. వృక్ష మని పలుకునప్పు
క-ష-లు వెవ్వేఱుగా వినరానిమాట నిజము. అందుచే, 'రిక్ షా' మొదలగు
దేశ్యపదములను వ్రాయవలసివచ్చినయెడల, 'క్ షా' యని వ్రాయవలెను. క్షా య
వ్రాసినయెడల పలుకుబడి భేదించును.

క్షకారమునకు పలుకుబడి మాఱినట్లే మఱికొన్ని సంయుక్తవర్ణముల పలుకు
యుమాఱిపోయినది.

సంజ్ఞ-సొంజ్ఞ-సౌజ్ఞ-సౌంగ్ఞ అనురీతిని మాఱినది. "హ్న హ్ల హ్
నలమనాం స్థితి రూర్ధ్వం" అను ప్రాకృతమంజరిలోని సూత్రమున కనుగుణము
దెలుఁగునందును మధ్యాహ్నము-వహ్ని-బ్రహ్మ-అనెడి పలుకుబడి వచ్చినది.

పట్టునట్టిఅచ్చు దీర్ఘము. మూఁడుమాత్రలు పలుకుటకుఁ బట్టునంత కాలము పట్టునది ప్లుతము. అనఁగా దీర్ఘమును గొంచెము పొడుగు చేసి పలికినయెడల అదియే ప్లుత మగును. ప్లుతముప్రక్క ౩ అంకె గు ర్తుండును. ఓగురూ ౩. ఇందలి ఊకారము ప్లుతము. దూరము నం దున్న వారిని పిలుచునపుడు ప్లుతస్వరము వచ్చును-

సూ:—ఁ-ం-ః-ఇవి క్రమముగా, అరసున్న-నిండుసున్న-విసర్గము అనఁ బడును. * ౧౭

ఇందు మొదటిదానికి అర్ధానుస్వారము అర్ధబిందువు ఖండబిందువు ననియు, రెండవదానికి పూర్ణానుస్వారము పూర్ణబిందువు నెఱసున్న యనియు పేళ్లు గలవు.

సూ:—అచ్చులు ప్రాణములు స్వరములు ననఁబడును. ౧౮

హల్లులపలుకుబడికిఁ బ్రాణతుల్యములు గావున ప్రాణములనియు, తమంతటఁ దామే ప్రకాశించునవి కావున స్వరము లనియు

---

„ పద్మా ర్వస్లి కహ్లారం కల్హార మభిధీయతే ।
బ్రహ్మ బమ్హా మత స్తేషాం స్థితి రూర్ధ్వ మిలీదృశీ"
ఇందు కల్హారము తత్సమము గానే తెలుఁగునఁ బ్రవేశించినది.

ప్రాకృతములందును పాలీభాషలోను గూడ పన్హా-కల్హారము-బమ్హా యను వర్ణక్రమమే పలుకుబడిలోనున్నది. దీనినిబట్టి చూడఁగా గీతలమీఁదివర్ణములపలుకుబడి మనభాషలోనికిఁ బ్రాకృతసంపర్కమున వచ్చిన దని తెలియనయ్యెడి. ఇందుకు బ్రహ్మశబ్దము బమ్హా-బొమ్మ యగుటయే నిదర్శనము. అయినను సంస్కృతసమము లనెడిబుద్ధితో గీతలమీఁద నున్నట్లు పలుకుట తగదు. జ్ఞ-హ్న-హ్మ-ము మను వర్ణక్రమముననే పలుకవలెను.

* ఇందులోఁ జూపినవిసర్గమే యశస్కాంక్షి-పయఃపానము మొదలగు చోట్ల కకారమునకుఁ బూర్వమందు జిహ్వామూలీయ మనుపేరను పకారమునకుఁ బూర్వమందు ఉపధ్మానీయ మనుపేరను అర్ధవిసర్గవలె న్వాడుఁ దగి యున్నది. కాని యిట్టియాచార మిపుడు పోయినది.

అచ్చులు చెప్పఁబడుచున్నవి. తేలికగాఁ బలుకుటకై వర్ణసమామ్నా
యమునందు క-చ-త-అనునట్టుగా హల్లులకుఁ దలకట్లు చేర్చి వ్రాయఁ
బడెను గాని, వీని నిజరూపములు-క్-చ్-త్-అనునట్లుగా నుండు.
కావుననే వీనికి పొల్లు లనుపేరు గలిగినది. వీనిపై నచ్చులుచేర
కి-చే-తో-అనువిధముగాఁ బలుకఁబడును. కావుననే యీపొల్లు
బడు హల్లుల పలుకుబడి కాధారము లైనయచ్చులు ప్రాణము
బడినవి.

సూ:—కకారము మొదలుగా మకారముదాఁక నుండువర్ణ
స్పర్శము లనఁబడును.

ఇవి యిరువదియైదు. వర్గమున కైదుచొప్పున కవర్గము-చవర్గ
టవర్గము-తవర్గము-పవర్గముఅని యైదువర్గము లగును. చే-జే-ఈరెం
చవర్గములోఁ జేరును. కావునఁ దెలుఁగులో స్పర్శము లిరువది
డగుచున్నవి.

సూ:—య-ర-ల-ళ-వ-ఱ-ఇవి అంతస్థము లనఁబడును.

సూ:—శ-ష-స-హ-ఇవి ఊష్మము లనఁబడును.

సూ:—క-చ-చే-ట-త-ప-ఇవి పరుషము లనఁబడును.

సూ:—గ-జ-జే-డ-ద-బ-ఇవి సరళము లనఁబడును.

సూ:—తక్కినవి స్థిరము లనఁబడును.

పరుషసరళములు గాక తక్కినయిరువదియాఱు హల్లు
స్థిరము లనిపేరు.

సూ:—ఖ-ఘ-ఛ-ఝ-ఠ-ఢ-థ-ధ-ఫ-భ- ఈపదియును ఒత్తక్షర
లనఁబడును.

గట్టిగా నూఁది పలుకఁబడునవి గావున వీని కీపేరు వచ్చి

సూ:—కకారమునకు వెనుక అర్ధవిసర్గమువలె నుండువర్ణము జిహ్వా మూలీయ మనఁబడును. ౨౮

ఉదా:—యశఃకాయము.

సూ:—పకారమునకు వెనుక అర్ధవిసర్గమువలె నుండువర్ణము ఉపధ్మా నీయ మనఁబడును. ౨౭

ఉదా:—పయఃపానము.

ఇవి రెండును విసర్గముయొక్క రూపాంతరములే కావున వీనిని వర్ణసమామ్నాయములోఁ బ్రత్యేకముగా లెక్క పెట్టలేదు. కాని వీని స్వరూపమును పేళ్ళును మాత్ర మిందు చూపఁబడినవి. కకారపకార ములకుఁ బూర్వము విసర్గముండెనేని పైవిధముగా వ్రాయఁదగును గాని యాయలవా టిపుడు పోయినది.

సూ:—హల్లులు ప్రాణులు వ్యంజనములు లనఁబడును. ౨౮

ప్రాణము లయినయచ్చులతోఁ గూడి పలుకఁబడునవి కావున ప్రాణులనియు వానితోఁ గూడని యపుడు పొల్లులుగా నుండునవి కావున వ్యంజనము లనియు హల్లులకుఁ బేళ్ళు వచ్చినవి.

సూ:—వ్రాయి కుఱుచ మొదలైనవి దేశ్యసంజ్ఞలు. ౨౯

వర్ణమునకు వ్రాయి, వర్ణములకు వ్రాలు, పొట్టి యచ్చులకు కుఱుచలు, పొడుగచ్చులకు నిడుపలు, సున్నకు బొట్టు, అరసున్నకు కుఱుచబొట్టు, నిండుసున్నకు నిడుపబొట్టు, హల్లులకు పొల్లులు, ద్విత్వ మునకు జడ్డ, మొదలుగా దేశ్యసంజ్ఞలు గలవు. ఇట్టిపేళ్ళు క్రమముగా వాడుకలో నణఁగిపోయినవి. వీని స్థానములఁ దత్సమసంజ్ఞలు చేరినవి.

సూ:—కంఠాదిస్థానములఁ బుట్టినవర్ణములు కంఠ్యాదిసంజ్ఞలొందును.

ఈక్రిందఁ జూపినయాయా వర్ణముల వరుస దాని కెదురుగా నున్నసంజ్ఞను జెందును.

అ-ఆ-క-ఖ-గ-ఘ-ఙ-హ-ః—కంఠమందు పుట్టినవి—కంఠ్యము

ఇ-ఈ-చ-ఛ-జ-ఝ-ఞ-య-శ—దౌడలనుండి పుట్టినవి— తా
వ్యములు.

ఋ-ౠ-ట-ఠ-డ-ఢ-ణ-ర-ఱ-ష-ళ—మూర్ధమందు పుట్టినవి—
మూర్ధన్యములు.

ౘ-త-థ-ద-ధ-న-ల-స-చే-జే—దంతములనుండి పుట్టినవి— ద
త్యములు.

ఉ-ఊ-ప-ఫ-బ-భ-మ—పెదవులనుండి పుట్టినవి—ఓష్ఠ్యములు

ఞ-మ-ఙ-ణ-న-ఁ-ం—ముక్కునుండి పుట్టినవి—నాసిక్యములు

ఎ-ఏ-ఐ-ఆ—కంఠమునుండి దౌడలనుండి పుట్టినవి— కంఠతా
వ్యములు.

ఒ-ఓ-ఔ—కంఠమునుండి పెదవులనుండి పుట్టినవి—కంఠోష్ఠ
ములు.

వ-ఢ—దంతములనుండి పెదవులనుండి పుట్టినవి-దంతోష్ఠ్యము

ౙక—నాలుక మొదటనుండి పుట్టినది—జిహ్వామూలీయము.

ౙప—దీని కుత్పత్తిస్థానము పెదవులు—ఓష్ఠ్యము.

సూ:—ప్రతివర్ణముకంటెను, కారప్రత్యయము వచ్చును. 3

ఉదా:—అకారము-ఆకారము-ఇకారము-ఈకారము; కకారము-తకా
రము-మకారము-సకారము- మొద—

సూ:—రవర్ణముకంటె, ఇఫప్రత్యయము వచ్చును. 3

ఉదా—రేఫము. రకార మనియు ప్రయోగములు కలవు. 'రకా
దీనినామాని' యని వాల్మీకిమహర్షి ప్రయోగించెను. కొండఱ
వ్యాకులలో రకార మనుటయు గలదు. అయినను రేఫ మ

టమే యుచితము-ఇది లఘు రేఫ మనఁబడును. అవర్ణమునకు బండిఱా యనిపేరు. ఇది అకార మనియే యప్పకవి చెప్పెను, బండిఱా యనుటకు సంస్కృతపదము కల్పించి శకటరేఫ మని కొందఱనుచున్నారు. కాని దీనిని అకార మనవచ్చును. ఇది యే గురు రేఫము.

ఈగ్రంథమునందు సూత్రములలో విధింపఁబడెడి యచ్చులకును హల్లులకును ఈక్రింది సంకేతములు చెల్లు నని గ్రహించునది.

సూ:—అకారము-ఇది హ్రస్వమునకే చెల్లును. 33

సూ:—అవర్ణము-ఇది హ్రస్వమునకు దీర్ఘమునకుఁ గూడఁ జెల్లును. ఇట్లే యన్నియచ్చులకును గ్రహించునది.

సూ:—కారప్రత్యయము చేర్చినహల్లు పొల్లుమాత్రమే యగును. 3౫

అనఁగా, ఈశాస్త్రమందు, నకారమువచ్చునని చెప్పినచోఁ 'న్' అను పొల్లుమాత్రమే వచ్చునని గ్రహించునది. ఇట్లే, కకారము-యకారము-టకారము- మొద—

సూ:—వర్ణపదము చేర్చినహల్లు అచ్చుతోఁ గూడినదానికిఁ జెల్లును. అనఁగా, నువర్ణము అని చెప్పినచో ఉకారముతోఁ గూడిన నకారము గ్రాహ్యము-టువర్ణము వచ్చు నన్నయెడల ఉకారముతోఁ గూడిన టకార మని యర్థము. ఇట్లే, కవర్ణము గవర్ణము- మొద—

సూ:—అచ్చ తెలుఁగు పదములలో, ఇ-ఈ-ఎ-ఏ-లతోఁగూడిన 'చ-జ' లు తాలవ్యము లగును. 32

ఉదా—చిన్న-చీమ-చెట్టు-చేను; జిగురు-జీడి-జెట్టి-జేన. అ-ఆ-లతోఁ గూడినదేశ్యతాలవ్యములు కొన్ని కల వని ముందు తెలియఁగలదు.

సూ:—అ-ఆ-ఉ-ఊ-ఒ-ఓ-ఔ-లతోఁగూడిన, చజ-లు దంత్యము లగును. ౩౮

ఉదా:—చేదర-చేప-చేట్టము-చూపు-చొప్పు-చోటు-చౌక-జెండెము-జేమి-జేన్ను-జేదము-జొన్న-జోగి-జౌకు.

ప్రాచీనులు దంత్య చజలపై రెండంకె ౨ వంటి గుర్తు నిలువు చుండెడివారు. ఇపుడు వ్రాఁతలోను అచ్చులోను గూడ దానిని కొందఱు విడుచుచున్నారు. దంత్యతాలవ్యభేద మెఱుఁగఁ జాలనిబాలు రాగుర్తునుబట్టి దంత్య చజల నెఱిఁగి యుచ్చరింతురు గావునఁ బైగుర్తు దంత్యచేజేలపై నిలుపుట యుచిత మగును.

సూ:—ఐకారముతోఁ గూడిన 'చజ' లచ్చ తెలుఁగున లేవు. ౩౯

చైత్రము- జైత్రయాత్ర- మొదలగునవి తత్సమములు కాని యాచ్ఛికములు గావు.

సూ—తుదివర్ణమునకు వెనుక నుండువర్ణము ఉపధ యనఁబడును.

వీచి-సంచి-వీనిలోని తుదివర్ణము ఇకారము. దానివెనుక నున్నది, చకారము. అది ఉపధ యనఁబడును.

సూ:—బహువచనప్రత్యయము పర మగునపుడు ఇకారాంతశబ్దముల ఉపధాచజలు దంత్యము లగును. ౪౧

ఈ సూత్రము ఆచ్ఛికములకు తత్సమములకుఁ గూడఁ జెల్లును.

ఉదా—సంచి+లు=సంచేలు-ఇకారము ఉకారమైనది,చకారము చేకారమైనది. ఇట్లే-జ-జ+లు-జేజేలు, ఇట్టి వాచ్ఛికములు.

వీచి + లు=వీచేలు—రాజి + లు=రాజేలు—ఇట్టివి తత్సమములు.

సూ:—మఱికొన్ని తత్సమశబ్దములతుద నుండు చకారజకారములు, ఉకారముతోఁ గూడి దంత్యము లగును. ౪౨

ఉదా:—అచ్-అచ్చ్యె-అచ్చ్యెలు. రాజన్-రాజే-రాజేలు-మొదల—

రాజుశబ్ద మొక్కటే దంత్యయుక్త మని కొందఱు వ్రాసిరి కాని యది సరి కాదు. పండితు లందఱు గూడ అచ్చ్యె-అచ్చ్యెలు-అని దంత్యయుక్తములు గానే పలుకుదురు. కాని, మహాభుజుఁడు వణిజుఁడు మొదలగువాని జకారము తాలవ్యముగానే పలుకఁ బడుచున్నది. అట్టి చకార జకారములు ఉకారముతోఁ గూడినను తాలవ్యములే. ఈపై రెండు సూత్రములక్రింద నుదాహరించినవియు, అట్టివియుఁ దక్కఁ దక్కిన తత్సమశబ్దములలోని చ-జ-లు, ఏయచ్చుతోఁ గూడినను తాలవ్యములే యగు నని తెలియునది.

ఉదా:—చంద్రుఁడు- చామరము-చూర్ణము—చోరుఁడు-జాతి-జుగుప్స జూటము-చౌర్యము-జోధపురము-మొద—

సూ:—బహువచనమునందు రాశిలోనిశవర్ణము సకార మగును. ౪౩

ఉదా:—రాశి-రాసులు.

సూ:—ఙ-ఞ-ణ—ళ-వు—వూ-వొ-వో-ఇవి యాంధ్రపదముల మొదట నుండవు. ౪౪

తత్సమ తద్భవ దేశ్య శబ్దములలో దేనిమొదట నైనను పైని జూపిన యక్షరము లుండవు. వో యనెడి వర్ణముమాత్రము కొన్ని తత్సమపదముల మొదటఁ గానవచ్చును. వోఢ—వోఢవ్యము. వాడుకలో వుత్తరము వూరు-వొకఁడు-వోడ యనునట్లుగా, ఉ ఊ ఒ ఓ లకు వకారము చేర్చినపదములు వినఁబడును గాని, అట్టివానిని కావ్యములఁ బ్రయోగింపరాదు. ఉండ-ఊడ-ఒడలు-ఓపిక—యనునట్లుగా, ఉ-ఊ-ఒ-ఓ-లు మొదలఁ గలపదములను వాడవలెను.

సూ:—అచ్చు తెలుఁగుపదముల మొదల యకారము లేదు. ౪౫

* దేశ్యశబ్దముల మొదట యకారము చేర్చి వ్రాయ రాదు. యిపుడు-యేమి-యెవఁడు-యెందుకు-మొదలయినవి వాడుకలోఁ గలవు కాని వానిని వ్రాయునపుడు ఇపుడు-ఏమి-ఎవఁడు-అను రీతినే వ్రాయఁదగును. ఇట్లే కావ్యములఁ బ్రయోగింప నగును. వెలయెంత—నిద్రవోయె-మొదలగుచోట్ల నుండుయకారవకారములు సంధివలన వచ్చిన ఆగమవర్ణములుగాని శబ్దములతోఁబుట్టినవి కావు.

## మఱి కొన్ని ముఖ్యసంజ్ఞలు

సూ:—ప్రాతిపదికము నామ మనఁబడును. ౪౬

ఏప్రత్యయమును చేరనట్టి అర్థము గలశబ్దస్వరూపము ప్రాతిపదిక మనఁబడును. దీని కీభాషలో నామ మనిపేరు.

ఉదా:—రామ-గురు-వన; మగ-చందురు-సుందర-రాజపురుష-ము.

పై వానిమీఁదఁ నేప్రత్యయమును చేరలేదు. వానికి అర్థమును గలదు. కావున నవి ప్రాతిపదికము లైనవి. ఈపేరు ధాతువునకు మాత్రము కలుగదు.

సూ:—ధాతువు. ౪౭

ఏప్రత్యయమును చేరని వచ్చు-పోవు-ఉండు-పోషించు-మొదలయినవి ధాతువులు. వీనినుండి పుట్టిన-వచ్చెను-ఉండును-పోషించుచున్నాఁడు మొదలయినవి క్రియ లని చెప్పఁబడుచున్నవి కావున ధాతువులకుఁ గూడ క్రియ లని పేరు పెట్టుట యుచితము గాదు.

సూ:—ప్రాతిపదికముయొక్క ధర్మములను ధాతువుయొక్క ధర్మములను విస్పష్టము చేయునది విభక్తి యనఁబడును. ౪౮

* తద్భవభాషలోఁ గొన్ని యకారము మొదటఁ గలపదములు గల వని కొందఱందురు. అందుకు జవ్వనముయొక్క మొదటిరూపము 'యవ్వనము' అనియు, నది తద్భవ మనియు నుదాహరింతురు. ఈ 'యవ్వనము' అనుపదమును మడికిసింగనార్యుఁడు ప్రాసస్థానమునఁ గూర్చియున్నాఁడు.

ప్రాతిపదికముయొక్క లింగము వచనము మొదలయిన వానిని ధాతువుయొక్క కాలము పురుషము మొదలయినవానిని విశదపఱచునట్టి ప్రత్యయము విభక్తి యని చెప్పఁబడును.

ఉదా:—రాముఁడు. ఇందలి డు ప్రత్యయము, రాముఁ డనెడియొక వ్యక్తిని పుంలింగమును ఏకవచనమును కర్తృత్వమును తెలుపుచున్నది.

వచ్చుచున్నారు. ఇందలి రు ప్రత్యయము, రాకను వర్తమాన కాలమును ప్రథమపురుషమును బహువచనమును క్రియాత్వమును దెలుపుచున్నది. ఇట్లే తక్కినవియుఁ జెప్పఁగలవు.

సూ:—డు-ము-వు-లు-మొదలయినవి నామవిభక్తులు. ౪౯

ప్రాతిపదికములకంటె వచ్చునట్టి, డు-ము-వు-లు; ని-ను-మొదలయిన యేడువిధము లైన విభక్తిప్రత్యయములు నామ విభక్తులనఁబడును.

సూ:—ఎను-రి-మొదలయినవి క్రియావిభక్తులు. ౫౦

ధాతువులకంటె నచ్చు, ఎను-రి-తివి-తిరి-మొదలయిన భూత వర్తమానాద్యర్థకము లయినప్రత్యయములు క్రియావిభక్తు లని చెప్పఁబడును.

సూ:—విభక్త్యంతము పదము. ౫౧

పైని జెప్పిన రెండువిధము లయినవిభక్తులు తుదఁగలవి పదములని చెప్పఁబడును.

ఉదా:—రాముఁడు-సీతను-వనమునకున్; పంపెను-వచ్చుచున్నారు-చేయుదును-మొద—

సూ:—ప్రత్యయము వర్ణక మనఁబడును. ౫౨

వ్యాకరణసూత్రములచే విధింపఁబడునట్టి వర్ణము గాని, వర్ణసముదాయముగాని ప్రత్యయ మనఁబడును. దాని కిందు వర్ణక మని

పేరు. ఈప్రత్యయసంజ్ఞ యింతకు మున్ను చెప్పినవిభక్తులకును జెల్లు చున్నది. తక్కినవానికిఁ గొన్ని యుదాహరణములు.

ఉదా:— మేలిమి-నల్లన - జూదరి - కోయుట - వచ్చి - చేయక - ఇచ్చిన- ఉండెడు-ఇత్యాదులు—

పైపదములచివరఁ గనవచ్చునట్టి, ఇమి-న-అరి-ట-ఇ-అక-ఇన- ఎడు-అనునవి ప్రత్యయములు.

సూ:— వ్యాకరణకార్యములు నిత్య - వైకల్పిక - బహుళ భేదమున మూఁడువిధములుగ నుండును. ౫౩

ఈశాస్త్రమున విధింపఁబోవుకార్యములు నిత్యాదిభేదమున మూఁడుతెఱఁగుల నుండును. వానివివర మిట్లెఱుఁగునది. నిత్య మనఁగా, సూత్రములచే విధింపఁబడిన సంధులు సమాసములు ఆగమములు ఆదేశములు మొదలయినకార్యములు తప్పక వచ్చుట యని యర్థము.

వైకల్పిక మనఁగా విధింపఁబడినకార్యము వచ్చుట రాకపోవుట. దీనికి విభాష యనియు వాడుక గలదు.

బహుళ మనఁగా విధింపఁబడినకార్యములు ప్రయోగానుగుణముగా కొన్నిచోట్ల వచ్చుట, కొన్నిచోట్ల రాకపోవుట, కొన్నిచోట్ల వైకల్పికముగా వచ్చుట, కొన్నిచోట్ల విధింపఁబడిన కార్యముకంటె వేఱొకకార్యము వచ్చుట, మొదలగు నర్థములు కలవు.

సూ:— ఆగమ మనఁగా నొకవర్ణమునకు మఱియొకవర్ణ మెక్కువగాఁ జేరుట. ౫౪

ఉదా:— హరి + అతఁడు, హరి + య్ + అతఁడు = హరియతఁడు. ఇందు యకార మధికముగాఁ జేరినది, కోయుట. ఇందు కోయు ధాతువునకు టవర్ణక మధికముగాఁ జేరినది. ఇట్లే యూహించునది.

సూ:— ఆదేశ మనఁగా నొకవర్ణమును గొట్టివేసి మఱియొకవర్ణము జేరుట. ౫౫

ఉదా:—నిద్ర+పోమె=నిద్రవోమె. ఇందు, పకారమును గొట్టివేసి వకారము వచ్చినది. పాట-పాడు ధాతువులోని డువర్ణమును గొట్టివేసి టవర్ణకము వచ్చినది. ఇట్లే యూహించునది.

సూ:—ఇకార ఉకారములతోఁ గూడినదియు, పొల్లుగా నుండునదియు నయిన నకారము ద్రుత మనఁబడును. ౧౬

అనఁగా, ని-ను-అనువానికి ద్రుత మని పేరు. ఈయచ్చులు రెండును పోయినను తక్కిన-న్-అనుపొల్లునకును, ద్రుతమనియే పేరు. పదము మొదటఁ గాని నడుమఁ గాని యుండెడి నకారము ద్రుతముకాదు. అన్నిపదములతుదను గనఁబడు-ని-ను-న్- అను వానికి ద్రుత మను పేరు గలుగదు. ఈవిషయము ముందు తెలియఁగలదు. ద్రుత మనఁగా జాఱిపోవునది, లేక కరఁగిపోవునది యని యర్థము. అనఁగా, ఒకప్పుడు లోపించిపోవును. మఱియొకప్పుడు అరసున్న గానో నిండుసున్న గానో మాఱి పోవును.

సూ:—ద్రుతము తుదఁగలశబ్దము ద్రుతప్రకృతికము. ౧౭

ఉదా:—రాముని-సీతను; రామున్-చూచితిన్ మొద—

సూ:—కొన్ని యెడల ద్రుతముమీఁద మఱియొక నకారమును జేరును.

ఉదా:—రామునిన్-వానినిన్-సీతనున్-అదియునున్-మొద—

సూ:—ద్రుత మంతమందు లేనిది కళ. ౧౮

ఉదా:—రాముఁడు-సీత-హరి-వనము-గురువు, వచ్చుచున్నాఁడు. ఇచ్చిరి. చేసితివి-మొద—

సూ:—హ్రస్వముమీఁది యరసున్న వైకల్పికముగా నిండుసున్న యగును. ౨౦

ఉదా:—అణఁకువ-అణంకువ,కొలఁది-కొలంది,చెలఁగి-చెలంగి, ఎఱుఁగు-ఎఱుంగు, కలఁడు-కలండు, చేయుఁడు-చేయుండు,మొద—

"హ్రస్వము మీఁది" యనుటచే దీర్ఘముమీఁద నుండు అర

నున్న నిండునున్న కా దని తెలియునది.

ఉదా:—వేఁడి-వేఁట-క్రోఁత- వాఁడు-వీఁడు- రాఁడు-లేఁడు- ఉన్నాఁడు- వగలాఁడు-ఇత్యాదులు. వాండు-వీండు-మూాంకుడు-ప్రాంత-మొదలగువానిలోఁ దొలుత నిండునున్నయే యుండెడిది. అది తరువాత అరసున్న యయినది. అది మరల నిండునున్న కా దని యర్థము.

కార్వేటి నగరప్రాంతమందలి యాంధ్రులు మూాంకుడు-పేండ-కాంచు- అనువిధముగా నిండునున్నతోనే యుచ్చరింతురు.

సూ:—అచ్చతెలుఁగుశబ్దములయందు బిందు వుండెనేని యది పరుషసరళములకు వెనుక నే యుండును. ఉ

బిందు వనఁగా అరసున్న గాని నిండునున్న గాని యని యర్థము 'ఉండెనేని' యనుటచే అన్నిశబ్దములయందును పరుషసరళములకు వెనుక బిందు వుండ దని యెఱుఁగునది.

ఉదా—కలఁక-మంచి-మంచే-కంటె-పడఁతి-తలఁపు- బలఁగము- గంగుంజే-గుండె-వెలఁది-కాఁక-కాంచు (చూచు) కాంచే (కవి కాంబోది (సస్యము) కాఁపురము — వేంద్రము .. ఇత్యాదులూహ్యములు.

సూ:—అఁట-ఇఁక-ఇఁగ-చుఁడు-అఁడుగో-ఇఁడుగో-శబ్దములఁ దప్ప దక్కినయేశబ్దముయొక్క మొదటిపొట్టియచ్చుమీఁదను అ సున్న యుండదు. ఉ

ఉదా—అఁట-ఇఁక-చుండు. ఈచుఁడుశబ్దము చూడుఁడు, అనుక్రియ యొక్క రూపాంతరము; దీనియేకవచనము చుము. రూపాంతరము, చుమ్ము. ఉదా. వాఁడునుమీావచ్చెను. నేను వచ్చెద, జుమ్మ. నీవు వచ్చెదవుసుమీా మీారు వచ్చెదరుసుఁడీ. ఇత్యాదులు. వీనిలోమాత్రమే అరసున్న మొదటిహ్రస్వముమీఁ

నుండును. తక్కినశబ్దములలో అరసున్న యుండెనేని, అది రెండవపొట్టి యచ్చుమీఁద నైన నుండును. లేదా, మొదటి దీర్ఘముమీఁదనే యుండిన నుండవచ్చును. ఉదా__నెలఁత-చెలఁగి-అడఁగు; నేఁడు-వాఁడు-ప్రాఁత-వేఁట; ఇత్యాదులు. ఇఁగ-అఁడుగో-ఇఁడుగో-లలోనియరసున్న నిండుసున్నకాదు.

సూ:__శకటరేఫము గలశబ్దములు తఱుచుగా దేశ్యములే యగును. ౬౩

ఉదా:__ఎఱుక-మఱది- త్రేఁడు-చెఱువు- కఱవు- తఱుఁగు-చెఱఁగు-నఱుకు-కొఱుకు-ముఱికి-మఱపు- చెఱకు- నూఱు- అఱువది-ఆఱు-ఏఱు- మొద__తఱుచుగా ననుటచే నిట్టివి కొన్ని తద్భవములు గూడఁ గలవని తెలియునది. బాడితా తద్భవములలో లే దని చిన్నయసూరి వ్రాసెను. కాని, పెఱ-గొఱపము-మొఱకు-గఱి- మొదలగు కొన్నిశబ్దములు కనఁబడుచున్నవి. శకటరేఫము తత్సమములలో నుండదు. దేశ్యములో ద్విత్వరేఫము లన్నియు శకటరేఫములే.

ఉదా__కఱ్ఱ-మఱ్ఱి-గొఱ్ఱె-నెఱ్ఱి-ఎఱ్ఱ-మిఱ్ఱు-జెఱ్ఱి- మొద__

సూ:__శకటరేఫము మఱియొకహల్లుతోఁ గూడునపుడు లఘురేఫమగును. ౬౪

ఉదా__నూఱు నూర్వురు, ఆఱు ఆర్గురు, చెఱువు చెర్వు, మొద__

పూర్వశాసనములందును ప్రాచీనతాళపత్రగ్రంథములందును చిన్నయసూరి నీతిచంద్రికమొదటికూర్పునందును గూడ సంయుక్తమయినపుడు గూడ ఱ్వ-ఱ్గు-అనువిధముగా శకటరేఫమే కనఁబడుచున్నది. క్రమముగాఁ బైపద్ధతి మాఱిపోయినది.

గ్రామముల పేళ్లలోను మనుష్యులపేళ్ళలోను ఇంటిపేళ్ళలోను ఉన్నశకటరేఫమును లఘురేఫముగా నుచ్చరించినను వ్రాసినను దోషము లేదు.

ఉదా—తీపఱ్ఱు తీపఱ్రు. ఎఱ్ఱయ్య ఎఱ్రయ్య. కఱ్ఱావారు-కఱ్రావారు.

## ద్రుతప్రకృతికములు—కళలు

సూ:—ఆంధ్రశబ్దములు ద్రుతప్రకృతికములు కళలు అని రెండు విధములు.

ఇంతకు మున్ను చెప్పినట్లుగా, అన్నిశబ్దముల తుదనుండెడి నకారము ద్రుతముకాదు కావున, ఏశబ్దము ద్రుతప్రకృతికమో ఏది కాదో స్థూలదృష్టితోఁ గనుఁగొనుటకుఁ గొన్నిసూచనలు చేయఁబడుచున్నవి.

### ద్రుతప్రకృతికములు

౧. నామవిభక్తులలో-ని-ను-చేతన్-చేన్-తోడన్-తోన్-కొఱకున్-వలనన్-వల్లన్-కంటెన్-కిన్-కున్-లోపలన్-లోన్-నన్; * మైన్-మెయిన్-పొంటెన్-అనెడివిభక్తులు తుదఁ గలశబ్దము లన్నియు ద్రుతప్రకృతికములు.

ఉదా—రామునిన్-వానిన్-సీతన్-హరులన్-నాచేతన్- నీతోడన్-అతనికొఱకున్- ధనముకంటెన్-దానివలనన్- నీవల్లన్ - వారికిన్-మేడకున్-మాలోపలన్-మాలోన్-జలమునన్ - బలంబుమైన్. వీనినిబట్టి పై విభక్తులు చివరఁ గల వన్నియు ద్రుతప్రకృతికము లని భావించునది.

౨. క్రియావిభక్తులలో-ఎను-తిని-నాను-ఉన్నాను-కలను-ను- దును-ఎదును- ఎడిని-ఎ[illegible]-అ[illegible]-తను • అను విభక్తులు తుద

---

* మైన్ మొదలయినవియు, కళలలో[illegible]-మార్చి మొదలయినవియు విభక్తిప్రతిరూపకము లైనయవ్యయములు.

• ఆశీరర్థమున నిపుడు ధాతువుతుదఁ జేరుచున్న ‚తను’ ప్రత్యయముయొక్క మొదటిరూపము „తము” ఈరూపము తాళపత్రగ్రంథములందు గనవచ్చుచున్నది. కావుతము+అనియె, కావుత మనియె. తరువాత లేఖకాదిదోషమువలననో యెట్లో మువర్ణము నువర్ణముగా మాఱినది.

గలవి ద్రుతప్రకృతికములు.

ఉదా—వచ్చెను వచ్చెన్ చేసితిని చేసితిన్ ఇచ్చినాను పంపుచున్నాను రాఁగలను పోవును ఎఱుఁగుదును కొట్టెదుర్ ఉండెడిర్ వ్రాసెదను వెళ్లను కలుగుతుర్ వీనినిబట్టి పైని జూపిన క్రియావిభక్తులు తుదఁ గల వన్నియు ద్రుతప్రకృతికము లని యూహించునది.

3. లాక్షణికావ్యయములలో-చున్-అర్-ఇనర్ - దుర్-అను ప్రత్యయములు చివరఁ గల వన్నియు ద్రుతప్రకృతికములు.

ఉదా—చేయుచుర్ తినర్ తినఁగన్ పాడినన్ అనుదున్ కార్ ఉన్నర్- వీనినిబట్టి పైప్రత్యయము లంతమందుఁ గలయవ్యయములు ద్రుతప్రకృతికము లని భావించునది.

౪. ప్రాతిపదికావ్యయములలో-వలెర్ మాఱ్కిన్ పోలెర్ కై వడిర్ ఇఁకర్ అందుకున్ ఇందుకుర్ కావునన్ మొదలయినవి ద్రుతప్రకృతికములు.

౫. * ఉను,ఇది సముచ్చయము-నకారముమీఁది ఉకారము లోపింపఁగా, ఉర్ అను రూప మగును. ఇది తుదఁ గల వన్నియు ద్రుతప్రకృతికములు. ఉదా — వాఁడు+ఉను=వాఁడును-ఉకార సంధినిత్యము. ఇట్లే నీవును-నీవున్ రాముఁడును-రాముడుర్.

సూ:—ఉకారమునకుఁ దప్ప, తక్కినయచ్చులకు ఉన్ పర మగునపుడు సంధి రాదు. ౬౬

పరరూప సంధి రానపుడు యకార మాగమ మగును.

---

* ను, సముచ్చయ మని కొన్నిలక్షణగ్రంథములం దున్నది. వీనిలో నేది సముచ్చయ మని చెప్పుట కైనను కొన్నియుపపత్తులు లేకపోవుఁ గాని ఉను సముచ్చయ మనుటయే యుచితతర మగును.

ఉదా—పెద్ద+ఉన్=పెద్దయున్, హరి+ఉన్=హరియున్ వాగె+
ఉన్=వాగెయున్-ఇత్యాదు లూహ్యాములు.

తల్లియున్ ఏనియున్ మిక్కిలియున్ ఏమియున్ మొదలగుచో
యువర్ణము లోపించుటకలదు. ఏనిన్ మిక్కిలిన్ ఏమిన్ అనురూ
ములు గ్రంథములయందు గనవచ్చును. ఇట్లు సముచ్చయా
తము లైన ద్రుతప్రకృతికముల నూహించునది. "తల్లి
దండ్రియు నన్నుఁ గానని మనస్తాపంబునన్" మనుచ—
యువర్ణము లోపించినది.

౬. ఏని,ఇకారము లోపించినపుడు ద్రుతప్రకృతికము.

ఉదా—రామునేన్+కొల్చెద=రామునేఁ గొల్చెద. రామునే
కొల్చెద-మొద-ఇట్లే ఏని తుదఁ గలశబ్దముల భేద మెఱుఁగునది

౭. సర్వనామములలో-నేను-తాను- ఇవి ద్రుతప్రకృతికములు

౮. నామవాచకములలో—కన్ను పొన్ను (బంగారము) మన్ను
పెను మొదలగు కొన్ని శబ్దములు, కొన్ని శబ్దములు పర మగునపు
మాత్రమే ద్విత్వలోపమును ఉకారలోపమును చెంది ద్రుతప్రకృతికమ
లగుచున్నవి.

ఉదా—కన్ను+తెఱ=కందెఱ (కనుఱెప్ప) పొన్ను+తామర=పొ
దామర, మన్ను+చిల్లి=మంజిల్లి, పెను+చీఁకటి=పెంజీఁకటి
మొద—

మఱియు, సంధియందు గాని సమాసమునందు గాని, ఆగ
ముగా వచ్చిన నకారము తుదఁ గలవి ద్రుతప్రకృతికము లగును. అ
వన్నియు ముందు ముందు తెలియును.

ఉదా—ప్రాఁత+చదువు=ప్రాఁజదువు-లేఁత+కొమ్మ = లేఁగొమ్మ
సరసము+పలుకు=సరసపుఁబలుకు-మొద—

ఇంకను గొన్ని ద్రుతప్రకృతికము లుండవచ్చును. వానిని ప్రయో

ములవలనను వ్యాకరణకార్యములవలనను గ్రహించునది.

ఇట్లు పైని జెప్పినవిధముగా, నేవి ద్రుతప్రకృతికము లగునో వానిమీఁద నున్న-క-చ-చే-ట-త-ప-లకుఁ గ్రమముగా, గ-జ-జే-డ-ద -అనువర్ణము లాదేశము లగు ననియు, వానికి వెనుక నున్న నకారము కు అరసున్న గాని నిండుసున్న గాని వచ్చు ననియు గ్రహించునది. శేషములు సంధిప్రకరణమునఁ దెలియును.

ఉదా:—రాముని జూచితిని. వానిఁ జూచితిని. వచ్చెను బళువులు వచ్చెఁ బళువులు. చూచుచుంబోయెను. తాఁబలికెను. మొ-

## కళలు

పైని జెప్పినలక్షణములు పట్టనిశబ్దము లన్నియు; కళ లని చెప్పఁబడును. అనఁగా ద్రుత మైన నకారము తుద లేని వని యర్థము.

౧. నామవిభక్తులలో, డు-ము-వు-లు-కై-యొక్క-అందు; కూర్చి-పట్టి-ఉండి-కొఱకు-చేసి-ఇవి తుదఁగల వన్నియు కళలు. ఉదా-దేవుఁడు-లోకము-శంభువు-విప్రులు- బాలునికై-నీయొక్క- వనమునందు-విద్యనుగూర్చి-జ్ఞానముంబట్టి -ఊరనుండి- నీకొఱకు-భక్తింజేసి-ఇట్టి వ్యూహ్యములు-

'అందు' కళ. ద్రుతప్రకృతికము కాదు. దీనింగూర్చి తరువాతఁ దెలియఁగలదు.

౨. ని-ను-తుద లేని క్రియారూపము లన్నియు కళలు.

ఉదా:—చేసిరి వచ్చినాఁడు ఇచ్చినాడు చెప్పినది వెళ్ళినవి తెచ్చితివి వచ్చితిరి కోరితిమి తినుచున్నావు వినుచున్నాము చూడఁగలఁడు ఉండఁగలరు ఇయ్యఁగలవు పోఁగలము వ్రాయుదురు చదువుదువు కోరుదుము చేసెదరు వెదకెదవు వెదకెదరు వినెదము వినుము వినుఁడు చేయకుము చేయకుఁడు చేయుదము చేయునది మొదలగునవి.

౩. నకారము తుద లేనియవ్యయము లన్నియు, కళలు

ఉదా:—వచ్చి చేయక కాఁబట్టి ఔరా ఆహా ఏమి మొదలయినవి
అని-విని-కని-తిని-కొని-కాని-నివర్ణము చివర నున్నను, ఇట్టి
కళలే. ఇట్లే తక్కినవి గ్రహించునది.

౪. సర్వనామవాచకములలోను నామవాచకములలోను విశేష
ములలోను, ప్రథమావిభక్తియేకవచన ప్రత్యయము చివర లే
శబ్దములు (అనఁగా స్త్రీసమములు) అన్నియు, కళలు. ని-ను
వర్ణములు చివర నున్నను, అవి కళ లని యే తెలియునది.

ఉదా:—ఒకటి-ఒకతె-ఇన్ని-ఎన్ని-అంత- ఎవతె-అది-ఇది-ఎది-నీవు
మొదలయినవి సర్వనామములు.

హరి-సీత-గౌరి-నది-అన్న-అమ్మ-గోడ-ఇల్లు-కన్నె-గోనె-చేను
పేను-మ్రాను-కొలను-కలను-వెన్ను-మిన్ను-కన్ను-విన్ను-పని
ముని-అవని-కౌను-మేను-సేన-వాన-చిన్న-సన్న-మెత్తని-ఎఱ్ఱని-తియ్య
నల్లన-తెల్లన-ఇత్యాదినామవాచకములును విశేషణములును కళ ల
యే యెఱుంగునది.

ప్రథమావిభక్తిమీఁదను, కొన్ని సమాపకక్రియాపదము
మీఁదను, ఉన్న-క-చ-చే-ట-త-ప-లకు, గ-స-డ-ద-వ-లాదేశ మ
ననుసూత్రమునుబట్టి, కకార, టకార, తకారములకు; గకార; డకా
దకారములు వచ్చినను ఆమొదటిపదములు ద్రుతప్రకృతికము ల
భ్రాంతి పడరాదు. అవి కళలే-ఉదా-రాముఁడు+కొట్టెను=రాముఁ
గొట్టెను. వాఁడు+టక్కరి=వాడు డక్కరి. రారు+కదా=రారు గద
ఇత్యాదులు.

## శబ్దవిభాగము

సూ:—ఆంధ్రశబ్దములు నాలుగువిధములు.

ఆంధ్రభాషలో వాడఁబడుశబ్దము లన్నియు, తత్సమము

తద్భవములు దేశ్యములు గ్రామ్యములు అని నాలుగు తెలుఁగులనున్నవి.

సూ:—ఒక్కొక్కటియు నామవాచకాదివిభాగములు గలది. ౬౮

పై తత్సమాదులలో నొక్కొక్కటియు, నామవాచకము సర్వనామవాచకము విశేషణము అవ్యయము క్రియ అను విభాగములుకలదియగును.

సూ:—సంస్కృతప్రాకృతసమము తత్సమము. ౬౯

తెలుఁగువిభక్తులును ఇతరప్రత్యయములును చేరుటచే నించుక మార్పు చెందినసంస్కృతశబ్దములును ప్రాకృతశబ్దములును తత్సమములనఁబడును. తత్ =ఆసంస్కృతప్రాకృతములతో, సమము=సమానమయిన దని యర్థము.

| ఉదా— | సం | తత్స | సం | తత్స |
|---|---|---|---|---|
| | రామః | రాముఁడు | హరిః | హరి |
| | గురుః | గురువు | జ్ఞానం | జ్ఞానము |
| | సీతా | సీత | ఏకం | ఏకము |
| | శతం | శతము | విశాలః | విశాలము |
| | సుందరీ | సుందరి | వస్ | వసించు |
| | సృజ్- | సృజించు | భజ్ | భజించు- మొద— |
| | సం | ప్రా- | | ప్రా-సమ |
| | అగ్నిః | అగ్గీ | | అగ్గి |
| | యమః | జమో | | జేముఁడు |
| | శృంగారః | సింగారో | | సింగారము |
| | రాజ్ఞీ | రాణీ | | రాణి |
| | శ్రీః | సిరీ | | సిరి |
| | గౌరవం | గారవం | | గారవము |
| | జటా | జడా | | జేడ |
| | మిరా | మేరా | | మేర- మొద— |

సూ:—సంస్కృతప్రాకృతభవము తద్భవము. ౨౦

వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములను బొంది తెలుఁగున స్థిర పడిన సంస్కృతప్రాకృత శబ్దములయొక్క వికృతరూపములు తద్భవము లనఁబడును.

| ఉదా— సం | తద్భ | ప్రా | తద్భ |
|---|---|---|---|
| ఆకాశః | ఆకసము | ఇంగాలో | ఇంగలము |
| చంద్రః | చందురుఁడు | అచ్ఛరా | అచ్చర |
| మృగః | మెకము / మెగము | పణ్ణాసా | పనస |
| సముద్రః | సంద్రము | లచ్ఛీ | లచ్చి |
| తామరసం | తామర | జణ్హో | జేన్నము |
| ముఖం | మొకము / మొగము | పయాణం | పయనము |
| వక్రః | వంకర | ఖంభో | కంబము |
| కుడ్యం | గోడ | పవాళో | పవడము |
| సింహః | సింగము | అచ్ఛేరం | అచ్చెరువు |
| గృహం | గీము | పుఢవీ | పుడమి |
| త్రిలింగం | తెలుఁగు | మచ్ఛరో | మచ్చరము |
| కర్పూరం | కప్పురము | వెజ్జో | వెజ్జు మొద— |

మన దేశమున నిపుడు ప్రాకృతము వాడుకలో లేకపోవుట చేతను ఇది ప్రాకృతసమము ఇది ప్రాకృతభవ మని విభజించుటకు వీలు లేకపోవుటచేతను, తద్భవము లన్నియు నిపుడు సంస్కృతభవ ములు గానే పరిగణింపఁబడుచున్నవి.

సూ:—దేశవ్యవహారసిద్ధము దేశ్యము. ౨౧

తెలుఁగుదేశము నలుగడల వాడుకయందు, ప్రవాహారూపమున

నచ్చుచున్నదియు, తత్సమతద్భవములకంటె వేఱయినదియు నగుశబ్ద జాలము దేశ్య మనఁబడును.

ఉదా:—ఇల్లు-వాకిలి-తల్లి-తండ్రి-ఆలు-మగఁడు-పాలు-పెరుఁగు-పాఁడి పంట-నీరు-నిప్పు-వాఁడు-ఆమె-రెండు-ఇద్దఱు-తియ్యని-పుల్లని-చేసి-చేయక-ఊరక-మిన్నక-వచ్చెను-ఇచ్చెను-మొ-

సూ:—* పామరజనభాషితము గ్రామ్యము. ౨౨

విద్యావివేకము లేనివా రుచ్చరించునట్టి యసభ్య మైనమాట గ్రామ్య మనఁబడును. శ్రుతికఠోరములైన యట్టిమాటలు కావ్యములఁ బ్రయోగింపఁదగవు. ఉదాహరణము లూహ్యములు.

సూ:—లక్షణవిరుద్ధ మపశబ్దము. ౨౩

నియమహీన మైనశబ్ద మపశబ్ద మనఁబడును. అదియుఁ గావ్యములఁ బ్రయోగింపరాదు.

ఉదా:—వొస్తాఁడు - తెలుస్తోంది - చూశాను - వొచ్చేఁడు - వుత్తరం - వూళ్ళో-నయ్యోరం-ఆఁడెల్లేఁడు-వెళ్ళిపోయొస్తాను-వెడతాఁడు-దొబ్బేఁడు-యెంకయ్య-రద్దూ-చెప్పేస్తా-చెప్తా-మొహం-దంఢానసం-రావాల-వొక్కటి - ఇత్యాదులును, చొచ్చుము-ఏగుదెంచఁగన్ - తెలుపఁగ వైతివి - షష్ఠమము - దారాపుత్రులు - ఏగఱదేరెన్-వలనదు-చొఱును-చొరితిని - చిగురుకు (చివరకనుటకు) పదతమ్ముఁలు- మొదలయినవియు.

సూ:—శిష్టవ్యవహారసిద్ధము పూర్వకవిప్రయుక్తము నైనభాష గ్రాహ్యము. ౨౪

పూర్వలాక్షణికసమ్మతము కాకపోయినను ఇపుడు దేశము నలుగడల శిష్టులు వాడుచున్నదియు పూర్వకవులు తమకావ్యంబుల వాడినదియు నగుభాష గ్రహింపఁదగును.

---

* పామరాదిప్రయుక్తం య త్త ద్గ్రామ్య మభిధీయతే—ఆథర్వ.

ఉదా:—కలకంటుఁడు-ప్రాణగొడ్డము-జీవగఱ్ఱ-కపిలకన్నులు-మున్నగు ప్రయోగము లనింద్యగ్రామ్యము లని కొందఱు, మిశ్రసమాసము లని కొందఱు సాధించిరి. వీనివంటివే యగునట్టి-దినవెచ్చము-నిత్యపడి-ప్రతివాఁడు మొదలయినవియు, జన్మ-కర్మ-అల్లుళ్ళు-కూఁతురికి-వద్ద-వద్దు-కద్దు-అందుకున్-వల్లన్-కొండతికిన్-చేతురు-కోతురు-వాటిని-వచ్చినాను-చాలా-అంతేనా?-చేసినా-పోషించన్-చేయండి-ఒళ్ళు-పెళ్ళి-మొదలయినవియు గ్రామ్యములు. *

పూర్వకవులు వాడినవియు శిష్టులు వాడుచున్నవియు నైన యీశబ్దములు సాధువు లని వ్యావహారిక భాషావాదు లనుచున్నారు. ఇవి యసాధువులు గ్రామ్యము లని గ్రాంథికవాదు లనుచున్నారు. భాష ప్రవాహగతిని మాఱుచుండుట నైజ మగుటచేతను, ఆర్యవ్యవహారదృష్టము గ్రామ్య మని పూర్వవైయాకరణు లందఱు నేకగ్రీవముగా నంగీకరించి యుండుటచేతను, వీనిని వీనివంటివానిని గ్రామ్యములఁ బ్రయోగింపవచ్చును.

పైని జూపినవిభాగములలో శిష్టవ్యావహారికము తత్సమాదులలో నంతర్భూతమే యగుటచే నిపుడు గ్రాంథిక మైనయాంధ్రశబ్దజాలము తత్సమతద్భవదేశ్యరూపమున మూఁడువిధములే యగుచున్నది. మఱియు నిది వ్యాకరణకార్యములసౌలభ్యమునకై తత్సమము-ఆచ్ఛికము నని రెండువిధము లగుచున్నది. ఆచ్ఛిక మనఁగా, అచ్చతెలుఁగు- ఇందు తద్భవదేశ్యములు చేరును.

## భాషాభాగములు

సూ:—ఆంధ్రభాష అయిదుభాగములు. ౭౫

---

* కవిప్రయోగములు శబ్దప్రకరణాదులఁ జూపఁబడినవి.

నామవాచకము-సర్వనామవాచకము-విశేషణము-అవ్యయము-క్రియ-అని.

సూ:—విశేష్యమే నామవాచకము. ౨౭

సంస్కృతమందును తెలుఁగునందును ఏది విశేష్యమనఁబడు చున్నదో అదియే నామవాచక మనఁబడును.

సూ:—ఒకప్రాణినిగాని ఒకవస్తువునుగాని గుణాదులను గాని చెప్పు నది నామవాచకము. ౨౮

ఉదా:—మనుష్యుఁడు-శ్రీరాముఁడు-ఆవు-చిలుక-కొండ-ఎత్తు-తీపి

సూ:—నామవాచకమునకుఁ బదులుగా వాడఁబడునది సర్వనామ వాచకము. ౨౯

ఉదా:—వాఁడు-ఇతఁడు-ఎవరు-ఆమె-అది-నీవు-మేము-ఒకఁడు-మొ

సూ:—నామవాచకముయొక్క గుణమును దెలుపునది విశేషణము.

ఉదా:—సుందరము-మంచి-తెల్ల-చిన్న-తియ్యని-రెండవ-వచ్చిన-మొ

సూ:—లింగవిభక్తివచనశూన్య మవ్యయము. ౩౦

పుంలింగము స్త్రీలింగము నపుంసకలింగము కానిది, డు-ము-వు-లు-ఎను-రి-మొదలగువిభక్తిప్రత్యయములు లేనిది, ఏకవచన బహు వచనములు లేనిది, యైనశబ్దము అవ్యయ మనఁబడును. అనఁగా లిం గాదులచే మార్పు చెందని దని భావము.

ఉదా:—సదా-సర్వదా-సర్వత్ర; మిక్కిలి-ఎట్లు-ఇఁకన్-కాఁబట్టి-ఏమి-మఱి-ఏల-అక్కట-ఔరా-ఆహా-మొద—సహజములు.

ధాతువులనుండి పుట్టినవి—

క్త్వార్థకములు:—చేసి-వచ్చి-ఉండి-పోయి-తిని-వెళ్ళి-చదివి.

వ్యతిరేకక్త్వార్థకములు-చూడక-రాక-వినక-చేరక.

శత్రర్థకములు:—చెప్పుచున్-పాడుచున్-దున్నుచున్-పోవుచున్.

తుమున్నర్థకములు:—వండన్-పెట్టన్-కొనన్-కనన్-మెచ్చన్-ఉండన్.



5

చేదాద్యర్థకములు:—తెచ్చినన్ - ఇచ్చినఁ - కొట్టినన్ - ఉన్నఁ - అయితేన్.

ఆనంతర్యార్థకములు:—అనుడున్-అనవుడున్-చేయుడున్-చదువుడున్.

సూ:—ఒకప్రాణియొక్క కాని ఒకవస్తువుయొక్క కాని వ్యాపారమును తెలుపుచు వాక్యార్థమును పూర్తిచేయునది క్రియ. ౮౧

అనఁగా, ఒకవాక్యములో కర్త చేయుపనిని తెలియఁజేయుచు, ఆవాక్యముయొక్క అర్థమును సమాప్తిచేయునది యని యర్థము.

ఉదా:—మిత్రుఁడు వచ్చెను. ఆవు పాలిచ్చుచున్నది. బాలుఁడు పాఠము చదువును. మేలయ్యెడును. మొ- ఈవాక్యములలోని కడపటిపదము లన్నియుఁ గ్రియలు.

ఇది సంజ్ఞాప్రకరణము.

---

## విభక్తిప్రకరణము

### నామవిభక్తులు

* సూ:—డు-ము-వు-లు- మొదలయినవి నామవిభక్తులు ౧

| | |
|---|---|
| డు-ము-వు-లు | ప్రథమా విభక్తి |
| ని-ను | ద్వితీయా విభక్తి |
| చేతన్-చేన్-తోడన్-తోన్ | తృతీయా విభక్తి |
| కొఱకుఁ-కై | చతుర్థీ విభక్తి |
| వలనఁ-వల్లఁ-కంటెన్ | పంచమీ విభక్తి |
| కిఁ-కుఁ-యొక్క-లోన్-లోపలఁ- | షష్ఠీ విభక్తి |
| అందు-నఁ | సప్తమీ విభక్తి |

* నన్నయభట్టు కాలమందు-కొఱకున్-వలనన్-లోపలన్-అనునివి విభక్తిప్రత్యయములు కావు, ఇవి, కొఱ-వల-లోపల-అనుశబ్దములవిభక్త్యంతరూపములు.

సూ:—సంబోధనమునందు ప్రథమైకవచనముఁ బదముయొక్క తుద నుండెడి ఉకారమునకు అకారమును, లువర్ణమునకు 'ఆర' యును, ఆగమము లగును, ఇదియే సంబోధనప్రథమావిభక్తి యనఁబడును. 2

ఉదా:—రాముఁడు + అ = రాముఁడ. మృగము + అ = మృగమ. గురువు + అ = గురువ. రాములు + ఆర = రాములార-మొ—

సూ:—సంబోధనమున నామము మొదట ఓకారమును, పిలువఁదగిన వారినిబట్టి దానికి-యి-సి-రి-వర్ణములును వైకల్పికముగా ఆగమము లగును. 3

సంబోధన మనఁగాఁ బిలుచుట. పిలువఁదగినవా రనఁగా, మిత్ర సఖీదాసాదులు. పిలుచుటలో మిత్రత్వము నీచత్వము ప్రేమ గౌరవము మొదలగునవి సూచింపఁబడును.

---

తోడన్-అందు-అనునవియవ్యయములు. మొదటిది ద్రుతాంతము సహార్థకము. ,,వారల యొఁదోడన్'' మున్నగుచోట్ల వేఱుగాఁ బ్రయోగింపఁబడుటయే యిందుకుఁ దార్కాణము. మఱియు నపుడు చతుర్థ్యర్థమందును షష్ఠ్యర్థమందును గూడ, కిన్-కున్-ప్రత్యయములే వాడఁబడెడివి. కై అనునది, కిన్-కున్-లకు ఐ చేర్చుటచేఁ గలిగినది. దీనిని కేతనకవి ,,వలసినప్పుడు చేత కై వలన యొక్క యందు ననునివి యగుఁ దృతీయాదులందు.'' అని లక్షణమునఁ జేర్కొనెను గాని ఉదాహరణములలో దీని నెందును జూపలేదు. యొక్క-విభక్తిని వక్కాణించెను గాని దానికి నుదాహరణము చూపలేదు. షష్ఠీసమాసమందు విగ్రహము చెప్పునపుడే, యొక్క-విభక్తి కుపయోగము కనఁబడునుగాని దీనికిఁ గావ్యములలోఁ గాని వాడుకలోఁ గాని ప్రయోగము గనరాదు. కేతన, వలనవిభక్తి కుదాహరణము చూపుట చూడఁగా నిది యతనినాఁటికి విభక్తిప్రత్యయముగా గణనకు వచ్చిన దని తోఁచుచున్నది. ఈపైని జేర్కొనఁబడిన వన్నియుఁ గ్రమముగా విభక్తు లైనవి. అర్వాచీనసంప్రదాయమునుబట్టి వీనినే కాక, ఉన్నవాని రూపాంతరములను గూడఁ జేర్చితిని. ఇట్లు పదములు అవ్యయములు గూడ విభక్తిప్రత్యయములుగా మాఱిన వని తెలిసికొన్నచో భాషకు మార్పు సహజ మనెడుమాట ప్రాజ్ఞులమది కెక్కకపోవునా!

ఉదా:—ఓయికృష్ణ-ఓకృష్ణ; ఓరిబాల-ఓబాల; ఓసిబిడ్డ-ఓబిడ్డ; ఓరిసేవక-ఓసేవక; ఓసిదాసి-ఓదాసి; ఓయిజేఁడ-ఓజేఁడ! ఇత్యాదులూహ్యములు. ఓశబ్దమును విడిచియు సంబోధ్యవాచకము ప్రయోగింపవచ్చును. ఉదా-రామ-రామా; కుమార-కుమారా. పిల్లలార-ఇత్యాదులు.

అకారము-అర; చేర్పకుండఁగా సంబోధ్యవాచకము ప్రయోగించుట కలదు. ఉదా-భగవానులూ! ఆంజనేయులూ! వినుఁడు బాలకులు. ఇత్యాదులు. ఈభేదములు శబ్దప్రకరణమునఁ దెలియును.

సూ:—డు-ము-వు-ని-న్-ఇవి యేకవచనములు.

ఒకప్రాణినిగాని ఒకవస్తువునుగాని చెప్పున దేకవచనము.

ఉదా:—రాముఁడు-ధనము-శంభువు-కృష్ణుని-వనమున్-మొ.—

ఇపుడు విభక్తులు చదువునట్టివాడుకనుబట్టి ద్రుతమువిూఁద యచ్చును విడిచి పైవిభక్తులు కొన్ని చూపితిని గాని చేతను-తోడను-కొఱకును-వలనను-వల్లను-కంటెను-కిని-కును-సను-అనురూపము మొదటి వని తెలియునది.

అందున్-అని కొందఱులాక్షణికులు ద్రుతాంతరూపమును జేర్చినిరి కాని భారతముయొక్క-ప్రాచీనతాళపత్రసంపుటములందు 'అందు' అని కళగానే కనఁబడును. అదియే నిజమైనరూప మని తలఁచి దీనికి నకారము చేర్చలేదు. ఇది సముచ్చయము చేరినపుడు ద్రుతాంత మగుచున్నది. దీనిని గూర్చి ముందుముందు మరలఁ దెలిపెదను.

సూ:—లు-ఇది బహువచనము

అనేకప్రాణులనుగాని, అనేకవస్తువులనుగాని చెప్పునది బహువచనము.

ఉదా:—రాములు-ఆవులు-గోడలు-మొ.—

సూ:—తక్కినవి యుభయములు. ౬

మిగిలిన ను-చేతను మొదలగు విభక్తులు ఏకవచనములు బహువచనములు గూడ నగును.

ఉదా:—సీతను-సీతలను, రామునిచేతన్ - రాములచేతన్, తమ్మునితోడన్-తమ్ములతోడన్, నీకొఱకున్-మీకొఱకున్, వానికై-వారికై, నావలనన్-మావలనన్, క్రతువుకంటెన్ - క్రతువులకంటెన్, వానికిన్-వారికిన్, నీకున్-మీకున్, నదియొక్క-నదులయొక్క, వనములోపలన్ - వనములలోపలన్, ఇంటియందు-ఇండ్లయందు-ఇట్లూహించునది.

సూ:—నామముతోఁ గలిసినపుడు, డుప్రత్యయము వెనుక బిందువు చేరును. ౭

ఉదా:—మగ+డు=మగఁడు, మగండు. సూర్యుఁడు - సూర్యుండు.

సూ:—విభక్తి ప్రత్యయాదుల ద్రుతస్వరమునకు లోపము వైకల్పికము. నాను-ఉన్నాను-లకుఁ గలుగదు. ౮

ని-ను-చేతను- మొదలగు నామవిభక్తులయొక్కయు; చెప్పఁబోవు-ఎను-తిని-కలను- మొదలగు క్రియావిభక్తులయొక్కయు; అను-ఇనను- మొదలగు నితరప్రత్యయములయొక్కయు; సముచ్చయమైన ఉను మొదలగువానియొక్కయు ; నకారముమీఁదనుండు ఇకారము ఉకారమును వైకల్పికముగ లోపించును. నాను-ఉన్నాను-అనుక్రియావిభక్తులతుది ఉకారము మాత్రము లోపింపదు.

ఉదా:—రాముని-రామున్, సీతను-సీతన్, వనమునను-వనమునన్, వచ్చెను-వచ్చెన్, చూచును-చూచున్, ఇచ్చితిని-ఇచ్చితిన్, చేసెడిని-చేసెడిన్, ఉండను-ఉండన్, చెప్పినను-చెప్పినన్, వాఁడును - వాఁడున్. మొద—చేసినాను - వచ్చుచున్నాను వంటిక్రియలతుదనుండు ఉకారము లోపింపదు.

సూ:—చేన్-తోఁ-వల్లన్-లోఁ-అనునవి, చేతఁ-తోడఁ-వలనఁ-లోపలఁ-అనువాని రూపాంతరములు. ౯

ఉదా:—రామునిచేతఁ-రామునిచేఁ, హరితోడఁ-హరితోఁ, నీవలనఁ-నీవల్లన్, శూరులలోపలఁ-శూరులలోఁ. 'వల్లఁ' అనుటకుఁ బ్రయోగములు కారకప్రకరణమునఁ గలవు.

(బాలురు విభక్తులను గుర్తుపట్టి వల్లించుటకుఁ గొన్నిశబ్దములుదాహరింపఁబడుచున్నవి. రూపనిష్పత్తివిశేషములు శబ్దప్రకరణమునఁ దెలియఁగలవు.)

అకారాంతము పుంలింగము రామశబ్దము,

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర. | రాముఁడు | రాములు |
| సం. ప్ర. | ఓయిరాముఁడ ఓరాముఁడా<br>ఓరామ ఓయిరామా<br>రామ-రామా | ఓరాములార<br>ఓరాములారా! |
| ద్వి. | రాముని-రామునిఁ-రామున్ | రాములను-రాములఁ |
| తృ. | రామునిచేతఁ-రామునిచేఁ<br>రామునితోడన్-రామునితోన్<br>రాముచేతఁ-రాముచేఁ<br>రాముతోడన్-రాముతోఁ | రాములచేతఁ-రాములచేన్<br>రాములతోడన్-రాములతోన్ |
| చ. | రామునికొఱకుఁ-రాముకొఱకుఁ<br>రామునికై-రాముకై | రాములకొఱకున్<br>రాములకై |
| పం. | రామునివలనఁ-రామువలనన్<br>రామునికంటెఁ-రాముకంటెఁ<br>రామునివల్లన్-రామువల్లఁ | రాములవలనన్<br>రాములకంటెఁ<br>రాములవల్లన్ |

| | | |
|---|---|---|
| ష. | * రామునికిన్-రామునకున్ | రాములకున్ |
| | రామునియొక్క-రామునియొక్క | రాములయొక్క |
| స. | రామునియందు-రామునందు | రాములయందు |
| | | రాములందు |

ఇట్లు కృష్ణుఁడు-గోవిందుఁడు-ధీరుఁడు-గురుఁడు-విధాతృఁడు.

సూ:—అందు-ఇందు-ఎందు-ఈమూఁడును విభక్త్యంతప్రతిరూపకము లై నయవ్యయములు. ౧౦

అనఁగా వీనికి నామవాచకములకువలెనే విభక్తిప్రత్యయములు గనవచ్చు నని భావము. వీనింగూర్చి యవ్యయప్రకరణమునఁ దెలియ గలదు. వీనిలో 'అందు' ప్రత్యేకముగాను ప్రయోగింపఁబడును, సప్తమీవిభక్తిప్రత్యయముగాను వాడఁబడును. ఈమూఁడును ప్రాచీనభారతతాళపత్రపుస్తకములందును పూర్వశాసనములందును కళలుగానే యున్నవి. తరువాత నివి ద్రుతప్రకృతికములుగాఁ బ్రయోగింపఁబడుచు వచ్చినవి. వీనిమీఁద నుండు-క-చ-చే-ట-త-ప-లకు, గ-స-డ-ద-వ-లాదేశము లగుట తొంటివ్రాఁతపుస్తకములందు గనవచ్చును.

ఉదా:—"ఎందువోయెదు" భార-"ఇందు ప్రత్యక్షమై" యుద్ధమల్లు నిశాసనము. ఈరెండుచోట్లను పకారము వకార మైనది. ఇట్టి ప్రయోగము లనేకములు కలవు. కాఁబట్టి [2] 'అందు' అను సప్తమీవిభక్తిప్రత్యయము కళ యని తెలియునది. దీనిమీఁద సముచ్చయము చేరినయెడల 'అందున్' అగును. సముచ్చయార్థము ద్యోత్య మగునపుడే యిది ద్రుతప్రకృతికము.

---

* లోపల—విభక్తియొక్క వినియోగముకారకప్రకరణమునఁ దెలియును.

2 అతిథివై వచ్చి నీవు మాయందు గుడిచి, భార—అర' "మాయందు కృతభోజనుండ వై పొమ్ము" సభా—ఇత్యాదిప్రయోగము లనేకము లచ్చులో ద్రుతప్రకృతికములుగా దిద్దఁబడినవి.

కాసిచో నిది కళయే. ఇందుకు—ఉదా:—వాం డ్లన్నమాట కొన్నిమండలములలో వాడుకయం దున్నది, కొన్నిగ్రంథము లయందు నున్నది. గ్రంథములందును అనుచో సముచ్చయము యొక్క-యర్థము గనవచ్చుచున్నది. సముచ్చయార్థ మావశ్యక ము గానిపట్టునఁ బూర్వగ్రంథములలో అందు నున్నదన్న ట్లుగా ద్రుతాంత మయిన (అందుఁ) ప్రయోగము కనఁ బడదు. సముచ్చయములోనినకారము నిలిచి యున్నపుడును నిందుసున్న యైనపుడును సముచ్చయార్థము గోచరించును. అరసున్నగా మాఱినపుడు (పద్యములందు) విస్పష్టము కాదు. అంతమాత్రమున, 'అందు' (సప్తమీవిభక్తి) ద్రుతాంత మని భావింపరాదు. *

ఆకారాంతము స్త్రీలింగము సీతాశబ్దము, తెలుఁగున అకా రాంతమైనది.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర. | సీత | సీతలు |
| సం. ప్ర. | ఓసీత-ఓసీతా | ఓసీతలార-సీతలారా! |
| ద్వి. | సీతను | సీతలను |
| తృ. | సీతచేతఁ(-చేన్-తోడన్-తోన్) | సీతలచేతన్— |
| చ. | సీతకొఱకుఁ-(కై) | సీతలకొఱకుఁ— |
| పం. | సీతవలనఁ-(వల్లఁ-కంటెఁ) | సీతలవలనన్— |
| ష. | సీతయొక్క-(కున్) | సీతలయొక్క— |
| స. | సీతయందు | సీతలయందు |

ఇట్లు, అకారము తుదఁగలతత్సమము లైనస్త్రీలింగపుంలింగ

* సముచ్చయతో గూడినప్పటి 'అందు' రూపము. సహజ మైన్ద్రుతప్రకృతి మను భ్రాంతి గలిగించి యుండును.

నపుంసకలింగశబ్దములును అకారాంతములై ఆచ్ఛికము లైనస్త్రీలింగ పుంలింగనపుంసకలింగశబ్దములును జెప్పఁదగును. అవి కొన్ని—రమ-కాంత-పతివ్రత ; బ్రహ్మ-యజ్వ-విశ్వకర్మ - కర్మ ; పిత-భ్రాత-సప్త; మాత-దుహిత ; అయ్య-అన్న ; అమ్మ-నెలఁత ; గోడ-మేడ ; చిలుక-చీమ ; మొద—

ఇకారాంతము పుంలింగము హరిశబ్దము.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర. | హరి | హరులు |
| సం. ప్ర. | ఓహరి-ఓహరీ | ఓహరులారా |
| ద్వి. | హరిని-హరిఁ | హరులను-హరులన్ |
| తృ. | హరిచేతన్-(చేన్-తోడన్-తోన్) | హరులచేతన్ |
| చ. | హరికొఱకున్-(కై) | హరులకొఱకుఁ |
| పం. | హరివలనఁ-(వల్లఁ-కంటెఁ) | హరులవలనన్ |
| ష. | హరికిన్-(యొక్క) | హరులకుఁ |
| స. | హరియందు | హరులయందు |

ఇట్లు ఇకారము తుదఁగల తత్సమములు ఆచ్ఛికములు గూడఁ జెప్పనగును. అట్టివి కొన్ని—కవి-గిరి-జ్ఞాని-కరి-యువతి-నీతి-వాణి-నది-వారి-శుచి-సిరి-పని-చెవి-గది-మొ—

ఉకారాంతము పుంలింగము గురుశబ్దము.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర. | గురువు-గురుఁడు | గురువులు-గురులు |
| సం. | ఓగురువ-ఓగురుఁడ-ఓగురూ3 | ఓగురువులార-ఓగురులారా |
| ద్వి. | గురువును-గురుని | గురువులను-గురులను |
| తృ. | గురువుతోడఁ-గురునితోఁ | గురువులతోడఁ- |

గురులతోఁ

| | |
|---|---|
| చ. గురువుకై-గురునికై | గురువులకై-గురులకై |
| పం. గురువుకంటెన్-గురునికంటెన్ | గురువులకంటెన్-గురులకంటెన్ |
| ష. గురువునకున్-గురునికిన్-గురునకున్ | గురువులకున్-గురులకున్ |
| గురువుయొక్క-గురునియొక్క | గురువులయొక్క |
| స. గురువునందు-గురునియందు | గురువులయందు |
| గురునందు | గురువులందు |
| | గురులయందు |
| | గురులందు |

ఇట్లు, శంభువు-విష్ణువు-బంధువు-విభువు-మొద —
ఊకారాంతము స్త్రీలింగము వధూశబ్దము, తెలుఁగున
ఉకారాంత మగును.

| ఏకవచనము | బహువచనము |
|---|---|
| ప్ర. వధువు | వధువులు |
| సం. ఓవధువ | ఓవధువులార |
| ద్వి. వధువును | వధువులను |
| స. వధువునందు | వధువులందు |

తక్కినవిభక్తు లూహించునది. ఇట్లు గోవు-భ్రూవు-సుభ్రూ
ఉకారాంతము నపుంసకలింగము కొలువుశబ్దము.

| ఏకవచనము | బహువచనము |
|---|---|
| ప్ర. కొలువు | కొలువులు |
| ద్వి. కొలువును | కొలువులను |
| తృ. కొలువుచేతన్(తోడన్) | కొలువులచేతన్ |
| చ. కొలువుకొఱకున్(కై) | కొలువులకొఱకున్ |

| | | |
|---|---|---|
| పం. | కొలువువలనన్ (కంటెన్) | కొలువులవలనన్ |
| ష. | కొలువునకున్ (యొక్క-) | కొలువులకున్ |
| | కొలువులోపలన్ | కొలువులలోపలన్ |
| స. | కొలువునందు | కొలువులయందు |

ఇట్లు-చెఱువు-బరువు-మందు-సందు- ఎచ్చు-తగ్గు-ముక్కు-తలుపు-కడుపు-మొద—సందర్భమునుబట్టి కొన్నిటికి సంబోధన ప్రథమావిభక్తి చేర్పవచ్చును.

ఎకారాంతము స్త్రీలింగము కన్నెశబ్దము.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర. | కన్నె | కన్నెలు |
| సం. | ఓకన్నె | ఓకన్నెలార |
| ద్వి. | కన్నెను | కన్నెలను |

సీతశబ్దమునకువలెనే దీనికిని విభక్త్యు లూహించునది. ఇట్లు పెట్టె గోనె-వన్నె-కోడె- మొద—

అకారాంతము నపుంసకలింగము జలశబ్దము.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర. | జలము-జలమ్ము-జలంబు- | జలములు-జలమ్ములు జలంబులు |
| సం. | ఓజలమ | ఓజలములార |
| ద్వి. | జలమును | జలములను |
| తృ. | జలముచేతన్ (తోడన్) | జలములచేతన్ |
| చ. | జలముకొఱకున్ (కై) | జలములకొఱకున్ |
| పం. | జలమువలనన్ (కంటెన్) | జలములవలనన్ |
| ష. | జలమునకున్ (యొక్క-లోపలన్) | జలములకున్ |
| స. | జలమునందు జలమందు | జలములయందు |

జలమునన్ జలములందు

ఇట్లు-ధనము-వనము-ఫలము-మొదలగు తత్సమములు, అద్దము-అందము-మొగము-కయ్యము-నేస్తము-మొదలగు నాచ్ఛికశబ్దములును జెప్పనగును.

ఔపవిభక్తికాంతములు కొన్ని—

కొన్ని నామములతుదనుండు-లి-లు-ల్లు-డు-రు-ఱు-ను-న్ను-యి-మొదలగు వర్ణములకు, ఇ-టి-ంటి-తి-అనెడి వర్ణములలో నేదయిన యథాప్రయోగముగా నాదేశ మగుచుండును. అది ద్వితీయాదివిభక్తుల యేకవచనములయందే తఱచుగాఁ గానవచ్చును. కావునఁ గొన్ని శబ్దముల ప్రథమైకవచన బహువచనరూపములును ద్వితీయతృతీయ సప్తముల యేకవచనములును చూపఁబడును. తక్కిన విభక్తులు వానినిబట్టి యూహింపవచ్చును. విశేషాంశములు శబ్దప్రకరణమునఁ దెలియును:

ప్ర. నాఁగలి-నాఁగళ్ళు; ద్వి. నాఁగటిని, తృ. నాఁగటిచేతన్-నాఁగటఁ, స. నాఁగటియందు-నాఁగటఁ- ఇట్లు- దోసిలి- గుప్పిలి-ఆఁకలి-కొడవలి-కౌఁగిలి- మొదలయినవి.

ప్ర. కాలు-కాళ్ళు; ద్వి. కాలిని, తృ. కాలిచేన్-కాలఁ, స. కాలియందు-కాలన్-ఇట్లు-వ్రేలు-నూలు- మోఁకాలు- మొద—

ప్ర. విల్లు-విండ్లు; ద్వి. వింటిని, తృ. వింటిచేన్-వింటన్, స. వింటియందు-వింటన్-ఇట్లు-ముల్లు-పల్లు-ఇల్లు- మొదలయినవి—

ప్ర. త్రాడు-త్రాళ్ళు; ద్వి. త్రాటిని, తృ. త్రాటిచేఁ-త్రాటఁ-స. త్రాటియందు-త్రాటన్-ఇట్లు-గూఁడు-కూడు- బీడు-నాఁడు-వీడు- మొద—తృతీయాసప్తములయం దన్నిటికిని అకారము రాదు. అది తరువాతఁ దెలియును.

ప్ర. నీరు-నీళ్ళు; ద్వి. నీటిని-నీరిని, తృ. నీటిచేన్-నీరిచేన్, స. నీటి

యందు-నీటన్-నీరియందు, ఇట్లు-నోరు-గోరు-మొద—

ప్ర. ఏఱు-ఏళ్ళు, ద్వి. ఏటిని, తృ. ఏటిచేన్, స. ఏటియందు-ఏటన్-

ప్ర. చేను-చేయి; ద్వి. చేనిని, తృ. చేనిచేన్, స. చేనియందు-ఇట్లు-పేను-మేను-మొద—

ప్ర. మ్రాను-మ్రాఁకులు; ద్వి. మ్రానిని, తృ. మ్రానియందు తక్కినది చేనుశబ్దమునకు వలెనే. ఇట్లు-కలను-కెలను-కొలను-మొదలయినవి.

ప్ర. కన్ను-కన్నులు; ద్వి. కంటిని, తృ. కంటిచేన్ - కంటన్, స. కంటియందు-కంటన్, ఇట్లు-మిన్ను-మన్ను-జున్ను మొదలయినవి-

ప్ర. గోయి-గోతులు; ద్వి. గోతిని, తృ. గోతిచేన్, స. గోతియందు-గోతన్-ఇట్లు-నూయి-చేయి-నేయి-మొద—

## వా క్య ము

సూ:—కర్తృకర్మక్రియాదులకూడిక వాక్యము. ౧౧

ఆదిపదముచే విశేషణము అన్వయము మొదలయినవి గ్రహింపఁదగును. వీనికూడికకే వాక్య మని పేరు.

సూ:—వాక్యమునందు స్వతంత్రముగా నుండునది కర్త యనఁబడును. ౧౨

అనఁగా, ధాతువు చెప్పునట్టి యర్థముగలపనిని చేయువానిని లేక చేయుదానిని తెలుపునట్టి పద మని యర్థము. అది వాక్యములో స్వతంత్రముగా నుండును గావున కర్త యగును.

ఉదా:—రాముఁడు రావణుని సంహరించెను.

ఇందు సంహరించుధాతువునకు చంపుట యర్థము. దానిని చేసినవాఁడు రాముఁడు. అతనిని దెలియఁజేయుపదము రాముఁడు. అది పైవాక్యములో స్వతంత్ర మయిన దగుటచే కర్త యైనది. ఇట్లే

ఆవు పాలిచ్చును. ఇందు, ఇచ్చుధాతువునకు ఇచ్చుట (ఈవి) అర్థము. దానిని చేయునది ఆవు-దానిని తెలియఁజేయుపదము ఆవు-అది పైవాక్యములో స్వతంత్రము గావునఁ గర్త యైనది.

*సూ:—క్రియాఫలమును బొందునది కర్మ. ౧౩

అనఁగా, ధాతువు చెప్పునట్టి యర్థముయొక్క ఫలమును జెందువానిని గాని, చెందుదానిని గాని తెలియఁజేయుపద మని యర్థము

ఉదా:—శ్రీరాముఁడు సీతను పెండ్లాడెను.

ఇందు పెండ్లాడుధాతువునకు వివాహము చేసికొనుట యర్థము దానిఫలమును బొందినది సీత. ఆమెను దెలుపుపదము సీత. కావున సీత యనుపద మిందు కర్మ యైనది. ఇట్లే యూహించునది.

సూ:—కర్త్రాదులలో నేదేని యొకటి లేనివాక్యము నుండును. ౧౪

కర్త కర్మ క్రియలలో నొకటి లేకయు వాక్య ముండుట కలదు. కాని, ఆలేనిపద మధ్యాహార్య మగును. లేనిపదము తెచ్చుకొనుట కధ్యాహారమనియు తెచ్చుకొనుపదమున కధ్యాహార్య మనియుఁ బేళ్ళు.

ఉదా—'వరమునఁ బుట్టితిన్ భరతవంశముఁ జొచ్చితిని.' భార—

ఈవాక్యములయందు నే ననెడిపద మధ్యాహార్యము.

ఆంజనేయుఁడు శ్రీరామునిదూత. ఇందు క్రియ లేదు. నీవు చెప్పితివి నేను వింటిని-ఇందు, కర్మపదములు లేవు. వానిని తెచ్చుకొని యర్థము చెప్పఁకొనవచ్చును.

---

(1) ధాత్వర్థవ్యాపారాశ్రయము కర్త. ప్రధానభూతధాత్వర్థ వ్యాపారాశ్రయత్వము స్వాతంత్ర్యము. క్రియయందు స్వాతంత్ర్యముచే వివక్షింపఁబడిన యర్థము కర్త.

* ధాత్వర్థఫలాశ్రయము కర్మ. అనుచుఁ గర్తృకర్మపదములకుఁ బాణినీయమున వ్యాఖ్యాతలు లక్షణములు వ్రాసిరి. ఇవి బాలురకు సులభముగాఁ దెలియ వని వీని యర్థము నీపైవిధముగా సూత్రించితిని. ఇవి కారకప్రకరణమున వివరింపఁబడును.

సూ:—భూతార్థకాదిభేదమునఁ గ్రియ నాలుగువిధములు. * ౧౫

భూతార్థకము వర్తమానార్థకము భవిష్యదర్థకము—తద్ధర్మాద్యర్థకము అని తెలుఁగున క్రియ నాల్గు తెఱఁగుల నుండును.

సూ:—జరిగినకాలమును తెలుపునది భూతార్థకము. ౧౬

సూ:—జరుగుచున్నకాలమును దెలుపునది వర్తమానార్థకము. ౧౭

సూ:—జరుగఁబోవుకాలమును దెలుపునది భవిష్యదర్థకము. ౧౮

సూ:—తఱుచుగా మూఁడుకాలములను దెలుపునది. తద్ధర్మాద్యర్థకము. ౧౯

ఆశీరర్థకము మొదలయినవి తద్ధర్మమునఁ జేరును. క్రమముగా నుదాహరణములు.

రాముఁడు పూలతోఁటకు వెళ్ళెను.

సీత పూవులు కోయుచున్నది.

అతఁ డామెను జూచును.

వారికి సంతోషము దయించెడిని.

సూ:—మఱియు ప్రథమపురుషాదిభేదమునఁ గ్రియ మూడువిధములు.

ప్రథమపురుషక్రియ మధ్యమపురుషక్రియ ఉత్తమపురుషక్రియ అని. క్రియాపదములతుద నుండు ఎను-తివి-తిని-మున్నగుక్రియావిభక్తులకు పురుషము లని పేరు. వానితోఁ గూడినవి యగుటచేఁ గ్రియాపదములకుఁ గూడ ఆపేళ్ళే కలిగినవి.

ఉదా—రాముఁడు వచ్చుచున్నాఁడు. నీవు చూచుచున్నావు. నేను చెప్పుచున్నాను.

సూ:—నీవు-మీరు- పదములు కర్త లగునపుడు క్రియ మధ్యమపురుష యగును- ౨౧

* క్రియాభేదములును వానివిభాగములును క్రియాప్రకరణమునఁ జూడనగును.

ఉదా—నీవు వచ్చితివి. మీరు వచ్చుచున్నారు. మొద—

సూ:—నేను- మేము-మనము-పదములు కర్త లగునప్పుడు క్రియ యుత్తమపురుష యగును. ౨౨

ఉదా—నేను చేయుదును-మేము చేయుదుము-మనము చేయుదము-

సూ:—తక్కినసర్వనామములు నామవాచకములు కర్త లగునపుడు క్రియ ప్రథమపురుష యగును. ౨౩

ఉదా—వాఁడు వచ్చెను- అది పోవుచున్నది. వీఁడు చూచెను. ఈమె చదివినది; సూర్యుఁ డుదయించును. వెలుఁగు రాఁగలదు. మొద—

[బాలురు క్రియలను గుర్తుపట్టుటకు భూతాద్యర్థకక్రియల సామాన్యరూపములు * మహదాదిభేదములతోఁ జూపఁబడుచున్నవి. విశేషములు క్రియాప్రకరణమునఁ దెలియును]

ఇచ్చుధాతువు, భూతకాలము.

| | | ఏక. | బహు |
|---|---|---|---|
| మహత్తు | ప్రథమపురుష. | ఇచ్చెను | ఇచ్చిరి |
| | | ఇచ్చినాఁడు | ఇచ్చినారు |
| మహతి | ,, | ఇచ్చెను | ఇచ్చిరి |
| | | ఇచ్చినది | ఇచ్చినారు |
| అమహత్తు | ,, | ఇచ్చెను | ఇచ్చెను |
| | | ఇచ్చినది | ఇచ్చినవి |
| మహత్తు | మధ్యమపురుష. | ఇచ్చితివి | ఇచ్చితిరి |
| | | ఇచ్చినావు | ఇచ్చినారు |
| మహతి | ,, | ఇచ్చితివి | ఇచ్చితిరి |
| | | ఇచ్చినావు | ఇచ్చినారు |

* మహదాదినిర్వచనము నామవాచకప్రకరణమునఁ గన నగును.

| | | | |
|---|---|---|---|
| అమహత్తు | మధ్యమపురుష | ఇచ్చితివి | ఇచ్చితిరి |
| | | ఇచ్చినావు | ఇచ్చినారు |
| మహత్తు | ఉత్తమపురుష | ఇచ్చితిని | ఇచ్చితిమి |
| | ,, | ఇచ్చినాను | ఇచ్చినాము |
| మహతి | ఉత్తమపురుష | ఇచ్చితిని | ఇచ్చితిమి |
| | ,, | ఇచ్చినాను | ఇచ్చినాము |
| అమహత్తు | ఉత్తమపురుష | ఇచ్చితిని | ఇచ్చితిమి |
| | ,, | ఇచ్చినాను | ఇచ్చినాము |

ప్రథమపురుష క్రియారూపములలో మాత్రము కొంచెము భేదము గనఁబడును. మధ్యమోత్తమపురుష క్రియారూపములు మూఁడింటియందును సమానముగానే యున్నవి. ఇట్లే వర్తమానకాలాదులఁ గూడ నుండు నని తెలియునది.

పలుకుధాతువు-వర్తమానకాలము.

| | | | |
|---|---|---|---|
| మ | ప్ర. పు. | పలుకుచున్నాఁడు | పలుకుచున్నారు |
| మ.తి | ,, ,, | పలుకుచున్నది | పలుకుచున్నారు |
| అమ | ,, ,, | పలుకుచున్నది | పలుకుచున్నవి |
| మ | మ. పు. | పలుకుచున్నావు | పలుకుచున్నారు |
| మ.తి | ,, ,, | పలుకుచున్నావు | పలుకుచున్నారు |
| అమ | ,, ,, | పలుకుచున్నావు | పలుకుచున్నారు |
| మ | ఉ. పు. | పలుకుచున్నాను | పలుకుచున్నాము |
| మ.తి | ,, ,, | పలుకుచున్నాను | పలుకుచున్నాము |
| అమ | ,, ,, | పలుకుచున్నాను | పలుకుచున్నాము |

* చేయుధాతువు. భవిష్యత్కాలము.

| | | | |
|---|---|---|---|
| మ | ప్ర. పు. | చేయఁగలఁడు | చేయఁగలరు |

* భవిష్యదర్థమునందు ధాతువునకు 'కల' అనుబంధముగాఁ జేర్చునట్టి యాచార మాంధ్రశబ్దచింతామణినాఁటినుండి వచ్చినది. నన్నయాదులనాఁడు చేయును-చేయుదురు-వంటివే భవిష్యదర్థక క్రియలు. అర్వాచీనసంప్రదాయమునుబట్టి యీ రూపము లిందు చూపితిని. క్రియాప్రకరణమున నీవిషయము విమర్శింపఁబడును.

| | | | |
|---|---|---|---|
| మ.తి | ,, ,, | చేయఁగలదు | చేయఁగలరు |
| అమ | ,, ,, | చేయఁగలదు | చేయఁగలవు |
| మ | మ. పు. | చేయఁగలవు | చేయఁగలరు |
| మ.తి | ,, ,, | చేయఁగలవు | చేయఁగలరు |
| అమ | ,, ,, | చేయఁగలవు | చేయఁగలరు |
| మ | ఉ. పు. | చేయఁగలను | చేయఁగలము |
| మ.తి | ,, ,, | చేయఁగలను | చేయఁగలము |
| అమ | ,, ,, | చేయఁగలను | చేయఁగలము |

కోరుధాతువు-తద్ధర్మకాలము.

| | | | |
|---|---|---|---|
| మహత్తు | ప్ర. పు. | కోరును | కోరుదురు |
| మహతి | ,, ,, | కోరును | కోరుదురు |
| అమహత్తు | ,, ,, | కోరును | కోరును |
| | మ. పు. | కోరుదువు | కోరుదురు |
| | ఉ. పు. | కోరుదును | కోరుదుము |

కోరుధాతువు-వ్యతిరేకతద్ధర్మార్థకము.

| | | | |
|---|---|---|---|
| మహత్తు | ప్ర. పు. | కోరఁడు | కోరరు |
| మహతి | ,, ,, | కోరదు | కోరరు |
| అమహత్తు | ,, ,, | కోరదు | కోరవు |
| | మ. పు. | కోరవు | కోరరు |
| | ఉ. పు. | కోరను | కోరము |

ప్రార్థనార్థకము - మధ్యమపురుషము - నీవు చేయుము - మీరు చేయుఁడు.

వ్యతిరేకప్రార్థనార్థకము-నీవు చేయకుము. మీరుచేయఁకుఁడు.

ఉభయప్రార్థనార్థకము-మనము చేయుదము.

విధ్యర్థకము-నీవు చేయునది. మీరు వ్రాయునది.

* ఆశీరర్థకము:— మేలు కలిగెడున్-కలుగుతన్.

## ఇది విభక్తి ప్రకరణము

---

## నామవాచక ప్రకరణము

సూ:— నామవాచక మయిదువిధములు. ౧

తత్సమాచ్ఛికరూపమయిన నామవాచకములు సంజ్ఞావాచకములు సామాన్యవాచకములు సముదాయవాచకములు ద్రవ్యవాచకములు గుణాదివాచకములు అని యైదువిధము లగుచున్నవి.

సూ:— ఒకప్రాణియొక్క కాని ఒకవస్తువుయొక్క కాని పేరు ప్రత్యేకముగాఁ జెప్పునది సంజ్ఞావాచకము. ౨

సూ:— సంజ్ఞ లేకవచనములు. 3

దేవమానవాది ప్రాణులకుఁ గాని వస్తువులకుఁ గాని పెట్టిన పేళ్ళు ఏకవచనములు గానే ప్రయోగింపఁబడును.

ఉదా:— శివుడు-పార్వతి-వాల్మీకి-నన్నయభట్టు-భారతము-గోదావరి-రాజమహేంద్రవరము-హిందూదేశము-ఇంగ్లండు-ప్రభవ-అశ్విని-చైత్రము-జనవరి-ఆదివారము-యజుర్వేదము-వ్యాకరణము-సూర్యుఁడు-భూమి-అమావాస్య-సన్నిపాతము-హిమాలయము-సంస్కృతము-తెలుఁగు-ఇంగ్లీషు-ఐరావతము-గాండీవము-ధర్మరాజు-మొద—

కృష్ణరాయలు-విద్యారణ్యులు-మొదలయినవానితుద బహువచనప్రత్యయ మున్నను అవి యొకనినే తెల్పును. అది గౌరవార్థకమైనబహువచన మనఁబడును.

---

* ఈక్రియాపదములరూపములు క్రియాప్రకరణమున నిర్ణయింపఁబడును.

ఒకటే పేరు గలవస్తువు లనేకము లున్నపుడు-వెంకయ్యలు-రామచంద్రపురములు-అనిచెప్పుదురు. అపుడాబహువచనరూపములు సామాన్యవాచకము లగును గాని ప్రత్యేకసంజ్ఞలు కావు. ప్రత్యేకసంజ్ఞయెపుడును ఏకవచనమునందే ప్రయోగింపఁబడును. శ్రీరాముఁడు శ్రీరాములు అని చెప్పుట విభక్తి జ్ఞానమున కని యెఱుంగునది.

సూ:—అందఱనుగాని అన్నిటినిగాని సమానముగాఁ జెప్పునది సామాన్యవాచకము. ర

ఉదా:—మనుష్యులు-దేవతలు-రాక్షసులు - గంధర్వులు - యక్షులు-కిన్నరులు-విద్యాధరులు-సిద్ధులు; మృగములు-పక్షులు - కీటకములు-పురుగులు; కొండలు-ఏళ్ళు - ఊళ్ళు-పల్లెలు; ధాన్యములు-లోహములు-సస్యములు-చెట్లు మొద—

సూ:—ఒక్కొక్కజాతిని జెప్పునదియు సామాన్యవాచకమే. గ

ఉదా:—హిందువులు-ఆంగ్లేయులు; ఆవులు-సింహములు; బ్రాహ్మణులు-శూద్రులు; చిలుకలు-పావురములు-పురుషులు-స్త్రీలు-మామిళ్ళు-పనసలు-చీమలు-పాములు-వరి-కంది; పెసలు-మొ-ధాన్యశబ్ద మేకవచనమం దున్నను విశేషణమును క్రియయును రెండువచనములందును వాడఁబడును.

ఉదా:—ధాన్యము మంచిది-ధాన్యము మంచివి; ధాన్యము పండెను-ధాన్యము పండినవి. మఱియు నేదో యొకధాన్యమునే చెప్పునపుడు ధాన్యశబ్దమునకు బహువచన ప్రత్యయము రాదు. అనేక ధాన్యములను జెప్పునపుడు 'నవధాన్యములు' అన్నట్లు బహువచనము వాడఁబడును.

పైవానిలో నొక్క ప్రాణిని ఒకవస్తువును తెలియఁజేయునపుడు మనుష్యుఁడు-కొండ-హిందువు-పురుషుఁడు-అని యేకవచనమే ప్రయోగింపవలెను. అపుడె నను అది సామాన్యవాచకమే. సామాన్యనామము

సంజ్ఞవలె నిరర్థకము గాక కొంతవిశేషమును దెలుపఁగలదు.

ఉదా:—నది. ఇది నదుల కన్నిటికిని జెల్లును. మఱియు, కొండల యందు పుట్టి సముద్రములోఁ గలియు నీటివెల్లువ నది యనఁ బడు ననెడివిషయమును దెలియఁజేయును.

సూ:—కొండఱియొక్క కాని కొన్నిటియొక్క కాని సముదాయ మును జెప్పునది సముదాయవాచకము. ౬

ఒక్కజాతికిఁ జెందిన యనేక ప్రాణులను గాని అనేక వస్తువు లను గాని ఒకరాశిగాఁ జెప్పునది యని యర్థము.

ఉదా:—సేన-మూఁక ; సభ-రచ్చె ; గుంపు-తండా ; పరిషత్తు-బఱి-మంద-తోఁపు ; మొద—

సూ:—సమూహవాచక మొకప్పుడు సామాన్యవాచకము నగును.

ఉదా:—నాలుగుసేన లొక్కచోఁ గలిసెను. మూఁడుమందలు వచ్చినవి.

ఇందు, సేనలు-మందలు-అనుపదములు సామాన్యవాచకములు. ఒకజాతికి సంబంధించిన గుంపును జెప్పుపద మేకవచన మగునపుడు సముదాయవాచక మనియు, బహువచనమై యితరసముదాయము లను గూడఁ దెలుపునపుడు సామాన్యవాచక మనియు గ్రహించునది.

సూ:—వస్తువిశేషములను జెప్పుపదములు ద్రవ్యవాచకములు. ౭

పదార్థములలోఁ గొన్ని వాడుకనుబట్టి వేఱొక నామవాచక జాతిలోఁ జేరినట్లు కనఁబడుచున్నది. వానికి మనభాషలోఁ బెట్టఁదగిన యొకపేరు లేదు. కావున నట్టివాని నిందు ద్రవ్యము లని పేర్కొంటిని. ద్రవ్యములపేళ్ళు చెప్పునవి ద్రవ్యనామవాచకములు.

సూ:—ద్రవ్యవాచక మేకవచనమై యాజాతిద్రవ్యమును బోధించు నది యగును. ౮

ఉదా:—వెండి-రాగి-బంగారము-ఇనుము-గాలి-నీరు-మంచు- మబ్బు -

మన్ను-రాయి-ఇసుక-కఱ్ఱ-పాలు-బియ్యము-అన్నము - ఉప్పు-బెల్లము-నేయి-నూనె-తేనె-కల్లు-మాంసము-పొగాకు - దూది-మొదలయినవి—

వెండి యెక్కడెక్కడ నున్నను, ఎంతెంత యున్నను, అది యంతయు వెండియే. బంగారుకణికను నూఱుముక్కలు చేసినను, ఒక్కొక్కముక్కయు ముక్క లన్నియుఁ గూడ బంగారమే యనఁబడును. అట్లే బెల్లము తేనె మొదలయినవి. ద్రవ్యమున కనేకత్వము లేదు. కాని వీనిలోఁ గొన్నిటికి బహువచనము లేక పోలేదు. అయినను, అవి ద్రవ్యవాచకములే.

ఉదా:—నీళ్ళు-రాళ్ళు-మొద—నీ రనెడియర్థమందే నీళ్ళని వాడుక. లెక్కింపఁ దగినన్ని చెప్పునపుడే రాళ్ళందురు. పెద్ద మొత్తము చెప్పునపుడు రాయి యందురు. ఇల్లు కట్టుటకు రాయి ఇటిక కొంటిని" అని వాడుక. క్షీర మనునర్థమున, 'పాయి' యని యొకరు ప్రయోగించిరి. కాని యిది నిత్యబహువచనమని కొంద ఱందురు. అది శబ్దస్వభావము గావున నిందు బహువచనవివక్ష లేదు. మొత్తముమీఁద ద్రవ్యవాచకము లేకవచనము లనఁ దగును. పైయుదాహరణములనుబట్టి ద్రవ్యవాచకములను బరిశీలించునది.

సూ:—గుణాదులను జెప్పునది గుణాదివాచకము. ౧౦

ఆదిపదముచే స్వభావము-అవస్థ - భావార్థకము-ధాత్వర్థము-గ్రహింపనగును. ఇవి యన్నియు నొకప్రాణినో యొకవస్తువునో యాశ్రయించి యుండును గావున నొకతరగతిలోఁ జేరినవి.

ఒక్కొక్కవస్తువు నాశ్రయించి యనేకగుణము లుండును. దానిస్వభావము బహువిధముగా నుండును. దాని కనేకము లయిన యవస్థ లుండును. వానిలో నొక్కొక్కదానికొక్కొక్క పేరు గలదు.

వానిని జెప్పునదే గుణాదినామవాచకము.

ఉదా:—తామరపువ్వు. ఎఱుపు లేక తెలుపు-మెత్తఁదనము-చక్కఁదనము - తావి-దానిగుణములు. గుండ్రదన - దానియాకారము. ముడుచుకొనుట-వికసించుట-దానిక్రియలు. సంకోచవికాసము లవస్థలు కూడ నగును.

గుణములు:—తీపి-చేఁదు-ఉప్పన-పులుపు-ఒగరు - కారము - ఎఱ్ఱన - నలుపు-తెల్లన-పసుపు-పచ్చన-తెలివి - చుఱుకుఁదనము - పిఱికితనము-గట్టితనము ; కినుక-వీర్యము-ఔదార్యము-కీర్తి - ఈవి - హెచ్చు-తగ్గు-మంచి-చెడ్డ-కొద్ది-గొప్ప-మొద—

స్వభావములు;—ఎత్తు-పొడుగు-పొట్టి-లావు-గుండ్రదన-వంకర-సన్నన - పలుచన-చిక్కన-మొద—

అవస్థలు:—బాల్యము-యౌవనము-చిన్నతనము-పదుచుఁదనము - మేలుకువ-కూరుకు-సుషుప్తి-చావు-మరణము- వెఱ్ఱి- మూర్ఛ - దుఃఖము-సుఖము-మొద—

భావార్థకములు:—కన్నెఱికము-చెలిమి-నుగఁటిమి-ధీరత్వము - రాజ్యము-గొప్పతనము. పైవానిలోఁ గొన్ని గుణము లగును.

ధాత్వర్థములు:—చేయుధాతువునర్థము చేయుట-ఇదియే ధాత్వర్థము. అనఁగా క్రియ లేక పని. ఇది వ్యతిరేకముగాఁ గూడనుండును.

ఉదా:—చేయుట, చేయమి-కోయుట, కోయమి-మొద—

చేఁత-రాక-ఓరిమి-నవ్వు-మొద లయిన దేశ్యకృదంతములును ధాత్వర్థనామవాచకములలోఁ జేరును. ఇట్టివానిలోఁ గొన్ని గుణస్వభావాదులలోఁ జేరినను జేరవచ్చును. కావుననే సమూహముగా గుణాదినామవాచక మను పేరు పెట్టఁబడినది. ఇట్లే గుణాదులను బరిశీలించునది. గుణాదినామవాచకములు తఱచుగా నేకవచనమునఁ బ్రయోగింపఁబడును.

## మఱికొన్ని నామవాచకములు

### నిత్యైకవచనాంతములు

| | | | |
|---|---|---|---|
| పైఁడి | కేలు | నిన్న | మొన్న |
| శేపు | వరి | పెసర | పాఁడి |

### నిత్యబహువచనాంతములు.

| | | | |
|---|---|---|---|
| * ఇరులు | పాలు | వడ్లు | కందులు |
| కురులు | మనము | అన్ని | అందఱు |

సూ:—సస్యవాచకములు నిత్యైకవచనములు, ధాన్యవాచకములు నిత్యబహువచనములు. ౧౧

ఉదా:— వరి-కంది-పెసర-జొన్న-మినుము - జనుము - మొదలయినవి చేలను తెలుపును. వడ్లు-కందులు-పెసలు-జొన్నలు-మినుములు-మొదలయినవి గింజలను దెలుపును.

### నామవాచకములలింగములు

సూ:—స్త్రీ పురుష జడభేదము లింగము. ౧౨

ఈమె స్త్రీ-వీఁడు పురుషుఁడు-ఇది యచేతనము-అని వ్యవహరిం పఁబడు భేదమును తెలియఁజేయునది లింగ మనఁబడును.

సూ:—అది సంస్కృతమున పుమాదిభేదమునఁ ద్రివిధము. ౧౩

ఆ లింగము సంస్కృతభాషలో, పుంలింగము - స్త్రీలింగము - నపుంసకలింగము-అని మూఁడువిధములు.

సూ:—సంస్కృతమున లింగము తఱచుగా నర్థాశ్రయము గాదు. ౧౪

దేవభాషలో లింగము శబ్దము నాశ్రయించి యుండును గాని తఱచుగా నర్థము నాశ్రయించి యుండదు. అందుకుఁ గొన్ని యుదాహరణములు.

---

* ఇరులు-కురులు మొదలగు కొన్ని శబ్దములు ప్రాచీనభాషలో నేకవచనము లు. లువర్ణము తుదనుండుటచే నివి బహువచనములు గాఁ దరువాత గణింపఁబడ్డవి.

| సంస్కృ | లిం | అర్థ | సంస్కృ | లింగ | అర్థ |
|---|---|---|---|---|---|
| తరు: | పుం | చెట్టు | లతా | స్త్రీ | తీఁగ |
| దారాః | పుం | భార్య | కళత్రం | న | భార్య |
| మిత్రం | న | స్నేహితుఁడు | పాకః | పుం | వంట |
| గ్రామః | పుం | ఊరు | నగరీ | స్త్రీ | పురము |

సంస్కృతశబ్దముల లింగము లీవిధముగా నర్థము నాశ్రయింపక తాఱుమాఱు అయి కనఁబడుటచేతనే మహాభాష్యకారులు "లింగ మశిష్యం లోకాశ్రయత్వా ల్లింగస్య" లౌకికశబ్దజాలము నాశ్రయించి యుండుటవలన లింగము శాసింపఁదగినది కా దని వక్కాణించియు న్నారు. అందుచే దాని ననుసరించి తెలుఁగున లింగములను నిర్ణ యింప వలనుపడక మనపూర్వలాక్షణికులు "స్త్రీతిర్యగ్జడవాచకములు వాని విశేషణములు అమహత్తులు, తక్కినవి మహత్తులు" అని వ్యాక రణకార్యముల కనుగుణముగా శబ్దవిభాగ మొనరించిరి. ఇటీవలఁ గొందఱు స్త్రీవాచకమునకు మహతి యనుపేరు పెట్టిరి కాని యీమ హదాది సంజ్ఞలు పుంలింగాదులకు సరిగావని యీక్రిందియుదాహార ణములవలనఁ దెలియుచున్నది.

౧. తరువు-మూర్ధము-ఇవి, అమహత్తులు-పుంలింగములు.

౨. మహతీవాచక మైనదారశబ్దము పుంలింగము—కళత్రము నపుం సకము.

3. నదీ లతా—శబ్దములు, అమహత్తులు స్త్రీలింగములు.

౪. మిత్రము—మహద్వాచకము నపుంసకలింగము.

ఇట్లు శబ్దముల నాశ్రయించి యున్నలింగములను తెలుఁగునఁ బ్రాచీనవ్యాకరణకర్తలు నిర్ణయింపక పోవుటకుఁ గారణము సంస్కృ తమున లింగజ్ఞానమునకు విభక్తిప్రత్యయములు తోడ్పడునట్లు తెలుఁ గునఁ దోడ్పడక పోవుటయే యని తెలియుచున్నది. ఏసంస్కృతశబ్ద

మున కైనను ప్రథమావిభక్తి యంతయుఁ జెప్పునప్పటి కాశబ్ద మేలిం
గమో సాధారణముగాఁ దెలియును. తెలుఁగున నట్లు తెలియదు.
డుప్రత్యయ మొకటి పుంలింగమును దెలుపును గాని యది యైనను
సార్వత్రికము కాదు. ఇందుకుఁ గొన్ని యుదాహరణములు.

హరి—హరులు, వారి-వారులు, పని-పనులు,యువతి-యువతులు.
భ్రాత-భ్రాతలు, మాత-మాతలు, అన్న-అన్నలు, గోడ-గోడలు.
గురువు - గురువులు, వధువు - వధువులు, మధువు - మధువులు,
మిత్రము-మిత్రములు, కళత్రము-కళత్రములు, వనము-వనములు,

పైనరుసలలోని పదములలో, ఇది యీలింగ మనుటకు విభక్తి
ప్రత్యయ మేమైనఁ దోడ్పడుచున్నదా ? లేదు. కావుననే సంస్కృ
తము చదివినవా రైనను తత్సమపదముల లింగములను జెప్పుటలో
భ్రాంతి పడుచుందురు. ఇందు కొకటి రెం డుదాహరణములు.

౧. రాముఁడు. పర్వతము. సంస్కృతమున నీరెండును పుంలింగ
ములు. ము ప్రత్యయము సామాన్యముగా నపుంసకశబ్దము
లకుఁ జేరుటనుబట్టి పర్వతము నపుంసకలింగ మందురు.

౨. వాతాయనము గవాక్షము. రెంటికిని కిటికీ యని యర్థము
సంస్కృతమున మొదటిది నపుంసకము, రెండవది పుంలింగము.
ప్రత్యయభేదము లేదు గావున గవాక్షము గూడ నపుంసకమే
యందురు.

పైని జెప్పినదానింబట్టి సంస్కృతవిభక్తులు లింగజ్ఞానమునకుఁ
దోడ్పడునట్లుగాఁ దెలుఁగువిభక్తులు తోడ్పడవని తెలియుచున్నది
గావునఁ దెలుఁగున లింగనిర్ణయమున కర్థమే గతి యని తేలినది.

అర్థమునుబట్టి లింగమును నిర్ణయించుటలోఁ గూడఁ గొన్ని
వైషమ్యములు రాకపోవు గాని, యెట్లయినను అది యుచితము కాక
నను, ఆంధ్రశబ్దజాలమునకు లింగములయేర్పాటు లేక పోవుట యుచి

తము గాదు కావునను ఈక్రిందివిధముగా మహదాదిసంజ్ఞలతో లింగ ములు నిర్ణయింపఁబడుచున్నవి. లింగములకంటె మహదాదిసంజ్ఞలే వ్యాకరణకార్యముల కెక్కువగా నుపయోగపడును గావున వానిని జక్కఁగాఁ బరిశీలించునది.

సూ:—లింగ మర్థాశ్రయమై స్త్రీపున్నపుంసకవిభాజక మగును. ౧౫

లింగ మర్థమునుబట్టి ఆఁడువారిని ఆఁడుజంతువులను, మగ వారిని మగజంతువులను, మగతనము ఆఁడుఁదనమును లేనిపదార్థము లను, వేఱుపఱచునది యగును.

సూ:—దేవమానవాదిపురుషవాచకములును వానివిశేషణములును పుంలింగములు మహత్తులు. ౧౬

ఆదిశబ్దముచే విద్యాధరాదిదేవయోనివిశేషులును దైత్యవిశేషు లును గ్రహింపఁదగుదురు. ఈదేవాదిజాతులలో మగవారిని జెప్పు శబ్దములును వానివిశేషణములును పుంలింగములు మహత్తులు నగును.

ఉదా:—బ్రహ్మ-అమరుఁడు - నరుఁడు-ధీరుఁడు - రాత్రిచరుఁడు-రక్క సుఁడు - గంధర్వుఁడు - రవి - కేతువు,- అయ్య-అన్న-పిత-భ్రాత- మగఁడు - తమ్ముఁడు - బల్లిదుఁడు - నేర్పరి - బిడ్డఁడు - కాఁపు - గొల్లఁడు-మిత్రము-మితుఁడు-ఒజ్జ-వెజ్జు-కాఁపు-బంటు- మొ—

సూ:—పురాణప్రసిద్ధము లయిన యన్యజాతి పురుషవాచకములు వానివిశేషణములును బుంలింగములు మహత్తులు నగును. ౧౭

పూర్వసూత్రమునఁ జెప్పఁబడిన దేవాదులకంటె వే అయిన జాతులలోనివారై పురాణప్రసిద్ధు లైన పురుషులను జెప్పునవి గూడఁ బుంలింగములై మహత్తు లగును.

ఉదా:—హనుమంతుఁడు-వాలి-జాంబవంతుఁడు-గరుత్మంతుఁడు - సం పాతి-జటాయువు-వాసుకి-తక్షకుఁడు మొద—గరుఁడే మున్నగు తద్భవము లొకటి రెం డున్నను, ఇట్టివి తలఁచుగాఁ బత్సను

ములే యగును.

సూ:—తిర్యగ్వాచకములు కొన్ని మహద్వివక్షయందు పుంలింగ ములు మహత్తులు నగును. ౧౫

తిర్యక్కు లనఁగా మృగపక్షిసరీసృపములు. ఇట్టివి తత్సమములై యుండును. వివక్షకుఁ గ్రియాపదము లొకగుర్తు.

ఉదా:—వానరుఁడు-నాగుఁడు; వృషభరాజు-గజేంద్రుఁడు మొదలగు రాజేంద్రపల్లభాదిశబ్దములు తుదఁగలవి గూడ నిందు చేరును. వివక్ష లేనిచో వానరము-నాగము- అని యగును. అపు డవి అమహత్తులు ఉభయలింగములునగును. కైరఁడు- కత్తళఁడు- జన్నఁడు - మొదలయిన దేశ్యమృగవాచకములు పుంలింగ సమము లగును గాని మహత్తులుగావని యెఱుఁగునది.

సూ:—అప్రాణివాచకములైన కొన్ని తత్సమములు మహద్వివక్ష యందు పుంలింగములు మహత్తులు నగును. ౧౬

ఉదా:—అనిలుఁడు-అనలుఁడు- సముద్రుఁడు- మేఘుఁడు, హిమవంతుఁ డు—మైనాకుఁడు మొదల—వివక్ష లేనిచో, అనిలము-అనల ము- సముద్రము-మేఘము- హిమవంతము-మైనాకము- అని యగును. అపు డవి అమహత్తులు నపుంసకలింగములు నగును తత్సమము లనుటచే, అనిలాదులయర్థము లిచ్చు గాలి-నిప్పు- కడలి- మొగిలు మున్నగునాచ్ఛికపదము లెన్నఁడును పుంలింగ ములు మహత్తులును గావని యెఱుంగునది.

సూ:—పురుషమృగాదివాచకములు పుంలింగములు, అమహత్తులు.

మృగపక్షిసరీసృపములలో మగవానిని జెప్పుశబ్దములు పుంలిం గము లగును గాని మహత్తులు గావు. అట్టివి, అమహత్తు లనఁబడును

ఉదా:—ఐరావతము-ఉచ్చైశ్శ్రవము- కరి-వృషభము- మహిషము- మేషము- హరిణము-మయూరము, ఎద్దు-దున్న- పోతు-ఇక్షి

గిత్త-పుంజు-పొట్టేలు-కోడె-ఆఁబోతు-చింబోతు- మొ.—

మేషి-హారిణి- మున్నగు స్త్రీలింగములు వేఱుగానున్నను, మేషము-హారిణము-మున్నగు కొన్ని తత్సమపదము లుభయలింగములు నగును. ఎనుము-గొఱ్ఱె- మొదలగు కొన్ని యాచ్ఛికములుగూడ నిట్టివి కలవు.

సూ:—దేవమానవాది స్త్రీవాచకములు వాని విశేషణములును స్త్రీ లింగములు మహతులు. ౨౧

ఉదా:—దేవి-అదితి-సరస్వతి-అరుంధతి- దార-కళత్రము- పెండ్లము- యువతి-కన్నె-రాణి-అమ్మ-అక్క--చెల్లెలు-దితి-రక్కసి-తాటక ఉమ-విద్యాధరి-కిన్నరి-నేర్పుకత్తె-చాకిత-మగువ-వగలాఁడి-మగ నాలు- మొదల.—

సూ:—పురాణప్రసిద్ధము లయినయన్యజాతి స్త్రీవాచకములును వాని విశేషణములును స్త్రీలింగములు మహతులు. ౨౨

దేవమానవాది జాతులకంటె వేఱయిన జాతులలోనివారై పురాణప్రసిద్ధ లైనస్త్రీలను జెప్పునవి స్త్రీలింగములు మహతీసంజ్ఞ కలవియు నగును.

ఉదా:—అంజన-వినత-కద్రువు-ఉలూచి-రుమ-తార-సరమ-మొ.—

ఇట్టివి తఱచుగాఁ దత్సమశబ్దములే యగును.

సూ:—మహతీవివక్షయందు కొన్ని తత్సమపదములు స్త్రీలింగములు మహతులు నగును. ౨౩

ఉదా:—గంగావసుంధరలు కుశలవులను బెంచిరి.

మురళా తమసలు సీతను గాపాడిరి.

రోహిణి చంద్రునికి మిక్కిలి ప్రియురాలు. మొద.—

వివక్ష లేనిచో గంగాయమునలు కలిసినవి. రోహిణీకృత్తికలు కనఁబడుచున్నవి. ఇత్యాదు లగును. అపు డివి స్త్రీలింగములు

మహాతులు గూడఁ గా వసి యెఱుంగునది.

సూ:— స్త్రీమృగాదివాచకములు స్త్రీలింగములు అమహత్తులు. ౨౮

మృగపక్షి సరీసృపములలో, ఆఁడువానిని జెప్పునవి స్త్రీలింగము లగును గాని మహతులు గావు. అవి అమహత్తులు.

ఉదా:—తురగి-మయూరి-ఆవు-గేదె-భుజగి-పెట్ట-పెంటి-మేపి-పడ్డ-మహిషి-గోడిగ-కరిణి-హరిణి-పెయ్య-కరేణువు-మొద—

పెయ్య శబ్దమును కొన్నిజిల్లాలలో మగదూడకు ఆఁడు దూడకుఁ గూడ వాడుదురు. ఉదా—కోడెపెయ్య-పడ్డపెయ్య. ఉత్తర మండలములలో నిది కేవల మాఁడుదానికే వాడఁబడును. ఇచ్చట దూడ పెంటికిని వాడఁబడును.

సూ:— దేవమానవాదిస్త్రీపురుషసామాన్య వాచక ముభయలింగము.

అది యథాప్రయోగముగా మహదాదిసంజ్ఞలను జెందును.

ఏశబ్దము స్త్రీపురుషులను సామాన్యముగాఁ జెప్పునో, అది ఉభయలింగ మగును. అది వాడుకనుబట్టి మహత్తు మహతి గూడ నగుచుండును. ఆభేదము విశేష్య విశేషణ క్రియాపదములవలన గ్రహింప నగును.

ఉదా:— దేవత-ప్రజ-జనము-అపత్యము-సంతానము-బంధువు-బంధుగు-చుట్టము-మానిసి-బిడ్డ-పిల్ల-శిశువు-కవి-గొల్ల-వేలుపు-రక్కసి-మొద—

ఇంద్రుఁడు దేవత - గౌరి దేవత-దేవతలు పూజింపఁదగుదురు; ఆమె నీకు బంధువు- అతఁ డామెకు బంధువు; అతఁడు కవి. ఆమె కవి. ఇట్టి యుదాహరణములవలన మహదాదిభేదము గ్రహించునది. ఇవి పురుషవిశేషణము లగుచోఁ బుంలింగములును స్త్రీవిశేషణము లగుచో స్త్రీలింగములు నగును.

సూ:— మృగపక్షి సరీసృప స్త్రీపురుషసామాన్య వాచకములు ఉభయ

లింగములు, అమహత్తులు. ౨౬

ఉదా:—గజము-గోవు-కుక్కుటము-కోకిలము - సర్పము- వృశ్చికము-
ఏనుఁగు-పసరము-కోడి- కోయిల - పాము - తేలు - హయము-
చిలుక-కోఁతి-చీమ-పసువు-పక్షి-కుక్క-నక్క- జింక- మొ—

గోవుశబ్దము ఆవునకే తఱచుగాఁ జెల్లుచున్నది. అయినను అది యుభయవాచకమే. * జింక, మగలేఁడి యని నిఘంటువులు చెప్పును. అయినను, అది రెంటికిని గూడ వాడఁబడుచున్నది. కావుననే మగ జింక ఆఁడుజింక యనువ్యవహారము గలిగినది. ఏశబ్దము ఆఁడుమగ భేదమును వివరింపఁజాలదో, అది యుభయవాచకమై యుభయలింగ మగును. ఉదా—చీమ- తేలు-చిలుక. ఆఁడు మగ భేదము తెలిసియు నే శబ్దమును రెండింటికిఁ గూడ వాడుదురో యది యుభయవాచక ముభయలింగ మనుట స్పష్టము- ఉదా—కుక్క-కోడి-గుఱ్ఱము- మేఁక. ఏది జాతివాచకముగా వాడఁబడునో యదియు నుభయలింగమే-ఉదా— మృగము-పక్షి-పిట్ట- మొ—

సూ:—తక్కినవి నపుంసకలింగములు అమహత్తులు. ౨౭

తక్కిన వనఁగా పైని జెప్పినయేతరగతిలోను జేరని వని యర్థము. అవి తరుగుల్మలతావాచకములు కేవలజడవాచకములు అవ యవవాచకములు గుణాదివాచకములు భూతాదివాచకములు ము న్నగునవి.

ఉదా:—తరువు-చెట్టు-లత. తీఁగ - పర్వతము-కొండ - గృహము-ఇల్లు
గ్రామము - ఊరు - భూమి - నేల - జలము-నీరు - అగ్ని-నిప్పు-
వాయువు-గాలి-ఆకాశము-చదలు - పాదము-కాలు-హస్తము-
చేయి-జ్ఞానము- తెలివి-దయ-కనికరము-విద్య-చేదువు- మొద-

* తాటాకుపుస్తకములలో చింక యని యున్నది. క్రమముగా దానిమీఁద జకారాదే శము వచ్చినరూపము జింక. అదియే వాడుకలోనికి వచ్చినది.

ఇంతకు మున్ను చేసిననాలుగువిధము లైన లింగనిర్ణయమును బట్టి బాలురయభ్యాసమునకై పుంలింగాదిభేదములతోను మహదాది భేదములతోనుకొన్నితత్సమాచ్ఛికపదము లుదాహరింపఁబడుచున్నవి. ఇందు, పుం-పుంలింగమునకు, స్త్రీ-స్త్రీలింగమునకు, ఉభ-ఉభయలింగమునకు, న-నపుంసకలింగమునకు, మ-మహత్తునకు, మ-తి-మహతికి, అమ-అమహత్తునకు గుర్తు లని యెఱుఁగునది.

౧. తత్సమములు-ప్రత్యయభేదము గలవి.

| పుం.మ. | స్త్రీ.మ-తి. | పుం.మ | స్త్రీ.మ-తి |
|---|---|---|---|
| జనకుఁడు | జనని | శూద్రుఁడు | శూద్ర |
| సోదరుఁడు | సోదరి | నాయకుఁడు | నాయిక |
| పతి | పత్ని | భర్త | భార్య |
| విద్వాంసుఁడు | విదుషి. | బ్రాహ్మణుఁడు | బ్రాహ్మణి |
| రాజు | రాజ్ఞి | సుతుఁడు | సుత |
| శ్వశురుఁడు | శ్వశ్రువు | ఉపాధ్యాయుఁడు | ఉపాధ్యాయ |
| కర్త | కర్త్రి) | పుత్రుఁడు | పుత్రి |
| నటుఁడు | నటి | చండాలుఁడు | చండాలి |
| క్షత్రియుఁడు | క్షత్రియ | బాలుఁడు | బాల |
| వైశ్యుఁడు | వైశ్య | యువ | యువతి |
| పితామహుఁడు | పితామహి | వృద్ధుఁడు | వృద్ధ |
| దేవుఁడు | దేవి | మాతామహుఁడు | మాతామహి |

ఇందు, యువ-యువలు, అని చెప్పుట వీనుల కింపుగా నుండక పోవుటచేఁ గొంద ఱిపుడు దీనికి కప్రత్యయముచేర్చి యువకుఁడు. యువకులు-అని వాడుచున్నారు. అది తప్పు గాదు కాని, ప్రభుశబ్దమునకు స్త్రీలింగరూపము ప్రభ్వియై యుండఁగా, ప్రభ్వణి యని వ్రాయుట మాత్రము ప్రామాదికమే.

౨. తత్సమములు-రూపభేదము గలవి.

| పుం. మ | స్త్రీ. మ-తి | పుం. మ | స్త్రీ. మ-తి |
|---|---|---|---|
| పురుషుఁడు | స్త్రీ | మాతులుఁడు | మాతృష్వస |
| పిత | మాత | పితృవ్యుఁడు | పితృష్వస |
| భ్రాత | స్వస | వరుఁడు | వధువు |
| పుత్రుఁడు | దుహిత | జామాత | స్నుష |
| పౌత్రుఁడు | నప్త్రి | భావుకుఁడు | వధూని-మొద- |

౩. తత్సమములు-ప్రత్యయభేదము గలవి. మృగాది-

| పుం. అమ | స్త్రీ. అమ | పుం. అమ | స్త్రీ. అమ |
|---|---|---|---|
| హరిణము | హరిణి | మయూరము | మయూరి |
| మహిషము | మహిషి | హంసము-హంస | హంసి |
| తురగము | తురగి | శుకము | శుకి |
| శ్వానము | శుని | కపోతము | కపోతి |
| మేషము | మేషి | భుజగము | భుజగి-మొద- |

తురగము-హంస-మున్నగు పెక్కు పదము లుభయలింగములు గాను వాడఁబడును-

౪. పరస్పర వ్యతిరేకార్థకములు, నపుం-తత్సమ-అమ.

| | | | |
|---|---|---|---|
| పుణ్యము | పాపము | గుణము | దోషము |
| రాగము | ద్వేషము | తేజస్సు | తిమిరము |
| దినము | రాత్రి | మైత్రి | శాత్రవము-మొ- |

౫. అచ్ఛికములు- ప్రత్యయభేదము గలవి.

| పుం. మ. | స్త్రీ. మ-తి | పుం. మ. | స్త్రీ. మ-తి. |
|---|---|---|---|
| దేవర | దేవేరి | కొమరుఁడు | కొమరిత |
| ఒడయుఁడు | ఒడయురాలు | బిడ్డఁడు | బిడ్డ |

| | | | |
|---|---|---|---|
| రక్కసుఁడు | రక్కెస | చాకి | చాకిత |
| మిండఁడు | మిండత | మాలఁడు | మాలెత |
| పాఱుఁడు | పాఱుత | చెలికాఁడు | చెలికత్తె |
| గొల్లఁడు | గొల్లత | పేద | పేదరాలు |
| వియ్యము | వియ్యపురాలు | వగలాఁడు | వగలాఁడి |

ఇత్యాదులు. బిడ్డ పిల్ల మొదలగు కొన్నిశబ్దములు తొల్లి స్త్రీలింగము లైనను వాడుకలో నుభయవాచకము లగుట, నుభయ లింగము లైనవి. అందుచేతనే మగబిడ్డ, ఆఁడుబిడ్డ యనెడివ్యవహారము గలిగినది.

౬. ఆచ్ఛికములు-రూపభేదము కలవి.

| పుం. మ. | స్త్రీ. మ-తి. | పుం. మ. | స్త్రీ. మ-తి. |
|---|---|---|---|
| తండ్రి | తల్లి | కొడుకు | కూఁతురు |
| అబ్బ | అమ్మ | పెనిమిటి | పెండ్లాము |
| తమ్ముఁడు | చెల్లెలు | బావ | వదినె |
| మామ | అత్త | అతఁడు | ఆమె |
| అల్లుఁడు | కోడలు | ఇతఁడు | ఈమె- మొద— |

౭. ఆచ్ఛికములు- రూపభేదము గలవి. మృగాది

| పుం. అమ. | స్త్రీ. అమ. | పుం. అమ. | స్త్రీ. అమ. |
|---|---|---|---|
| ఎద్దు | ఆవు | గోడా | గోడిగ |
| దున్న | గేదె | పుంజు | పెట్ట |
| పొట్టేలు | గొఱ్ఱె * | పోతు | పెంటి |
| చింబోతు | మేఁక * | కోడె | పెయ్య |

* ఈవువ్వు గుర్తుగలవి యుభయవాచకములై యుభయలింగ ములు నగును. పోతు పెంటి శబ్దములు చేరుటచేఁ గొన్ని యుభయ లింగశబ్దములు క్రమముగాఁ బుంలింగములు స్త్రీలింగములు నగును.

ఉదా:—ఎనుపోతు-ఎనుపెంటి-పోతుటేనుఁగు-పోతుటేఁగ-మేఁకపోతు-ఇత్యాదులు కవిప్రయోగసిద్ధములు. ఇందు ఉభయవాచకమునకు స్త్రీపురుషవాచకశబ్దములు చేర్చుటయుఁ గలదు.

ఉదా:—కోడిపెట్ట-కోడిపుంజు. అట్లే, ఆఁడు మగ శబ్దములు చేర్చుటయుఁగలదు. ఉదా—ఆఁడుకుక్క-మగకుక్క. ఆఁడుగుఱ్ఱము-మగగుఱ్ఱము, మొద—కొన్నిమండలములలో, ఆఁడేనుఁగును పిడియేనుఁ గందురు.

౮ ఆచ్ఛికములు- పరస్పరవ్యతిరేకార్థకములు. నపుం- అమ-

| | | | |
|---|---|---|---|
| ఒప్పు | తప్పు | వెలుఁగు | చీఁకటి |
| కలిమి | లేమి | పగలు | రేయి |
| మంచి | చెడ్డ | మేలు | కీడు |
| పున్నెము | అన్నెము | చెలిమి | పగ-మొద— |

౯. నూనవాదివాచకములలో నుభయలింగములకు స్త్రీపురుషశబ్దములను, ఆఁడు మగ శబ్దములను జేర్చి చెప్పుట గలదు.

ఉదా:—స్త్రీసంతానము- పురుషసంతానము. ఆఁడుశిశువు-మగశిశువు. ఇత్యాదులూహ్యములు.

నామవాచకముల వాడుక

సూ:—ఎల్లనామవాచకములు కర్తృకర్మవిశేషణము లగును. ౨౮

ఇంతకు మున్ను చెప్పినయైదువిధము లైన నామవాచకములును వాక్యములయందు కర్తలు కర్మలు విశేషణములు నై వాడఁబడును. కాని సంజ్ఞావాచకము లరుదుగాను, తక్కినవి తఱచుగాను విశేషణము లగును.

నామవాచకములు కర్త కర్మ లగుట కుదాహరణము లిచ్చుట యనావశ్యకము కావున, విశేషణము లగుటకు మాత్రము కొన్ని యుదాహరణము లిచ్చెదను.

౧. సంజ్ఞ:—విదర్భదేశమును భోజరాజు పాలించెను.

ఇందు, విదర్భ-భోజ-పదములు సంజ్ఞావాచకము లయ్యును సామాన్యనామవాచకము లైన దేశ-రాజ-శబ్దములకు విశేషణము లైనవి. ఇట్లే యీక్రింది సమాసములలోని పూర్వపదములు సంజ్ఞా విశేషణము లగు నని తెలియునది.

వాల్మీకిమహాముని-రామాయణకావ్యము - కైలాసాద్రి-గంగా నది-వ్యాకరణశాస్త్రము-తెలుఁగుభాష-నన్నయకవి-స్వర్గలోకము- మొ

౨. సామాన్య:—బ్రాహ్మణకవి-మేఁకపోతు-కోడిపుంజు-వే విద్య-మామిడిచెట్టు-వరిచేను-శూద్రప్రభువు-మెట్టనేల - వెలఁగపండు శత్రురాజు-చెఱకువిల్లు-వెదురుగడ. మొద—

పైసమాసములలోని పదము లన్నియు సామాన్యనామవా కములు. మొదటిపదములు విశేణములు, రెండవపదములు విశేష్య ములు నయినవి. వ్యస్తములుగా నున్నయెడల, పైని జూపినసంజ్ఞాసా మాన్యవాచకవిశేషణము లన్నియు విశేష్యములే యగును.

౩. సముదాయ:—మందావులు, అనుచో ‹మంద' సముదాయ వాచకమై ‹ఆవులు' పదమునకు విశేషణ మైనది.

"మందాలన్ న్యర్బుదషట్క-మిచ్చె విభుఁ డుద్యద్వైద శ్రేణికిన్" భాగవ—

౪. ద్రవ్య:—వెండిపళ్ళెము-బంగరుగిన్నె-రాగిచెంబు- మంచి నీరు-ఉప్పురాయి - మొద— పైసమాసములలోని మొదటి పదము లన్నియు ద్రవ్యనామవాచకములు. ఇందు విశేషణము లైనవి. తుది రెండుసమాసములలోని తుది రెండుపదములు గూడ ద్రవ్యనామవా చకములే, ఇపుడు విశేష్యము లైనవి.

౫. గుణాదినామవాచకములు:—

నల్లకలువ వేఁడిసెగ్గ నేతబట్ట సుఖనిద్ర

| | | | |
|---|---|---|---|
| ఎత్తుగోడ | పంటనేల | చేఁతచెంబు | తీపిమాటలు |
| పొట్టిపిల్ల | పూతకొమ్మ | తియ్యమామిడి | మేలుపని |
| చలిగాలి | పోఁతవిగ్రహము | సన్నబియ్యము | మంచితెలివి-మొ |

మొదటి మూఁడువరుసలలోని మొదటి పదములును నాల్గవ వరుసలోని పదములన్నియును, గుణాదినామవాచకములు. అన్నివరుసలలోను మొదటివి విశేషణములు. నల్ల-తెల్ల-మొదలయినవి విశేషణములై విశేష్యముల నంటియుండును. ఎఱుపు-నలుపు-మొదలైనవి విశేషణములై వేఱుగాఁ బ్రయోగింపఁబడును. వాఁడెఱుపు-వీఁడునలుపు-అని వాడుక గలదు. మొత్తముమీఁద ఆచ్ఛికములైన గుణాదినామవాచకములు తఱుచుగా విశేషణములగును. వాడుకనుబట్టియుఁ బ్రయోగములనుబట్టియు విశేష్య విశేషణ ధర్మములు తెలియునది.

ఇది నామవాచకప్రకరణము

---

## సర్వనామవాచకప్రకరణము.

“నామవాచకమునకు బదులుగా వాడఁబడునది సర్వనామవాచకము” అని మున్ను లక్షణము చెప్పఁబడినది కాని, అన్ని-ఎంత-కొంద ఱు-రెండు ఇద్దఱు-మొదలయినవి నామవాచకములకు బదులుగా వాడఁబడవు. ఇవి వాక్యములందు కర్తలుగా నుపయోగపడుచుండినను, అధ్యాహార్యము లయినవిశేష్యములకు విశేషణములే యగును గాని, వాఁడు-ఆమె-అది-మొదలయిన వానివలెఁ బూర్వ వాక్యమందలి నామవాచకములను జెప్పఁజాలవు. అయినను, ఇవి నామవాచకములను సూచించునవి కావున ‘వాఁడు’ మొదలగువాని వలె సర్వనామము లగుచున్నవి.

దేశ్యముయొక్క వైచిత్ర్యమంతయు సర్వనామములతోను అవ్యయములతోను సంబంధించి యున్నది. ఇవి భాషకు మిక్కిలి యుపయోగకరములు.

ఇతరసంజ్ఞలవలెనేసర్వనామసంజ్ఞయుసంస్కృతమునుండి తెలుఁగునకు వచ్చినది కాని దీనికిందుసరియయినయర్థము లేదు. "సర్వాదీనిసర్వనామాని" సర్వశబ్దము మొదలుగాఁగలవిసర్వనామములనిపాణినివ్రాసెను. పైసూత్రమునే సరిగాఁ దెలిఁగించి 'అన్ని ప్రభృతులు సర్వనామము'లని చిన్నయసూరి వ్రాసెను. కాని సంస్కృతమున, సర్వ-విశ్వ-మున్నగుశబ్దములును, తెలుఁగున అన్ని-అందఱు-మున్నగుశబ్దములు నెట్లు సర్వనామసంజ్ఞకలవి యగునో పైసూత్రములనుబట్టి తెలియరాదు. కావున నిట్టి శబ్దముల కిది యొకగుర్తు అనియే చెప్పవలసి వచ్చినది. అయినను, సర్వ-నామ=ఎల్లనామములను, వాచకము=బదులుగా నుపయోగింపఁబడియో సంబంధము కలిపియో చెప్పునది సర్వనామవాచకము. అని యొకవిధముగా వ్యుత్పత్తి చెప్పవచ్చును. రాముఁడు-రాజు- మొదలగు నెల్లమహన్నామములను జెప్పుటచే వాఁడు-అతఁడు- మొదలయినవి సర్వనామవాచకము లయినవి. సీత-రాణి- మొదలయినయెల్లమహాలీనామములను జెప్పుటచే, అది-ఆమె-ఈమె- మొదలయినవి సర్వనామవాచకము లయినవి. వనము-ధనము- మొదలయిన యెల్లయమహన్నామములను జెప్పుటచే,అది-ఇది- మొదలయినవి సర్వనామవాచకము లయినవి. ఇట్లు సాదృశ్యమునుబట్టి విశేషణాది ధర్మములు గలవియు సర్వనామవాచక సంజ్ఞను జెందుచున్నవి. ఈసర్వనామవాచకమే సర్వనామ మనఁబడుచున్నది.

సూ:—సర్వనామవాచకము లైదువిధములు. ౧

దేశ్యము లైన సర్వనామవాచకములు, పురుషసర్వనామములు నిర్దేశకసర్వనామములు సంబంధసర్వనామములు ప్రశ్నవాచకములు

సంఖ్యావాచకములు అని మైదువిధము లగును. తత్సమ తద్భవ సర్వనామములుగూడఁ దెలుఁగునఁ గొన్ని కలవు. అవి కొన్ని యుదాహరించి పిదప దేశ్యసర్వనామము లుదాహరింతును.

తత్సమసర్వనామములు:—సర్వము-విశ్వము (సమస్తము) ఉభయము-ఉభయులు; అన్యుఁడు-అన్య-అన్యము; ఇతరుఁడు-ఇతర-ఇతరము; ఏకము-శతము-సహస్రము; ద్వితయము-త్రితయము-మొదలయినవి. మఱియు, త్వత్-యుష్మత్-మత్-అస్మత్-భవత్-ఏతత్-యత్-తత్ మొదలయినవి శబ్దాంతరములతోఁ గలిసి తెలుఁగునఁ జేరును. త్వదాజ్ఞ - యుష్మత్కీర్తి-మత్కులము-తద్గుణము మొద—

తద్భవసర్వనామములు:—ఇవి కొన్ని సంఖ్యావాచకములు మాత్రమే తెలుఁగున గనవచ్చును. ఎక్కటి-ఎక్కము (ఒకటి) సత (ఏడు) పనస (ఏఁబది) మొద—

దేశ్యసర్వనామములు:—పురుషసర్వనామములు.

సూ:—మధ్యమోత్తమపురుషక్రియలకు కర్త లగునట్టి నీ-మీ-నా-మా-మన- శబ్దములు పురుషసర్వనామములు. ౨

మధ్యమపురుషక్రియలకు కర్త లగు నీవు మీరు, ఉత్తమపురుషక్రియలకుఁ గర్తలగు నేను మేము మనము, అనునవి పురుషసర్వనామము లనఁబడును. వీని కిది ప్రత్యేకసంజ్ఞ.

మనము-అనునది 'నీవు నేను' పదముల కేకముగా వాడఁబడు నిత్యబహువచనాంతమైన సర్వనామము. ఇందు మొదటియంశము నీవు. రెండవయంశము నేను. రెండవయంశమునుబట్టి దీనిక్రియ యెప్పుడును ఉత్తమపురుషమే యగును. కావున, నీ-మీ-శబ్దములు మధ్యమపురుషసర్వనామములనియు, నా-మా-మన-శబ్దము లుత్తమపురుష సర్వనామము లనియుఁ జెప్పఁదగును. ఇవి యన్నియు మహదర్థకములు

మహత్త్వార్థకములు అమహదర్థకములు గూడ నగును.

ఉదా:—నీవు చెప్పితివి- మీరు చదివితిరి- నేను చేసితిని- మేము వచ్చితిమి- మనము వింటిమి- మనము పోవుదము. మొద—

సూ:—తక్కినవి ప్రథమపురుషసర్వనామములు నగును. 3

వాఁడు-ఆమె-అందఱు-ఒకటి- ఇద్దఱు- మొదలయిన యితర సర్వనామము లన్నియుఁ బ్రథమపురుషక్రియలకు కర్త లగుటచేఁ బ్రథమపురుషసర్వనామము లని చెప్పఁదగును గాని, యిది వీనికిఁ బ్రత్యేకసంజ్ఞ కాదు. సముచ్చయమునుబట్టి వీనికి నిర్దేశకసంబంధాది సంజ్ఞలు గూడఁ గలుగును. ప్రథమపురుషసర్వనామములు కొన్ని మహదాదిభేదములతో నుదాహరింపఁబడును. పుంలింగ స్త్రీలింగము లందు బహువచనరూపములు సమానముగా నుండును.

| ఏక. మ. | ఏక. మ-తి- | బహు-మ-మ-తి. | ఏక-అమ-బహు- |
|---|---|---|---|
| వాఁడు-అతఁడు | అది - ఆమె | వారు | అది - అవి |
| వీఁడు - ఇతఁడు | ఇది - ఈమె | వీరు | ఇది - ఇవి |
| ఎవఁడు-(ఎతఁడు) | ఏది - ఏమె | ఎవరు | ఏది - ఏవి |
| ఒకఁడు | ఒకతె | ఒకరు | ఒకటి - ఒకట్లు |

పుం. స్త్రీ. బహు—అందఱు - ఇందఱు-ఎందఱు-కొందఱు-పెక్కండ్రు-పలువురు- మొద—

నపుం. బహు—అన్ని- ఇన్ని- ఎన్ని-కొన్ని-పెక్కు-పెక్కులు మొద—

సూ:—తాను-శబ్దము త్రిలింగము, సంశ్లిష్టవాక్యమున నుత్తమపురుష క్రియకుఁ గూడఁ గర్త యగును. 4

ఉదా:—ఏక—తాను. బహు—తాము- తారు-తమరు.

ఇవి మూఁడులింగములు నగును. రెండువాక్యములు కలిసిన వాక్యమందు ఉత్తమపురుషక్రియలకును గర్త లగును. సాధారణముగాఁ

ప్రథమపురుషక్రియలకుఁ గర్త లగును.

ఉదా:—సీత తాను బంగారులేడిని జూచితి నని రామునితోఁ జెప్పెను.

ఇందు, చూచితిని అనుక్రియకు 'తాను' కర్త.

తాను వచ్చెను-తాము చెప్పిరి-ఇందు ప్రథమపురుషక్రియలకుఁ గర్తలైనవి.

సూ:—అతఁడు మొదలయినవి యీషద్గౌరవార్థకములు, ఆయన-ఆమె మొదలయినవి గౌరవార్థకములు, వారు మొదలయినవి స్త్రీపురుషసామాన్య బహుత్వబోధకములు గౌరవార్థకములును, వాండ్రు మొదలయినవి స్త్రీపురుషసామాన్యనీచత్వ మిశ్రత్వ బోధకములు, వాఁడు-అది-మొదలయినవి వేఱుగాఁ బ్రయోగించునపుడు నీచత్వమిశ్రత్వబోధకములు. 71

క్రమముగా నుదాహరణములును, ఎవఁడు మున్నగువాని రూపాంతరములును చూపఁబడును.

ఉదా:—౧. అతఁడు - ఆతఁడు - అతగాఁడు - ఆతగాఁడు. *

ఇతఁడు - ఈతఁడు - ఇతగాఁడు - ఈతగాఁడు.

ఎతఁడు - ఏతఁడు - (ఎవఁడు - వేఁడు - ఏఁడు - ఏవాఁడు-ఎవ్వఁడు-ఎవ్వాఁడు.)

౨. ఆయన-ఈయన-ఏయన.

ఆమె-ఆయమ-ఆపె-ఆయప-ఆకె-ఆయక-ఆబిడ-ఆవిడ.

ఈమె-ఈయమ-ఈపె-ఈయప-ఈకె-ఈయక-ఈబిడ ఈవిడ-

ఏమె-ఏయమ-ఏపె-ఏయప-ఏకె-ఏయక-ఏబిడ-ఎవతె.

3. వారు-వారలు, వీరు-వీరలు, వేరు-ఏరు, ఏవారు-ఏవారలు, ఎవ్వారు-ఎవ్వారలు.

---

* ఆతను—ఇతను—శబ్దములు శిష్టులవాడుకలోఁ గలవు గాని పూర్వకవిప్రయోగములు కనరావు.

౪. వాండ్రు-వీండ్రు-ఎవండ్రు-ఏవాండ్రు-ఎవ్వాండ్రు-ఎవ్వండ్రు.

౫. వాఁడు-వీఁడు-ఎవఁడు-ఎవ్వఁడు, అది-ఇది-ఎవతె.

ఆయన్న-ఆయమ్మ-ఆయప్ప-ఈయక్క-ఏబిడ్డ-మొదలగు శబ్దములే, ఆయన-ఆయమ-ఏబిడ-మొదలగురూపములను జెంది స్వార్థములను విడిచి గౌరవార్థకములైన సర్వనామములైనవి. ఆవిడ-ఈవిడలు, ఆబిడ ఈబిడల రూపాంతరములు. కొన్నియెడల వకారబకారములు పరస్పర మాదేశము లగును.

అది మొదలగు సమహదర్థకముల రూపాంతరములు:—

| ఏక | బహు |
|---|---|
| అద్ది-ఆయది-అయ్యది | అవ్వి-ఆయవి-అయ్యవి |
| ఇద్ది-ఈయది-ఇయ్యది | ఇవ్వి-ఈయవి-ఇయ్యవి |
| ఏది-ఎద్ది-ఏయది-ఎయ్యది | ఏవి-ఎవ్వి-ఏయవి-ఎయ్యవి |

3-౪-౫-సూత్రములక్రింద నుదాహరించిన వన్నియుఁ బ్రథమ పురుషక్రియలకుఁ గర్త లగును.

సూ:—ఏమి, ఏది యనునర్థమున సర్వనామము నిత్యైకవచనము జోప విభక్తికాంతము. ౬

ఉదా:—ఏమిటి-ఏటికి-ఏటిమాట-ఏమికులము మొద-

సూ:—పలు-శబ్దమునకు మహన్మహాత్మ్యర్థమున బహువచనము కలదు. అమహదర్థమున వ్యస్తప్రయోగము లేదు. ౭

ఉదా:—పలువురు. పలువిధములు-పలుతెగలు-మొద-

సూ:—ఒకప్రాణినిగాని ఒకవస్తువునుగాని నిర్దేశించి చెప్పునది నిర్దేశక సర్వనామము. ౮

నామవాచకమునకు బదులుగా వాడఁబడునదియై దానిని సూచించునదియే నిర్దేశక మగును.

ఉదా:—వాఁడు-అతఁడు-వీఁడు-ఇతఁడు-ఆమె-ఈమె; అది-ఇది-మొ-

వీనిరూపాంతరములు బహువచనములు గూడ గ్రాహ్యములు. వాఁడు వచ్చెను. వీఁడు పోవుచున్నాఁడు. అనువాక్యములలోని వాఁడు వీఁడు పదములు క్రమముగా విషయమునకు సంబంధించిన దూరస్థుని సమీపస్థుని నిర్దేశించి చెప్పుచున్నవి. ఇట్లే తక్కినవానిం గూర్చి గ్రహించునది.

సూ:—అల్ల-ఇల్ల-ఉల్ల-ఇవియును నిర్దేశకసర్వనామములు. ౯

ఇందు మొదటిది దూరస్థుని, రెండవది సమీపస్థుని, మూఁడవది దూరము దగ్గఱ గాక నడుము నున్నవానిని నిర్దేశించి చెప్పును. ఇవి నామవాచకాదుల నంటియుండును గాని వేఱుగా నుండవు.

ఉదా:—అల్లవాఁడు-అల్లఁడుగో-అల్లది-మొద-

“మనవార లెల్లన ల్లావెడ నున్నవారు పదమాయని” చంద్రభా—ఇల్లిఁడుగో-ఇల్లిదిగో-ఇల్లవీఁడు. ఇప్పటిపండితులు ప్రయోగించిరి ఉల్లయనుటకు భారతప్రయోగములు. అర-6-154.

“ఉల్లకాంచనరథముపై నున్నవాఁడు-ఉల్లపద్మాకరముపొంత నుండి నిన్న” ఇది యిప్పుడు వాడుకలో లేదు గాని తక్కినవి గలవు.

సూ:—తదాద్యర్థకములతో సంబంధించు యదాద్యర్థకములు సంబంధసర్వనామము లనఁబడును. ౧౦

తత్-సర్వ-మొదలగువానియర్థ మిచ్చు-వాఁడు-అన్ని-మొదలయినవి తదాద్యర్థకములు. యత్-కియత్-మున్నగువాని యర్థ మిచ్చునట్టి ఎవఁడు-ఎంత-మొదలయినవి యదాద్యర్థకములు. ఒకవాక్యమునందు వాడు మొదలగువానితో సంబంధము గల ఎవఁడు మొదలయినవి సంబంధసర్వనామము లనఁబడును.

ఉదా:—ఎవఁడు-ఎవతె-ఏది-ఎందఱు-ఎంత-ఎన్ని-ఎవరు-మొద-

ఎవఁడు చేసికొన్నకర్మము వాఁడే యనుభవించును. ఎన్ని చెప్పిన నన్నియుఁ జేయును. ఎంత యున్న నంతే చాలును. ఎవతె చెప్పి

నో దానినే యడుగుదు.—

ఎవతెశబ్దమున కిరువదిరెండురూపములు కలవు:—ఎవతె-ఎవ్వతె-ఎవ్వరిత-ఎవ్వర్త-ఎవ్వత-ఎవత-ఎవ్వరితి- ఎవ్వర్తి-ఎవ్వతి-ఎవరితి- ఎవర్తి-ఎవతి-ఎవ్వరితె-ఎవ్వర్తె-ఎవరితె-ఎవర్తె-ఎవ్వర్తుక-ఎవ్వతుక- ఎవర్తుక ఎవతుక-ఎవరిత-ఎవర్త-

సూ:—కిమాద్యర్థకములు ప్రశ్నవాచకములు. ౧౧

సంస్కృతమున, కిమ్-కియత్ మొదలగు శబ్దములయర్థము లిచ్చునట్టి, ఎవఁడు-ఎవతె-ఎది-ఎందఱు-ఎన్ని-ఎంత- మొదలయినవి ప్రశ్నవాచకము లనఁబడును. అడుగుటను తెలుపునవి యని యర్థము. ఇవి యదాద్యర్థకములుగా పూర్వసూత్రమునఁ జెప్పఁబడినవి. సంస్కృతమునం దున్నయదాది కిమాదిభేదము తెలుఁగున లేదు. యదర్థమునందును కిమర్థమునందును గూడ ఎవఁడు-అనుపదమే వాఁడఁబడును. కావున వాడుకనుబట్టి యిది యీయర్థమును దెలుపు నని గ్రహింపవలెను. "ఎవఁడు వచ్చెనో నాకుఁ దెలియదు" ఇందు, ఎవఁ డనుదానికేపురుషుఁడని యర్థము గావున నిది యదర్థకము. "ఆవచ్చినవాఁ డెవఁడు" ఇది ప్రశ్నము కావున నిందలియెవఁడు, కిమర్థకము. పదమొక్కటియే యిట్లర్థభేదముఁ జెందుచున్నది. కావుననే దీనిని గొందఱు యత్కిమర్థక మనిరి. మఱి కొన్నియుదాహరణములు.

ఎందఱో వచ్చిరి. ఎందఱు వచ్చిరి? ఎంత యున్నను లాభము లేదు. ఎంత యున్నది? ఎవ రిచ్చిరి? ఎవ రిచ్చినదియుఁ దెలియదు. మొదలయినవి.

సూ:—యదర్థమునందును కిమర్థమునందును గూడ, ఏకవచనమునకు బదులుగా గౌరవార్థకమై 'ఎవరు' పదము వాడఁబడును.

ఉదా:—నేఁటిసభ కధ్యక్షుఁ డెవరో తెలియదు. అతఁ డెవరు? మీ రెవరు? మొద-

"కరుణాశాలివి నీవెవ్వరు నాపాలింటను గల్గురంగపతివో తండ్రీ" విప్రనా-

సూ:—సంఖ్యను జెప్పునవి సంఖ్యావాచకములు. ౧౩

ఇవి సంఖ్యార్థకములు సంఖ్యేయార్థకములు అని రెండువిధములు. లెక్కను మాత్రము తెలుపునవి సంఖ్యార్థకములు. అనఁగా, అంకెలు.—ఒకటి-రెండు-మూఁడు-పది-నూఱు-వేయి-మొద—

సూ:— కేవలసంఖ్యావాచకములును అమహదర్థకములు నయిన ఒకటిమొదలు తొమ్మిదివఱకుఁ గలశబ్దములకు, సంఖ్యావాచక విశేషణములతో నన్వయించునపుడు బహువచనము బహుళముగా నగును. ౧౪

అనఁగా, ఎక్కాలు చెప్పునపుడు గుణించునపుడు సంఖ్యలకు బహువచనము కల దనుట.

ఉదా:— రెం డొకట్లు రెండు. రెండు రెళ్ళు నాలుగు. మూఁడు మూళ్ళు తొమ్మిది-మొ-తక్కినప్పుడు బహువచనము రాదు.

ఉదా—గజ మొకటి. అశ్వములు రెండు. మొద—

ఒక్కశబ్దమున కమహదర్థము నందును డువర్ణకము వచ్చును.

ఉదా—“మృగ మొకండు కంటెఁ బడియెఁ.”

సూ:—పది మొదలగువానికి బహువచనము గలదు. ౧౫

ఉదా:—పదులు-నూఱులు-వేలు-పదివేలు-వందలు-మొద—

సంఖ్యావాచకము లమహదర్థకము లగు నపుడు ఏకవచనమందున్నను బహుత్వమునే తెల్పును. అపుడు విశేషణక్రియాపదములు బహువచనము లగును.

ఉదా:—ఆబండిగుఱ్ఱములు రెండును బలము గలవి. ఆవులు నాలుగు వచ్చుచున్నవి. అవి యైదు మొక్కలు-మొ—

కావున రెండు-మూఁడు-మొదలయినవి సంఖ్యేయార్థము లగు

నపుడు బహుత్వబోధకములే యగుచున్నవి.

సూ:—తిర్యగ్జడములను స్త్రీపురుషులను లెక్కించునపుడు చెప్పం బడు సంఖ్యావాచకములే సంఖ్యేయార్థకము లనంబడును. ౧౬

అమహత్తులను లెక్కించునపుడు సంఖ్యలరూపము మాఱ దనియు, మహతీమహత్తులను లెక్కించునపుడు మాఱు ననియుం దెలియునది.

ఉదా:—అను–బండ్లు రెండు వచ్చినవి. గుఱ్ఱములు నాలుగు వెళ్ళినవి. మొదలయినవి

మ-తి.మ—స్త్రీ లిద్దఱు వచ్చిరి. పురుషులు నలుగురు వెళ్ళిరి. మొదలయినవి.

సూ:—ఒక్కశబ్దముతక్కం, దక్కిన సంఖ్యేయార్థకము లన్నియు నుభయలింగములు నిత్యబహువచనాంతములు నగును. ౧౭

'ఒక్క' శబ్దము మహదాదిభేదముల ననేకరూపములొందును తక్కిన సంఖ్యేయార్థకము లయిన-ఇద్దఱు-ముగ్గురు-మొదలయినవానికి గూడం గొన్ని రూపాంతరములు గలవు కాని, యవి స్త్రీలను పురుషులను గూడం దెలుపునవి యగుటచే నుభయలింగము లగును. రెండు మూండు మొద లయినవి నపుంసకలింగములే.

ముందుగా, ఒక్కశబ్దమునకు మూండులింగములందును గల రూపభేదములను జూపి తరువాత రెండు ఇద్దఱు మున్నగుశబ్దముల నుదాహరించెదను.

ఒక్కశబ్దము, ఏకార్థకము-ప్రథమావిభక్తి రూపములు

మహ—ఒకండు-ఒక్కండు ; ఒకరు-ఒకండ్రు-ఒక్కరు-ఒక్కండ్రు

ఒకొండు-ఒక్కొండు ; ఒకొరు-ఒకొండ్రు-ఒక్కొరు-ఒక్కొండ్రు

ఒకరుండు-ఒక్కరుండు ; ఒకరులు-ఒకళులు-ఒకళ్ళు-ఒక్కరులు-ఒక్కళులు-ఒక్కళ్ళు

ఒకొరుఁడు-ఒక్కొరుఁడు ; ఒకొరులు-ఒకొళులు-ఒకొళ్ళు-
ఒక్కొరులు-ఒక్కొళులు-ఒకొళ్ళు

ఒకరువుఁడు-ఒక్కరువుఁడు ; ఒకరువులు-ఒక్కరువులు

ఒకొరువుఁడు-ఒక్కొరువుఁడు ; ఒకొరువులు-ఒక్కొరువులు

ఒరుఁడు-ఒరువుఁడు ; ఒరులు-ఒరువులు

ఒండు-ఒడ్డు ; ఒండులు-ఒండ్లు-ఒడ్డులు-ఒడ్లు

మహత్య—ఒకరిత-ఒకర్త-ఒకర్తు-ఒకర్తుక-ఒకత-ఒకతుక-ఒకొరిత-
ఒకొర్త-ఒకొర్తు-ఒకొర్తుక-ఒకొత-ఒకొతుక-ఒక్కరిత-ఒక్కర్త
ఒక్కర్తు-ఒక్కర్తుక-ఒక్కత-ఒక్కతుక-ఒక్కొరిత-ఒక్కొర్త-
ఒక్కొర్తు-ఒక్కొర్తుక-ఒక్కొత-ఒక్కొతుక-ఒకరితి-ఒకర్తి-ఒకతి-
ఒకొరితి-ఒకొర్తి-ఒకొతి-ఒక్కరితి-ఒక్కర్తి-ఒక్కతి-ఒక్కొరితి-
ఒక్కొర్తి-ఒక్కొతి-ఒకరితె-ఒకర్తె-ఒకతె-ఒకొరితె-ఒకొర్తె-
ఒకొతె-ఒక్కరితె-ఒక్కర్తె-ఒక్కతె-ఒక్కొరితె-ఒక్కొర్తె-
ఒక్కొతె-ఓర్త-ఓర్తి-ఓర్తు-ఓర్తుక - ఇవి యేఁబదిరెండు
రూపములు.

అమ—ఒకటి-ఒకొటి-ఒక్కటి-ఒక్కొటి-ఎక్కటి.

ఒకఁడు-ఒకొఁడు-ఒక్కఁడు-ఒక్కొఁడు-ఒండు.

సంఖ్యావాచకమైన యీశబ్దమునకు (ఒక్కటి) బహువచన రూపము లేదని చిన్నయసూరి వ్రాసెను గాని, ఎక్కాలు చెప్పునపుడు (రెండొకట్లు రెండు) కల దని యింతకు మున్న తెల్పితిని.

పైని జూపినమహతీవాచకరూపము లన్నింటికి ననఁగా, ఒకరిత-ఒకతె-మొద లగువానికి బహువచనమందు మొదటఁ జూపిన ఒకరు మొద లగు మహద్వాచకరూపములే వచ్చును. ఒక్కశబ్దము యొక్క భిన్నభిన్నరూపములు కొన్ని పద్యకావ్యములందు గణయతి ప్రాసముల కనుగుణముగాఁ బూర్వకవులు కల్పించిన వగుటచే వచన

ములఁ గాని వాడుకలోఁ గాని యట్టివి కనరావు.

ఒరుఁడు శబ్దమున కొక్కఁ డనునర్థమును కొందఱు లక్షణకర్తలు చెప్పిరి కాని దీని కితరుఁ డనునర్థమే ప్రాచీనగ్రంథములలోఁ గనవచ్చును.

నిరూపింపకుండఁగాఁ జెప్పునప్పుడు, ఒకశబ్దము వెనుక, 'ఒకాను' చేరిన రూపములు-ఒకానొకఁడు-ఒకానొకతె-ఒకానొకటి. అమహదర్థమునందు, ఒకానొకఁడనియుఁ గొందఱు ప్రయోగించిరి. ఈశబ్దమునకుఁ గూడ మున్ను చూపిన ఒక్కశబ్దముయొక్క రూపము లన్నియుఁ గలుగును. ఒకానొక్కఁడు-ఒకానొక్కతి-ఒకానొక్కటి-ఇత్యాదులు యథాప్రయోగముగా గ్రాహ్యములు,

సూ:—ఒక్కశబ్దమున కర్థవిశేషములందు మఱికొన్ని రూపభేదములు గలవు. ౧౫

ఉదా:—ఒంటి=నన్నొంటిఁ జేసి పోయిరి. ఒరిమ=ఐకమత్యము. ఒండొరున్=ఒకరి నొకరు, పరస్పర మనుట. ఒకయట్ట యనుటకు, ఒంటట్ట యనునట్లే ఓరట్ట యనియు వాడుక కలదు. రెండు రెట్లు=ఇబ్బడి-ఇనుమడి-ఇమ్మడి; మూఁడు రెట్లు=ముబ్బడి-ముమ్మడి; నాలుగు రెట్లు=నలుమడి ఇవి పూర్వకావ్యశాసనాదుల నున్నవి. ఇట్లే సంఖ్యావాచక విశేషములను ప్రాచీన శాసనకావ్యాదులవలనను లోకవ్యవహారమువలనను గ్రహించునది.

ఒండొరు-ఒండొరులు-అను ప్రథమావిభక్త్యంతరూపములను పరస్పర మనెడియర్థమున నిప్పటివారు పెక్కండ్రు ప్రయోగించుచున్నారు. అది సరి గాదు. ఈరూపములు ప్రాచీనగ్రంథములం దెందును గనరావు. ఒండొరున్-ఒండొరులన్-ఒండొరులతోన్-మొదలగు రూపములు ప్రయోజ్యములు.

సూ:—కొన్ని యాచ్ఛికశబ్దములందు మొదట నుండని గకారమునకు వకారము వైకల్పికముగ నగును.

ఉదా:—ఇరుగురు-ఇరువురు, నలుగురు-నలువురు, నూఱుగురు-నూఱ్వురు, పలుగురు-పలువురు, తోఁగ-తోఁవ, పగలు-పవలు, ప్రోగు-ప్రోవు, ఈగి-ఈవి, అగు-అవు, తగులు-తవులు, మొ—

'కొన్ని' యనుట యీసూత్రము సార్వత్రికము గాదనుటకు. నగ-పగ-మొగము-నగము-తెగ-వగ-వాఁగు-వాగు-రాగి-మొద లగు ననేక శబ్దములలోని గకారము వకారము కాదు. "మొదట నుండని" యనుటచే, గాలి-గుఱ్ఱము-గీము-మొదలగు వానిలోని పదాద్యగకారము వకారము కా దని తెలియునది. అపదాద్యగకార మైనను వకార మగుటకు వాడుకయే శరణము.

ఈక్రింద నుదాహరింపఁబడు సంఖ్యేయవాచకములలోని గకారమునకు యథాప్రయోగముగా వైకల్పికముగా వకారాదేశము చేసి పఠింప నగును. కాని అయిదుగురు మొదలగు కొన్నిటి గకారము మాత్రము వకారము కాదు. వందమీఁద 'గురు' చేరదు. 'ఒక్క' శబ్దము యొక్క రూపాంతరములను యథాప్రయోగముగాఁ గూర్చుకొనునది.

మఱియు పది-ఇరువది మొదలగు వానికి మహన్మత్యర్థము లందు వాడుకలోను ఆధునికగ్రంథములలోనుగూడ 'మంది' శబ్దము చేరుచున్నది. కావున మందిశబ్దము చేరినరూపములు గూడ సంఖ్యేయ వాచకములుగా గణింపఁదగును. పువ్వు గుర్తు గలరూపములు శ్రీనాథాదికవులు వాడినవానికిఁ దుల్యములును శిష్టవ్యవహారసిద్ధములు నగుటచే సాధువు లని గ్రహింపఁదగును.

| అమ- | మ-మతి. | అమ- | మ-మతి- |
|---|---|---|---|
| రెండు | ఇద్దఱు-ఇరుగురు<br>ఇరువురు | పదునాఱు<br>పదియాఱు | పదునాఱుగురు<br>పదియాఱుగురు |

| | | | |
|---|---|---|---|
| మూఁడు | మూగురు- ముగ్గురు | పదాఱు | పదాఱుగురు |
| | ముప్వురు-ముగురు | పదునేడు | పదునేడుగురు |
| నాలుగు | నలుగురు- నలువురు | పదియేడు | పదియేడుగురు |
| అయిదు | అయిదుగురు | పదేడు | పదేడుగురు |
| ఏను | ఏగురు-ఏవురు | పదునెనిమిది | పదునెనమండ్రు |
| ఆఱు | ఆఱుగురు- ఆర్వురు | | పదునెనమండుగురు |
| ఏడు | ఏడుగురు-ఏడ్వురు | పందొమ్మిది | పందొమ్మండ్రు |
| ఎనిమిది | ఎనమండ్రు | | పందొమ్మండ్రుగురు |
| | ఎనమండుగురు• | ఇరువది | ఇరువండ్రు |
| తొమ్మిది | తొమ్మండ్రు | ఇరువై | ఇరువై మంది |
| | తొమ్మండుగురు • | •ఇరవై | ఇరవై మంది |
| పది | పదుగురు - పదురు- | ముప్పది | ముప్పండ్రు |
| | పదుగుండ్రు | ముప్పై | ముప్పైమంది |
| | పదుండ్రు- పదిమంది | నలువది | నలువండ్రు |
| పదునొకటి | పదునొకరు | •నలబై | నలబైమంది |
| | పదునొకండ్రు | ఏఁబది | ఏఁబండ్రు |
| పదనొకండు | పదనొకండ్రు | ఏఁబై | ఏఁబై మంది |
| •పదకొండు | పదకొండుగురు | అఱువది | అఱువండ్రు |
| పండ్రెండు | పన్నిద్దఱు | •అఱువై | అఱువై మంది |
| | పన్నిరుగురు | డెబ్బది | డెబ్బండ్రు |
| •పన్నెండు | పన్నెండుగురు | డెబ్బై | డెబ్బైమంది |
| పదుమూఁడు | పదుమూగురు | ఎనుబది | ఎనుబండ్రు |
| | పదుముగ్గురు | ఎనుబై | ఎనుబై మంది |
| | పదుముగురు | •ఎనబై | ఎనబై మంది |
| •పదమూఁడు | పదముగ్గురు | తొంబది | తొంబండ్రు |

| | | | |
|---|---|---|---|
| పదునాలుగు | పదునలుగురు | తొంబై | తొంబైమంది |
| | పదునల్వురు | నూఱు | నూఱుగురు |
| పద్నాలుగు | పద్నాలుగురు • | | నూర్వురు- |
| పదునేను | పదునేగురు | | నూరుమంది |
| | పదునేవురు | వంద | వందమంది |
| పదునైదు | పదునైదుగురు | వేయి | వేగురు- వేయిమంది |
| పదేను | పదేవురు | పదివేలు | పదివేగురు |
| పదిహైదు | పదిహైదుగురు | | పదివేలమంది |

పై వానిలో శిష్టసమ్మతము లైనట్టి పుంవ్వగుర్తు గలశబ్దముల రూపసిద్ధికై సూత్రములు కల్పించుట యనావశ్యకము. అయినను వానింగూర్చి యించుక వివరించెదను. ఇరువై-అఱువై-అనుప్రయోగములు పూర్వకావ్యములం దున్నవి. „ఇరువై నాలుగుమూళ్ళమేర" కాశీఖం—„ఇరువై పంబశరంబులేసె" వరాహ-ఆయతిగతినిలనూటిరువై యెనిమిది" సరసభూ— "మహోహార్యాంతరాళంబునం, దఱువై యోజనముల్" వరాహ "తొమ్మిదినూఱులు తొంబై తొమ్మిది"

గ.సా-*ఇరువై-అఱువై-నలుబై-మొదలగుశబ్దములలోని ఉకారము క్రమముగా అకారమైన దనుట తెల్లము.

• అయిదుగురువలె-ఎనిమిదిగురు కావలసియుండగా, ఎనమండ్రురూప మెట్లు సిద్ధించి సాధు వయ్యెనో, అట్లే ఎనమండుగురు,

---

*ఇప్పటికి నాలుగువందల సంవత్సరములకు వెనుకటి వైనకొన్ని శాసనములలో ముప్పై-నలుభై-అఱువై-ఇరవై-ఎనభై-డెబ్భై-ఏంభై-మొదలగురూపములు కనవచ్చు చున్నవి. శా-శకము ౧౯౯౧-మొదలుగా ౧౫౦౦ వఱకు.గలశాసనములలో, భైరూపములున్నవి. ఇట్టిరూపములు „దక్షిణదేశశాసనావళిలోను గలవు."

•కొన్ని మండలములలో, అయిదుమంది-తొమ్మిదిమంది యనెడివాడుక యుం గలదు-దీనినిబట్టి పది-యిరువది మున్నగుశబ్దముల మీఁద నే కాక, పదికి లోపల నుండు రెండు మొద లగువానిమీఁద(గూడ మందిశబ్దము చేరుట కలదని తెలియవచ్చున

రూపమును సిద్ధించి సాధు వగుచున్నది. వాడుకలోను గ్రంథముల లోను ఎచ్చటను వినఁ గన రాని ఎనమండ్రుగురు శబ్దము నిప్పుడు కొంతమంది ప్రయోగించుచున్నారు. అది తప్పు గాని, ఎనమండుగురు తప్పు కాదు. ఇట్లే పదకొండు-పన్నెండు మొదలయినవియు సాధువు లగును. పదనొకండు- పదమూఁడు-పదముగురు-అనురూపములు లక్షణములాదు... కావ్యములందును గలవు. *

## కొన్ని సంఖ్యల విశేషరూపములు.

రెండు+ఏను= ఈరేను = పది ; రెండు + ఆఱు = ఇరాఱు - ఈరాఱు=పండ్రెండు; రెండు+ఏడు=ఈరేడు=పదునాల్గు; ఆఱును+ ఒకటి=ఆఱునొక్కటి ; రెండు+నూఱులు=ఇన్నూఱు ; మొదలయినవి గ్రాహ్యములు. కొంద ఱిపుడు ఇన్నూఱు లని బహువచనము ప్రయోగించుచున్నారు. అది ప్రామాదికము. ఇట్టి సమాసపదము లేకవచనములే యగును.

సూ:—కొన్ని సంఖ్యావాచకములకు మహద్విశేషణము లగునప్పుడు గూడ నమహద్రూపములు భారతాదులఁ గనవచ్చుచున్నవి.

ఉదా:—బ్రాహ్మణు లతిపుణ్యు లెనిమిదివేలు, యతులు పదివేలు అనురు లఱువదివే లుందురు. అబ్జనాభులు నూఱు నైదుపదులు (నూటయేఁబదిమంది) ఇత్యాదులు. ఇట్లు మహతీవిశేషణము లగు నపుడు గూడ నమహద్రూపములే యగును. పిల్లలు రెండువందలు స్త్రీలు నాలుగువందలు వచ్చిరనియుఁ బ్రయోగింపవచ్చును, కాని యిట్టిప్రయోగములకు విశేషవ్యాప్తి

---

* ఎనిమిది తొమ్మిది బదియుఁ బదనొకండ్పం డ్రెండుగాఁ గఁదగనేర్పడుచున్—ప్రబంధరా—: 67ప.

ద్విత్వంచక్వచి బష్టంస్యాదష్వహాపవిభక్తితా—అథర్వ—ఉదా—ముప్పది-పదమూఁడు—ఒ టరి—ఒంటివాఁడు—వ్యాఖ్య—పదముగురు. ఉ. రామా.

లేదు. మఱియు,పది-వంద-నూఱు-వేయి మొదలగు సంఖ్యా వాచకములే యిట్లు విశేషణములైనఁ గావచ్చునుగాని పదికి లోపలనుండు సంఖ్య లట్లుకావు. బ్రాహ్మణులునాలుగు-యతులు మూఁడు- స్త్రీ లెనిమిది - అనెడివాడుకయు లేదు. ప్రయోగములును లేవు.

ఈక్రింద నుదాహరింపఁబడునవి విశేషణధర్మము గలవి యయ్యుఁ బ్రథమపురుషక్రియలకుఁ గర్తలు గా నుపయోగపడుచు నామవాచకములను సూచించును. ఇందు కొన్నిము న్నుదాహరించినశబ్దములు కూడ నుండును.

సూ:—అంత-ఇంత-ఎంత-కొంత-శబ్దములు పరిమాణ కాలార్థకములు అనుపదార్థకములు నగును. ౨౧

క్రమముగాఁ బ్రయోగము లుదాహరింపఁబడును.

„ పరిమా—. ప్రయోగవిభవ మింత యంతని పొగడ నే నెంతదాన" కొంత ద వ్వరిగి చూచెద"—కాలా—„ వాసుదేవుఁడు నచ్చునంతకు—కుంతి యింతకున్ బడుగయి—ఎంతకుఁ గాచి యుండెదను—నిరీక్షించి నంతఁ గొంతకు నచ్చెను" భార—

సూ:—అంత-ఇంత-అన్ని-ఇన్ని-అందఱు-ఇందఱు-మొదలగు కొన్ని నముచ్చయమైన 'ఉన్'తోఁ గలిసి సర్వార్థకము లగును.

ఉదా:—అంతయున్ = అది యెల్లను, ఇంతయున్ = ఇది యెల్లను, „అంతవృత్తాంతము విని" వృత్తాంత మంతయును విని యని యర్థము. ఇంత నిక్కువం బెబ్బంగిన్ " ఇది యెల్ల నిజ మని యర్థము. ఈ రెండుచోట్లను సముచ్చయము సంధివశమున లోపించిన దని తెలియునది.

సూ:—అంత-ఇంత-లకు, అది-ఇది-యర్థములును కలవు. ౨౩

ఉదా:—"అంతకంటె నెగ్గు. . . కాంతాదులతోడిపొందు"

"ఇంతకంటెఁ బెం పెయ్యది? " భార-

సూ:—ఎంతకు, ఉన్ - ఏని - ఓ - చేరినపుడు మిక్కిలి యనునర్థము వచ్చును. ౨౮

ఉదా—"అంతిపురముచుట్టతికం బెంతయుఁ గీడు"—నీ కెంతేని యాప్తుండు—ఎంతో సంతోషము నొందెను"—భార—

అంత-ఇంత-శబ్దముల కింకను విశేషార్థములు గలవు. వానిని నిఘంటువులవలనఁ దెలియునది. పైనాలుగుశబ్దములకును అంతతోఁ-అంతకంటెఁ-ఇంతకుఁ-ఎంతకుఁ-ఇంతలోన్ - కొంతలోపలఁ అనున ట్లేకవచనమందు గొన్ని విభక్తులు గనవచ్చును. అంత-ఇంత-ఎంత-లకుఁ బ్రథమాబహువచనమును గలదు.

,, అంతలు చేసి పోనడిచి యక్కట సంజయు చేత—తలపం గూడునె యింత లేసి దొరలీసైన్యంబు—ఎంత లాపద లయ్యెను సెలుకపడవు'' భార-కొంత లనెడి ప్రయోగము కనఁబడలేదు,

సూ:—అన్ని-ఇన్ని-ఎన్ని - కొన్ని-శబ్దములు సంఖ్యాద్యర్థకములు, అమహదర్థకములు, నిత్యబహువచనాంతములు. ౨౯

అంత-మొదలగు శబ్దముల కివి బహువచనాదేశము లయిన రూపము లనియు ఏకవచనము లనియు, శబ్దరత్నాకరము చెప్పుచున్నది గాని యది సమీచీనము కాదు. అంత-ఇంత; అన్ని-ఇన్ని- ఇవి సర్వార్థమున సరిపడుచున్నను తక్కినయర్థములందు వానికిని వీనికిని సంబంధము లేదు. అవి యన్నియు విశేషముగా కాలార్థమును జెప్పును. ఇవి యన్నియు సంఖ్యార్థమును జెప్పును. ఇది మిక్కిలి విలక్షణమైన యర్థభేదము. పైగా వానికి అంతలు-ఇంతలు-ఎంతలు- అని బహువచన రూపములు గనఁబడుచుండఁగా, నివి వానికి మరల బహువచనాదేశరూపము లనుటయు సమంజసము గాదు. ఏకవచనము లే యై వానికి బహ్వర్థమును జెప్పుచున్న వని తలంత మన్న, ఏకవచనము నందే యర్థభేదముతో నొకశబ్దమునకు రెండురూపము లున్నవనుట

యుక్తము గాదు. ఇఁకనో అన్ని-మొదలగువానికిని అందఱు-మొదలగువానికిని సంబంధ మున్నమాట నిజము. అర్థవిశేషములతో నుదాహరణములు:—

అన్ని=అంతసంఖ్యగలవి, అన్నియున్ = అవియెల్ల; ఇన్ని=ఇంతసంఖ్యకలవి, ఇన్నియున్=ఇవియెల్ల; ఎన్ని=ఎంతసంఖ్యకలవి, అవియెన్ని?; కొన్ని=కొంతసంఖ్యకలవి.

వీని కన్నిటికిని క్రియ బహువచనమునఁ బ్రయోగింపఁబడుటయు వీని బహువచనాంతత్వమును విశదపఱచుచున్నది.

ఉదా:—అన్ని యున్నవి. ఇన్ని లేవు. ఎన్ని వచ్చినవి. కొన్ని పోయినవి. ఇత్యాదులు. కావున నివి నిత్యబహువచనాంతము లనుట యుక్తము. కొన్ని మండలములలో ఎన్నిమంది ఇన్నిమంది యను వాడుకయుఁ గలదు.

సూ:—అందఱు-ఇందఱు - ఎందఱు - కొందఱు - శబ్దములు, అన్ని మొదలగువాని మహతీమహదర్థకరూపములు నిత్యబహువచనాంతములు నగును. ౨౬

ఉదా:—అందఱు = అంతసంఖ్య కలవారు, అందఱున్=వారెల్లరు; ఇందఱు=ఇంతసంఖ్యకలవారు, ఇందఱున్=వీరెల్లరు; ఎందఱు=ఎంతసంఖ్యకలవారు- ఎంతమంది?; కొందఱు = కొంతసంఖ్య కలవారు.

## సర్వనామముల వాడుక

సూ:—సర్వనామములకు సంబోధనప్రథమావిభక్తి తప్పఁ దక్కిన విభక్తులు నామవాచకములకుం బోలె యథాప్రయోగముగా నుండును. ౨౭

ఉదా:—వారు-వీరు-నిన్నున్-నాచేతన్-ఎవరికొఱకున్ - దానివలనన్-అగతకంటెన్-అందఱికిన్-అన్నిటియందు.

ఇతరశబ్దములతోఁ జేరి యున్నపుడు, వాఁడు-అది-శబ్దములకు మాత్రము సంబోధనప్రథమావిభక్తియు వచ్చును.
ఉదా:—ఓచిన్నవాఁడా! ఓచిన్నదానా! ఇత్యాదులు.

సూ:—పురుషసర్వనామములును నిర్దేశక ప్రథమపురుషసర్వనామములఁ గొన్నియు కర్తృకర్మములును, తక్కిన వన్నియుఁ గర్తృకర్మవిశేషణములు నగును. ౨౮

నీవు-నేను-తాను-వాఁడు-ఆమె-వీఁడు-ఈమె-ఎవఁడు-ఎవతె-ఏది-అది-ఇది-ఈశబ్దములు వాక్యములందు కర్తలు కర్మలు మాత్రమగును. విశేషణములు కావు. వాఁడు-అది శబ్దములు మాత్రము విశేషణపదములతోఁ జేరి విశేషణము లగును.
ఉదా:—పెద్దవాఁడు-పెద్దది-ఇత్యాదులు.

తక్కిన వనఁగా, ఒక్కఁడు-ఒక్కతె-రెండు-ఇద్దఱు-అంత-అన్ని అందఱు మొదలయినవి విశేషణములు గూడ నగును.
ఉదా:—నీవొక్కఁడవు-ఒక్కవనము-రెండునదులు-ఇద్దఱురాజులు-ఇన్ని మాటలు-అంతపని-మొద—

సూ:—ఆ-ఈ-ఏ- విశేషణములు నగుచున్నవి. ౨౯

'సర్వనామము లయిన యీమూఁడు శబ్దములు తెలుఁగున నిపుడు విశేషణములుగా వాడఁబడుచున్నవి.
ఉదా:—ఆమాట-ఈబాలుఁడు-ఏకథలు-మొద—

ఇది సర్వనామప్రకరణము.

---

## విశేషణప్రకరణము

'నామవాచకముయొక్క గుణమును దెలుపునది విశేషణ'మని మున్ను లక్షణము చెప్పబడినది కాని నామవాచకములకే కాదు

క్రియలకును విశేషణములు గల వనియు, విశేషణములు గుణములనే కాక ద్రవ్యములను క్రియలను (వ్యాపారములను) కూడఁ జెప్పు ననియు నీప్రకరణమునఁ దెలియును.

సూ:—విశేష్యము భేద్యము, విశేషణము భేదకము. ౧

విశేష్య మనఁగా నామవాచకము. గుణాదులచే భేదింపఁదగినది విశేష్య మనియు, గుణాదులను భేదించునది విశేషణ మనియు నర్థము.

నామవాచకప్రకరణమునఁ జెప్పఁబడిన గుణవాచకములు, తెలుపు-శౌర్యము-తెలివి-మొదలగు గుణములను జెప్పును. ఇందు చెప్పఁబోవు గుణవాచకములు - తెల్లని-బల్లిదుఁడు-ప్రాజ్ఞుఁడు-అనుచు విశేష్యములగుణములను విశదీకరించును.

నామవాచకములు కొన్ని సర్వనామవాచకములు గూఁడ గొన్నియెడల విశేషణములుగూడ నగు నని చెప్పి కొన్నియుదాహరణములు వెనుకటి ప్రకరణములందు చూపితిని. ఇందు కేవలము విశేషణధర్మము కలవి మాత్రమే యుదాహరింతును. అక్కడక్కడ కొన్ని విశేష్యధర్మము గలవియు నుండవచ్చును.

సూ:—విశేషణము లాఱువిధములు. ౨

గుణాదివాచకములు, ద్రవ్యవాచకములు, క్రియావాచకములు, సంఖ్యావాచకములు, క్రియాజన్యములు, క్రియావిశేషణములు-అని.

ఇందు, జాతిసంజ్ఞావాచకవిశేషణములు చేరవు. 'బ్రాహ్మణమంత్రి' యనుచో, బ్రాహ్మణపదము మంత్రియొక్కజాతిని దెలుపుచు జాతివాచకవిశేషణ మయిన దనియు, 'గంగానది' యనుచో, గంగా పదము నదియొక్క పేరు చెప్పుచు సంజ్ఞావాచకవిశేషణమైన దనియు గ్రహించునది. తక్కిన వన్నియు గుణద్రవ్యాదివాచకములలోఁ జేరును గావున, గుణాభావమును జెప్పునది గుణవాచకములలోను,

ద్రవ్యాభావమును జెప్పునవి ద్రవ్యవాచకములలోను జేరి, విశేష్యము లనుబట్టి లింగవచనాదులయెడ మార్పు చెందును. ఇందుకుఁ గొన్ని యుదాహరణములు.

విరాగుఁడు - విరాగ - విరాగము; నిష్కాముఁడు - నిష్కామ- నిష్కామము; బుద్ధిహీనుఁడు-బుద్ధిహీన-బుద్ధిహీనము- మొదలయినవి గుణవాచకవిశేషణములలోఁ జేరును. నిర్ధనుఁడు - నిర్ధన - నిర్ధనము; దరిద్రుఁడు-దరిద్ర-దరిద్రము (సంసారము) మొదలయినవి ద్రవ్యవాచకములలోఁ జేరును. 'గుణాది' యన్నచోట ఆదిపదముచే-స్వభావము- అవస్థ-శక్తి-సామ్యము- మొదలైనవి గ్రహింపనగును.

సూ:--విశేషణముల లింగవిభక్తివచనములు విశేష్యమునుబట్టి మాఱు చుండును. 3

కొన్ని అమహదర్థకవిశేష్యములు బహువచనమం దున్నను, వానివిశేషణము లేకవచనమం దుండవచ్చును. ఈయంశములు కారక ప్రకరణమునఁ దెలియఁగలవు. ఇట్లు మాఱునట్టివానికి విశేష్యనిఘ్నము లని పేరు. అనఁగా, లింగాదులయెడ విశేష్యములకు లోఁబడియుండు నవి యని యర్థము. ఈసూత్రము తత్సమశబ్దములకే విశేషముగా వర్తించును. ఆచ్ఛికములకుఁ దఱచుగా వర్తింపదు.

ఉదా:—గుణాదివాచకవిశేషణములు- తత్సమములు.

| మ | స్త్రీ- | అమ. | మ. |
|---|---|---|---|
| సుందరుఁడు | సుందరి | సుందరము | బుద్ధిమంతుఁడు |
| ప్రియుఁడు | ప్రియ | ప్రియము | సుకృతి |
| ఉత్తముఁడు | ఉత్తమ | ఉత్తమము | మాని |
| ప్రవీణుఁడు | ప్రవీణ | ప్రవీణము | ఉదారుఁడు- మొ. |

పైవానిలో మహతీవాచకవిశేషణములైనప్రియాదిశబ్దములకుఁ దఱచుగా ఆలుశబ్దము చేరును. ప్రియురాలు ఉత్తమరాలు ధన్యురాలు మొద—

తత్సమములు-సమాసములు-అమహద్విశేషణములు

| | | |
|---|---|---|
| సితపద్మము | మధురవచనము | శీతమారుతము |
| కఠినహృదయము | నీలోత్పలము | దివ్యమందిరము |
| విమలజలము | పావనచరితము | భవ్యగుణము |
| క్రూరకృత్యము | కపటాలోచనము | స్థిరబుద్ధి- మొద— |

పైకర్మధారయసమాసములలోని మొదటిపదము లన్నియు విశేషణములు. మఱియు నీక్రింది సమస్తపదములు వ్యస్తపదములు విశేషణములే యగును.

| | | | |
|---|---|---|---|
| మహానుభావుఁడు | దయాళువు | సిద్ధసంకల్పుఁడు | సంతుష్టము |
| సత్ప్రవర్తనుఁడు | భయశీలుఁడు | భీరువు | కాతరుఁడు . |
| సత్యవచనుఁడు | పథ్యము | హితము | మృదువు |
| శూరుఁడు | ధీరుఁడు | వీరుఁడు | సాహసికుఁడు |

ఈక్రిందివి అభావవిశిష్టవాచకవిశేషణములు.

| | | | |
|---|---|---|---|
| నిర్గుణుఁడు | అస్థిరుఁడు | మందమతి | అప్రాజ్ఞుఁడు |
| అనాకార | కురూప | అయోగ్య | అవివేకుఁడు |
| విరక్తము | అసత్యము | అభయము | నిర్మోహము- మొ |

అచ్చికములు-ఏకపదములు-

| | | | |
|---|---|---|---|
| అందగాఁడు | అందకత్తె | నేర్పరి | నేర్పుకత్తె |
| బల్లిదుఁడు | బల్లిదురాలు | వన్నెలాఁడు | వన్నెలాఁడి |
| చేనవరి | చేనవురాలు | చెలికాఁడు | చెలికత్తె- మొ— |

ఆచ్ఛికములు-సమాసపదములు.

| | | | |
|---|---|---|---|
| తెల్లతామర | పిఱికిబంటు | కొమరుఁబ్రా | పెద్దయిల్లు |
| చల్లగాలి | వాలుజేడ | యము | ముదురుకాయ |
| తియ్యమామిడి | వట్టిమాట | పోటుమానిసి | ముద్దుమాట |
| తియ్యనిమాట | పుల్లగూర | చిన్నవాఁడు | చిఱునవ్వు |

పైసమాసములలోని మొదటిశబ్దము లెల్ల విశేషణములు. వాఁడి-వేఁడి-చలి-తీపి- మున్నగువిశేష్యములును సమాసములయందు విశేషణము లగును. ఉదా — వాఁడికత్తి-వేఁడినీళ్ళు - చలిగాలి - తీపిమాట- వేఁడివెలుఁగు-చలివెలుఁగు-మొదలయినవి. మఱియు, పోటరి-ఒయారి-కల్లరీఁడు- మొదలగునవియు, వెరవిఁడి-పీఱిఁడి-సిగ్గిఁడి-మున్నగు గుణాభావబోధకములును గుణవాచక విశేషణములే యగును. కాని, తియ్య-తియ్యని - తెల్ల-తెల్లని-వాలు - వట్టి- మొదలయిన యనేక విశేషణములకు స్వతంత్రప్రయోగము లేదు. వీనికే కాదు, కొన్ని కృత్తద్ధితాంతములకును బల్లిదాదులు కొన్నిటికిని దప్పఁ దక్కిన యాదృచ్ఛికవిశేషణములలో సహజములైన పెక్కింటికి స్వతంత్రప్రయోగము లేదనియే చెప్పవచ్చును. ఈవిషయము వాడుకనుబట్టియుఁ బ్రయోగములనుబట్టియుఁ దెలియనగును. ఇందుకుఁ గొన్నిశబ్దము లుదాహరింపఁబడును.

శక్తిస్వభావాదులను నిర్దేశించునవియు, లేక సూచించునవియు నగు అట్టి-ఇట్టి-ఎట్టి-శబ్దములును, పోలిక యర్థముగల-వంటి-బోఁటి-శబ్దములును సర్వదా విశేష్యముల నంటి యుండును. ఇందు బోఁటి శబ్దమునకు విభక్తి గనవచ్చును గాని తక్కినవానికి విభక్తియే కనరాదు. వానికి విభక్తి వివక్షించునపుడు వాఁడు-అది-శబ్దములు తుదఁ జేరును.

ఉదా:— అట్టిశూరుఁడు. ఇట్టిదాత- ఎట్టినరుఁడు-అట్టివాఁడు-అట్టిఁడు-
ఇట్టిది-ఎట్టిదానికి-ఇత్యాదులూహ్యములు.

కమలజునట్టిందు—ఇట్టిఁడగుట— ఎట్టిఁడు—నానిజేశుఁడు—అనిప్రయోగములు. వంటి-బోఁటి-శబ్దము లింకొకపదము తుదఁ జేరియే ప్రయోగింపఁబడును. ఉదా — అటువంటిపనులు - ఇటువంటిధీరుఁడు-నీబోఁటి యోగ్యుఁడు-మాబోంట్లకు-రాముని బోఁటిమహావీరుఁడు ఇత్యాదులు—

అట్టిశబ్దము తఱచుగా క్రియాజన్యవిశేషణములనంటియుండును.
ఉదా:—వచ్చినట్టి-చేయుచున్నట్టి-ఇత్యాదులు. ఇట్లే గుణాదివాచక విశేషణములను బరిశీలించునది.

## ద్రవ్యవాచకవిశేషణములు

సూ:—విశేష్యములకు సంబంధించినద్రవ్యములను జెప్పునవి ద్రవ్యవాచకములు. ౮

ద్రవ్య మనఁగాఁ బదార్థము. నామవాచకప్రకరణమునఁ జెప్పఁబడిన ద్రవ్యవాచకములు కేవలము వెండి-రాగి-మంచు-రాయి-మొదలగు పదార్థములను మాత్రమే చెప్పునవి. అవి విశేష్యములు. ఇందు జెప్పఁబోవునవి ధనవంతుఁడు-కనకమయము- అనుచు, విశేష్యములకుఁ జెందియుండు ద్రవ్యములను దెల్పునవియై ద్రవ్యవాచకవిశేషణము లగుచున్నవి. ఇట్లే ముక్కంటి- తమ్మికంటి-నెలతాల్పు- మొదలగు సమాసపదములును వ్యుత్పత్తినిబట్టి ద్రవ్యవాచకవిశేషణము లగు నని యెఱుఁగునది.

ఉదా:—తత్సమములు

| మహ | మ.తి- | అము |
|---|---|---|
| ధనవంతుఁడు | ధనికురాలు | శ్రీమంతము |
| ఆయుధపాణి | అరుణచేల | పుష్పితము |
| ధనవతుఁడు | విశాలాక్షి | కనకమయము- మొ___ |

పై నుదాహరించిన సమస్తపదములు వ్యస్తపదములును ద్రవ్యవాచకవిశేషణము లగును. మఱియును కొన్ని—సైకతసేతువు-పాయసాన్నము-హైమకంకణము-పార్థివలింగము-బాడబాగ్ని-సైంధవలవణము-మొ___

పైసమాసములలోని మొదటిపదము లన్నియు విశేషణములు మఱియును గొన్ని తత్సమములు, అచ్చికములును పుష్పబాణము-శిలా

విగ్రహము-పూములికి-నుంచుకొండ-రాతిబొమ్మ-కందదుంప- కట్టిపెట్టె-పట్టుబట్ట-వెండిపళ్లెము మొ—

పైసమాసములలోని మొదటిపదము లన్నియు విశేష్యము లయ్యు నిందు విశేషణధర్మము నాశ్రయించినవి. మఱియు, కాణుఁడు-గుడ్డి-చీఁకు-మూకుఁడు-మూఁగ- పంగువు-కుంటి-ఖంజుఁడు-విగ్రుఁడు-వికతన సికి-ముక్కిఁడి- బధిరుఁడు-చెవిటి- లేనడి-లేబరము-మొదలయిన యభావవిశిష్టవాచకములును విశేషణము లగును. దీర్ఘసమాసముల యందు గుణవాచకములు ద్రవ్యవాచకములును గలిసి యుండును. ఒకప్పుడు జాతిసంజ్ఞావాచకములును గలియును. వానిని వైలక్షణము లనుబట్టి గ్రహింపఁదగును.

ఉదా:—మహోన్నతదివ్యహర్మ్య ప్రాసాదరమ్య మగుపురము.

ఇందు, మొదటి మూఁడుపదములు గుణవాచకములు హర్మ్యా దులకు విశేషణములు హర్మ్యప్రాసాదరమ్యము ద్రవ్యవాచకము పుర మునకు విశేషణము. ఇట్లే తక్కినవి యూహించునది.

క్రియావాచకవిశేషణములు

సూ:—విశేష్యములకు సంబంధించినక్రియలను జెప్పునవి క్రియా వాచకములు.

క్రియ యనఁగా వ్యాపారము. ఈక్రియావాచకవిశేషణములు విశేష్యములను బట్టి లింగవిభక్తివచనముల మార్పు నొందును. ఉదా:

| | | | |
|---|---|---|---|
| కృతజ్ఞుఁడు | పాఠకుఁడు | క్షేమంకరము | పాపఘ్ని |
| మిత్రద్రోహి | పూజకుఁడు | ధనదాయి | మోహిని |
| సురాపాయి | పాచకుఁడు | ఉపదేశకుఁడు | యశస్కరి |

అచ్చతెలుఁగునఁ గూడ కృదంతము లైన పదము లన్నియు క్రియావాచకములే యగును. కాని, అవి చాలవఱకు విశేష్యము లుగాఁ బ్రయోగింపఁబడుచున్నవి. అందు గొన్నిపదములు సమా

ములయందు విశేషణము లగుట కలదు కాని, కృత్ప్రత్యయములు
కానక ర్త్రుకర్మాద్యర్థముల వచ్చుటంజేసి వానిలో నేవి కర్త్రర్థకములో
నవిమాత్రము క్రియావాచకవిశేషణము లగు నని తెలియునది.
మఱియు నీకర్త్రర్థకపదములు సమాసములందు మాత్రమే యిట్టివిశే
షణము లగు ననియు, ప్రత్యేకముగా నున్నచో విశేష్యము లగు
ననియు గ్రహించునది. విశేషణత్వసిద్ధికై యర్థములు గూడ వ్రాయఁ
బడుచున్నవి.

ఉదా:— దేశ్యక్రియావాచక విశేషణములు.

చూపుడువ్రేలు=చూపించునట్టివ్రేలు

పంటకాఁపు=పండించునట్టికాఁపు

పంటభూమి=పండునట్టిభూమి

కాపుమామిడి=కాచునట్టిమామిడి

వంటబ్రాహ్మణుఁడు=వండునట్టి విప్రుఁడు

పూతకొమ్మ=పూచునట్టికొమ్మ

పూతకొమ్మ వచ్చినదని వాడుక. పైసమాసములలోని మొదటి
పదములు విశేష్యములవ్యాపారములను దెల్పుచుఁ గ్రియావాచక
విశేషణము లగుచున్నవి. ఈక్రిందిసమాసములలోని మొదటిపద
ములు తాము సమసించువిశేష్యముల వ్యాపారములను దెల్పక యితర
విశేష్యములవ్యాపారములను జెప్పుచున్నను, సమాసములందు క్రియా
వాచకములై విశేషణములే యగుచున్నవి.

ఉదా:— పెంపుడుకూఁతురు=అన్యులు పెంచుకొన్నపిల్ల

దాఁపుడుధనము=ఇతరులు దాఁచినసొమ్ము

వేఁపుడుకూర=వంటకత్తె వేఁచినకూర

నేఁతబట్ట=సాలీఁడు నేసినబట్ట

దిగుడుబావి=జనులు దిగునట్టిబావి.

## సంఖ్యావాచకవిశేషణములు

ఇందు సంఖ్యార్థకములును సంఖ్యేయార్థకములును విశేషణములు గూడ నగు ననుటకు సర్వనామప్రకరణమునఁ గొన్నియుదాహరణము లీయఁబడినవి. ఇందు పూరణార్థకములు మాత్రమే చెప్పఁబడును. ఇవి యెల్లయెడల విశేషణములే యగును. అందు తత్సమ పూరణార్థకములువిశేష్యములనుబట్టి లింగవిభక్తివచనములనుబొందును

| | మ | మ- తి. | అమ |
|---|---|---|---|
| ఉదా:- | ద్వితీయుఁడు | ద్వితీయ | ద్వితీయము |
| | చతుర్థుఁడు | చతుర్థ | చతుర్థము |
| | దశముఁడు | దశమ | దశమము |
| | వింశుఁడు | వింశ | వింశము |
| | వింశతితముఁడు | వింశతితమ | వింశతితమము- మొ- |

చతుర్థశబ్దము మొదలుగాఁ గలవి తిథు లర్థమగునపుడు, ఈకారాంతము లగును. తెలుఁగున హ్రస్వము వచ్చును. ఉదా—చతుర్థి- పంచమి షష్ఠి మొదలయిన వ్యాహ్యములు.

సూ:—'అవ' అనెడియాగమము చేరుటచే, తెలుఁగంకెలు పూరణార్థకములై విశేషణము లగును. కాని వీనికి విభక్తివచనము లుండవు. ఇవి స్వతంత్రములు గావు. విశేష్యముల నంటి యుండును. ౬

ఉదా:—రెండవవాఁడు- మూఁడవయిల్లు- పదవయేనుఁగు- నూఱవగుఱ్ఱము- వేయవబంటు- మొద—వందశబ్దమున కీప్రత్యయము చేరదు. వందవవాఁడనువాడుక లేదు.

సంస్కృతమునందు ఏకశబ్దమునకు ప్రథమశబ్దమువలెనే, తెలుఁగునందు ఒక్కశబ్దమునకు 'మొదటి'శబ్దము పూరణార్థకరూపము. ఒకటవయి లననుటకు మొదటి యిలని వాడుదురు. కాని యిప్పుడు ఒకటి

శబ్దమునకు 'అవ' చేరినప్రయోగములు వాఙ్మయములోనికి వచ్చినవి. ఒక టవతరగతి. ఒకటవపాఠము. ఒకటవరకము మొదల——కావున, ఒక శబ్దమునకు 'అవ' చేర్చుట దోషము గాదని తెలియునది. కాని, ఒక్క మీఁదనే అవ చేర్చిన డెబ్బదియొక్కవ-ఇరువదియొక్కవ- మొదలగు ప్రయోగములు సాధువులు గావు. గ్రాహ్యములును గావు.

ప్రాచీనగ్రంథములందు పూరణార్థకమైన అవ ప్రత్యయము రాని ప్రయోగములు తఱుచుగాఁ గనవచ్చును. పదుమూఁడవయేఁడను అర్థమందు, పదుమూఁడగునేఁడని, అగుధాతువుయొక్క తద్ధర్మార్థక క్రియాజన్య విశేషణమే కనవచ్చును. ఈయాచారము నన్నయాది కవుల వ్రాఁతలయందును శాసనములందును గానవచ్చుచున్నది. 'అగు' యొక్క పలుకుబడియే క్రమముగా అవు-అవ-గా మాఱి, మఱి కొంత కాలమునకు ఓ-యనురూపమునకు మాఱినట్లు కనఁబడు చున్నది. ఇందుకుఁ బ్రయోగములు——

క. వాఁడానాలుగుగడియలు
నేఁడాదిగఁ గడపి సూర్యు, డిఁకఁ దూర్పునకున్
రాఁడో యని తలపోయఁగ
మూఁడోజా మయ్యె నంత మోద మెలర్పన్. నిరంకు—౨-౮

గీ. తప్పు కిరునదియెనిమిదోద్వాపరాంత', వేంకటేశ్వ-
చక్ర-సీ. అంటంగఁ గడ లెల్ల నాలుగేళలు గీసి
క్రింది పందొమ్మిదోఛందమునను—అప్పక. ౪

శబ్దసంప్రదాయమును బట్టి భాషాభిజ్ఞులు దీనియాచిత్య మెఱుంగుదురు గాక.

## క్రియాజన్యవిశేషణములు

సూ:—ధాతువులవలనఁ బుట్టినవి క్రియాజన్యవిశేషణము లనఁ బడును. ౭

ఈవిశేషణముల రూపనిష్పత్తి క్రియాప్రకరణమున గన

వచ్చును. ఇవి భూతార్థకాదిభేదమున నాలుగువిధములుగా నుండును. వీనికి వ్యస్తప్రయోగము గాని విభక్తులు గాని కలుగవు.

ఉదా:—భూ-క్రి-వచ్చిన రాముఁడు-ఇచ్చినగోవు-చేయనిపని-

వర్త-క్రి-చేయుచున్న పని-చెప్పుచున్న మాట

భవి-క్రి-పెట్టఁగలవాఁడు-కొనఁగలగేదె

తద్ధ-క్రి-కోరువరము-కోరెడువరము-కోరెడివరము-మొ-

వీనికిని విభక్తివివక్షించునపుడు-వాఁడు-అది-శబ్దము లనుప్రయుక్తము లగును. ఉదా-వచ్చినవాఁడు-వచ్చినది-చేసినదానిని-ఇచ్చినవానికి-మొద-

మఱియు వీనికి, అట్టి యనుపదము వైకల్పికముగఁ జేరును. చేసినట్టిపని-వచ్చుచున్నట్టి బాలుఁడు-వచ్చుచున్న బాలుఁడు.

క్రియావిశేషణములు

సూ:—క్రియాపదముల ధర్మములను దెలుపునవి క్రియావిశేణములు.

ఇవి క్రియలయొక్క యర్థములను హెచ్చింపఁగలవు, తగ్గింపఁగలవు. వేఱు చేయఁగలవు. క్రియావిశేషణ మనునది వేఱొకభాషాభాగము కాదు. కొన్ని కొన్ని నామవాచకములు, విశేషణములు, అవ్యయములు క్రియలకు విశేషణములై పై పేరఁ బరగుచున్నవి. కొన్ని నామసర్వనామవాచకములు విశేషణములు, సామాన్యముగా అగుధాతువునుండి పుట్టినతుమున్నంతావ్యయ మయిన ' కాన్ ' అను దానితోను సముచ్చయముతోను జేరి క్రియావిశేషణము లగుచున్నవి.

ఉదా:—వడిగా వచ్చెను. మెల్లన పోయెను. మెల్లగాఁ బోయెను. తిన్నగా వచ్చెను. సరిగాఁ బొమ్ము. ఎంతయుఁ గంతించె. పెద్దయు మెచ్చెను. చక్క వచ్చెను. చక్కఁ జేసెను. చక్కఁగాఁ జూచెను. మొద—

సూ:—క్రియావిశేషణ మగునపుడు చక్కశబ్దమునకు నకారము నిత్యముగా నాగమమగును. ౯

ఉదా:—చక్కఁజేసెను. ద్రుతకార్యము వచ్చినది. చక్కవచ్చె ననుచో ద్రుతము లోపించినది.

అవ్యయములకు:—గ్రక్కున వచ్చెను. బోరనఁ జొచ్చెను. చాలా సంతోషించెను. మిక్కిలి యానందించి, పాడుచు వెళ్ళెను. ఈయ కుండెను. తద్దతగదు-కడుం గడు విచారించి—దిగ్గన లేచి-చయ్యనఁ దెచ్చెను. మొ.—

ఇది విశేషణప్రకరణము.

---

## అ వ్య య ప్ర క ర ణ ము

'లింగవిభక్తివచనశూన్య మవ్యయ'మని మున్ను లక్షణము చెప్పఁబడినది.

సూ:—అవ్యయములు రెండువిధములు. ౧

ప్రతిపదోక్తములు లాక్షణికములు అని. పుట్టుకలోనే లింగాదులు లేనివియు వాడుకలో లింగాదులను విడిచి యితరార్థములందు స్థిరపడిన కొన్నిశబ్దములును ప్రతిపదోక్తము లనఁబడును. ధాతువుల నుండి పుట్టినయవ్యయములు లాక్షణికము లనఁబడును. ప్రతిపదోక్తము లన్నియు దేశ్యములు. లాక్షణికములలోఁ దత్సమతద్భవదేశ్యము లగు మూఁడువిధము లయినవియుఁ గలవు. తెలుఁగులో సంస్కృతావ్యయము లనేకములు శబ్దాంతరములతోఁ గలిసియు, ధాతువుల మొదలఁ జేరియు విశేష్య విశేషణములుగా నుండియు, వేఱుగాను కూడఁ గనఁబడుచున్నవి. వానిలోఁ గొన్నిటి నుదాహరించి పిదపఁ దెలుఁగులోని యవ్యయములు నుదాహరించెదము.

సంస్కృతావ్యయములు:—

| | |
|---|---|
| ప్రాతర్-ప్రాతఃకాలము | శమ్-శంకరుఁడు |
| దివా-దివాస్వాపము | పురస్-పురోభాగము |
| స్వర్-స్వర్లోకము | ఉపరి-ఉపరిలోకము |
| పునర్-పునర్జన్మము | శశ్వత్-శాశ్వతము |
| అలమ్-అలంకారము | సద్యస్-సద్యోగర్భము |
| నక్తమ్-నక్తంచరులు | అంతర్-అంతఃపురము |
| చిరమ్-చిరంజీవి | నమస్-నమస్కారము. |

ఇట్టి వనేకములు తత్సమపదములతోఁ గలిసి తెలుఁగునఁ జేరినవి.

స్వస్తి-సదా-వృథా-సర్వత్ర- మొదలగు కొన్నిటికిఁ దెనుఁగునఁ బ్రత్యేకప్రయోగము కలదు. సంస్కృతావ్యయములలోనివైన ఉపసర్గలు తత్సమములైన విశేష్య విశేషణ ధాతువులమొదలఁ జేరి కనఁబడుచుండును గావున వానినిగూడ నుదాహరించెదను.

ప్ర-సు-ఉప- మొదలయినవి ఉపసర్గలు.

| | | |
|---|---|---|
| ప్ర-ప్రదేశము | పరా-పరాభవము | నిర్-నిర్భయము |
| వి-వినయము | అప-అపమార్గము | దుర్-దుర్జనుఁడు |
| ఆ-ఆకారము | అను-అనుమానము | అభి-అభియోగము |
| ని-నిదానము | అవ-అవమానము | ఉత్-ఉద్యమము |
| సు-సుగుణము | అధి-అధికారము | పరి-పరిమాణము |
| నిస్-నిష్కారణము | అపి-అపిధానము | ఉప-ఉపకారము |
| దుస్-దుస్స్వప్నము | అతి-అతికష్టము | ప్రతి-ప్రతిక్రియ |
| సమ్-సమ్మానము | సన్-సంభవించు | నిర్-నిర్జించు |

ప్రతి యనెడియుపసర్గ అచ్ఛికశబ్దములతోఁ గూడి వాడుకలోను ఇప్పటిగ్రంథములలోనుగూడఁ గనఁబడుచున్నది.

ఉదా:—ప్రతియిల్లు-ప్రతిమాట-ప్రతివాఁడు-ప్రతిది-

దీనికి-సాటి-బదులు-(నకలు)-అనెడి యర్థములు గలవు.

"నీప్రతి లేరీభువనత్రయంబున" ఉ—హరి—"వీరుఁ డిల లేఁడు ప్రతి రఘు వీరుఁ డొకఁడు" విజ—"ఏను నీప్రతిగ నర్చనచేసెద" జై మి—

"ఆపుస్తకముయొక్క ప్రతి యొకటి నాయొద్ద నున్నది" మొద లగుచోట్ల ఆపుస్తకమున కన్నివిధముల సాటియైన దని యర్థము చెప్పవచ్చును గాని, ఈయర్థమునే సూచించునట్టి నక లనెడియర్థము వాడుకలో స్థిరపడినది.

పైని జూపిన యుపసర్గలు ధాతువులయర్థములను వివిధముగా మార్చుచుండును. ఇందు కొకయుదాహరణము 'హృ' ధాతువునకు హరించుట యర్థము. ఉపసర్గలు చేరుటచే దీని కనేకార్థములు వచ్చినవి.

ప్రహారము=దెబ్బ
ఆహారము=తిండి
ఉపహారము=కానుక
అపహారము=దొంగిలించుట
సమాహారము=పోగుచేయుట
పరిహారము=విడిచిపెట్టుట మొ—
సంహారము=చంపుట-ముడుచుట
విహారము=సుఖముగాఁ దిరుగుట
నిరాహారము=తిండిలేకుండుట
ఉపసంహారము=సమాప్తి

సూ:—కొన్ని సంస్కృతావ్యయములు తెలుఁగున విశేష్యములు విశే షణములు కూడ నగును. ౨

ఉదా:—స్వస్తి యగుఁగాక-చిర మయ్యె-సాయ మైనది-ఇహము చెడును- మొదలగుచోట్ల, స్వస్తిమొదలైనవి విశేష్యములు. నీమాట మృష-జగత్తు మిథ్య-ఇత్యాదులందు మృషాదులు విశేషణములు.

## ప్రతిపదోక్తావ్యయములు

వీనిలో ఏకాక్షరములు అనేకాక్షరములు ఏకార్థకములు అనే

కార్థకములు మొదలుగా ననేకవిధములు గలవు. మఱియు నామసర్వ నామ క్రియాపదములు కొన్ని వాడుకలో వర్ణాంతరములతోను శబ్దాంతరములతోను గూడి యితరార్థముల స్థిరపడినవియుఁ గలవు. అందు కొన్ని నిపాతము లనుపేర నవ్యయము లగుచున్నవి. అవ్యయములకు లింగవచనాదు లుండవు గాని హ్రస్వదీర్ఘద్విత్వలోపాదుల రాకపోకలచేఁ గలుగుచూర్పు లుండును. కొన్ని యవ్యయముల తుదను విభక్తిప్రత్యయము లున్నట్లు కనఁబడుఁను. కాని యవి విభక్తులు గావని తెలియునది. ఇందు ౧ గుర్తుకలవి సహజములును విశేష్యాదు లవ్యయములుగా మాఱినవియును. ౨ గుర్తుగలవి విభక్తిప్రతిరూపక ములు. ౩ గుర్తుగలవి విభక్త్యంత ప్రతిరూపకములు. ౪ గుర్తుగలవి నిపాతములు. మొత్తమన్నియుఁ బ్రతిపదోక్తము లనఁదగును.

౧. అ-ఆ-ఇ-ఈ-ఆఁ-ఊఁ-ఎ-ఏ-ఓ-అన్నా-అమ్మమ్మా- అమ్మక్క-అయ్యో-అబ్బో-అబ్బే- ఆయలే- ఆహా- అకటా- అఁట-అటె- అరే-అట్లు-ఇట్లు- ఎట్లు- అటు- ఇటు- ఎటు-అంతన్-ఎట్టెట్టూ- ఇఁకఁ-ఏని-అండి-ఏమి-ఏసి- ఉను- ఓయి- కావునన్-దాఁకన్- కాని-కరము-అనయము-కాఁబట్టి-కాఁబోలును- పోలెన్-వలెన్- బలెన్-ఔరా-కశా-మిక్కిలి-మఱి- ఊరక-మిన్నక- బళీ-ఇహి హీ-రే-రా-చెల్లరే-పదంపడి- బోరనన్- పిదపన్- ఇంచుక-ఏల- ఓయి- ఒండెఁ- ఒకో- మా-జే- సరి- సేనా- శలా-ను-వెంటన్- సెబాసు- మొద___

౨. కూర్చి-గుఱించి-మైఁ-మెయిఁ-చేసి- పొంటెన్- కోసము-కోనరము-ఉంచి-ఉండి-పట్టి- మొ___

౩. అపుడు-ఇపుడు-ఎపుడు-అందు-ఇందు-ఎందు-అట-ఇట-ఎట-ఎల్ల- ఆవల-ఈవల- మొ___

౪. అదిగో-ఇదిగో-అఁడుగో-ఇఁడుగో- ఏఁడీ-ఏరీ- చాలా- కూడా.

చూ-చుమీా-చుఁడీ-ఇంద-ఇందండీ-వాఁడుగో- మొ—

సూ:—కొన్ని ప్రతిపదోక్తావ్యయములకు రూపాంతరములునుగలవు 3

ఉదా:—అటులు-అట్లు, కద-కదా, ఔర-ఔరా-అవురా, అక్కటా
కటా-అకటా-అకట, బాపురే-బాప్పు-పురే-మొద—

సూ:—మార్పునం దర్థభేదమును కొన్నిటికిఁ గల్గును. ४

ఉదా:—అ దేమి ? ప్రశ్నార్థకము- ఏమీా-ఏమేమీా! ఆశ్చర్యార్థకములు.

సూ:—రెండేసియవ్యయములు కలిసి యర్థాంతరములఁ దెల్పును. ౫

ఉదా:—వికల్పము-పక్షాంతరము మున్నగునర్థము లిచ్చెడి 'ఏని' యను నవ్యయము ఉను-అనుసముచ్చయముతోఁగూడి, అయినను-మిక్కిలి-యనెడి యర్థమిచ్చును. మఱియు, 'ఆ' యను నవ్యయముతోఁ గలిసి ప్రశ్నార్థకమగును, ఏనా?

"వినిపించిన నింతేనా? యని యందఱు" శుకస—సంప్రదాయసిద్ధము లక్షణశుద్ధము నై శిష్టసమ్మత మయిన యాప్రయోగము గ్రామ్య మనుట పొరపాటు.

సూ:—కాని-దీర్ఘాంతమై యంగీకారమును దెల్పును, హ్రస్వాంతమైనను దీర్ఘాంతమైనను వికల్పమును దెల్పును. ౬

క్రమముగా దీర్ఘాంతములకుఁ బ్రయోగములు—

,,కానిరండని—అము- నిచెల్వంబది నిక్కమట్లయినఁగానినాకుని వంక'' కాళ

,,నిరవద్యస్థిరభక్తితోడ ననుఁ గానీ శంభుఁ, గానీ రమేశ్వరుఁ గానీ గుతియించి'' కాశీఖం—

,,పాదము లొత్త ర మ్మనుట గానీ యొంటియేమో కదా నికటత్షోణికి నేసుచ మ్మనుట గానీ—కళాపూ—ఇత్యాదులు

కానిమ్మయొక్క రూపాంతరముకానీ-హ్రస్వాంతముకాని- ఇది యవ్యయమైనది.

సూ:—చాలా-కూడా-నిపాతములు. ౭

ఇవి, చాలు కూడు ధాతువుల తుమున్నర్థకావ్యయము లైన చాలన్ కూడన్ అనువానిలోని తుది నకారమునకు లోపమును దాని వెనుకటియచ్చునకు దీర్ఘమును వచ్చుటచేఁ గలిగినరూపములు. ఇవి కళలై నిపాతములై ప్రతిపదోక్తములలోఁ జేరినవి. (చాలు కూడు ధాతువుల తుమున్నర్థకరూపములును వేఱుగా నుండును.) ఇవి సహజార్థములనే కాక విశేషార్థములను గూడఁ దెల్పును. చాలా అధికార్థకము. కూడా సముచ్చయార్థకము. చాలా యిచ్చె ననుచో మిక్కిలి యిచ్చెననియు, వానికిఁ గూడా పెట్టుమనుచో వానికిని బెట్టుమనియు నర్థము గోచరించును. దీర్ఘాంతములైన యివి సేనా తలా యనువాని వలె నుండును.

ఇందుకుఁ గొన్ని ప్రయోగములు.

„ఆమాటలువిని...చాలా ముఖ్యంబుగ." రంగరాయ—„చాలా నేఁ గలుగంగ నెంతపనికిన్ సంతాపముం బొందఁగా నేలా సిగ్గున" అనిరు—„చాలాకయ్యము చేసి చిక్కినమదస్తంబేరమస్వామిపై" అప్పక—„మేలారసి లోకులనన్ చాలా రసికత్వ మబ్బె సర్వేశునకున్" గౌరీ—„సతతభక్తియుతసన్మునిజాలా క్షితివృషగిరి యనఁ జెలఁగును చాలా ప్రబంధ—„చాలా వేఁడిన హరి మీ రేలా వల దని—" మృత్యుంజ—„ఆడకునుం బోక మనము హాయిగ నెచటన్ కూడా నుండుదమో యని." రాధా—ఇత్యాదులు.

సూ:—అచ్చు పర మగునపుడు వీనిపై 'ను' అనునవ్యయము చేరుటయుఁ గలదు. ౮

ఉదా:—కూడా+ను ఉండుదము=కూడా నుండుదము. చాలా+ను ఏ = చాలానే=చాలానే యిచ్చెను.

వానికిఁ గూడా యిమ్ము. చాలా యిచ్చె ననుచో 'ను' చేరుట కనరాదు. వానితోఁ గూడా పొమ్ము. చాలా కోరె నిత్యాదిస్థలముల హల్లు పరమగునపుడు 'ను' చేరదు. వాడుకలో దేశ మెల్లెడల వ్యాపించి కావ్యములందును గనవచ్చు వీనిని గ్రామ్యము లనుట యుచి

తేము కాదు.

సూ:—సేనా-తలా-లును, కావ్యవ్యవహారసిద్ధములు.

"ఏలా సేనా మాటలు?" బసవ—"సేనాగా నొనరించిన నాసెలగళుండు-" ప్రభులిం—"అందఱకుం దలాయొకటి స్వార్థము గల్గుట చోఁపఁ బల్కె." ప్రభా వ—"అది తలాయొకముద్దెఁడు నారగించి" పరమ—

శబ్దరత్నాకరమున నిట్టియవ్యయములు పెక్కు లుదాహరింపఁబడియున్నవి.

తక్కిన కొన్నియవ్యయముల కర్థములు ప్రయోగములు.

౧. సెబాసు ఆశ్చర్య ప్రశంసార్థకము-రూపాంతరము సేబాసు.

"సెబాసుర యోరిజయంత" ఉ-రా-"మెచ్చించెదవే నపుడు నిన్ను సేబాసందున్" హరవి—

౨. మా-బళీ మిక్కిలి గొప్ప యను నర్థములను జెప్పును.

ఈయర్థములకుఁ గ్రమముగాఁ బ్రయోగములు.

"మామయిచ్చెను మా యని మహి నుతింప" నైష—"మనమున మెచ్చునాయకుఁడ మా నెఱజాణవు" హంస—

ఇట్టి ప్రయోగములింకను గలవు. మామ్మ (తండ్రితల్లి-తల్లికంటెగొప్పది) యనుచో గొప్పయనెడియర్థము గోచరించును, 'మిక్కిలి' యర్థమున మాబాగు-మామంచివాఁడు-మాదొడ్డమాట- ఇత్యాదులు వాడుకలోఁగలవు. ఇది మహచ్ఛబ్దముయొక్క అపభ్రంశరూపమని కొందఱందురు. కాని శ్రీనాథాదులు దీనిని వాడుటనుబట్టి దేశ్యమనియే తోఁచుచున్నది. కాకున్న, నిపాతము గావచ్చును.

3. జే-ఆశీర్వాదము నమస్కార మనునర్థములఁ జెప్పును. ఇది యామ్రేడితము నగును. జేజే-దీని రూపాంతరము జా.

ఇందుకుఁ బ్రయోగములు.

" చేదోయి మోడ్చి జే యనుచు నమస్కృతు లలర" శేష—జేజే యని జగ మెంచఁగ" ఉ-రా-"జేజే హిరణ్యాక్షశిశుకమునకు" సాంఖ్య—జా పరమేశ్వరా యనుచు [illegible]

సూ:—ఇంకన్-దాఁకన్-అనువానితుదిన కారమునకు లోపమును
దానివెనుకటి యచ్చునకు దీర్ఘమును బహుళముగా నగును.

ఉదా:—ఇంకన్-ఇంకా-ఇంకాన్, దాఁకన్-దాఁకా-దాఁకాన్-

ఇంకాన్, అని ప్రాసస్థానమున ప్రుతాంతముగాఁ గనఁబడు టచే సకారలోపము బహుళ మనవలసివచ్చినది గాని వాడుకలో ద్రు ము నిత్యముగా లోపించునపుడే వెనుకటియచ్చునకు దీర్ఘము వి వచ్చును.

ఉదా:—ప్రయోగములు.

"మానసవేగవాహములు మత్తగజంబుల వెన్ని యున్న నిం। కా నొకళ్ళ కూర్పవలె" ప్రబోధ—"ఈరీతిన్ గొనియాడు నారదునిఁ దా నీక్షించినన్ ప్రే నిం। కా రావోయి" రామ స్త—"నేనిద్రపోవుదాఁకా నిద్ర పోవ దేపని చెప్ప యని"_వైజయం—"యాగము నేక్రియన్ జరుగు నేల జనించితి భూమి మీ నిం।కాఁ గలకార్య మేమి?—పట్టాభిరా—ఇత్యాదు లనేకములు గలవు.

సూ:—చూచినన్-అయినన్- మొదలగు చేదర్థకము లైనయవ్య ములతుది నకారమునకు లోపమును దానివెనుకటి యచ్చున దీర్ఘమును వైకల్పికముగా నగును.

ఉదా:—చూచినన్-చూచినా-అయినన్-అయినా-చేసినన్-చేసినా-చె ప్పినన్-చెప్పినా-మొద-

ఇట్టివానికిఁ గొన్నిప్రయోగములు.

"ఏసమయము చూచినా సదాశివమిత్ర గోచరగ్రంథార్థసూచనంబు" హ నర—"ఆనాఁటి వినోదము లె। న్నైనా కల వైన—"_దశావ—"ఏకడ మేలుగ వగ పేటికిఁ గల్గెడు దానవేంద్రయై। నా కల దొక్క విన్నపము"దశావ—"కాఁ లె పని లేదయి। నా విను మొకతేప" పార్వతీ—"ఓశీతాచలకన్యకారమణ నా ద్యోగ మిం కేరికై। నా శ్రీఘంబున-సానం—

ఇట్టి ప్రయోగములు పెక్కు గలవు. యతిప్రాసములకు సా ధించిన వీనిని ఁద్దుటకు వీలు లేదు. శిష్టవ్యవహారసిద్ధము లైనవీ గ్రామ్యము లనుటకు వలనుపడదు.

సూ:—కొన్ని నామసర్వనామములమీఁది సముచ్చయము గూడ లోపించుటయు, దానివెనుకటి యచ్చునకు దీర్ఘమువచ్చుటయుఁ గనవచ్చును. ౧౨

ఉదా:—చల్లయుఁ=చల్లా, వెన్నయుఁ=వెన్నా, ఏమియుఁ=ఏమీ, అంతయుఁ=అంతా, ఇట్లే ఇంతా మొద—

ఇందుకుఁ బ్రయోగములు

"చల్లాయంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచుఁ బోనాడితిన్
దల్లీ కన్నడరాజ్యలక్ష్మి దయలేదా నేను శ్రీనాథుఁడన్"
"వెన్నా మీఁగడయున్ ఫలంబొసఁగెదన్ వేగంబ రారమ్మమా, యన్నా"
వసు—"ఏమీ కొంకక పెట్టు భిక్షులకు" హర—"అంతా సంశయమే శరీరఘ
ం బంతా విచారంబె లో, నంతా" కాళ—శ—

సూ:—నమాసధాతువునుండి పుట్టినవ్యతిరేకక్త్వార్థకముగాని వ్యతిరేక భూతార్థక క్రియాజన్యవిశేషణముగాని వ్యతిరేక భావార్థకముగాని పర మగుచో, క్త్వార్థకముమీఁది సముచ్చయమునకు లోపమును దత్పూర్వస్వరమునకు దీర్ఘమును వైకల్పికముగ నగును. ౧౩

ఉదా:—కూడియుఁగూడని- కూడీకూడని-ఇత్యాదులు

"నియమితమందుభిధ్వని వినివినమిన్" జైమినిభా—
"కూడీకూడనిచిన్నకూఁకటులతో గోపార్భకశ్రేణితో" దేవకీ—
"మాసిమానని" కళాపూ—ద్వ్యక్షరకందము
"దుర్భాషణముల్ వినివినని భంగి న దట్టిద" నైష—
"అధరము కదలీకదలక" సుమతి—
నమ్మిమి మృత్యువు పెద్దయు నమ్మట యపమృత్యు వగుట నరపతి నమ్మీ
నమ్మక" భార—శాంతి—2—351 (1901 కూర్పు) ఈపాఠము తెలువాతి
మాఱిపోయినది.

సూ:—కూర్చి మొద లగునవి విభక్తిప్రతిరూపకావ్యయములు. ౧౪

విభక్తులవలె నుండి వానియర్థ మిచ్చునవి యని యర్థము.

కూర్చి-గుఱించి-గుఱించి-ద్వితీయావిభక్తి ప్రతిరూపకములు. మెయిఁ-మైఁ-చేసి-తృతీయావిభక్తి ప్రతిరూపకములు. కోసము-కోసరము-పొంటెన్-చతుర్థీ విభక్తిప్రతిరూపకములు.ఉండి-ఉంచి-పట్టి-పంచమీవిభక్తి ప్రతిరూపకములు.

సూ:—అందు మొదలయినవి విభక్త్యంతప్రతిరూపకావ్యయములు.

అనఁగా, డు-ము-వు-లు మొదలగు సప్తవిభక్తులతోఁ గూడిన విశేష్యాదులవలె నుండునట్టి యవ్యయము లని యర్థము. ఈక్రింద నుదాహరింపఁబడువానితుదను విభక్తిప్రత్యయములవంటి వర్ణములు కనఁబడును గాని యవి విభక్తులు గావనియు, అవ్యయముల స్వరూపములే యట్లుండుననియు గ్రహించునది. ఇట్టివి సంస్కృతమునందును గలవు. పోలికకై సంస్కృతావ్యయ మొకటి ముందుగా నుదాహరింపఁబడును.

చిరమ్-చిరేణ-చిరాయ-చిరాత్-చిరస్య-అనునవి, రామమ్-రామేణ-రామాయ-రామాత్-రామస్య, అనువిభక్త్యంత నామరూపములవలెఁ గనవచ్చుచున్నవి. కాని చిరమ్ మొదలైనవి యవ్యయములే. వానిలోఁ గొన్నిరూపములకు విభక్తులయర్థము గోచరించుటయుఁ గలదు. అయినను, అవి యవ్యయములే. కావుననే వానిని విభక్త్యంతప్రతిరూపకము లని సంస్కృతవ్యాకరణకర్తలు నిర్ణయించిరి. ఇట్లే తెలుఁగునఁ గూడ విభక్త్యంతప్రతిరూపకములు గల వనుటకై యింత వ్రాయవలసి వచ్చినది.

అర్థభేదము గలవాని కయ్యాయర్థములను గూడ నెదురుగా వ్రాయుచు నట్టియవ్యయములను ముందుగా నుదాహరించి పిదప వాని యవ్యయత్వము నిరూపించెదను.

౧. * అందు = అచ్చోటను- అందుండి=ఆచోటినుండి
అచ్చోటికి

* కళిర్మైన యీ 'అందు' రూపమే సప్తమీవిభక్తియైనది.

ఇందు=ఇచ్చోటను-ఇచ్చోటికి ఇందుండి=ఈచోటినుండి

ఎందు=ఎచ్చోటను-ఎచ్చోటికి ఎందుండి=ఏచోటినుండి

అందునుగూర్చి=దానినిగూర్చి ఎందునుగూర్చి=దేనినిగూర్చి

ఇందునుగూర్చి=దీనినిగూర్చి అందుచేన్=అందువలనన్= ఆకార ణమున.

ఇందుచేన్, ఇందువలనన్=ఈకారణమున

ఎందుచేన్=ఎందువలనన్=ఏకారణమున

అందుకున్ / అందుకోసము } =దానికోసము, అందులోన్ దానియందు

ఇందుకున్ / ఇందుకోసము } =దీనికోసము, ఇందులోన్=దీనియందు.

ఎందుకున్ / ఎందుకోసము } =దేనికోసము, ఎందులోన్=దేనియందు.

అందులకున్=దానికి, ఆచోటికి. అందునకున్=దానికి.

ఇందులకున్=దీనికి, ఈచోటికి. ఇందునకున్=దీనికి.

ఎందులకున్=దేనికి, ఏచోటికి. ఎందునకున్=దేనికి.

౨. అప్పుడు-అపుడు=ఆసమయమునందు (ఆ+ప్రొద్దు=అప్పుడు) అప్పటికంటెన్-అప్పటికిన్- ఇప్పుడు-ఇపుడు=ఈసమయమందు (ఈ+ప్రొద్దు=ఇప్పుడు) ఇప్పటికంటెన్-ఇప్పటికిన్. ఎప్పుడు-ఎపుడు= ఏసమయమునందు (ఏ+ప్రొద్దు=ఎప్పుడు) ఎప్పటికంటెన్-ఎప్పటికిన్.

సమాసమునందు, 'అప్పుడు' యొక్క యర్థము మారును-అనఁగా, 'ఆ' యను సర్వనామముయొక్క యర్థము విన రాదు.

ఎల్లప్పుడు=సర్వకాలములందును, విన్నప్పుడు=విన్నసమయమునందు, అన్నప్పుడు=ప్రతిసమయమునందు.

అంచులన్-ఇందులన్-ఎందులన్-అనురూపములును ఉత్తరహరి వంశాదులఁ గలవు. పైపట్టికలలోని రూపములకుఁ గొన్ని పూర్వ ప్రయోగములు:—

„ నివిందుకుఁదగు యత్నము గావింపుము ” జైమి—ఇందుకురాఁ జెల్లునె” పసు—విరావంబుసలిపితంచువలన రానణుఁడనుపేర” ఉ-రా— తెలుపునవిందుకో సమె „రాధా—ఇందునకేమి కొలంత” ఉ—రా—నా స్త్రియు ననవొల్లరందునం గల విప్రుల్ „విప్రనా—తనువెత్తినందునకు” నరసిం—చొక్కుచుఁ జెప్పి రందులకుఁ జూచిన యందుకు” హంస—అందుపై నెక్కి-యతఁడు తారాద్రికరిగె „ఉ-రా— తా ముదయించినందుకు నిదర్శనమాఁగద” కవిరా—

ఇట్లు వివిధములైన రూపములకును వందలకొలఁది ప్రయోగ ములు గలవు. కాని విశేష్య భ్రాంతిచే వీనికి ‘అందునకున్’ అన్న ట్లుగా నవర్ణాగమముచేయుట యుచితముగాదు.

అందు-ఇందు-ఎందు-అపుడు-ఇపుడు-ఎపుడు-ఇవి యవ్యయము లని చెప్పి వీనికి విశేష్యములకు వలెనే విభక్తులు వచ్చునని చెప్ప వచ్చును గాని, అట్లయిన వీనికి విశేష్యత్వ మెక్కువ యారోపించి నట్లగును. విభక్త్యంత ప్రతిరూపము లన్నచో నవ్యయత్వము స్థిర పఱచి నట్లగును. ఇదియే భేదము.

బాలవ్యాకరణము శబ్దరత్నాకరము గూడ అప్పు డిప్పు డెప్పు డనుశబ్దములు విశేష్యములని చెప్పుచున్నవి గాని యది సరిగాదు. ఆంధ్రశబ్ద చింతామణిలోని సూత్రములను బట్టి చూచినను, అర్థము లను బట్టి చూచినను, ఇవి యవ్యయములే యని గోచరింపకపోదు. ఇవి వాక్యములందు కర్తలుగాని కర్మలుగాని కాక పోవుటచే విశేష్య ములు కావనుట స్పష్టము. ఇంక నివి సర్వనామ విశేషణములు కావ నుట విదితమే కదా. కావున వీని యవ్యయత్వమును గూర్చి విశేష చర్చయిం దనావశ్యకము. ఇఁక నిట్టివే మఱికొన్ని విభక్త్యంత ప్రతి రూపకావ్యయము లుదాహరింపఁబడును.

౧. ఎల్ల-ఇది కళ గాని ద్రుతప్రకృతికము కాదు.

ఎల్ల-ఎల్లరు-ప్రథమావిభక్త్యంతరూపములు. ఎల్లన్-ద్వితీ— ఇల్లే-ఎల్లరతోను-ఎల్లరకంటెన్-ఎల్లరకున్-ఎల్లయందు - మొదలయిన రూపములును గలవు. ఇందు, రేఫముతోఁగూడిన రూపములు మహన్మహతీవాచకములు గాను, తక్కినవి మహదమహన్మహతీవాచకములుగాను వాడఁబడుచున్నవి. చిన్నయ సూరి యిది ద్రుతాంత మనుట పొరపాటు.

ఉదా:—బాలు రెల్లరు వచ్చిరి బాలికల నెల్లరఁ జూచితిని, వా రెల్ల చదువుదురు. ఆవు లెల్ల పాలిచ్చును, ఎల్లయర్థములు-ఎల్లకలుషములు, పెద్దల నెల్ల నడిగితిని. గ్రామముల నెల్లఁ జూచితిని- "ఎల్లన్ శిష్యులఁ గొంచు వత్తునొ" భీమఖం-ఇందు, ఎల్లన్ ద్వితీయావిభక్త్యంతము. వారెల్లన్-అనుచో సముచ్చయాంతము.

అమహదర్థమున సప్తమీ రూపమునకు—

"ఎల్లయందును దా వసియించు నెల్ల యదియుఁ దనయందు వసియించు టంద్రు" భార-ఉ—ఇంకలి 'ఎల్లయందు' రూపమే ఎల్ల కళ యనుటకుఁ దగిన తార్కాణము.

ఎల్లవారుయొక్క రూపాంతరము ఎల్లరు అని కొంద అందురు కాని యది సరిగాదు. ఇది పెక్కురువంటిది. పెక్కు బహ్వర్థకము. ఎల్ల సర్వార్థకము.

౨. అట-ఇట-ఎట.ఇవి క్రమముగా అక్కడ ఇక్కడ ఎక్కడ యను నర్థము గలయవ్యయములు కళలు ప్రథమావిభక్త్యంతరూపములు. అటన్-ఇటన్-ఇవి సప్తమ్యర్థ మిచ్చు ద్వితీయాంత రూపములు. వీనికిఁ గ్రమముగా, అటు తరువాతన్ ఇటు తరువాతన్ అనునర్థములు కలవు అటనుండి-అటకున్-ఇటనుండి-

ఇటకున్ - ఇటఁబట్టి - యనురూపములకును భారతాదులలోఁ బ్రయోగములు గలవు. 'ఇటవట్టి' యనియుఁ బ్రాచీనగ్రంథములఁ గనవచ్చును, శబ్దరత్నాకరకారులు వీనిని విశేష్యములనుట సరిగాదు.

3. ఆ-ఈ-లతోఁగలిసి వలనుశబ్దము, ఆవల-ఈవల-యై, ఆప్రక్క-ఈప్రక్క యను నర్థములం దవ్యయ మైనది. ఈ రెండునుకళలు ఆవలన్-అటుపిదప-ఈవలన్=ఇటు పిదప, ఈయర్థములందు ద్రుతాంతములు. ఆవులన్-అవులన్ - అవలన్ - అవ్వలన్; ఈవలన్-ఇవలన్-ఇవ్వలన్, అనునవి రూపాంతరములు, వీని సమాసమందు ఇకారమం తాదేశ మగును.

"ఆవల నే మయ్యెనో యెఱుఁగను" "హిమాచలంబు నావల హేమకూటమును" "ఇంక భువనంబులం దిటఁబట్టి రాత్రిలేని' భార—"ఆవ్వలివృత్తాంతము వినిపింపుము." ఇత్యాదులు పూర్వకవిప్రయోగములు.

సూ:—కొన్ని యవ్యయములకు నామవాచకములకు వలెనే సంధిసమాస కార్యములునుఔప విభక్తిక కార్యమును గలుగును. ౧౬

ఇది దేశ్యవైచిత్ర్య మని తలంపక కొందఱిట్టివానిని విశేష్యములని చెప్పిరి కాని విశేష్యధర్మము పైవానికిని చెప్పఁబోవువానికిఁ చాడ నెందును గానరాదు. "భాషేయ మమితా, దేశ్యా త్రచిత్రస్వభావయుక్" అని యథర్వణుఁడు చెప్పినట్లుగా దేశ్యమందలి వైచిత్ర్యములలో నిది యొకటి యని గ్రహించునది.

ఉదా:—ఇచ్చినపిదప-వచ్చినపుడు-చేసినయెల్ల పాపములు- మొదలగు చోట్లఁ గ్రియాజన్యవిశేషణములతోఁ గలియుచున్నవి.

పనికులంబు-కట్టెదురు. ఎల్లకలుషము-మిక్కిలిచేతులు- ఇత్యాదులందు విశేషణము లగుచున్నవి.

పిదపటివృత్తాంతము- వెనుకటికథ-అప్పటిమాట-ఎప్పటిమాట-

ఇత్యాదులం దాపవిభక్తికకార్యము నొందుచున్నవి. అందలివార-
ఇాదలిజనులు అప్పలిమాట- తోడికోడలు- ఇత్యాదులందు సమాస
కార్యము గనవచ్చుచున్నది.

* కొన్ని నిపాతముల పూర్వరూపములు

౧. చూడుము-చూడుడు-అను మధ్యమపురుష క్రియారూపములు
చుము మొదలగురూపములఁ జెందినవి.

ఉదా :—చుము-చుమ్మా-చుమిమ్మా-చూ-చుమీ-చుమి- చుండీ-చుఁడీ-
చుఁడి మొ.—

౨. ఏఁడు-ఏరు- అను సర్వనామములు 'ఈ' యను నవ్యయముతోఁ
గూడి, క్రమముగా ఎక్కడనున్నాఁడు? ఎక్కడ నున్నారు?
అనెడి యర్థములందు స్థిరపడినవి.

"ఏఁడీ నాకన్నతండ్రి—వా రేరీ సిరి మూట గట్టికొని పోవం
గలిశే" భాగ—

3. వాఁడు-వీఁడు-అను సర్వనామములు 'గో' అను నవ్యయముతోఁ
గలిసి, ఆఁడుగో-అఁడుగో- ఈఁడుగో-ఇఁడుగో- అనురూపములఁ
జెందినవి.

ఇవి యొకపురుషుని నిర్దేశించి చూపునపుడు వాడఁబడును.
మహాత్మ్యమహాత్ములను నిర్దేశించి చూపునపుడు వాఁడబడునట్టి అదిగో-
ఇదిగో-యనువానివలె నివియు సాధువు లగును. కొన్ని దక్షిణమండ
ములందు-వాఁడుగో - వీఁడుగో - రూపములు వాడుకలో నున్నవి.
ఆఁడుగో-ఇఁడుగో-ఉత్తరమండలముల వాడుకలో నున్నవి.

౪. 'ఇదిగో తీసికొనుము' అనెడియర్థమున-ఇాదము-ఇంద, దీనికి

* చుమీ-ఇంద-మొదలగు క్రియానిపాతముల సాదృశ్యమునుబట్టి, మిక్కిలి
మాఱిపోయిన అనక-ఆఁడుగో-ఏఁడీ-మొదలయిన నామసర్వనామాదులును ఇందు
నిపాతము లనఁబడినవి.

బహువచనమునందును గౌరవార్థమునందును- ఇందండి- అని క్రియారూపములు నిపాతము లైనవి.

"ఇంద మని యిందమనుమని కందర్పపరివరుభీతి" కకుత్స— ఇండ- మొదలగురూపముల నేవ్యాకరణమును సాధింపలేదు. పూర్వకవిసమ్మతములయిన యివి యసాధువులు గావు, కావున నిపాతములను వ్యాకరణవిధులు బాధింపఁజాలవనియు, అవి వాడుకలో నున్నట్లే ప్రయోజ్యము లగుననియుఁ దలంచునది. ఇట్టి నిపాతములు తెలుఁగున నింకను గలవు. ఇందు కొక యుదాహరణము.

ఆ+వెనుక=ఆనక. ఇది మిక్కిలి మార్పు చెంది "కొంచెము సేపున్న తరువాత" ననెడియర్థమున స్థిరపడినది. ఇట్లే యూహించునది.

సూ:—లాక్షణికావ్యయము లాఱువిధములు.

ధాతువులనుండి పుట్టిన యవ్యయములు క్త్వార్థకములు వ్యతిరేకక్త్వార్థములు శత్రర్థకములు తుమున్నర్థకములు చేదాద్యర్థకములు ఆనంతర్యార్థకములు అని యాఱువిధములు. ఈపేళ్ళు సంస్కృతము నుండి వచ్చినవి.

ధాతువు లన్నియు—వచ్చు-చేయు—ఉండు-తిను - అనునట్లుగా ఉకారాంతములై యుండు నని గ్రహించునది.

సూ:—ఒకవస్తువు నాశ్రయించి యున్నపనులలో ముందుగా జరుగు దానిని దెలుపుధాతువునకు ఇ ప్రత్యయ మాగమ మగును ఇదియే క్త్వార్థకము.

ఉదా:—వచ్చు+ఇ=ఉకారసంధి, వచ్చి; ఇట్లు ఉండి-చూచి-వి

బాలుఁడు పాఠము చదివి వెళ్ళెను. ఇందు చదువుట వెళ్ళుట యనురెండుపనులును ఒకబాలుని జెంది యున్నవి. వీనిలో ముందు జరిగినపనిని తెలుపుచదువుధాతువునకు ఇప్రత్యయము చేరినది. స

క్రియ యేకాలమం దున్నను ముందు జరిగినపనిని తెల్పు ధాతు
నకు ఇట్లే ఇప్రత్యయము చేసును.

దా—ఈశ్వరుఁడు లోకము సృజించి పోషించుచున్నాఁడు.

రాముఁడు నేఁడు వచ్చి రేపు వెళ్ళును. మొద—.

:—ఇకారాదులు ఎకారాదులు నైనప్రత్యయములు పరమగున
పుడు ధాతువులతుదనుండు యకారమునకుఁగాని ఉపధాయ
కారమునకుఁ గాని సకారము వచ్చును. ౧౮

దా:—చేయు+ఇ=చేసు+ఇ=చేసి. ఇట్లు, మేసి-కోసి-వ్రాసి-మొ-

:—ఒకవస్తువు నాశ్రయించి యున్నపనులలో ముందు జరుగుదా
నిని దెలుపుధాతువునకు వ్యతిరేకార్థమునందు అక ప్రత్యయ
మాగమ మగును. ఇదియే వ్యతిరేకక్త్వార్థకము.

దా—విను+అక=వినక (ఉకారసంధి) ఇట్లు, చేయక-వెళ్ళక-మొద

:—అకారాదిప్రత్యయములు మధ్యమపురుష ము-డు- ప్రత్యయ
ములును పరమగునపుడు కొన్ని ధాతువుల ఉపధా చేకారమునకు
వకార మాదేశ మగును.

దా:—పిలుచు+అక=పిలువు+అక=పిలువక- ఇట్లు నడవక- కొలు
వక-నొవ్వక- మొద—

గ్రుచ్చు మొదలగుకొన్నిటికి వైకల్పికము- గ్రువ్వక- గ్రుచ్చక-
హెచ్చు మొదలగుకొన్నిటికి రాదు. హెచ్చక - మెచ్చక-
దోఁచక మొ—

తత్సమ ధాతువులచకారమున కిట్టి సందర్భములందు పకారము
వచ్చునని క్రియాప్రకరణమునఁ దెలియును. పోషింపక-భరింపక మొ—

:—శత్రంతవిశేషణములయర్థమందు ధాతువునకు 'చును' ప్రత్యయ
మాగమ మగును. ఇదియే శత్రర్థకము ౨౨

సంస్కృతమందు కుర్వన్- గచ్ఛన్- మొదలగు శత్రంతములు

యర్థమందు చేయు-పోవు-మొదలగువానికి చున్-చేరు నని యర్థము.
ఉదా:—చేయు+చుఁ=చేయుచుఁ ఇట్లు, పాడుచున్ - పోవుచున్-
పాలించుచుఁ-తినుచుఁ-మొద—
సూ:—'చును' పర మగునపుడు, అను-మొదలగు కొన్ని ధాతువుల
ఉకారమునకు లోపమును నకారమునకు నిండుసున్నయు వైక
ల్పికముగా నగును.
ఉదా:—అను+చుఁ=అన్చుఁ-అంచుఁ, ఇట్లు, విను-తిను-కను-కొను-
ధాతువులకు వచ్చును.
సూ:—శత్రర్థకము లైనయవ్యయములు క్రియలకు విశేషణములగును.
ఉదా:—చూచుచుఁ బోవుచున్నాఁడు. పాడుచు వచ్చి కూర్చుం
డెను. క్రియ యేవస్తువు నాశ్రయించి యుండునో యిదియు
దానిని యాశ్రయించును.
సూ:—ఒకపనికి నిమిత్తమైనపనిని దెలుపుధాతువునకు 'అను' ప్రత్యయ
మాగమ మగును. ఇదియే తుమున్నర్థకము.
ఉదా:—చదువు+అన్=చదువన్-ఇట్లు కొట్టఁ-తిట్టన్-వేఁడఁ-మొ
బాలుఁడు చదువఁ బోయెను. ఇందు పోవుట యను క్రియ
చదువుల నిమిత్తము. అందుచే చదువుధాతువునకు అ
ప్రత్యయము చేరినది. ఇందు రెండుక్రియలును ఒకవస్తు
నాశ్రయించి యుండవలె నన్ననియమము లేదు.
ఉదా:—రాముఁడు హనుమంతుని సీతను వెదకఁ బంపెను. మొ—
సూ:—ఒకపని జరుగుసమయమును దెలియఁజేయుటకైయొక పని
బోధించుధాతువునకును అను-ప్రత్యయ మాగమ మగును
ఉదా:—కోడి కూయఁగా రాముఁ డిల్లు వెడలెను. ఇందు వెడలు
యనుపని జరిగినకాలము కోడికూఁతచేఁ దెలియుచున్న
...ప్రత్యయము వచ్చిన

అనఁగా కోడికూఁతవేళ వెళ్లెనని యర్థము.

సూ:—కాలము-ఇచ్ఛ-సామర్థ్యము- మొదలగువానిని దెలియఁజేయు పదములు పర మగునపుడును 'అను' ప్రత్యయము వచ్చును.

ఉదా:—బడికిఁ బోవ వేళ యైనది. తినఁగోరెను. చదువఁదలఁచెను. కొట్టఁ గలఁడు- చెప్పఁ జాలును మొ—

సూ:—కార్యకారణభావము మొదలయినవి తోఁచునపుడు కారణ వాచక మైనధాతువునకు 'ఇనను' ప్రత్యయ మాగమ మగును. ఇదియే చేదాద్యర్థకము. ౩౦

ఉదా:—ఇచ్చు+ఇనన్=ఇచ్చినన్-ఇట్లు, కోరినన్-చూచినన్- మొ— ౧౯ సూత్రముచే యకారమునకు సకారము వచ్చును.

వ్రాయు+ఇనన్=వ్రాసినన్-చేయు+ఇనన్+చేసినన్ మొద— వానలు కురిసినఁ బంటలు పండును. ఇందు, పంటలు పండుటకు వానలుకురియుట కారణము. కావున కురియుధాతువునకు "ఇనన్" చేరినది. 'ఆది' యనుటచే పక్షము మొదలగు నర్థములందును ఈప్రత్యయము వచ్చును.

ఉదా:—సత్యము చెప్పినఁ దప స్సేల? సత్యము చెప్పినపక్షమం దని యర్థము.

సూ:—క్త్వార్థకము లైనయవ్యయములు "తేన్" అనుదానితోఁ గలిసి చేదర్థకములు గూడ నగును. ౩౧

తెచ్చుధాతువుయొక్క తుమున్నర్థక మైనయవ్యయము తేన్- దీనితోఁ గలిసి - అయి - దొరికి - చెప్పి- మొదలయినవి చేదర్థము లగుచున్నవి. అపుడు తెచ్చుధాత్వర్థము గోచరింపదు. ఇట్టి యవ్యయములు వాడుకలోను గ్రంథములలోను గూడ విస్తరించి యున్నవి.

ఉదా:—అయితేన్-ఐతేన్ "దుర్యోధనుం డైతే నేమి" పాంచా—

"ఒప్పంగా నా ర్తవగిరివ ల్లైతే" అప్పక—

దొరికితేన్—"తెలియం గలవాఁడు దొరికితే వాసి యనర్" పార్వ—"నృపతిమాళి! కేళి కైతేను నీ కిది కేవలంబు" హంస—

సూ:—ఉండి-అని - మొదలగువాని తొలియచ్చుమీఁదివర్ణములకు నిఁడుసున్నయు తేన్ తకారమునకు టకారమును వచ్చును.

ఉదా:—ఉండి+తేన్=ఉంటేన్ "ఆకుదునఁట లేకుంటే" ఉ. నై ష-

"నేనమ్మియుంటే నీ విట్లు దురాశ" దశావ—

అని+తేన్=అంటేన్, "కూడదంటే నెమ్మోములు వంచి"

దశావ--ఇట్లు వింటేన్-కంటేన్-కొంటేన్-తింటేన్-మొద—

సూ:—తేన్-పరమగునపుడు పోయి లోని యి వర్ణము లోపించును.

ఉదా:—పోయి+తేన్=పోతేన్ "నీతోడఁ జర్చచేయఁగఁ । బోతే"

రాధికా—పోతేన్-అంటేన్-ఉంటేన్-ఇత్యాదులు కాళహ—

అయితేఁగానిమ్ము- చెపితేఁజెప్పనీ- పోతేఁబోనీ- అంటేనేమి? ఉంటేనేమి పోతేనేమి-ఇత్యాదులు శిష్టవ్యవహారసిద్ధములు. భారతము నం దీరూపములు లేకున్నను అర్వాచీనులు ప్రయోగించుటచే నివి సాధువు లగును.

అంటె- మొదలగు కొన్ని హ్రస్వాంతరూపముల నొకరిద్దఱు ప్రయోగించిరి కాని యవి నియమవ్యవహారదూరము లగుటయే కాదు శ్రుతిరమ్యములును గావు.

సూ:—ఆనంతర్యము ద్యోత్య మగునపుడు ధాతువునకు 'డున్' ప్రత్యయము చేరును. 32

ఆనంతర్య మనఁగా వెనువెంట నని యర్థము

ఉదా:—చంద్రుఁడు పొడముడుఁ గలువలు వికసించె. చంద్రుఁ డుదయించినవెంటనే యనెడియర్థ మిందు స్ఫురించుచున్నది. ఇట్లే చేయుడున్, చూచుడున్, మొద—

సూ:—'దుక్' పరమగునప్పుడు, 'అగు' నకు కావు, 'అను'నకు అనవు-
నావులు విభాష నగును. 33

* ఉదా:— అగుదుక్-కావుదుక్; అనుదుక్-అనవుదుక్-నావుదుక్-

సూ:—ప్రతిపదోక్తములు లాక్షణికములు గూడఁ గొన్ని వాక్యముల
యందు కర్తృకర్మవిశేషణము లగుట గలదు. 34

విశేషణ క్రియావిశేషణము లగుట కుదాహరణములు మున్నే
చూపఁబడినవి.

ప్రతిపదోక్తములు కర్త లగుటకు:—నీవిచ్చినది మిక్కిలియయ్యె-ఆహా
పుట్టెను లాఁతి చూపఱను-అవ్వన మెల్ల గూలె-మొ.—ఇందు
మిక్కిలి మొదలయినవి కర్తలు.

కర్మలగుటకు:—మర్మమెల్లఁ జదివితిఁదండ్రీ-ఆహా పుట్టింపదె-హాయను-
మొద- ఇందు ఎల్ల మొదలయినవి కర్మలు.

లాక్షణికములు కర్తలగుటకు:— అతనిగుణములు వర్ణింప నగునె
యిపుడు- ఆబాలునిఁ జదివింపఁదగును మొ—ఇందు వర్ణింపక్-
చదివింపన్- కర్తలు.

సూ:—కొన్నియవ్యయములు శబ్దాంతరములను గూడి విశేషార్థవాచ
కము లగుచున్నవి. 35

ఉదా:—ఎల్లి+ఉండీ=ఎల్లుండి=రేపటికితరువాతిరోజు-ఎల్లుండికి-మొ-
ఇంత+దాఁకక్ = ఇందాఁక (ఇంతకు మునుపు) ఇందాఁకటి
మాట- ఇట్లు, అందాఁక-ఎందాఁక-ఇవి రెండును విశేషణములుకావు.
ఇట్లే అవ్యయములను బరిశీలించునది.

ఇది అవ్యయప్రకరణము.

---

* దుక్ ప్రత్యయమువెనుక బిందువున్న ప్రయోగములు-అనవుఁడు-అనవుండు
వంటివి ప్రాచీనతాళపత్రగ్రంథములలోఁ గనఁబడును.

## సంధిప్రకరణము.

పలుకుబడిలో శబ్దము లొకదానితో నొకటి కలియుట సంధి యనఁబడును, సంహిత యున్నపుడే పదము లట్లు కలియును. పలుకుబడిలో వ్యవధాన మెంతమాత్రమును లేకుండఁగా వర్ణములు మిక్కిలి దగ్గఱగా నుండుట సంహిత యనఁబడును. ఇట్లు వర్ణములు మిక్కిలి దగ్గఱగా నుండవలె నన్ననియమము ఏకపదమునందును, ధాతూపసర్గలమెడను, సమాసమువిషయమునందును, నిత్యముగా వర్తించును. వాక్యమునం దీనియమము వివక్షనుబట్టి యుండును. అనఁగా వాక్యములోనిపదముల నొకదానికి నింకొకదానికి నెడము గలుగునట్లు పలికినను బలుకవచ్చును, వ్రాసినను వ్రాయవచ్చును. ఇట్లు పాణినీయము చెప్పుచున్నది. * ఇందు కుదాహరణములు

రా ము ఁడు; అని యొక పదమందలి వర్ణముల నెడముగాఁ బలుకరాదు. వ్రాయరాదు, రాముఁడు, అని కలిపియే పలుకవలెను. ప్ర కాశించు, అని, ఉపసర్గను ధాతువును వేఱుపఱిచి పలుకరాదు. ఇట్లే రాముని బాణము అని సమాసమునందలి పదముల నెడముగా- బలుకరాదు. పైమూఁడువిధము లయినస్థలములయందును సంహిత నిత్యము.

నేఁడు ఆదివారము అగుటవలన బాలురు అందఱును ఆటలు ఆడుచున్నారు. అని వాక్యమును వ్రాసిన వ్రాయవచ్చును గాని యీపద్ధతి స్వభావవిరుద్ధముగా నుండును. మనభాషలో విసంధిగా, అనఁగా అజాదిపదములను బూర్వపదములతోఁ గలుపకుండఁగా నుచ్చరించువాఁడుక లేదు సరిగదా, పైగా పదాదియందలిహల్లును గూడ విడిచి, (బొొట్టి పిలిచెను-అక్కడి కెళ్ళు) సంధచేసి యుచ్చ

---

* సంహి తైకపదే నిత్యా నిత్యా ధాతూపసర్గయోః
నిత్యా సమాసే వాక్యే తు సా వివక్షా మపేక్షతే.

లుచుండి
చున్నను బాలురకు శబ్దస్వరూపము సులభముగాఁ దెలియుటకై చిన్నతరగతులలోఁ జదువఁదగిన వచనగ్రంథములను వ్రాయునపుడు విసంధి పాటించినఁ బాటింపవచ్చును గాని కొంతభాషాజ్ఞాన మలవడిన బాలురు కాని పెద్దలు గాని చదువుకొనఁదగిన గ్రంథములయం దట్లు విసంధిని బాటించుట తగదు. అట్లు వ్రాసిన వచనము ధారాళముగా నడవదు. కాని, అర్థసందేహము గాని అసార్థము గాని కలుగునపుడు విసంధిగా వ్రాయుటయే యుచితము. ఉదాహరణములు ముందుముందు తెలియును.

ఇంతకు మున్ను చెప్పిన దానినిబట్టి రాముఁడు అతఁడు అను పదములు మిక్కిలి దగ్గఱగా నుండుట సంహితయనియు రాముఁడతఁడని కలియుట సంధి యనియుఁ దేలినది. ఇట్లు రెండచ్చులు కలియునపుడు వచ్చుపరరూపము మాత్రమే సంధి కాదు. ఏరెండువర్ణములు దగ్గఱగాఁ జేరునపు డయినను, వచ్చునట్టి ఆగమము ఆదేశము వర్ణలోపము, తుదకు సంశ్లేషము గూడ సంధిశబ్దవాచ్యమే యగును. ఆదేశలోపములు మొదటిపదము తుదివర్ణమునకే కాదు, రెండవపదము మొదటివర్ణమునకును సంభవించును- అదియు సంధిశబ్దవాచ్యమే యగును. ఇందుకు ముందుగాఁ గొన్ని యుదాహరణములు:—

మీ+ఇల్లు మీ+య్+ఇల్లు=మీయిల్లు-ఆగమసంధి

నిద్ర+పోయె=నిద్రవోయె- వకారమాదేశము-ఆదేశసంధి

నా+అది=నాది- అకారలోపము-లోపసంధి

వచ్చెన్గోవులు- అంతనతఁడు-సంశ్లేషసంధి

అచ్చు లేనిహల్లు మీఁదివర్ణముతో (హల్లుతోఁ గాని అచ్చుతోఁగాని) కలియుట యిందు సంశ్లేష మనఁబడును. సంశ్లేష మనగా చక్కఁగాఁ గలియుట.

మనప్రాచీనలాక్షణికులు అచ్ సంధినిగూర్చి వ్రాసినవిధు లన్ని

టికి మొత్తమువిూఁద పరరూప మనెడియర్థమే యగును. మొదటి పదముతుదియచ్చునకును రెండవపదము మొదటియచ్చునకును రెం డవపదము మొదటియచ్చు ఏకాదేశ మగుట పరరూపసంధి యనఁ బడును. దీనిభావమే యీక్రిందిసూత్రమునఁ జెప్పఁబడినది.

సూ:—మొదటిపదముతుదియచ్చును గొట్టివేసి యచ్చట రెండవ పదము మొదటియచ్చు వచ్చి చేరుట సంధి యనఁబడును. ౧

ఇదియే పరరూపసంధి. ఈసూత్రము అచ్చులకు వచ్చునట్టి యెల్లసంధులకును వర్తించును.

సూ:—అకారమునకు అచ్చు పర మగునపుడు సంధిబహుళము* ౨

ఉదా:—మేడ+ఎక్కెను—మే డెక్కెను. ఇది గ్రామ్య, (మేడ నెక్కెను)

సూ:—సంధిరానియెడల అచ్చుకంటెఁ బర మైనయచ్చు మొదటఁ దలుచుగా యకారము చేరును. ౩

పరరూపసంధి రానియెడల నని యర్థము. ఇట్లధికముగా వచ్చు నని విధింపఁబడు దానికే ఆగమసంధి యని పేరు.

ఉదా:—మేడ+ఎక్కెను, మేడ+య్+ఎక్కెను=మేడయెక్కెను, ఇట్లు వెల+ఎంత=వెలెంత - వెలయెంత, పుట్టిన+ఇల్లు = పుట్టి నిల్లు-పుట్టినయిల్లు, రాక+ఉండెను = రాకుండెను- రాకయుం డెను, ఇంత+ఎందుకు = ఇంతెందుకు - ఇంతయెందుకు, వాన+ఎక్కువ=వానెక్కువ-వానయెక్కువ-మొద—

బహుళ మనుటచే, ఆకు-అంత-ఏసి-పర మగునపుడు సంధి నిత్యము.

ఉదా:—చింత + ఆకు = చింతాకు, చేట + అంత = చేటంత, అంత+ఏసి=అంతేసి.

---

* క్వచి త్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచి ద్విభాషా క్వచి దన్య దేవ విధే ర్విధానం బహుధా సమీక్ష్య చాతుర్విధం బాహుళకం వదంతి. కాశికావృత్తి- దీనియర్థము సంజ్ఞాప్రకరణముననే తెలుపఁబడినది.

"చింతయాకంత్రైనన్" పాండు-ఇది శ్రావ్యము గాలేదు. ఇట్లు
వాడుకయు లేదు.

సూ:—తామరశబ్దమునకు ఆకుశబ్దము పర మగునపుడు పువర్ణాగ
మము వైకల్పికము

ఉదా:—తామర+ఆకు=తామరపాకు-తామరాకు

సూ:—మేన మొదలగు కొన్ని శబ్దములకు అత్త మొదలగు కొన్ని
పరమగు నపుడు సంధి నిత్యము.

ఉదా:—మేన+అత్త=మేనత్త-ఇట్లు మేనల్లుఁడు-పెద్దత్త-పెద్దమ్మ-
దొడ్డమ్మ-చిన్నత్త-చిన్నల్లుఁడు-పెద్దల్లుఁడు-పెద్దన్న-చిన్నన్న-
పెద్దయ్య-చిన్నయ్య; కొత్తూరు-పుల్లావు-ఎఱ్ఱావు-చుక్కెద్దు-
తెల్లావు-బట్టెద్దు-మోటెద్దు-మొద—

మేనయత్త-మేనయల్లుఁడు-ఎఱ్ఱయావు - మొదలయినవి వాడు
కలో లేక పోవుటచే నివి గ్రంథములలో నుపయోగించినను శ్రుతిరమ్య
ములు కావు. అదియును గాక కొన్నిశబ్దములు సంధి చేసినపు డొక
యర్థమును చేయనపుడు మఱియొక యర్థమును దెల్పును.

ఉదా:—దొడ్డమ్మ=పెత్తల్లి, దొడ్డయమ్మ=మంచియిల్లాలు, మోటె
ద్దు=కపిలెలాగునట్టియెద్దు, మోటయెద్దు = పనిచేయనియెద్దు-
ఇట్లు సంధివశమున నర్థములు భేదించుటకును వాడుకయే
మూలము కావున వాడుక ననుసరించిన నిర్దుష్ట మైన ప్రయో
గము మనోజ్ఞ మనుట నిర్వివాదము. *

సూ:—సంబోధనాంతముల అకారమునకును నిశ్చయాద్యర్థక మైన
అకారమునకు సంధి రాదు.

ఉదా:—ఓరాముఁడ+ఇటు రమ్ము=ఓరాముఁడ యిటురమ్ము.
నీవ+ఇచ్చితివి=నీవ యిచ్చితివి-మొద—



* భవంతి కేచిచ్ఛబ్దాస్తు సాంగత్యేనైవ సాగవః—ఆగర్వః—

వెలెంత- వానెక్కు- డైనది- యనుచోట్ల, అకారసంధి శ్రావ్యమయినట్లు, వెలాలు-వానుదకము- మొదలగుచోట్ల శ్రావ్యము కాదు. కావున నిట్టిచోట్లఁ బరరూపసంధి చేయక యకారాగమము చేయుటయే యుచితము. వెలయాలు-వానయుదకము. ఇట్లే యౌచిత్యమెఱిఁగి సంధి చేయునది.

సూ:— స్త్రీవాచకము.లయొక్కయు, తత్సమములయొక్కయు అకారమునకుఁగూడ నొక్కొక్కచో సంధి యగును. ౭

ఇట్టియెడ సంధి రాదని చిన్నయసూరి చెప్పెనుగాని, అథర్వణుఁడు తత్సమాచ్ఛల కొక్కొక్కచో సంధి యగుననియే చెప్పెను.

"క్వచిత్సంస్కృతీయోఽపి ప్రాణోఽప్యతిచ్యుతో భవేత్"

ఇందుకుఁ బ్రయోగములు.

"సీతఁ దనదారని క్రమ్మఱ—పిరమాతఁట సీతాజనని" జైమి—"పరమాత్మందురు కొందఱు" వరాహ—దూతని" కవిక—గంగావలి" రాము—రంగకర్తంచు—గంగనుకాన—చేష్టుడిగె "అమ—ప్రేతని—మిథ్యని" పద్మ—"ఆత్మనందనుఁ జెంప మామకు పుదిన్" కా—వ్యా, నెలఁతిచ్చెను. ఆము—

ధరెంత-శ్రమెక్కు-వ- వేళయినది- ధర్మకర్తవరు మొ[illegible]. న్యవహారసిద్ధములు.

సూ:—షష్ఠీసమాసమునందు అకారమునకు అచ్చు పరమగునపుడెల్లయెడల సంధి బహుళము. ౮

సమాసమునందు విభక్తిప్రత్యయము (యొక్క) లోపించును.

"కురువృద్ధరాజులొద్ద—రాజులాజ్ఞ—బాహులందము" భార—సురాయలమ్మ-అయ్యలొద్ద" భాగ—మగువలాననములు తల్లులొద్ద" బట్టలద్దకము ఇత్యాదులందు ఆగమలవర్ణముయొక్క ఆకారమునకును, "చందమామల్లుఁడు—రామాభ్య, వెన్నునియన్నన్న" విజయ, మేకరువు—ఆము, అత్తిల్లు—ఇత్యాదులందు నామములతుది అకారమునకును సంధివైకల్పికము. బహుళమనుటచే, అమ్మమ్మ—నాయనమ్మ—అయ్యమ్మ-తాతమ్మ ఇత్యాదులందు సంధినిత్యము.

సూ:—అయ్యమొదలగుశబ్దములు పరము లగునపు డెల్లయచ్చులకు సంధి నిత్యము. ౯

ఉదా:—రామ+అయ్య=రామయ్య, ఇట్లు సీతమ్మ, జానకమ్మ, చక్రపాణయ్య-గౌరమ్మ-లక్ష్మక్క-సుబ్బప్ప మొద—

సూ:—కొన్ని సంజ్ఞావాచకముల ఇకారమునకు అయ్య అమ్మ అన్న శబ్దముల అకారము పర మగుచో ఆ రెంటికిని ఏకార మాదేశ మగును. ౧౦

ఉదా:—చిట్టి+అయ్య=చిట్టెయ్య- ఆది+అమ్మ=ఆదెమ్మ- బుల్లి+అన్న=బుల్లెన్న- ఇట్లు, బుల్లెయ్య, సోదెమ్మ- మొద-

కొన్నియనుటచే, లక్ష్మయ్య- భారతమ్మ- బుచ్చన్న- ఇత్యాదులం దీ కార్యము గలుగ దని తెలియునది. ఇది వాడుకనుబట్టి తెలియఁ దగినది.

సూ:—దీర్ఘాచ్చులకు సంధి లేదు. ౧౧

పరరూపసంధి లేదు గావున యకార మాగమ మగును.

ఉదా:—మీ+ఇష్టము = మీయిష్టము- పల్లకీ+ఎక్కెను = పల్లకీ యెక్కెను. తలా+ఒకటి=తలాయొకటి. నీ+ఆదరము=నీయాదరము మొ—

సూ:—మా-మీ-లకు అమ్మ మొదలగు కొన్నిశబ్దములు పర మగు నప్పుడు యకారాగమము వైకల్పికము. ౧౨

ఉదా:—మాఅమ్మ-మీఅయ్య- మీఅన్న- మాఆవు- మొద—ఇట్లు యకారాగమము రానిప్రయోగములు దేశ మెల్లెడల నుత్తమ జాతులందు వినవచ్చును. కొన్నిచోట్ల, పామరజాతులందు మాయమ్మ-మాయావు- మొదలయినవి వినఁబడును. అమ్మ-అయ్య-అన్న-అక్క-అప్ప-అమ్మాయి-అబ్బాయి-ఆయన-ఆవిడ ఆవు- మొద—అమ్మాదులు.

నా-నీ-శబ్దములమీఁద భార్య-భర్త-పెండ్లాము-పెనిమిటి- మొద లగుశబ్దములు చేరునప్పుడు [illegible] వాడుకలోఁ

జేరుట లేదు. నీపెండ్లా మన్నట్లు నీయూవిడ యనువాడుక లేదు. మా ఆయన యన్నట్లు నాఆయన యనుటయు వినఁబడదు. ఇట్టివైచిత్ర్యములు దేశ్యములో నెన్నో కలవు.

ఏవిధమైనసంధియు రాకపోవుట ప్రకృతిభావ మనఁబడును. ఇది సంస్కృతమందును గలదు. ఉదా—సప్తఋషులు. దేవఋణము (అమూఆసాతే)

మొ—శబ్దసంస్కారములలో ప్రకృతిభావ మొకటి.

సూ:—మధ్యమపురుషక్రియల ఇకారమునకు అచ్చు పరమగు నపుడు సంధి నిత్యము. ౧౩

ఉదా:—చేసితివి+అపుడు=చేసితివపుడు. వచ్చితి+ఇటకు=వచ్చితిటకు
చూచితిరి+ఎల్ల=చూచితిరెల్ల- మొద—

సూ:—ప్రథమోత్తమపురుష బహువచనక్రియల ఇకారమునకు సంధి వైకల్పికము. ౧౪

ఉదా:—వచ్చిరి+ఎల్లరు=వచ్చిరెల్లరు-వచ్చిరియెల్లరు
ఉంటిమి+అచ్చట=ఉంటిమచ్చట-ఉంటిమియచ్చట- మొ—

సూ:—ఏమ్యాదులయొక్కయు కొన్నియాచ్ఛిక నామసర్వనామవాచకములయొక్కయు వ్యతిరేకభూతార్థకక్రియాజన్య విశేషణాదులయొక్కయు ఇకారమునకు సంధి బహుళముగా నగును. ౧౫

ఉదా:—ఏమి+అంటివి=ఏమంటివి-ఏమియంటివి:
ఆనతి+ఇచ్చు=ఆనతిచ్చు-ఆనతియిచ్చు- అది+ఏమి=అదేమి-అదియేమి. చేయని+అట్టి=చేయనట్టి-చేయనియట్టి మొద—

ఏమి-మఱి-ఏని-మొద—ఏమ్యాదులు. ఆనతి-పెండ్లి-బండి-వెండి-పైడి-రాతిరి-ప్రాయ్య-తెలివి-తిత్తి-మనవి- బంతి-చీకటి- నెయ్యి-సెట్టి-తండ్రి-పని-చెవి-వాయి-మొద-ఆచ్ఛిక నామములు. అది-ఇది-ఏది-ఒకటి-ఎనిమిది-తొమ్మిది-పది-అవి-అన్ని-వేయి-మొద—సర్వనామములు. పోషింపని-రాని-అట్టి-ఎట్టి మొద—క్రి-విశేషణములు.

పై నుదాహరించినశబ్దముల కన్నిటికిని భారతాదులయందు సంధి కనపచ్చుచున్నది. ఇట్టి వింక ననేకములు కలవు. భారతాదుల యందే యీసంధి కనఁబడుచున్నను ఆచ్ఛికనామముల ఇకారమునకు బాలవ్యాకరణమున సంధి విధింపఁబడలేదు.

బహుళ మనుటచే, ఘురుటాలు- కత్తాపు-గంగెద్దు-మగనాలు- మున్నగు కొన్నిచోట్ల సంధి నిత్యము. 'ఆసమయంబునన్ మగనియాం డ్రును' అను నుత్తరరామాయణప్రయోగము శ్రావ్యముకాదు.

మఱియుఁ దత్సమములందును షష్ఠీసమాసమందును గూడ ఇకారసంధికిఁ బ్రయోగములు కలవు.

"సకలశుభములు శౌరిచ్చు జనుల కెపుడు; పల్లవపుటార్భిడఁగ రాదు" విసు—నళినారఁట—సౌరభోద్గారఁట—కవిరా, వానరదము—జైమి, దీనుఁగ్రుులు, నైష, ఎవ్వనింట – పద్మ, వానన్న – నరస, వానిల్లు – రుక్మా, అతినాలు"— హంస—

వీనిని బ్రమాణములుగాఁ గైకొని శ్రావ్య మగుచోట్లనే కాని యెల్లయెడల ఇకారసంధి చేయరాదు.

సూ:—అకు- పర మగునప్పుడు ఇకారమునకు సంధి వైకల్పికము ౧౬

ఉదా:—మామిడాకు- మామిడియాకు- ఇట్లు మత్తాకు- కొబ్బరాకు- రావాకు మొద—

సూ:—క్త్వార్థకమైన ఇకారమునకుఁ గొన్నియెడల సంధి వైకల్పికము. ౧౭

ఇందుకుఁ బ్రమాణములు ప్రయోగములు—

"ఇడఁగ వచ్చును ల్యప్పుపై నిత్యసంధి మాత్ర మొక్కొక్కచోటను" కవి సం—"అం దిమ్ము-భార, ఎఱిఁ గెఱిఁగి-రాజశే, ఒనరిం చెగురేగు రెంచినన్— జైమి, "చిం చిచ్చు-అము, చెప్పింపఁడే-ప్రభా, అడి గిచ్చు-అనవల సంటి-విజ, "చూ చిటురమ్ము-హంస, నిగి డిరుపై పులన్- శుద్ధాం, ఇట్లనేకప్రయోగములు కలవు,

ఆమ్రేడితము పర మగునపుడు స్వార్థక మైనను సంధి నిత్య మని యహోబలుఁడు వ్రాసెను. ఉదా—అడిగడిగి- ఇచ్చిచ్చి మొ.

అయినను ఈవిధి సార్వత్రికము గాదనియు జాతీయమై విన నింపగు చోటఁ జేయఁదగు ననియు గ్రహించునది.

సూ:—పరిమాణార్థక మైన ఎఁడు వర్ణకము పర మగునపు డెల్ల యచ్చులకు సంధి నిత్యము. ౧౮

ఉదా:—పుట్టి+ఎఁడు=పుట్టెఁడు, వీసె+ఎఁడు=వీసెఁడు, గోనె+ఎఁడు=గోనెఁడు, బార+ఎఁడు=బారెఁడు, తూము+ఎఁడు=తూమెఁడు, జోలె+ఎఁడు=జోలెఁడు, బోలె+ఎఁడు=బోలెఁడు ఇత్యాదులు.

సూ:—ఎఁడు- పర మగునపుడు దోసిలి మొదలగువాని తుదివర్ణము నకు లోపము నిత్యము ౧౯

ఉదా:—దోసిలి+ఎఁడు=దోసెఁడు. దీనిచేఁ గడపటి యక్షరమునకు లోపము. పూర్వసూత్రముచే నిత్య సంధి- దోసిలి-పిడికిలి-గుప్పిలి-కంచము-విస్తరి- సందిలి- పట్టిలి- కొణిదిలి- మొద— దీనికి వాడుకయే శరణము. పదలమెఁడు-ఆముడెఁడు-గజమెఁడు-మొదలయినవి వాడుకలో లేవు.

సూ:—డు-ము-వు-లు-అందు-విభక్తుల ఉకారమునకును, ప్రథమా విభక్తి రూపములైన తక్కిన నామవాచక సర్వనామవాచక విశేషణముల ఉకారమునకును, అవ్యయక్రియాపదముల ఉకారమునకును, సంధి నిత్యము. ౨౦

ఉదా:—రాముఁడు+అతఁడు=రాముడతఁడు

గురువు+ఇచ్చెను=గురువిచ్చెను

ఇంటియందు+ఉన్నది=ఇంటియందున్నది

ఎవరు+ఉన్నారు=ఎవరున్నారు

వనము+ఒకటి=వనమొకటి

జనులు+అందఱు=జను లందఱు

అపుడు+ఇచ్చెను=అపుడిచ్చెను

రాఁడు+ఇటకు=రాఁడిటకు

చెట్టు+ఎక్కెను=చెట్టెక్కెను

రెండు+ఉన్నవి=రెం డున్నవి

ఎందు+ఏగెను=ఎందేగెను.

ఉందుము+ఇక్కడ=ఉందు మిక్కడ

ఇచ్చినాను+అర్థము=ఇచ్చినానర్థము

వచ్చుచున్నాను+ఇపుడు=వచ్చుచున్నానిపుడు

ఇత్యాదులు. నాను-ఉన్నాను- వీని తుదియచ్చు లోపింపదు గావున నివి యీసూత్రమున కుదాహరింపఁబడినవి.

సూ:—నామక్రియావిభక్త్యాదుల ద్రుతస్వరములకు సంధి నిత్యము. ౨౧

నామవిభక్తులయొక్క క్రియావిభక్తులయొక్క ద్రుతము లని యర్థము.

ఉదా:—రాముని+అడిగెను= రామునడిగెను- సీతను+అర్చించి= సీతనర్చించి- వచ్చితిని+ఇపుడు = వచ్చితినిపుడు- చేసెను+అతఁడు=చేసెనతఁడు- నాతోడను+ఉండెను = నాతోడనుండెను- చేయును+అతఁడు=చేయునతఁడు-

ద్రుతస్వరములోపించునపుడు, నకారము మీఁదియచ్చులోఁ గూడును. అపుడును రూపము లిట్లే యుండును.

ఉదా:—రామున్+అడిగె=రామునడిగె- బాలన్+ఆదరించి=బాలనాదరించి-ఉంటిన్+ఇచ్చట=ఉంటినిచ్చట- ఇత్యాదులు.

ఆదిశబ్దముచే, కాఁబోలును. ఉను- మొదలగు నవ్యయముల ద్రుతస్వరము గ్రాహ్యము.

*చిన్నయసూరి "ప్రథమేతర విభక్తిశత్రర్థకచువర్ణంబులయం దున్న యుకారమునకు సంధి వైకల్పికము" అనిచెప్పి, నన్నడిగె- నాకొసఁ కిచ్చె- మొదలయిన వుదాహరించెను. కాని, కొఱకున్-కున్- అను వానిలోని ఉకారమువలె, నన్నులోనిఉకారము విభక్తిసంబంధమైనది కాదు. 'నా'శబ్దమున కాదేశముగా వచ్చినది- నన్ను. దీనిమీఁది విభక్తి- ను. దీనిఉకారము లోపించినపుడు-నన్నున్-అగును. దీనిలోని ఉకారము ప్రకృతిసంబంధమైన దగుటచేఁ బైసూత్ర మిచ్చట వర్తింపదు. అట్లు వర్తించె నేని రామున్+అడిగెన్=రామడిగెన్, అని యేల కాఁగూడదు? కావున ద్వితీయావిభక్తియం దెచ్చట నుండు ఉకారమునకు సంధి వచ్చునో యిపుడు నిర్ణయింపఁబడుచున్నది. ఈచెప్పఁ బోవు నాలుచోట్లఁ దప్ప ద్వితీయావిభక్తియందు ప్రకృతిసంబంధమైన ఉకారమునకు సంధి రాదు.

సూ:—నీ-నా-తన-శబ్దముల ద్వితీయావిభక్తి రూపముల ఉకారమునకును; చతుర్థ్యాదివిభక్తి శత్రర్థకచువర్ణముల ఉకారమునకును సంధి వైకల్పికము. • ౨౨

సూ:—అచ్చులకు సంధి వచ్చునపుడు నడుమ నున్నద్రుతము లోపించును. ౨౩

ద్రుత మున్నచోట్లనే యని యర్థము. ఈసూత్ర మట్టి స్థలముల సర్వత్ర సమన్వయించును.

ఉదా:—నిన్నున్+అడిగె=నిన్నడిగె, నిన్ననడిగె
మిమ్మున్+అరసి=మిమ్మరసి, మిమ్మనరసి

---

*అనాదిషు విభక్తి షూతో వా-అం-చిం, ఈసూత్రభావమును గ్రహించి కేతనకవి- నన్ను-నిన్ను-తన్ను-లమీఁది ద్రుతము అచ్చు పరమగునపుడు లోపించు నని ఆం-భూ-58-59-పద్యములందు చెప్పెను. వీనినిబట్టి బహువచనమందు వచ్చు 'మమ్ము' మొదలయినవి గ్రాహ్యములు. తన్ను-నన్ను-నిన్ను-ఇవి కళ లని అప్పకవి చెప్పెను. ద్వితీయావిభక్తి చేరనపు డివి కళలైనప్రకృతులని తెలియుచున్నది.

నన్నుఁ + ఆదరించి = నన్నాదరించి, నన్ను నాదరించి

మమ్ముఁ + ఎంచి = మమ్మెంచి, మమ్ము నెంచి

తన్నున్ + ఎఱిఁగి = తన్నెఱిఁగి, తన్ను నెఱిఁగి

తమ్మున్ + అట్లు = తమ్మట్లు, తమ్ము నట్లు

వానికొఱకున్ + ఇచ్చె = వానికొఱకిచ్చె, వానికొఱకు నిచ్చె

నీకుఁ + ఎదురు = నీకెదురు, నీకు నెదురు

పాడుచున్ + ఏగెను = పాడుచేగెను, పాడుచు నేగెను. మొ— చె ట్టెక్కెను, వన మరసెను. ఇత్యాదులలోని సంధి ప్రథమా విభక్తిరూపములకే కాని ద్వితీయావిభక్తిరూపములకుఁ గా దని తెలియునది. ఒకవేళ ద్వితీయావిభక్తియే వివక్షించినచో సంధి రాదు.

చెట్టుఁ + ఎక్కెను = చెట్టు నెక్కెను. కాని యిట్టి ప్రయోగములు పూర్వకావ్యములఁ గనరావు.

సూ:— నిన్ను మొదలగు నాఱింటికి ద్విత్వలోపమున సంధి రాదు.

ఉదా:— నినుఁ + అడిగె = నినునడిగె - తమున్ + ఎఱిఁగి = తము నెఱిఁగి మొదలయినవి.

సూ:— కిషష్ఠికిని ఇఁకాదులకును సంధి వైకల్పికము. ౨౮

ఉదా:— రామునికిన్ + ఇచ్చె = రామునికిచ్చె - రామునికి నిచ్చె

ఇఁకన్ + ఎప్పుడు = ఇఁకెప్పుడు - ఇఁక నెప్పుడు

ఇఁకన్ - ఇఁగఁ - ఎట్టకున్ - ఎట్టకేలకున్ ; అందుకున్ - అప్పటికిఁ - మొదలగునవి యిఁకాదులు.

సూ:— అందు - ఇందు - ఎందు - వీనికి సమాసమందు అలియను నాగమమగును. ౨౯

ఉదా:— అందు + అలి + వారు - ఉకారసంధి నిత్యము - అందలివారు

ఇట్లు ఇందలిజనులు - ఎందలియేఱు - మొద—, 'అందు' సామ

మున సప్తమీవిభక్తి [illegible]

ఉదా:—నాయందలి కరుణ. ఇది యలుక్సమాసమనఁబడును. భారత కాలమునందు అలికి బదులుగా ఉల వాడఁబడినది.

ఉదా:—ఎందు+ఉల, ఎందులదానవు-అందులవాఁడు-భార—

సూ:—తక్కిన ద్రుతప్రకృతికములకు సంధిరాదు. ౨౬

ఇంతకు మున్ను చెప్పిన సూత్రములచే రాఁదగిన వానికిఁ దప్పఁ దక్కిన ద్రుతప్రకృతికముల యచ్చులకు పరరూప సంధి రాదు. చివర నున్న నకారము మీఁదియచ్చుతోఁ గలియును.

ఉదా:—రామున్+అడిగె=రామునడిగె - హరిన్+అడిగి=హరినడిగి- చేయున్+అతఁడు=చేయునతఁడు - చూడన్+అయితి=చూడనయితి- అంతన్+అతఁడు=అంతనతఁడు- అనుడున్+ఇట్లు=అనుడునిట్లు- మొ—

సూ:—అచ్చునకు ఆమ్రేడితము పర మగునపుడు సంధి ప్రాయికముగా నగును. ౨౭

రెండుమారులు లుచ్చరించు మాటయొక్క రెండవరూప మామ్రేడిత మనఁబడు నని పాణినీయము. స్త్రీవాచక నిషేధము గాని దీర్ఘస్వర నిషేధము గాని యిచ్చటఁ బట్టదు.

ఉదా:—ఓహో+ఓహో=ఓహోహో-ఇట్లు ఆహాహా-అయ్యయ్యో ఎట్టెట్టూ-ఔరౌరా-మొద—

ప్రాయికమనుటచే-ఏమేమి-ఏమియేమి-ఇత్యాదులందు వైకల్పికముగ నగును.

సూ:—కర్మధారయమునందు మువర్ణకమునకు పు-ంపు-లు బహుళముగా నగును. ౨౮

ఉదా:—సరసము+అలుక, సరసపు+అలుక- వక్ష్యమాణసూత్రముచే టకార మాగమము-సరసపు+ట్+అలుక=సరసపుటలుక- విర సము+వచనము=విరసపువచనము- మొద—

బహుళ మనుటచే, ఈకార్య మితరసమాసములయందును
కొన్ని చోట్లనగును.

ఉదా:—సంగరంపు వేడుక-యుద్ధపుభీతి- కన్నపుఁగత్తి - గుఱ్ఱపుఁ రౌతు
ఏకాలపువాఁడు-

ప్రాచీనగ్రంథములయందు షష్ఠీసమాసమందు పువర్ణాదేశము వచ్చిన ప్రయోగములు కనఁబడవు. ,,ననవిల్తుశాస్త్రంబునినుకులు'' అనుచోట, శాస్త్రంపు నినుకులని తరువాతి వారు దిద్దిరి. భారతములో, ధర్మము తెఱఁగు ఇత్యాదులే ననవచ్చును.

మఱియు, ఈపువర్ణాదేశము మువర్ణకమునకే కాక యొకా
నొకచో నామముతుదివర్ణమునకును గలుగుచున్నది.

ఉదా:—మోదుగు+ఆకు=మోదుపాకు-మోదుగాకు-

సూ:—కర్మధారయమునందు పేదాదిశబ్దములకు ఆలుశబ్దము పర
మగునపుడు రేఫాగమ మగును. ౨౯

ఉదా—పేద+ర్+ఆలు=పేదరాలు, ఇట్లు, బీద - ముద్ద - ముగుద-
ముద్దు-బాలెంత-అయిదువ-కొమ-మనుమ - గొడ్డు - వియ్యపు-
వియ్యంకు-జవ- మొద——

ఇందు జవ్వనిశబ్దమునకు ఆలు పర మగునపుడు 'జవ' ఆదేశ
మగును. ఈసూత్రములఁ జూపెడి ఆలుశబ్దమునకు స్త్రీ యర్థము.

సూ:—ఆలుశబ్దము పర మగునప్పుడు తత్సమశబ్దముల అకారమునకు
ఉకారమును రేఫాగమమును కర్మధారయమునం దగును. ౩౦

ఉదా:—ధీర+ఆలు=ధీరు+ర్+ఆలు=ధీరురాలు. ఇట్లు గుణవంతు
రాలు-బుద్ధిమంతురాలు-సమర్థురాలు-సరసురాలు- ప్రియురాలు
మొదలయినవి.

సూ:—సమాసమునందు కొన్నిశబ్దముల ఉకారమునకు అజాదిశబ్ద
ములు కొన్ని పర మగునపుడు టకారాగమము బహుళ
ముగా నగును. ౩౧

ఇతరసమాసములందు గూడ నీయాగమము కానవచ్చుటచే 'కర్మధారయములం' దనెడి చిన్నయసూరినియమము చాలదు.

ప్రయోగములననుబట్టియు వాడుకననుబట్టియు నెప్పు డెచ్చట వచ్చునో గ్రహించునది.

ఉదా:—కలుకు+ట్+అమ్మ = కలుకుటమ్మ. సరసపు+ట్+అలుక=సరసపుటలుక. ఇట్లు, ముద్దుటుంగరము-చెక్కుటద్దము-నిగ్గుటద్దము- పోతుటేనుఁగు- మదపుటేనుఁగు- కొమ్ముటేనుఁగు పోతుటీఁగ- పెంకుటిల్లు-సన్నపుటెలుఁగు-ఇత్యాదులందు నిత్యము.

పొదరుటిల్లు-పొదరిల్లు, చిగురుటాకు - చిగురాకు, తములపుటాకు-తములపాకు, పేరుటురము-పేరురము, చదరంగపుటెత్తు-చదరంగపెత్తు, వేల్పుటావు- వేల్పావు, ఇల్లటపుటల్లుఁడు- ఇల్లటపల్లుఁడు-ఇత్యాదులందు వైకల్పికము.

బహుళ మనుటచే, తేనెటీఁగ- దుక్కిటెద్దు- పల్లెటూరు-పడుకటిల్లు- ఇత్యాదులం దితరాచ్చులకుఁ గూడ నీయాగము కలుగుచున్న దని తెలియునది-

"ధర నుకారాంతభిన్న పదంబులకును । దిటముగ టుగాగమంబు కొన్నిటికిఁ గల్గు। వెల్లటేనుఁగు లన మిద్దె టిల్లనంగ" కృష్ణ—

సూత్రమందు కొన్నిశబ్దముల కనుటచే-ఎత్తరుగు- టేకడవి-తాటాకిల్లు-బెల్లపచ్చు-ఆముదపాకు-ఇత్యాదులం దీయాగమము రాదు. దీనికి వాడుకయే శరణము.

సూ:—షష్ఠీసమాసమందు ఉకారాంతపదములకు అచ్చు పర మగునపుడు నకారాగమము బహుళముగా నగును. 37

సమాసమునందు విభక్తిప్రత్యయము లోపించును.

ఉదా:—రాము+ఆజ్ఞ=రామునాజ్ఞ, చెఱువు+ఒద్ద=చెఱువునొద్ద, గురువు+ఆదరము = గురువునాదరము, కులము+ఉన్నతి=

కులమునున్నతి, జనకు+ఎడ = జనకునెడ, భీష్మ+అంతటి వాఁడు=భీష్మనంతటివాఁడు. మొ—

బహుళ మనుట గట్టురాజల్లుఁడు - మొగమందము - వెన్నుని యన్నన్న-శిరసందము-బచ్చింట-పుట్టింటితల్లిప్రజలు- బ్రతుకాస-చెట్టా కు-వేల్పావు-వేల్పుటావు-మొదలయిన నకారాగమము రానిప్రయో గము లెన్నో కల వనుటకు. ఇట్టివి శ్రావ్యములు నగుచున్నవి. ఆగమ శాస్త్ర మునిత్య మనెడిసంస్కృతనియమము తెలుఁగునకును వర్తించును.

సూ:—షష్ఠీసమాసమునందు ఋకారాంతములకు అచ్చు పర మగు నపుడు నకారాగమము నిత్యము. 33

ఉదా:—విధాతృ+న్+ఆజ్ఞ=విధాతృనాజ్ఞ- మాతృనాదరము మొ-

సూ:—తద్ధర్మార్థకవిశేషణముల ఉకారమున కచ్చు పర మగునపుడు నకారాగమము నిత్యము. 34

ఉదా:—చేయు+న్+అతఁడు=చేయునతఁడు- తెచ్చెడు నర్థము మొ-

వెడలునగ్ని యనుటకు వెడలగ్ని యనుప్రయోగము కనఁబడును గాని యది ప్రామాదికము.

సూ:—సమాసమునందు అది అవి శబ్దముల అకారమునకు లోపము బహుళముగ నగును. 35

ఉదా:—నా+అది=నాది, నాయది. నా+అవి = నావి, నాయవి. చెప్పిన+అది=చెప్పినది, చెప్పినయది. చెప్పిన+అవి=చెప్పినవి, చెప్పినయవి. బహుళమనుటచే ఇకారాంతములమీఁదను ఉకా రాంతములమీఁదను లోపము నిత్యము.

ఉదా:—ఈపద్య మాకవిది. ఈగ్రంథము లితనివి-బోగముది-గట్టివి. వీనింబట్టి 'రామునియది' వంటిప్రయోగములు శ్రావ్యములు గావని తెలియునది.

సూ:—ఉకారాంత తద్ధర్మవిశేషణములమీఁది అది-అవి-శబ్దముల

అకారమునకు లోపము రాదు. ఇకారాంతతద్ధర్మవిశేషణముల మీఁద లోపము నిత్యము. 36

ఉదా:—వచ్చునది- వచ్చెడునది; చేయునవి- చేసెడునవి; చూచెడిది- చూచెడివి.

సూ:—కొన్ని నామములమీఁది అదిశబ్దముయొక్క అకారమునకు లోపము వైకల్పికము. 37

ఉదా:—కాఁపు+అది=కాఁపుది. ఆఁడు+అది=ఆఁడుది. కాఁపది- ఆఁడది-యనుచోట్ల అకారలోపము రాలేదు. ఉకారసంధి వచ్చిన దని తెలియునది. ప్రయోగములు:—

* ,,అదియాఁడది యని చూడకుము మిగుల డాయఁగ వచ్చెన్'' యయాతి దీని రూపాంతరము, ఆఁటది. ,,ఆస్యగంబుల శూద్రుఁడు నాఁటదియును'' కాశీఖం

సూ:—నా-మా-శబ్దములకుఁ గ్రమముగాఁ బరమైన-అన్న-అమ్మశబ్దముల అకారమున కర్థవిశేషములందు లోపము నిత్యము. 38

ఉదా:—నా+అన్న=నాన్న=తండ్రి, ఉత్తరమండలములలోని శూద్రులు నాన్నశబ్దమును జ్యేష్ఠసోదరుని యెడ వాడుదురు.

మా+అమ్మ = మామ్మ, తండ్రితల్లి. ఇందలి మాశబ్దమవ్యయము.

సూ:—అచ్చు పర మగునపుడు సమాసమునందు కుఱుచాదుల తొలియచ్చుమీఁదివర్ణముల కెల్ల ద్విరుక్తటకార మాదేశమగును. 39

ఉదా:—కుఱుచ+ఆవాలు, కుట్+ఆవాలు=కుట్టావాలు- కుట్టుసురు. కడున్+అలుక=కట్టలుక- కట్టెదురు- కట్టాయితము. నడుము+అడవి=నట్టడవి- నట్టిల్లు- నట్టేఱు. నిడుద+ఊరుపు=నిట్టూరుపు, చిఱు+ఎలుక=చిట్టెలుక.

* ఆఁడది-కాఁపది-అను శబ్దములలోని డవర్ణ-పవర్ణములు ఉభయవర్ణములలోఁ జేరును.

సూ:—ఆమ్రేడితము పర మగునపుడు కడాదులతొలియచ్చుమీఁది వర్ణముల కెల్ల ద్విరుక్త టవర్ణ మాదేశ మగును. ౪౦

ఉదా:—కడ+కడ=కట్టకడ; ఎదురు+ఎదురు=ఎట్టయెదురు. ఇట్లు, కొట్టకొన - చిట్టచివర - తుట్టతుద - పట్టపగలు - తెట్టతెన్ను - తెట్టతెరువు-నట్టనడుము-పిట్టపిడుగు-బట్టబయలు-మొద—

సూ:—అందదుకు మొదలయినవి వ్యవహారమున నున్నట్లే గ్రాహ్యములు ౪౧

అందదుకు - ఇఱ్ఱింకులు - ఇల్లిగ్గులు - చెల్లచెదరు - చెల్లాచెదరు - తుత్తుమురు-తుత్తునియలు - తుత్తునకలు - మిఱుమిట్లు- దావద్వులు - బెంబేలు-కంగారు-చెచ్చెర- మొద —

సూ:—ఆమ్రేడితము పర మగునపు డాచ్ఛికములవిభక్తికి లోపము బహుళముగా నగును. ౪౨

విభక్తితోఁగూడ దానితో వచ్చిన ఆగమమును బోవును.

ఉదా:—అడుగునకున్ + అడుగునకున్ = అడుగడుగునకున్ - అడుగున కడుగునకున్, అక్కడన్ + అక్కడన్ = అక్కడక్కడన్ - అక్కడ నక్కడన్, వారికిన్ + వారికిన్ = వారివారికిన్ - వారికివారికిన్,

బహుళ మనుటచే, అంతన్ మొదలగు నవ్యయముల తుది హల్లును 'అప్పటికిన్' ఇత్యాదివిభక్త్యంత ప్రతి రూపకముల తుదివర్ణములును లోపించునని తెలియునది. అంతంతన్ - అప్పటప్పటికిన్ - మొదలయినవి.

మఱియు, ఏఁటేఁటన్ మొదలగు కొన్నిచోట్ల విభక్తిలోపము నిత్యము.

సూ:—ఆమ్రేడితము పర మగునపుడు ఇంచుక మొదలగు కొన్నిటి తుదివర్ణము వైకల్పికముగా లోపించును. ౪౩

ఉదా:—ఇంచుక+ఇంచుక=ఇంచించుక-ఇంచుకించుక, కొంచెము+

కొంచెము=కొంచెకొంచెము- కొంచెముకొంచెము, నాఁడు+నాఁడు=నానాఁడు-నాఁడునాఁడు- వేగ+వేగ=వేవేగ, దావు+దావు=దాదావులు- మొద___ "దాదావుల నిల్చి మధ్యన గదా" జైమిని___

సూ:___ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగును. ४४

ఉదా:___రాముని+కొలిచితిని=రామునిగొలిచితిని

వచ్చెను+చంద్రుఁడు=వచ్చెనుజంద్రుఁడు

చూచితిని+చుట్టమును=చూచితినిజుట్టమును

చేసెను+టక్కులు=చేసెనుడక్కులు

తల్లిని+తిట్టకు=తల్లినిదిట్టకు

చదువుదును+పాఠము=చదువుదునుబాఠము.

సూ: ఆదేశసరళములకు వెనుక నున్నద్రుతమునకు బిందువు గాని సంశ్లేషము గాని వైకల్పికముగ నగును. ४५

ఉదా:___పూచెనుగలువలు—పూచెఁగలువలు-పూచెంగలువలు-పూచెన్గలువలు

చూచితినిజంద్రుని, చూచితిఁజంద్రుని - చూచితింజంద్రుని - చూచితిఞ్జంద్రుని

సీతనుజూచితి, సీతఁజూచితి- సీతంజూచితి—సీతఞ్జూచితి.

కంటినిడెక్కెము, కంటిఁడెక్కెము - కంటిండెక్కెము - కంటిన్డెక్కెము

చేసెనుదపము, చేసెఁదపము-చేసెందపము-చేసెన్దపము

విరియునుబద్మము, విరియుఁబద్మము-విరియుంబద్మము- విరియున్బద్మము

పద్యకావ్యముల గణయతిప్రాసలయానుకూల్యమున కేర్పడిన పూర్ణబిందుసంశ్లేషములతోడి రూపములు వచనకావ్యముల నీకాల

మున రచింపవు.

సూ:—ద్రుతమునకు సిద్ధసరళములు స్థిరవర్ణములు పరమగునపుడు లోపము గాని సంశ్లేషము గాని బహుళముగ నగును. ౭౬

శబ్దముపుట్టుకతోనే యున్న సరళము సిద్ధసరళ మనఁబడును.

ఉదా:—వచ్చెను గోవులు, వచ్చె గోవులు-వచ్చెన్గోవులు.

ఇచ్చెను ధనము, ఇచ్చె ధనము-ఇచ్చెన్ధనము

రామునకును మ్రొక్కి, రామునకు మ్రొక్కి - రామునకు మ్రొక్కి - మొ—

బహుళ మనుటచేఁ గొన్నిచోట్లఁ బూర్ణబిందువును గలుగు నని తెలియునది.

ఉదా:—పాడెను గంధర్వుఁడు—పాడెం గంధర్వుఁడు, వచ్చెను ధాత్రీపతి-వచ్చెం ధాత్రీపతి, కన్దోయి-కందోయి.

సూ:—దీర్ఘముమీఁది ద్రుతమునకు నిండుసున్న రాదు; తాను నేను శబ్దముల దుత్రితమునకు సంశ్లేషమును రాదు. ౭౭

ఉదా:—పూర్తిగాన్ + చేసె=పూర్తిగాఁజేసె-పూర్తిగాన్జేసె.

తాను+చదివె=తాను జదివె-తాఁ జదివె

నేను+చెప్పితి=నేను జెప్పితి-నేఁ జెప్పితి మొ—

సూ:—సమాసమునందును అసమాసమునందును హల్లు పర మగునపుడు కొన్నిశబ్దముల ద్విత్వమునకు లోపము బహుళముగ నగును. ౭౮

ఉదా:—కన్నుదోయి-కనుదోయి, ముల్లుకంప - ములుకంప, కల్లు త్రాగి-కలు త్రాగి, కన్ను-కను, ముల్లు-ములు, కల్లు-కలు, విల్లు-విలు, పల్లు-పలు, మున్ను-మును, వెన్ను-వెను, విన్ను-విను, మిన్ను-మిను, మొ—

బహుళ మనుటచే [illegible] గొన్ని

యెడలమాత్రమే యీ కార్యము వచ్చును-పొందామర-పొలువడు.

సూ:—అను-చను-కొను- పెనుల ఉకారమునకు సమాసమున లో
మును, అచ్చు పర మగునపుడు నకారమునకు ద్విత్వమున
గొన్నిచోట్లఁ గనవచ్చును.

అను. చను- కొను- అనునవి తద్ధర్మార్థక క్రియాజన్యవిశేష
ములు. పెను, పెనువుశబ్దమునకు సమాసమున వువర్ణము లోపింపఁగా
గలిగినరూపము. ఉకారములోపించునపుడు నకారము ద్రుతము కాదు

దమయంతి యన్కూఁతు, దమదాంతదమనులన్సుతులను, గిరివ్రజమన్పురంబు
అన్నిష్టసఖి—అన్నుర్వీశుఁడు—నాఁడుచన్తో, జడికొన్కొ—న్కులు—పెన్నరు—పెన్గద-
పెన్నెనరు, పెన్నుద్ది—పెన్నూఁత—పెన్నరదము మొద—భారతాదులు.

సూ:—హల్లు పరమగునపుడు కను-మను- మొదలగువాని ఉకారము
నకుఁ గొన్నియెడల లోపమును, పరుషములు పరమగునపుడు
తుదినకారమునకు ద్రుతత్వమును బహుళముగా నగును.

ఉదా:—కను+మొఱగి=కన్మొఱగి-ఉకారలోపము.

దు్రితత్వము వచ్చును కావున ద్రుతకార్యములు వచ్చును.

ఉదా:—కను-కన్గీఁకటి, పొను-పొందామర, మును-ముంగొంగు, పెను-
పెంద్రోవ-పెందలకడ-పెందోడ. మొద—

కన్గవ-కన్గొనలు- ఇత్యాదులందు నకారమునకు ద్రుతత్వము
లేదు. ప్రథమమీఁదిదికావున నిచ్చటికకారము గకార మైనది. ఇట్లే
ప్రయోగములనుబట్టి యూహించునది.

సూ:—శబ్దముయొక్క మొదటి పొట్టి యచ్చుమీఁది ద్రుతమునకు
లోపమురాదు.

ఉదా:—కన్దోయి. కదోయి వంటి రూపములు కావు.

సూ:—కొన్నిచోట్ల ద్రుతమున కచ్చు పరమగునపుడు ద్విత్వము క
వచ్చును.

ఇట్లు వచ్చునట్టిది ద్రుతద్విత్వసంధి యనఁబడును. ఈసంధులు భారతమునందును గలవు. కాని ముద్రాపకులు కొన్ని దిద్దినారు.

„ పరిచర్య లొనర్చుచు న్నపరిమితనిష్ఠ—భార—ఆది, ఇంద్రగురు ప్రతిభుఁ జేసి యింద్రసమాను న్నింద్రయశు—సభా, ఎఱిఁగింపు నావుడు న్నయ్యతిముఖ్యుఁడు విరా, వివిధోత్పాతంబులకు న్నవనిపతి—శాంతి—ఊరకుండఁగ నగునే మనకు న్నాదిభ వుండవు—హరి—పూ, ఇత్యాదిపాఠము లనేకము లచ్చులో మాఱిపోయినవి.

„ సురగణంబు శోభము నొంద । న్నివ్విధమున—ఉ—హ, సర్వము న్నతనిది న్యకలామయమంచు—భాగ, చోట్లుంబలె । న్నురుశోభావిభవ—కళా, మూఁడున్నర—విష్ణు, లినియె న్ని నూఱు—శుక, వారక యీపురి న్నెచట—రాజశే, మూఁడు నేను మూఁడు న్నేనున్—కవిజనా, ఇత్యాదులు భారతేతరకృతులందసంఖ్యముగా నున్నవి.

వీనినిబట్టి ఒకటెన్నర- ఆఱునొన్నకటి- మొదలయినవి సాధువు లగుచున్నవి. చెవి కింపగుచోట నీసంధి చేయఁదగును. „సన్నచ్యుతః- పశ్యన్నితి” ఇత్యాదినకారద్విత్వసంధులు సంస్కృతమందును గలవు.

సూ:—ఒకానొకచోఁ బదాంతమందలి నకారమునకు మకారము పరమగుచో మకార మగును. ౫౩

ఉదా:—కమ్మనిలతాంతకు మ్మొనసి-భార, ఇట్టిసంధి పూర్వకావ్యములం దైనను అరుదుగా నున్నది.

సూ:—సమాసమునందు ఉకారాంతము లైన స్త్రీసమములకును పు-ంపు-లకును పరుషసరళములు పరము లగునపుడు నకారాగమము బహుళముగా నగును. ౫౪

నకారము విధించిన చోట్ల, పూర్వసూత్రములనుబట్టి ద్రుతకార్యము లూహించునది.

ఉదా:—చిగురు+న్+కైదువు=చిగురుఁగైదువు-చిగురుంగైదువు

సరసపు+న్+పలుకు=సరసపుఁబలుకు-సరసపుంబలుకు

బహుళమనుటచే స్థిరము పరమగు నపుడును ఈయాగమ మొక్కొకచో నగును. ఉదా:—గరువవును గరువు-మొ—

ఈయాగమము సూత్రములోఁ జెప్పినస్థలములందు నిత్యముగా వచ్చునని పూర్వుల యభిప్రాయము. కాని యిది కానిప్రయోగము లధికముగాఁ గనఁబడును.

ఉదా:—కొలువుకూటము-ముదురుటేకు - చెఱకుకఱ్ఱ - మంచుచినుకు-నిండుపున్నమ-గండుపిల్లి-చేటుకాలము-బంగారుపళ్ళెము-తెలుగుకవిత్వము-ముద్దుకొడుకు- పెంపుడుకూఁతురు- పూర్వకాలపు చరిత్ర- మొద—

కావునఁ బద్యరచనయందు గణయతిప్రాసల కుపయోగించుపట్టుల నీయాగమము చేయవచ్చునుగాని వచనరచనయం దిది యావశ్యకము కాదు. ఆగమశాస్త్ర్ర మనిత్య మని యార్యోక్తి.

సూ:—ఉకారాంత స్త్రీ సమములకును, పుం-పు-లకును, అకారాంత గుణవాచకములకును, తనము పర మగునపుడు నకారము బహుళముగా నాగమ మగును. ౫౫

ఉదా:—పడుచుఁదనము-పడుచుందనము-పడుచున్దనము
సరసంపుఁదనము-సరసంపుందనము-సరసంపున్దనము
చక్కఁదనము-చక్కందనము-చక్కన్దనము
పడుచు-సొగసు-దుడుకు-చుఱుకు-దురుసు-కఱకు-అఁడు ;
చక్క-చల్ల-కమ్మ-పుల్ల- తెల్ల-విన్న-చప్ప-తియ్య, మొద—

సూ:—సమాసమందు ప్రాఁతాదులతొలియచ్చుమీఁది వర్ణములకు హల్లు పర మగునప్పుడు లోపము బహుళము. ౫౬

అచ్చు పర మగునపు డీలోపము వచ్చుటకుఁ జిన్నయసూరి 'ప్రాయిల్లు' ఉదాహరించెను గాని, భారతాదులయందు లేమెండ-పూయలుఁగు-ప్రామేఁకు-వంటి ప్రయోగములు కనరావు 'ప్రయ్యేఱు' అను గ్రామనామము ప్రాయే అనుభ్రాంతి గలిగించి యుండవచ్చును.

ఉదా:—ప్రాఁత + మినుకు = ప్రామినుకు. లేఁత + దూఁడ = లేదూఁడ,

పూవు+ రెమ్మ—పూరెమ్మ-మొద—

సూ:—లోపింపఁగా మిగిలినదానికిఁ బరుషవర్ణములు పర మగు నపుడు నకార మాగమ మగును. ౫౭

ఉదా:—ప్రా+న్+చదువు=ప్రాఁజదువు, దీర్ఘముపై నిండు సున్న రాదు. పొన్ను, పొందామర - కెంపు, కెందామర - చెన్ను, చెంగలువ - మీఁదు, మీఁగడ - క్రిందు, క్రిందల - క్రొత్త, క్రొంబసిఁడి-ముందు, ముంగొంగు - పది, పందొమ్మిది-వెల్ల, వెంజామర-చెన్ను, చెంగావి-కెంపు, కెంజాయ-మొ—

బహుళ మనుటచే నిట్టిచోట్ల సంశ్లేషము లేదు. ప్రాచీనపుస్తకములలో వెంజామర యని యున్నది. ఇది ముద్రణముఁ వింజామర యైనది. వెల్ల+చామర=వింజామర-శ-ర. అఱవములో వెణ్ శామర యందురు. వెంజామర పూర్వరూపము.

సూ:—క్రిందు మొదలగు కొన్ని శబ్దముల లుప్తశేషమునకుఁ గొన్ని శబ్దములు పర మగుచో దీర్ఘము వచ్చును. ౫౮

ఉదా:—కిందు, కీఁగాలు-కీఁదొడ-కీఁగడుపు - క్రీనీడ - క్రీవాఁడ, సగము, సామేను-మొద—

సూ:—క్రొత్త మొదలగు కొన్నిటి లుప్తశేషమునకుఁ గొన్నిశబ్దములు పర మగునపుడు నకారము రాదు. కొన్నిటి మీఁది హల్లునకు ద్విత్వము వచ్చును. ౫౯

ఉదా:—క్రొత్త, క్రొత్తావి-క్రొక్కారు. నెఱ,నెత్తఱి. పొన్ను, పొత్తామర.క్రేవ, క్రేగన్ను. చేఁద, చేత్రాడు-మొద—"పొత్తామరని మెడినెత్తమ్మి కొలని" కాళ—

ప్రాఁత-త్రాడు-మొదలగు వానిలోని రేఫము వైకల్పికముగా లోపించును. అందుచే * చేత్తాడు-అనుద్వితత్వము వచ్చిన రూపము

---

* కొందఱు [illegible]

వచ్చినది.

చేఁదు+త్రాడు=చేఁద్రాడు- అనిశబ్దపత్నాకరము. ఇదిచేఁద యొక్క త్రాడుగాని, చేఁదునట్టిత్రాడు కాదు. ఈపక్షములో నర్థ పుష్టి లేమియే కాదు, 'చేఁదు' తద్ధర్మవిశేషణ మగుటచే దువర్ణమే లోపింపదు.

సూ:—రాజు-రాచ-శబ్దములలోని తుదివర్ణము లోపించును. పరుషము పర మైనను నకారాగమము రాదు. ౬౦

ఉదా:—రాజు+రాజు=రారాజు- రాచ+కొమరుఁడు = రాకొమరుఁడు. రాచ, రాయంచ—రాచిలుక-రాతరుణి- మొ—

సూ:—కొన్నిశబ్దములు పర మగునపుడు నిండు మొదలగు కొన్నిటి తుదివర్ణము లోపించును. పరుషేతరము లైనమీఁది హల్లులకు ద్విత్వము వచ్చును. ౬౧

ఉదా:—నిండు, నివ్వెఱ-నివ్వెఱగు. నెఱ,నెన్నడుము-నెమ్మని-నెవ్వడి- క్రొత్త, క్రొవ్వాడి- మొద—

సరళస్థిరములు పర మగునపుడు (కెంపు) కెంజడలు-కెంధూళి- మున్నగు ప్రయోగములందు నకారాగమముగూడఁ గనవచ్చును. ఈ లోపనకారాగమద్విత్వములను వాడుకనుబట్టి గ్రహించునది.

సూ:—నకారము మొదటఁ గలకొన్నిశబ్దములు పర మగునపుడు రెండు మొదలగు కొన్నిటి తొలియచ్చుమీఁది వర్ణములకు నకారము బహుళముగా నాదేశ మగును. ౬౨

ఉదా:—రెండునాళ్ళు - రెన్నాళ్ళు, మూఁడునాళ్ళు - మూన్నాళ్ళు, పేఁడనీళ్ళు-పేన్నీళ్ళు, వేఁడినీళ్ళు-వేన్నీళ్ళు, పజ్జనేల—పన్నేల, చలినీళ్ళు-చన్నీళ్ళు, రెండునెలలు-రెన్నెలలు మొద—

ఈకార్యము వచ్చునపుడు నెలలోని అకారమునకు లోపము గనఁబడుచున్నది. ఇందుకు ప్రయోగములు—

" రెన్నెల్లదాఁక మీఁదట-రామా, తల లేకున్న వాఁడు చెల్లును రెన్నెల్లను-
మి, ఎవ్వనికి వాఁడు నార్నెల్ల కేగు దివికి-కాశీఖం, ఇపుడు నార్నెల్ల కోకపరి-
స, నాఁటికిఁ దొమ్మిదినెల్లు నిండఁగన్-యయా, మూణ్నెల్ల కవయవములు-సా
ం, ఆరెల్లకు జీవనంబచట-" వేంక,

బహుళ మనుటచే, మిన్న+నాగు=మిన్నాగు మొదలగు
ట్లఁ బైకార్యము నిత్యము; ఆర్నెల్లు మొదలగు చోట్ల ఉకార
పము మాత్రము, (నాలుగు) నాల్నెల్లు-నాల్నాళ్ళు-మొదలగు
ట్ల తుదివర్ణమునకును దానివెనుకటి యచ్చునకును లోపము,
మూణ్నెల్లు-ఏణ్నాళ్లు-మొదలగు చోట్ల తుదియచ్చునకు లోపము
కారమునకు ణకారము, అని తెలియునది.

సూ:—కాలవాచకమైన 'నాళ్ళు' పర మగునపుడు అన్ని-ఇన్ని-ఎన్ని-
కొన్ని-శబ్దములతుదిని వర్ణము వైకల్పికముగా లోపించును.

ఉదా:—అన్ని+నాళ్ళు=అన్+నాళ్ళు=అన్నాళ్ళు-ఇట్లు-ఇన్నాళ్ళు-
ఎన్నాళ్ళు-కొన్నాళ్ళు-

సూ:—అంత-ఇంత-ఎంత-లకు, దనుక-దాఁక-శబ్దములు పర మగు
నపుడు తవర్ణము బహుళముగా లోపించును. ౬౪

ఉదా:—అంత+దనుక=అందనుక, అంత+దాఁక=అందాఁక-ఇంద
నుక-ఇందాఁక, ఎందనుక-ఎందాఁక-

బహుళ మనుటచే అంతదనుక మొదలగు రూపములు నుండును

సూ:—అచ్చు మొదటఁగల కొన్ని శబ్దములు పర మగునపుడు,
పదిలోనిదివర్ణమునకు నకారద్వయము బహుళముగా నాదేశ
మగును. ౬౫

ఉదా:—పది+ఇద్దఱు=పన్న్+ఇద్దఱు = పన్నిద్దఱు-ఇట్లు పన్నిరు
వురు-పన్నిద్దము-పన్నిల్లము-మొద—

సూ:—రెండు-పర మగునపుడు పదిలోనిదివర్ణమునకు బిందుపూర్వక
డకార మాదేశ మగును. ౬౬

ఉదా:—పది+రెండు=పండ్+రెండు=పండ్రెండు

రెండులోని రేఫమునకు లోపమును ౬౨ సూత్రముచే నకారద్వయమును చేయఁగా పన్నెండు రూప మగును. ఇదియే మిక్కిలి వాడుకలో నున్నది.

## గసడద వాదేశము

ఈయాదేశము తెలుఁగులో మిక్కిలి చిత్ర మైనది. ఇది భారతకాలమునుండి నేఁటివఱకును బహువిధముల మాఱుచునే యున్నది.* ఇందుకు ముందుగాఁ బ్రాచీనపద్ధతిని సూచించి పిదప నర్వాచీనపద్ధతిని దెల్పెదను.

సూ:—ప్రథమమీఁది పరుషములకు గ-స-డ-ద-వ-లు, నిత్యమని ప్రాచీనమతము. క-చ-ట-త-ప ౬౭

ఆపరుషములు (క-చ-ట-త-ప-) తత్సమపదముల మొదటివి కానీ ఆచ్ఛికపదముల మొదటివి కానీ వేని కైనను సరియే యనియు, ఆప్రథమాంతము తత్సమము కానీ, ఆచ్ఛికము కానీ యే దయినను సరియే యనియు నర్థము.

ఉదా—శ్రీ+పాలింపంగ=శ్రీవాలింపంగ- భార—
వీరల్+కోపించిన=వీరల్గోపించిన- ఉ—హరి—
పెంపు+పరీక్షింపమె=పెంపువరీక్షింప- వసు—
ఎవ్వండు+పఠించెడు=ఎవ్వండువఠించెడు- కాశీఖం—
వీరులు+చూచి=వీరులుసూచి- భార—

---

* యుద్ధమల్లునిశాసనమునాఁడును భారతకాలమందును ప్రథమమీఁదియేపరుషములకైనను గసడదవాదేశము నిత్యము. కేతనమతముకూడ నిదియే యని తోఁచును. వికృతిశబ్దములమీఁది సాంస్కృతికపరుషములకు గసడవదలు రావు, తత్సమములమీఁదియేపరుషముల కైనను నిత్యముగా వచ్చును—అం—చిం—ప్రథమమీఁదియాచ్ఛికపరుషములకుఁ బైయాదేశము వైకల్పికము. తత్సమపరుషములకు రాను అథర్వ—శృంగారభూషణాదులమతము. ఇంకను వేఱుగా నున్నవి.

ఈకార్యము కళ లయినక్రియావ్యయములమీఁది పరుషముల
కును ప్రాచీనులమతమున వచ్చును.

ఉదా:—ఇట్లు+తపంబు=ఇట్లుదపంబు- నిర్వచ—
ఎట్టు+చూచి=ఎట్టుసూచి, భార—
ఎందు+పోయెదు=ఎందువోయెదు- భార—
ఇందు+ప్రత్యక్షమై=ఇందుబ్రత్యక్షమై- యు-శాస—
రారు+కదా=రారుగదా—ఇత్యాదులు.

కొన్ని ప్రాచీనశాసనములందే కాక భారతాదుల వ్రాఁతపుస్త
కములలోను గూడ నిట్లు గసడవాదేశము నిత్యమై కనవచ్చును.
అచ్చులోఁ బ్రాసస్థలములమాత్ర మీయాదేశము నిలిచినది. తక్కిన
చోట్లఁ బోయినది. కొన్నిచోట్ల నర్థసందేహము గలిగించుటయే
కాక శ్రుతిరమ్యము గూడఁ గాకపోవుటచేతనే ఆచ్ఛికములమీఁది
కత్నమపరుషముల గసడదవాదేశ మాంధ్రశబ్దచింతామణికాలమందే
పోయినది. దానిలోనిసూత్రమునుబట్టియే పూర్వలిఖితపుస్తకములలోఁ
గనవచ్చెడి యీయాదేశ మచ్చులోఁ బ్రాసేతరస్థానములందు పూర్తి
గాఁ బోయినది.

సూ:—ప్రథమమీఁది ఆచ్ఛికపరుషములకు గసడదవలు బహుళ
ముగా నగును. ౬౭

ఉదా:—రాముఁడు+కదలె=రాముఁడు గదలె—రాముఁడు కదలె
అతఁడు+చేసె=అతఁడు సేసె-అతఁడు చేసె
వాఁడు+చేనియె=వాఁడు సనియె-వాఁడు చేనియె
వీఁడు+టక్కరి=వీఁడు డక్కరి-వీఁడు టక్కరి
సీత+తెచ్చె=సీత దెచ్చె-సీత తెచ్చె
చెట్టు+పడె=చెట్టు వడె-చెట్టు పడె. మొద—
బహుళ మనుటచే కళ లైన కొన్ని క్రియాపదములమీఁదను

అవ్యయములమీఁదను ఉన్న యాచ్ఛికపరుషములకుఁగూడ నీకార్యము వైకల్పికముగ నగు నని తెలియునది.

ఉదా:—వత్తురు+పోదురు=వత్తురు వోదురు—వత్తురు పోదురు

లేదు+తలఁప=లేదు దలఁప—లేదు తలఁప

అపుడు+పోయి=అపుడు వోయి-అపుడు పోయి

ఏమి+చెప్పుదున్=ఏమి సెప్పుదున్-ఏమి చెప్పుదున్

ఆహా+పుట్టింపదె=ఆహా వుట్టింపదె-ఆహా పుట్టింపదె- మొద—

ఎందయినను అపార్థము తోఁచునపుడును శ్రుతికటువు గానుండునపుడును ఈయాదేశము చేయుట యుచితము గాదు.

ఉదా:—ఆమె సీర కట్టినది- చదరసాఁపలు- ఆపిల్ల గోడలు- రెండు సేఁదలు-అది చేఁకుచెట్టు- నాలుగు వుచ్చకాయలు- అపుడు దోఁచెను- అది జోకు- ఇత్యాదులందు గసడదవాదేశము తగదు.

సూ:—తాను-నేను-శబ్దములమీఁది పరుషములకు గసడదవలు రావు.

ఇవి ప్రథమాంతము లైనను ద్రుతప్రకృతికములు గావున శరశ సూత్రముచే గజజేడదబలు వచ్చును.

ఉదా:—తానుజెప్పె, నేను జేదివితి.

సూ:—ప్రథమమీఁది తత్సమపరుషములకు గసడదవలు రావు.

ఆప్రథమ ఆచ్ఛికమే కాదు, తత్సమ మైనను సరే, దాని మీఁది పరుషములకు గసడదవలు చేయుట యుచితముగాదు. 'రాముఁడు గరుణాభిరాముఁ'డని కొందఱుదాహరించిరి కాని, కణ్వుఁడు గులగురువు- రాముఁడు సాపధరుఁడు- సౌమిత్రి సిరంజీవి- ఇత్యాదులు శ్రుతికటువు లగును. అదికాక, ఈయాచారము పూర్వమే పోయినది.

సూ:—ద్వంద్వసమాసమునం దాచ్ఛికములమీఁది యాచ్ఛికపరుషములకు గసడదవలు బహుళముగా నగును.

ఉదా:—కూర+కాయ=కూరగాయలు. కాలు+చేయి=కాలుసేతులు. టక్కు+టెక్కు = టక్కుటెక్కులు. తల్లి+తండ్రి=తల్లిదండ్రులు- ఊరు+పల్లె=ఊరుపల్లెలు మొద—

ద్వంద్వమునం దీయాదేశము నిత్యమని హరికవి చెప్పెనుగాని, రాకపోకలు-అక్కచెల్లెండ్రు-అందచందములు-కందతుండెములు-మొదలగు పెక్కుచోట్లఁ గానరాకున్నది.

సూ:—ఏవార్థక క్త్వార్థక సంబోధనాంతాదులమీఁది యేపరుషములకును గసడదవలు రావు. 22

ఉదా:—తా,నకడంకన్- ఎ,క్కికడున్- చొ,చ్చితగన్- త,ల్లీకృపచేసి-దాఁచనే,లాకనకాంగి-ర,మ్మామాతము-అది, గోకానఁబడియె-ఇత్యాదిబహుప్రయోగములందు ప్రాసస్థానముల నీయాదేశము కనఁబడదు.

సూ:—కాన్‌లోని కకారమునకుఁ దప్ప, వచసరచనయం దీగసడదవాదేశ మైచ్ఛికము. 23

పద్యరచనయందు యతిప్రాసముల కీయాదేశ మావశ్యకమైనను వచనరచనయం దావశ్యకము కాదు. కాని యాచ్ఛికము లైన- క-త-వర్ణములకు గ-ద- లాదేశ మగుట కొన్నిచోట్ల శ్రావ్య మగును. మొత్తముమీఁద నీయాదేశ మిష్టమున్నఁ జేయవచ్చును లేకున్న మానవచ్చును. ఇఁకనో కాన్‌లోని కకారమునకు మాత్రము గకారము నిత్యము.

ఉఁ:—తిన్నగాఁ బొమ్ము- వడిగా నేగెను. వింతగా నున్నది. బుద్ధిమంతుఁడుగా నుండెను. మొద—

సూ:—వాక్యముతుద ద్రుతస్వరమునకేని ద్రుతమునకేని లోపము బహుళముగ నగును. 24

ఉదా:—పాఠము చదివెన్-పాఠము చదివె-పాఠముచదివెను- మొ—

బహుళ మనుటచేఁ బద్యపాదాంతమందు గురు వుండవలసిన చోట ద్రుతస్వరము మాత్రమే లోపించును.

ఉదా:—సత్యమువలనను ములు సూపు గౌరవంబున పేర్మిఁ.

సూ:—పడ్వాదులు పర మగునపుడు కర్మపదములమువర్ణకమునకు లోపముగాని నిండునున్న గాని బహుళముగా వచ్చును- ౭౫

ఉదా:—భయము+పడె=భయపడె-భయంపడె - భయముపడె - ఆది పదముచే, పఱుచు-పాటు-పట్టు-పెట్టు- మొద—

బహుళ మనుటచే స్పష్టపఱుచు - భంగపాటు - శ్రమపెట్టు- మున్నగు కొన్ని చోట్ల ములోపము మాత్రమే తఱుచుగ నగును. పంతముపట్టు-పంతంపట్టు-మున్నగు కొన్ని చోట్ల ములోపము రాదు. అన్నముపెట్టు-ఆయుధముపట్టు-మొదలగుచోట్ల ములోపము బిందువు గూడఁ గలుగవు. కర్మపదము లనుటచే ఫలము పడెను-కప్పను నాగ ము పట్టెను-మొదలగు చోట్ల కర్తృవాచి మువర్ణముకమున కీకార్య ము రాదు.

సూ:—కొన్ని సమస్త పదములలోని - ము - మి-మ - వర్ణములకును బూర్ణబిందువు వచ్చుచున్నది. ౭౬

ఉదా:—వేలము+పాట=వేలంపాట (ఏలము - హిం), బెల్లము+ కొండ=బెల్లంకొండ, నడిమి+పల్లి = నడింపల్లి, నందమ+ పూఁడి=నందంపూఁడి- మొద—

ఇట్లు వ్యవహారప్రసిద్ధములు గ్రంథస్థములు నైనవి మాత్రమే ప్రయోగార్హములు.

సూ:—కొన్ని సమాసములందు మువర్ణకలోపము గనవచ్చును. ౭౭

ఉదా:— ప్రాణము + గొడ్డము = ప్రాణగొడ్డము, ఇట్లు, జీవగఱ్ఱ-కపిలకన్నులు-దినవెచ్చము-దినబత్తెము-నిత్యపడి - అంద చందములు- మొదలయినవి భారతాదులందు గలవు. వీనినిబట్టి

మువర్ణకలోపము నొంది వాడుకలో స్థిరపడి శ్రావ్యములైనవి మాత్రమే ప్రయోగార్హ్యములు. ఉదా-జీతబత్తెములు-మొ-

సూ:—సమాసమందు చేతఁ-తోడఁ-వలనన్-అనువిభక్తుల తుది అకారమునకు ఇకార మాదేశ మగును- ౭౮

ఇట్టు విధించుటచేతనే విభక్తియొక్క నకారము లోపించును.

ఉదా:—నీచేతన్+పోరు=నీచేతిపోరు, ఇట్లు నాతోడిచెలిమి-వానివలని నేరము-మొద—

సూ:—హల్లు పర మగునపుడును అవసానమందును మధ్యమపురుష మువర్ణకము వైకల్పికముగ లోపించును. ౭౯

ఉదా:—చదువుము పాఠము-చదువు పాఠము, పని చేయుము-పని చేయు, అచ్చు పర మగునపుడు లోపింపదు. చూడుము మిటు.

సూ:—వ్యతిరేకమధ్యమ ము వర్ణకమున కెల్లయెడల లోపము వైకల్పికముగ నగును. ౮౦

ఉదా:—చూడకుము మిటు-చూడ కిటు; ఇటు చూడకుము-ఇటు చూడకు; చూడకుము నన్ను, చూడకునన్ను.

సూ:—ఆమ్రేడితము పరమ గునపుడు మధ్యమపురుష ము-డు-ప్రత్యయములకు లోపము వైకల్పికము. ౮౧

ఉదా:—ఉండుండుము-ఉండుముండుము, వినువినుఁడు-వినుఁడువినుఁడు మొదలయినవి.

సూ:—అనుకరణశబ్దముల కచ్చు పర మగునపుడు-ర్-మ్-నర్-న-అనునవియు, అచ్చులు హల్లులు గూడఁ బర మగునపుడు-న్-అనునదియు యథాప్రయోగముగా నాగమము లగును. ౮౨

ఇందుకుఁ బ్రయోగములు—

,, దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ-గొబ్బుగొబ్బు రనునాదంబుల్,
తీవ్రమని గిబ్బుమని గు వేలునఁబడియెన్ దబ్బునఁజలు చెన్;

వాన బోరున కురిసెన్; జలజల నలుసులు రాలెను-సరసిపై నీరు సలసలఁ దెరలె"
ఇట్లనేకములు కలవు.

ఒకప్పు డేదియు రాదు. "దేవతలమనంబు దిగ్గనంగ" బోరు మొదలగు కొన్నిటికి అనన్ చేరఁగా బోరనన్-దిగ్గనన్-మొదలగు రూపము లగును, ఇదియే బోరుననె-దిగ్గుననె-అనునట్లు కూడఁ బ్రయోగింపఁబడెను-

సూ:—ఇవి ద్విరుక్తము లగునపుడును మకారము వైకల్పికముగా నగును. ౮-౩

ఉదా:—,, పటపటమని-పటపట పండ్లు గీటుకొని, జలజలమని-కన్నుల జలజలకారెడు నీరు—" మొద—

విశేషణ మగునపుడు కొన్నిటికి నివర్ణము చేరును. ఉదా—నిగనిగనిసంజకెంజాయ-పెళపెళని చీర—మొద—

సూ:—కొన్ని ద్విరుక్తములమీదఁ గొన్నిబహువచనప్రత్యయములు గనవచ్చును. ౮-౪

ఉదా:—వెకవెకలు-చెకచెకలు-దడబిడలు-గడబిడలకు మొ—

ఆడుధాతువుతోఁ జేరి యివి శబ్దపల్లవము లగుచున్నవి. ఉదా—గిజగిజలాడు - సలసలలాడు - కుతకుతలాడు - మొద—వీని నన్నిటినిబట్టి చూడఁగా వీనికి విశేష్యవిశేషణక్రియావిశేషణాదిధర్మములన్నియుఁ గలవని తోఁచుచున్నది.

సూ;—అనుకరణమందు విసర్గము లోపించును. ౮-౫

అనుకరణ మనఁగా అనుధాతువును జేర్చి చెప్పుట.

జయతు మహారాజః+అనియె=జయతు మహారాజ యనియె.

వర్ధతాం శ్రీః+అనియె=వర్ధతాం శ్రీ యనియె.

రామాయ నమః+అనియె=రామాయ నమ యనియె.

సూ:—విసర్గ లోపించుచుచోఁ గొన్నిటి తుదనుండు అకారమునకు ఓకారము వైకల్పికముగ నగును. ౮౮

ఉదా:—రామాయ నమో యనిమె. గతానుగతికోలోకో యటంచుర్గ. పాతుమా మీశ్వరో యని మొ—

సూ:—అనుకరణమందు తుదిహల్లునకు ద్విత్వ మగును. ౮౯

ఉదా:—పాయాత్ + అనుచు, పాయాత్తనుచు- ఆత్మార్థం పృథివీం త్యజేత్తనెను- మొ—

సూ:—హ్రస్వైక స్వరశబ్దముల మకారమునకు ద్విత్వము నిత్యము.

ఉదా:—కస్త్వమ్ + అనిమె = కస్త్వమ్మనిమె. తత్కిమ్ + అనిమె = తత్కిమ్మనిమె- మొ—

హ్రస్వ మనుటచే రక్షతుమామ్ + అనె-రక్షతుమామనె-ఇత్యాదులందు ద్విత్వము రాదు.

సూ:—ద్విస్వరశబ్దముల మకారమునకు ద్విత్వము వైకల్పికము. ౯౧

ఉదా:—దాసోఽహమ్ + అనె=దాసోఽహమ్మనె—దాసోఽహమనె—మొద—

సూ:—అనుకరణమందు ఉకారాంతముల విసర్గమునకు వువర్ణ మాదేశమగును.

ఉదా:—అయంగురుః + అనె=అయంగురువనె— ఇయం ధేనుః + అనె= ఇయంధేనువనె— మొద—

సూ:—అనుకరణమునందు తుదిదీర్ఘమునకు హ్రస్వము రాదు. ౯౦

ఉదా:—పాతు మాం పరమేశ్వరీయని- దుర్బలస్య బలం రాజా యన వినవే- మొద—

సూ:—వాక్యావసానమందును అర్థసంశయము గలుగునపుడును అపార్థము తోఁచునపుడును సంజ్ఞావాచకములు పర మగునపుడును, సంధి చేయబడి లోపము రాదు. ౯౧

ఉదా:—సత్యంబుతో సరియుఁ గావు. ఎఱుఁగుమెల్ల ధర్మములకు.
రాజునకు చారులే కన్నులు- రాజునకుఁ జారులే కన్నులన్నచో
సర్థసంశయము నపార్థమును గూడవచ్చును- ఇట్టిచోట్ల ద్రుత
లోపము కార్యము.

సూ:—ఋ—ఌ—వర్ణములు రేఫ లకార తుల్యములు. ౯—౨

అనఁగా, ర—ల—పర మగునపు డెట్టికార్య మగునో, అప్పు
లయినను ఇవి పరమగునపు డట్టికార్యమే యగును.

ఉదా:—అతఁడుఋషి- చూడుము ఋకారము- సంధిరాదు.
ఆఋణము- ఇది ఋకారము- యకారాగమము లేదు.
వచ్చెఋషి-వచ్చెనృషి- లోపసంశ్లేషములు వచ్చెను.

## సంస్కృతసంధులు

ఇవి కొన్ని సూచింపఁబడును. విశేషములు సిద్ధాంతకౌముది
వలన గ్రహింపవచ్చును.

## సవర్ణదీర్ఘసంధి

సూ:—అకారాదులకు అకారాదులు క్రమముగాఁ బర మగునపుడు
రెంటికి నేకముగా దీర్ఘము వచ్చును. ౯—౩

ఉదా:—దండక+అటవి = దండకాటవి, రామ+ఆజ్ఞ = రామాజ్ఞ
సీతా+అనసూయా = సీతానసూయలు, కవి+ఇంద్రుఁడు=
కవీంద్రుఁడు, గురు+ఉదయము = గురూదయము, పితృ+
ఋణము=పితౄణము (పితృఋణము-పితౄణము) ఋకారాంత
ములకు మాత్ర మిట్లు మూఁడురూపము లగును. ఇట్లు, దేవా
గౌరీశుఁడు- మొద—

## పరరూపసంధి

సూ:—ప్రారంగాదులయందు పరరూపము బహుళము. ౯—౪

ఉదా:—సార+అంగము=సారంగము, కుల+అట=కులట, సీమ+అంతము=సీమంతము, బింబ+ఓష్ఠము=బింబోష్ఠము-మొద—బహుళ మనుటచే మార్తాండుఁడు- మార్తాండుఁడు, బింబౌష్ఠము అనురూపములును గలుగును.

## గుణసంధి

సూ:—అవర్ణము ఇవర్ణము కలిసి ఏకార మగును ౯౩

ఉదా:—పరమ+ఈశ్వరుఁడు = పరమేశ్వరుఁడు. రమా+ఈశుఁడు= రమేశుఁడు. దేవ+ఇంద్రుఁడు=దేవేంద్రుఁడు. మొద—

సూ:—అవర్ణము ఉవర్ణము కలిసి ఓకార మగును. ౯౪

ఉదా:—సూర్య+ఉదయము = సూర్యోదయము. దయా+ఉదధి= దయోదధి. సీతా+ఊర్మిళా=సీతోర్మిళలు. మొద—

సూ:—అవర్ణమునకు ఋవర్ణమునకు అర్ వైకల్పికముగ నగును.

ఉదా:—దేవ+ఋషి=దేవర్షి, దేవఋషి, సప్త+ఋషులు=సప్తర్షులు సప్తఋషులు, వసంత+ఋతువు = వసంతర్తువు- వసంత ఋతువు, మొద—

## వృద్ధిసంధి

సూ:—అవర్ణమునకు ఏ ఐ లలో నేది పరమైనను రెంటికిని ఐకార మాదేశ మగును. ౯౫

ఉదా:—కరుణా+ఏకనిలయుఁడు=కరుణైకనిలయుఁడు, సకల+ఐశ్వర్యములు=సకలైశ్వర్యములు, జన+ఏకీభావము=జనైకీభావము- మొద—

సూ:—అవర్ణమునకు ఓ ఔ లలో నేది పరమైనను రెంటికిని ఔకార మాదేశ మగును. ౯౬

ఉదా:—గంగా+ఓఘము = గంగౌఘము, మహా+ఔన్నత్యము= మహౌన్నత్యము, దేవ+ఔన్నత్యము=దేవౌన్నత్యము- మొద—

## యణ్ సంధి

సూ:—అచ్చు పర మగునపుడు ఇవర్ణమునకు యకారము వచ్చును.
సవర్ణము కాని యచ్చని యర్థము. ఇట్లే ముందును గ్రహించునది.

ఉదా:—పతి+ఆజ్ఞ, పత్ య్+ఆజ్ఞ=పత్యాజ్ఞ-ఇట్లు, అతి+ఉత్సాహము=అత్యుత్సాహము-మొద—

సూ:—అచ్చు పర మగునపుడు ఉవర్ణమునకు వకారము వచ్చును.

ఉదా:—గురు+ఆజ్ఞ, గుర్ వ్+ఆజ్ఞ=గుర్వాజ్ఞ-ఇట్లు, మను+అంతరము=మన్వంతరము-వధూ+ఆకృతి=వధ్వాకృతి-మొద—

సూ:—ఋకారమునకు రేఫము వచ్చును. ౧౦౩

ఉదా:—మాతృ+ఆదరము- మాత్ ర్+ఆదరము=మాత్రాదరము-పితృ+ఆనందము=పిత్రానందము-మొద—

## హల్సంధులు

సూ:—సకార తవర్గములకు-శవర్ణ చవర్గములు పరమైన యెడల క్రమముగా శవర్ణ, చవర్గములే వచ్చును. ౧౦౩

ఉదా:—దుస్+శీలము=దుశ్శీలము, దుస్+చరిత్ర=దుశ్చరిత్ర-మనస్+శాంతి=మనశ్శాంతి, తత్+చిత్రము=తచ్చిత్రము.

సూ:—అచ్చులును, గ-జ-డ-ద-బ-మొదలగు కొన్ని హల్లులును పర మగునపుడు క-చ-ట-త-ప-లకుఁ గ్రమముగా-గ-జ-డ-ద-బ-లాదేశ మగును. ౧౦౪

ఉదా:—వాక్+ఈశుఁడు=వాగీశుఁడు-దిక్+గజము=దిగ్గజము-అచ్+అంతము=అజంతము-అచ్+జాతి=అజ్జాతి
తురాషాట్+ఆజ్ఞ = తురాషాడాజ్ఞ - రాట్+డంబరము=రాడ్డంబరము-

చిత్ + ఆనందము- చిదానందము-తత్ + దేశము=తద్దేశము-కకుప్ + అంతము=కకుబంతము-అప్ + బిందువు=అబ్బిందువు-ఇట్లు, పరిత్యగాత్మ-అజ్వర్ణము-తటిద్భీతి-మరుద్గణము-అబ్ధి-విద్వద్బృందము-మొద—

ఇట్లు వచ్చిన దకారమునకు-జ-ఝ-పర మగుచో జకారము వచ్చును.

ఉదా:—సద్ + జన్మము=సజ్జన్మము - తద్ + ఝరము = తజ్ఝరము - మొదలయినవి.

ఈసంధిలో ననేకభేదములు గలవు.

సూ:—అనునాసికవర్ణములు పరము లగునపుడు, క-చ-ట-త-ప-ల కాయావర్గులలోనియనునాసికవర్ణములు వచ్చును. ౧౦౫

ఉదా:—వాక్ + మయము=వాఙ్మయము, అచ్ + మధ్యము=అఞ్మధ్యము, విరాట్ + మహిమ=విరాణ్మహిమ, జగత్ + నాటకము=జగన్నాటకము, అప్ + మయము=అమ్మయము.

సూ:—క-చ-ట-త-ప-లకంటెఁ బర మైన శవర్ణమునకు వైకల్పికముగా ఛకారము వచ్చును. శవర్ణము పర మగునపుడు తకారమునకు చకారము నిత్యముగ నగును. ౧౦౬

ఉదా:—త్వక్ + శోభ=త్వక్ఛోభ-త్వక్శోభ, అచ్ + శబ్దము=అచ్ఛబ్దము-అచ్శబ్దము, విట్ + శూద్రులు=విట్ఛూద్రులు-విట్శూద్రులు, విద్యుత్ + శక్తి = విద్యుచ్ఛక్తి-విద్యుచ్శక్తి, అప్ + శీలము=అప్ఛీలము-అప్శీలము.

సంస్కృతమునం దీవిధి వైకల్పికమైనను విద్యుచ్శక్తివంటి కొన్నిశబ్దములకు వాడుక లేదు.

సూ:—పదాంతమందలి సకారమునకు క-ఖ-పరమైనచో జిహ్వామూలీయమును, ప-ఫ-పర మగునపుడో ఉపధ్మానీయమును వచ్చును.

ఉదా:—యశస్ + కాయము=యశఃకాయము, అయస్ + ఖడ్గము= అయఃఖడ్గము, మనస్ + పద్మము = మనఃపద్మము, తపస్ + ఫలము=తపఃఫలము.

కామ-కాంత-కుంభ-పాత్రాదులు కొన్ని పర మగునపు డీ కార్యము రాదు. శ్రేయస్కాముఁడు- అయస్కాంతము- ఇత్యాదులు ప్రయోగములవలనఁ దెలియునది.

మఱియు క్షకారము పరమయినయెడల నిత్యముగా సకారము నకు విసర్గమే వచ్చును. మనఃక్షోభము—తపఃక్షాంతులు- మొద—

సూ:—మనస్, మొదలగువానిలోని 'అస్' నకును, దానికంటెఁ బర మైన అకారమునకును ఓకార మేకాదేశ మగును. ౧౦౮

ఉదా:—మనస్ + అభిరాముఁడు=మనోఽభిరాముఁడు, శ్రేయస్ + అభిలాష=శ్రేయోఽభిలాష, వయస్ + అనంతరము=వయోఽనంతరము, పయస్ + అబ్ధి—పయోఽబ్ధి- మొ— ఽ ఈగుర్తు అకారమును దెలుపుచుండును.

సూ:—కొన్ని హల్లులు పర మగునపుడు పదాంతమం దున్న 'అస్' నకు ఓకారము వచ్చును. ౧౦౯

ఉదా:—మనస్ + నాయకుఁడు = మనోనాయకుఁడు, ఇట్లు అమోమయము- పయోముఖము- తపోధనులు- శ్రేయోవృద్ధి- యశోదాయకము మొద—

సూ:—అజంతములైన యుపసర్గలమీఁదను, సిద్ధసమాసమందును ఛకారము పరమయినచో, అచ్చునకు చకార మాగమ మగును. ౧౧౦

ఉదా:—ప్ర + చ్ + ఛన్నము=ప్రచ్ఛన్నము! మేఘ + చ్ + ఛాయ= మేఘచ్ఛాయ. ఇట్లు విచ్ఛిత్తి— శరీరచ్ఛాయ- స్వచ్ఛందము- వృక్షచ్ఛాయ- మొద—

సమాస మనుటచే స్త్రీ ఛత్రము ధరించెను. యువతి ఛాత్రున కన్నము పెట్టెను. ఇత్యాదులందు రాదు.

ఇది సంధిప్రకరణము.

ఇది

శ్రీ చర్ల బ్రహ్మయశాస్త్రి గురువరకరుణాధీత పాణినీయుండగు
మల్లాది సూర్యనారాయణశాస్త్రిచే రచియింపఁబడిన
సూర్యనారాయణీయంబను ఆంధ్రభాషాను
శాసనమందు ప్రథమభాగము.



# తప్పొప్పులపట్టిక



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 33 | 9 | మునకుఁబదులు- | మునకుబదులు |
| 39 | 16 | ఇందుప్రత్య- | ఇందువ్రత్య- |
| 39 | 22 | కారఁప్రక- | కారకప్రక- |
| 46 | 21 | ప్రధానభూత- | ప్రధానీభూత- |
| 73 | 2 | జెప్పెనుఁ | జెప్పెను. |
| 107 | 6 | బ్రమోగ- | బ్రయోగ- |
| 143 | 7 | కొంబసిఁడి- | క్రొంబసిఁడి |
| 145 | 8 | ఆరెల్లకు | ఆర్నెల్లకు |



సూర్యనారాయణీయము

అను

# ఆంధ్రభాషానుశాసనము

ద్వితీయ భాగము

అనుశాసనకర్త :

రాజమహేంద్రవర రాజకీయ శాస్త్రకలాశాలాంధ్ర పండితులగు

బ్రహ్మశ్రీ మల్లాది, సూర్యనారాయణశాస్త్రిగారు

ప్రథమముద్రణము

ప్రకాశకుఁడు :

కవితా వాసుదేవయ్య

అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే

శ్రీ సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రితము.

రాజమహేంద్రవరము

1926

 [ వెల 0—10—0

# విషయసూచిక.

## ద్వితీయభాగము

శబ్దప్రకరణము



---

# ఆంధ్రభాషానుశాసనము

## ద్వితీయ భాగము



### శబ్దప్రకరణము.

#### డుప్రత్యయాంతములరూపనిష్పత్తి.

విభక్తిప్రకరణమునఁ జూపఁబడిన నామవిభక్తులలో నేవి యేజాతిశబ్దములకంటె వచ్చునో అవి వచ్చునపు డెట్టియాగమాదేశములు వచ్చునో యావిషయ మీశబ్దప్రకరణమునఁ దెలుపఁబడును. డిచినవిభక్తులను విభక్తులరూపాంతరములను విభక్తిప్రకరణమున దాహరించినశబ్దములనుబట్టి గ్రహించునది.

సూ:—ప్రథమైకవచనమునందు డుప్రత్యయము కనఁబడునట్టి తత్సమాచ్ఛికనామములు డుమంతము లనఁబడును. ౧

అట్టివానిని గొన్నిగణములుగాఁ జూపుచున్నాను.

త్సమములలో :—అకారాంతములు మహద్వాచకములు నైన రామ-కృష్ణ-శివ-ధీర-సుందర-భార్గవ-రాజపురుష-ఆశ్రితవత్సల నిర్మలయశస్క-ఇత్యాదులును,

చ్ఛికములలో :—మహద్వాచకము లయినబల్లిదాదులు, తమ్ము-అల్లు-మొదలయినవియు, మగాదులును, మత్వర్థాదులవచ్చెడి-ఆ-ఈ-గా-కా-ప్రత్యయములు తుదఁగలవియు, అమహద్వాచకము లయినకయిరాదులును, వాఁడు-వీఁడు మొదలగు కొన్ని సర్వనామములును, డుమంతములు.

సూ:—ప్రథమైకవచనమున డు-ము-వు-ప్రత్యయములలో నేదియు రానిశబ్దము లన్నియు స్త్రీసమము లనఁబడును. ౨

స్త్రీసమము లనుటచే నట్టివానికి స్త్రీలింగశబ్దములకు వలెనే

వ్యాకరణకార్యము లగు ననియు కొన్ని పుంలింగములై అకారాంత ములుగాఁ గనఁబడుచున్నను వానికి ఉత్వ డుప్రత్యయాదులు రావనియు గ్రహించునది.

సూ:—మహద్వాచకము లయిన తత్సమనామములయొక్కయు బల్లిదాదులయొక్కయు చివరనున్న అకారమునకు ఉకారము బహుళముగా నగును. 3

ఉదా:—రామ-రాము, ధీర-ధీరు, రాజపురుష-రాజపురుషు, బల్లిద-బల్లిదు, ఇత్యాదులకు ఉకారము నిత్యము.

బహుళ మనుటచే, మిత్రాదులకు దూతాదులకు ఉకారము వైకల్పికముగ వచ్చును. మగ-కయిర-మొదలయినవి అకారాంతము లైనను వానికి ఉకారము రాదు.

సూ:—మహద్వాచకములై డుమంతము లయిననామములకును, కయిరాదులకును ప్రథమైకవచనమున 'డు' ప్రత్యయము వచ్చును. 4

వి-ప్ర-2 సూత్రముచే డుప్రత్యయము వెనుక బిందువు వచ్చును.

ఉదా:—రాముఁడు-మిత్రుఁడు-దూతుఁడు-గురుఁడు-విధాతృఁడు-బల్లిదుఁడు-తమ్ముఁడు-మగఁడు-కయిరఁడు-మొద—

మగఁడు - మనుమఁడు - రాయఁడు - నాయఁడు - ఒడయఁడు - బాపఁడు-రంగఁడు-లింగఁడు-పాపఁడు-బిడ్డఁడు-పిల్లఁడు - కుఱ్ఱఁడు - గరుడఁడు-మాలఁడు-గొల్లఁడు-వ్రేఁడు-ఱేఁడు-వన్నెలాఁడు - మావటీఁడు-ఎల్లిగాఁడు-చెలికాఁడు-అందగాఁడు-ఇత్యాదులు మగాదులు.

కయిరఁడు-కత్తళఁడు-జన్నఁడు-నీలఁడు - బొల్లఁడు - నడగఁడు-మొదలయినవి కయిరాదులు.

బహువచనమందు లు ప్రత్యయము చేరును.

ఉదా:—రాములు-బల్లిదులు-మగలు-కయిరలు-ఇత్యాదులు.

సూ:—ఒడయ మొదలగు కొన్నిటి తుది అకారమునకు ఉకారము వచ్చుటయుఁ గలదు. ౧౧

ఉదా:—ఒడయుఁడు-ఒడయు రాలు- 'యువతిమండలములకొడయుఁడవు గమ్ము' జైమిని- ఇట్లే నాయుఁడు-రాయుఁడు- మొదలగు వ్యావహారికములును సాధువు లగును.

ఇంతటినుండి రూపనిష్పత్తి కొకతత్సమశబ్దమును ఒకయాచ్ఛిక శబ్దము నుదాహరింపఁబడుచుండును. విశేష మున్నచోట్ల నాయాశబ్దములు నుదాహరింపఁబడును.

ప్ర- రాముఁడు-రాములు. రాయఁడు-రాయలు.

వి-ప్ర. ౨-౩-సంబోధనసూత్రములచే ఏకవచనమున అ-బహువచనమున ఆర-వచ్చును. ఓ-మొదలయినవి మొదలఁ జేరును.

సం-ఓ రాముఁడ-ఓ రాములార ఓ రాయఁడ-ఓ రాయలార

రాముఁడ-రాములార రాయఁడ-రాయలార

సూ:—సంబోధనమునఁ దత్సమనామముల ఉకారముమీఁది డు ప్రత్యయమునకు లోపము వైకల్పికముగా నగును. అగుచో శాస్త్రముచే వచ్చిన ఉకారమునకు అకారము వచ్చును. ౬

ఉదా:—(ఓ రాము+డు) ఓ రామ-తత్సమము లనుటచే, ఓబల్లిదుఁడ-ఓతమ్ముఁడ ఇత్యాదులందు డులోపము రాదు. 'ఉకారము మీఁది' యనుటచే ఓరాయఁడ, ఓ తేఁడా, ఓవిధాతృఁడ, ఇత్యాదులందు డులోపము రాదు. "శాస్త్రముచే వచ్చిన" యనుటచే ఓగురూ ఇత్యాదులకు అకారము రాదు. రాయఁడు శబ్దము సంజ్ఞలతోఁ జేరి సంస్కృతప్రాయ మగునపుడు, డులోపము వచ్చును. శ్రీకృష్ణరాయా బుక్క-రాయా- మొ.

సూ:—ఓయి మొదలగువానికిఁ బ్రత్యేకప్రయోగమును గలదు. ౭

ఉదా:—రావోయి! ఓరిపోరా, ఓసిపోవే-ఇత్యాదులు

సూ;—సంబోధనమునఁ బదములతుదనున్న అకార ఇకారములకు దీర్ఘము వైకల్పికము. ౮

సం.ప్ర. ఓరాముఁడా-ఓరాములారా ఓరాయఁడా-ఓరాయలారా
ఓరాముఁడ-ఓరాములార ఓరాయఁడ-ఓరాయలార
ఓరామా
ఓరామ

సూ:—మధ్యమపురుషక్రియాసంబంధమున 'ఆర' వైకల్పికముగా లోపించును. ౯

ఉదా:—వినుఁడు బాలకులు. వినుఁడు బాలకులార-మధ్యమపురుష క్రియ లేనిచో 'ఆర' లోపింపదు. "అన్నలార మిమ్ము నడిగెద నొకమాట"

సూ:—డుమంతములకును, ఇవర్ణాంతములకును ఐకారాంతములకును ద్వితీయైకవచనమున 'ని' ప్రత్యయమును, వీనికి బహువచనమునందును తక్కిన యెల్ల శబ్దములకు రెండువచనములందును ను-ప్రత్యయమును వచ్చును. ౧౦

ఉదా:—భీముని-బల్లిదుని-మగనిని-కవిని-స్త్రీని-రైని-కైని; భీములను కవులను-స్త్రీలను; సీతను - సీతలను - వధువును - వధువులను-కన్నెను-కన్నెలను; మొద—

సూ:—మహద్వాచకము లైన సర్వనామములకును మగాదులకును కయిరాదులకును ద్వితీయాదుల యేకవచనములందు నిత్యముగాను, తక్కి నడుమంతములకు వైకల్పికముగాను నివర్ణ మాగమ మగును. ౧౧

ఉదా:—వానిని-మగనిని-కయిరనిని, వానిచేతఁ - మగనిచేతన్ - జేచేతన్ - చెలికానికిన్ - మొద—భీమునిని-భీముని - భీమునిచేతన్-భీముచేతఁ,తమ్మునిని-తమ్ముని - తమ్మునిచేతఁ - తమ్ముచేతఁ,

విధాతృనిని - విధాతృని - విధాతృనిచేతన్ - విధాతృచేతన్,
గురునిని-గురుని-గురునిచేన్-గురుచేన్-మొద—

సూ:—ఎల్లనామములకును ద్వితీయాది బహువచన ప్రత్యయములు పర మగునపుడు 'ల' వర్ణ మాగమ మగును. ౧౨

ద్వి. రామునిని-రాముని, రాములను. రాయనిని-రాయలను.

తృ. రామునిచేతన్-రాములచేతన్. రాయనిచేతన్- రాయలచేతన్ రాముచేతన్.

సూ:—నీ-మీ-శబ్దములకుఁ దప్ప ఇవర్ణముమీఁదను ఐకారము మీఁదను 'కిన్' షష్ఠియు, తక్కిన యచ్చులమీఁద 'కున్' షష్ఠియు వచ్చును. ౧౩

ఇవర్ణ మనుటచే నామముయొక్క ఆగమముయొక్క ఆదేశము యొక్క ఇకారమును, ఈకారమును గూడ గ్రాహ్యమగును. నీ-మీ-లకు కున్ ప్రత్యయమే వచ్చును.

ఉదా—నీకున్- మీకున్- హరికిన్- స్త్రీకిన్-రైకిన్- మానవటీని కిన్-
గోవిందునికిన్- విధాతృనికిన్; గోవిందునకున్- విధాతృనకున్-
గురునకున్--తమ్మునకున్-సీతకున్-కన్నెకున్- మొద—

సూ—ఉకారఋకారములమీఁద షష్ఠీవిభక్తియందు 'న'వర్ణాగమము బహుళముగా నగును. ౧౪

౧౧ సూత్రముచేవచ్చు నివర్ణము వైకల్పికముగావున, అది రానపుడు దీనిచే నవర్ణము వచ్చును. నివర్ణముమీఁద 'కిన్' నవర్ణము మీఁద 'కున్' వచ్చును.

ఉదా—భీమునకున్-విధాతృనకున్, చెట్టునకున్-కొడుకునకున్.

బహుళమనుట 'కున్' పరమగునపుడు నవర్ణాగమము రాని ప్రయోగములుగూడఁ గలవనుటకు.

"ఉత్తరదిక్కు కనియె—ఉ. హరి, ~~[illegible]~~, వనరుహ వాభు సద్భవుఁడు—నిక్కమా, కొంతతనవుకు (బ్రహ్మ) పీఠమా, లుప్తవర్ణానా, పత్రిక

చూపి రాజుకున్—జైమి, కడుపు కిడక—పంచ, మందు కయినన్—యయా, పృథు కోడిపోయినసురరాజా—ప్రబోధ, వానుకుం గవిత—ప్రభా, మనువుకు—వనముకు—భాగవ— వంతుకు వచ్చుసత్య—పారిజా, కలవుకుఁ దోడావపంట—కువ, మోముకు వాలుఁగన్నులు—అనిరు, గురువుకు బొమ్మవెట్టిరి—కవిరా, కప్పనఁగా నింటిమీఁది కప్పుకు చేరా—ఆం—భా"

ఇత్యాదులు వందలకొలఁది గలవు. అయినను, రాముకున్-దేవుకున్-వంటిప్రయోగములు విన నింపుగావు. కావున నమహద్వాచకములలో అకారాంతములు ఉకారాంతములు నైన-తత్సమాచ్ఛికములకు (వనముకున్-వంతుకున్) నవర్ణాగమము వైకల్పికముగఁ జేసినఁ జేయవచ్చును గాని, భీముకున్-గురుకున్-విధాతృకున్ -అనునట్లు తత్సమమహత్తులపై నవర్ణాగమము చేయకుండుట యుచితము కాదు. ఇది వ్యవహారయోగ్యము శ్రుతిరమ్యము నగురీతిని బ్రయోగింపఁ దగును.

షష్ఠీ:- రామునియొక్క- రాములయొక్క. రాయనియొక్క రాయలయొక్క.
రామునికిన్- రాములకున్. రాయనికిన్- రాయలకున్-
రామునకున్- రాములలోపలన్- రాయలలోపలన్.

సూ—ఉకారము తుదఁ గలజడవాచకములమీఁద-అందు-నన్-రెండును, తక్కిన శబ్దములమీఁద - అందు - ఒక్కటియుఁ జేరును. ౧౫

ఉదా—జలమందు-జలమునన్, తరువునందు-తరువునన్; దేవునందు-మిత్రమునందు- గిరియందు-శాలయందు-గోనెయందు-మొద-

'పై' మున్నగు కొన్నిటిమీఁద-అందు-నన్-రెండును గూడఁ జేరినప్రయోగములు కనరావు వినరావు, కావున, 'పైనన్' అని కొందఱు ప్రయోగించుట పొరపాటు. 'పైని' అని వాడవలెను. ఇది సప్తమ్యర్థమున ద్వితీయవచ్చిన రూపము.

సూ—అందు పరమగునప్పుడు ఉకారఋకారములకు నిత్యముగాను

ఆగమ ముువర్ణము మీఁదను అమహద్వాచకముల ఆగమ వువర్ణము మీఁదను వైకల్పికముగాను నకార మాగమమగును. ౧౬

ఉదా—గోవిందు+న్+అందు=గోవిందునందు-విధాతృనందు; మిత్రమునందు-మిత్రమందు, వనమునందు-వనమందు; తనువునందు-తనునందు.

అమహద్వాచకము లనుటచే, వధువు-గురువు-మొదలగు మహతీమహద్వాచకములయాగమ వువర్ణము మీఁద నకారము నిత్యముగా నగు నని తెలియునది. వధువునందు-గురువునందు. "ఆగమ, ము-వు-వర్ణముల కందువర్ణకము పరమగునపుడు నుగాగమంబు విభాష నగు"నని చిన్నయసూరి వ్రాసెను గాని గురునందు-వధునందు వంటి ప్రయోగములు ప్రామాణికగ్రంథములఁ గనరాకపోవుటచేతను అట్టి ప్రయోగములు శ్రావ్యములు కాకపోవుటచేతను అమహద్వాచకము లనెడి విశేషణ మావశ్యక మగుచున్నది. కొన్ని డుమంతములకు నివర్ణాగమము రానియపుడే, అందు పరమగునపు డీ సూగమ మగును.

సప్త: రామునియందు-రాములయందు. రాయనియందు- రాయలయందు
రామునందు-రాములందు- రాయలందు.

అందు పరమగునపుడు బహువచనమందలి ఆగమ లవర్ణమునకు సర్వత్ర సంధి వైకల్పికమని తెలియునది. తక్కిన విభక్తులను రూపాంతరముల నూహించునది. ఇట్లు, గోవిందుఁడు-పాత్రుఁడు - యోధుఁడు-శంభుఁడు-సవితృఁడు; బల్లిదుఁడు-కొమరుఁడు మొదలయినవి రామశబ్దమువలెను; మగఁడు-మనుమఁడు-కయిరఁడు మొదలయినవి రాయఁడు శబ్దమువలెను, విభక్తులను బొందును.

సూ:—ఉకారాంతము లైనతత్సమనామములకును గోశబ్దమునకును ప్రథమైకవచనమున వుప్రత్యయము బహుళముగా నగును. ౧౭

ఉదా:—మనువు-దనువు-వధువు-ధేనువు-తరువు-గోవు-మొద—

బహుళమనుటచే గుర్వాదులకు డుప్రత్యయము గూడ వచ్చును. ఉదా-గురువు-గురుఁడు, శంభువు-శంభుఁడు, విష్ణువు-విష్ణుఁడు వటువు-వటుఁడు, విభువు-విభుఁడు-వసువు-వసుఁడు-ఇత్యాదులు.

సూ:—అకారాంతములు అమహద్వాచకములు నయినతత్సమనామములకును మిత్రాదికళత్రాదులకును ప్రథమైకవచనమున ము ప్రత్యయము బహుళముగా నగును. ౧౫

ఉదా:—వనము-జలము-ధనము-విశ్వము-స్వర్గము-వృక్షము-మృగము-శార్దూలము- విహంగము - కీటకము - నాగము - మొద— కళత్రము మహతీవాచకము-అపత్యము-సంతానము - జనము- మొదలయినవి మహన్మహతీవాచకములు.

బహుళమనుటచే మహత్తులైన మిత్రాదులకు వైకల్పికముగ డు ప్రత్యయము గూడ వచ్చును.

ఉదా:—మిత్రము-మిత్రుఁడు, శరణము-శరణుఁడు, ప్రధానము-ప్రధానుఁడు, పాత్రము-పాత్రుఁడు.

కేవలమహద్వాచక మయినపుడు జనశబ్దమునకు డుప్రత్యయము వచ్చును - జనుఁడు - జనులు - ఈబహువచనము మహత్త్వార్థమందును వాడఁబడినది.

సూ:—మహత్తు లగువిధాత్రాదులకు అకారమును స్త్రీసమత్వమును వైకల్పికముగ నగును. ౧౬

ఉదా;—విధాతృ-ఋకారమునకు అకారమురాఁగా విధాత-స్త్రీసమత్వము వచ్చుటచేఁ బ్రథమైకవచనప్రత్యయము రాదు. ఈవిధి వైకల్పికము కావున డుప్రత్యయము వచ్చునపుడు విధాతృఁడు అగును. విధాతృ-ధాతృ-దాతృ-సవితృ-నేతృ-ఇవి విధాత్రాదులు.

సూ:—మహద్వివక్షయందు సముద్రాదులకు డువర్ణకము వచ్చును. డువర్ణకముతోఁ నామముతుది అకారమునకు కారమగును. ౨౦

ఉదా:—సముద్రుఁడు-మేఘుఁడు-హిమవంతుఁడు. మైనాకుఁడు-ఉరగుఁడు-మొ॥ద—వివక్ష లేనిచోఁ మువర్ణకమగును. సముద్రము-మేఘము-మొ—

సూ:—వృద్ధాదుల డువర్ణకము వైకల్పికముగ లోపించును. ౨౧

ఉదా:—వృద్ధు-వృద్ధుఁడు. ఇట్లు నీచు-చార్వాకు-దాసు-గృహస్థు-ధూర్తు-భట్టు-బందుగు-మొదలగువానికి రెండురూపము లగును. "మహితాత్ముఁడు నన్నయభట్టుదక్షతఁ"

సూ:—దూతాదులకు స్త్రీసమత్వము బహుళము. ౨౨

ఉదా:—దూత-దూతుఁడు. ఇట్లు-యోధ-శుంఠ-మొ— అమహద్విశేషణము లగునపుడు స్త్రీసమత్వము నిత్యము. "సింగంబు దూత యగు జంబుకంబు"

సూ:—ప్రత్యేకప్రయోగమున దేవశబ్దమునకు బహువచనమును సురశబ్దమున కేకవచనమును లేవు. సంస్కృతసమాసమందుండును. ౨౩

ఉదా:—దేవుఁడు-భూదేవులు, సురలు-భూసురుఁడు.

సూ:—సురశబ్దము నిత్యముగాను అసురశబ్దము వైకల్పికముగాను స్త్రీసమము లగును. సిద్ధసమాసమునఁ గావు. ౨౪

ఉదా:—సురలు—సురలన్; అసుర-అసురుఁడు; అసురలు-అసురులు; అవనీసురులు-నిఖిలాసురులు.

సూ:—మత్వర్థీయాంతములైన సంస్కృతశబ్దముల ద్వితీయైక వచన రూపములు తెలుఁగున నామము లగును. అగుచోఁ దుది మకారము లోపించును. ౨౫

ఉదా:—శ్రీమంతమ్-శ్రీమంత, ఇట్లు గుణవంత-విద్వాంస-ఇత్యాదులు.

ప్రాకృతమందు ప్రథమైకవచనమున శ్రీమంతో భగవంతో గుణవంతో యనురీతిని మత్వర్థీయాంతశబ్దములరూపము లుండును. ఆరూపములే తెలుఁగున అకారాంతము లయిన ప్రాతిపదికము లయిన వనియు నూహింపవచ్చును.

సూ:—మహద్వాచకములైన తత్సమమతుబంతనామములు రామ శబ్దతుల్యములు. ౨౬

అనఁగా డుప్రత్యయాదులు రామశబ్దమునకు వలెనే వానికి వచ్చు ననుట.

ఉదా:—శ్రీమంతుఁడు- విద్వాంసుఁడు; గుణవంతుఁడు-గుణవంతులు- గుణవంతుని- ఇత్యాదిరూపము లగును.

సూ:—కొన్ని మతుబంతముల ప్రథమైకవచనరూపమే వైకల్పికముగఁ దెలుఁగున నామ మగును. అగుచో దానికి ఉకార మాగమ మగును. ౨౭

ఉదా:—భగవాన్+ఉ=భగవాను, హనుమాన్+ఉ=హనుమాను, రామశబ్దమునకు వలె డుప్రత్యయాదులు వచ్చును.

ఉదా:—భగవానుఁడు—హనుమానుఁడు-ఇత్యాదులు.

పక్షమున-భగవంతుఁడు, హనుమంతుఁడు-

దీనిరూపాంతరము హనుమ. "పడగనున్న హనుమ భయ విహ్వాలుఁడు గాఁడు" ప్రయోగము. హనుమఁడనియు వాడుకగలదు.

మహతీవాచకము లయినచో నీమతుబంతరూపములకు ఆలు శబ్దముచేరును. భగవంతురాలు-శ్రీమంతురాలు-విద్వాంసురాలు- మొ.

సూ:—ఋత్విక్-వణిక్- పురోధస్- ఇంద్రజిత్- పరీక్షిత్- శబ్దము ద్వితీయైకవచనరూపములు వైకల్పికముగా నామము లగు నగుచోఁ జివర నుండుమకారము లోపించును. ౨౮

వీనికి రామశబ్దమునకు వలెనే డువర్ణకాదులు వచ్చును.

ఉదా:—ఋత్విజుఁడు-వణిజుఁడు-పురోధసుఁడు- ఇంద్రజితుఁడు-పరీక్షి తుఁడు- పక్షమున- ఋత్విక్కు- మొదలగురూపము లగును. తవర్ణలోపమున, ఇంద్రజి యనురూప మగును.

సూ:—కొన్ని సంస్కృతహలంత ప్రథమైకవచనములే తెలుఁగున నామము లగును. అపుడు తుదిహల్లునకు ద్విత్వమును ఉకార మును బహుళముగా నగును. 28

ఉదా:—ఋత్విక్ + క్ + ఉ=ఋత్విక్కు. ఇట్లు, వణిక్కు-అహస్సు-మరుత్తు-సుమనస్సు-వీరుత్తు-జలముక్కు- (అప్) అప్పు-జగత్తు-మొద—బహుళమనుటచేఁ గొన్నిటికి ద్విత్వము వైకల్పికము. ఉదా—సరస్సు—సరసు, శిరస్సు - శిరసు, మనస్సు-మనసు, వాక్కు-వాకు, స్వరాట్టు-స్వరాటు, వయస్సు-వయసు-మొద—"మరుతులయంశమునఁ బుట్టి" భార—దీనినిబట్టి మరుతు అనియు నుండవచ్చును. వేధస్-వేధ, పురోధస్-పురోధ-పురోధసుఁడు. ఈరెండుశబ్దముల కిట్లేప్రయోగములు గలవు. వేధ-పురోధ-శ్రీసమములు- పురోధసుఁడు రామశబ్దతుల్యము.

సూ:—మహదాద్యాచకము లయిన కొన్నిసకారాంతశబ్దముల సలోప రూపమేని ద్వితీయైకవచనరూపమేని తెలుఁగున బహుళముగా నామ మగును. అగుచోఁ దుదిమకారము లోపించును. 30

రెండుపక్షములందును ప్రాతిపదికసంబంధ మైన అకారమునకు ఉకారము వచ్చును.

ఉదా:—అంగిరస్-అంగిర-అంగిరు; అగిరసమ్-అంగిరస-అంగిరసు ; డుప్రత్యయము రాఁగా రామశబ్దమువలె నగును. అంగిరుఁడు, అంగిరసుఁడు. ఇట్లు, ప్రచేతుఁడు-ప్రచేతసుఁడు, ఉగ్రశ్రవుఁడు - ఉగ్రశ్రవసుఁడు-ఊర్ధ్వరేతుఁడు-ఊర్ధ్వరేతసుఁడు- మొద—బహుళ మను టచే బహువ్రీహిని గొన్నిటికి సలోపము నిత్యము-దిగ్వాసుఁడు.దుర్వా

సుఁడు- శ్రీవత్సవక్షుఁడు—మహాయశుఁడు- మొద—

ఈకార్యము సుమనశ్శబ్దమునకు రాదు. సుమనస్సు. ఉగ్రశ్రవస్సు అనియుఁ బ్రయోగము గలదు.

కొన్ని యనుటచే, సవయస్కుఁడు - లబ్ధయశస్కుఁడు- మొదలగుచోట్ల కప్రత్యయము వచ్చుచోఁ బైకార్యము రాదు. లబ్ధశ్రేయుఁడు- లబ్ధశ్రేయసుఁడు-స్థిరచేతుఁడు..దృఢచేతసుఁడు-అని ప్రయోగింపరాదు. ఈవిషయము ప్రయోగవ్యవహారముల నెఱుఁగునది.

తత్సమ మైన 'దుర్వాసుఁడు' అనుదానిని గొందఱు సిద్ధసమాసమునం దుపయోగించిరి.

"ఉర్వి కొప్పగుదానియుత్తరంబునను । దుర్వాసతీర్థ ముత్సుకతతో జూడు"
పండితా—దుర్వాసమహామునిపతి । పర్వున దయ నటకు వచ్చె" ప్రభులిం—

సూ:—విశ్వకర్మాదిశబ్దముల నకారము లోపించును. వానికి స్త్రీసమత్వము బహుళముగ నగును. ౩౦

ఉదా:—విశ్వకర్మన్, విశ్వకర్మ. స్త్రీసమము గానియపుడు, ఉకారము డు వర్ణకము వచ్చును. విశ్వకర్ముఁడు. ఇట్లు-ఆత్మ- దేవశర్మ-కృతవర్మ-పరమాత్మ- పూష- మున్నగు శబ్దములకు రెండు రూపము లగును. బహుళ మనుటచే, సుధన్వ-సుత్రామ-సుపర్వ-సహజన్మ-అర్యమ-కృతకర్మ- ధృతవర్మ-మహామహిమ-మొదలగువానికి స్త్రీ సమత్వము రాదు. సుధన్వుఁడు. ఇత్యాదులు. మఱియు ఋత్విగ్విప్రచతురాస్యవాచక మైనబ్రహ్మశబ్దము నిత్యముగా స్త్రీసమము. బ్రహ్మ-బ్రహ్మలు.

సూ:—మహద్వాచకము తత్సమము దీర్ఘపూర్వము లకారోపధము అకారాంతమునైన నామముకంటెను పగతు మొదలగు నాచ్ఛికములకంటెను పర మయిన-లు-ల-లకు, రు-ర-లు బహుళముగా నాదేశ మగును. ౩౨

ఉదా:—బాలు+లు=బాలురు, బాలు+లను=బాలురను, పగతు+లు=పగతురు—పగతు+లను=పగతురను, మొద—

ఇట్లు లోకపాలురు-సుశీలురు-దయాళురు; అల్లురు-నెయ్యురు-బలియురు-మార్తురు-మొద—బహుళ మనుటచే దీర్ఘపూర్వములు కానితత్సమములమీఁద గూడఁ బైకార్యము గనవచ్చుచున్నది.

ఉదా:—నులినురు-మల్లురు-మొద—ఇవి పూర్వకావ్యముల నున్నవి. ఇవి వాడుకలో లేవు. శాస్త్రసమ్మతములు కావు, అయినను సుశబ్దము లైనవి. వాడుకలో నున్నను, బాలులు మొదలయిన నపశబ్దము లనఁబడుచున్నవి. ఒక్కచో రెండు ర వర్ణముల పలుకుబడి క్లిష్టముగా నుండును గావున బాలులారయను సంబోధనరూపము సాధు వగును.

సూ:—గండాదులమీఁది బహువచన లకారమునకు రేఫమును దానివెనుక నిండునున్నతోఁగూడిన డకారమును బహుళముగా నగును.

ఉదా:— గండఁడు, గండ+ండ్+రు=గండండ్రు- గండండ్రను-మిండండ్రు-మిండండ్రను- గండలు- మిండలు-అను రూపములు నరసింహవ్యాకరణమునఁ గలవు «మిండ లయ్యెడన్" కవికర్ణ— «నలకూబరాదులు ననుపుమిండలు'' కాశీఖం—

సూ:—మగాదులమీఁదను కయిరాదులమీఁదను ఈ ప్రత్యయాంత ములమీఁదను బహువచనలకారమునకు రేఫము రాదు.

ఉదా:—మగలు-మనుమలు, కయిరలు-జన్నలు, సాలీలు-సంగడీలు-మాపటీలు- మొద— కొందఱు మాపటీండ్రు- అనియుఁ బ్రయోగించిరి. «తెరలు సని మాపటీండ్రు కొందలపడంగ" కువల—

సూ:—కాప్రత్యయాంతములమీఁది బహువచనలకారమునకు రేఫ

'ముగాని శకటరేఫముగాని బహుళముగా వచ్చును. రేఫము
నకు వెనుకఁ బూర్ణబిందుపూర్వకడకార మగును. ౩౭

ఉదా:— చెలికాఁడు- చెలికాండ్రు- చెలికాలు- చెలికానిని, చెలికాండ్రను-విలుకాండ్రు-విలుకాలు- వేఁటకాండ్రు- వేఁటకాలు- మొ--

ఇట్లు కాప్రత్యయాంతముల కెల్ల నుభయరూపము లగునని పూర్వుల యభిప్రాయము కనఁబడుచున్నది గాని, అందగాలు-బేరగాలు-అనెడిరూపములు శ్రావ్యములు గావు- ఈ రూపములకుఁ దఱుచుగాఁ బ్రయోగములును గానరావు. వీనికి అందగాండ్రు- బేరగాండ్రు అను రూపములే యుచితములు. 'కాలు' మీఁద లువర్ణకముచేర్చి తిక్కన యొకటి ప్రయోగించెను "వేడుక కాలులు జాలరులు చూచి కర్ందుకొనంగన్" భార—

సూ:— బహువచనము పర మగునపుడు ఱే మొదలగువానికి బిందుపూర్వక డు వర్ణమాగమ మగును. ౩౮

ఉదా:— ఱే+ఁడు+లు=ఱేఁడులు. వక్ష్యమాణసూత్రమున ఉలోపము-ఱేండ్లు- సింగమనేఁడు- సింగమనేండ్లు- సింగమనేఁడులు- అమ్మిసీఁడు-అమ్మినీండ్లు, ఈకార్యము వ్రే శబ్దమునకు రాదు. వ్రేఁడు-వ్రేలు. (గొల్ల)

సూ:— హల్లు పర మగునపుడును అవసానమందును ప్రథమాబహువచన ప్రత్యయముయొక్క ఉకారము వైకల్పికముగ లోపించును. ౩౯

ఉదా:— రాములు- రాముల్; పడఁతులు-పడఁతుల్, వనములు- వనముల్, వారలు-వారల్, భూపాలురు-భూపాలుర్ - మొద-

"వారి దప్రతతుల్ పాల్పడి' తత్పాలు ర్భయం బందఁగన్ మొదలగు ప్రయోగములు పద్యములందు గనవచ్చెడిని.

సూ:— ఈకార్య మాదేశశకట రేఫమునకును సంయుక్తము లైన

సు-లు-వర్ణకములకును గలుగదు. ౩౮

ఉదా:— వేటకాఱు-విలుకాఱు; చెలికాండ్రు- ఱేండ్లు- త్రాళ్ళు-.

సూ:— సహజముగా ఉకారాంతము లైన తత్సమనామములమీఁది సంబుద్ధి డు వర్ణకము వైకల్పికముగా లోపించును. లోపించు నపుడు దాని వెనుక నున్న ఉకారము ప్లుత మగును. ౩౯

సంస్కృతమందు హ్రస్వముప్రక్క (౩) మూఁడంకె నిలుపుట ప్లుతమునకు గుర్తు. ఈగుర్తు తెలుఁగున దీర్ఘముప్రక్క నిలుపుట యాచారమైనది.

ఉదా— ఓ గురూ ౩. ఓ విష్ణూ ౩. ఓ శంభూ ౩. ఇత్యాదులు. పక్షమున ఓ గురుఁడ. - ఓగురుఁడా - ఇత్యాదిరూపము లగును. ఇట్లు ఉకారము ప్లుత మగుట కొన్ని బహువచనాంత ములందును గనవచ్చును. ఉదా— భగవానులూ ౩, హనుమా నులూ ౩

సూ:— నీచత్వ మిత్రత్వములందు పురుషవాచకనామములపై 'గా' ప్రత్యయ మగును. అగుచోఁ గొన్నిటి తుదియచ్చునకికారము వచ్చును. ౪౦

ఉదా:— ఎల్లయ్యగాఁడు-పుల్లిగాఁడు-ఎల్లిగాఁడు- మొద—

"ఈయశోద। గారి గోపాలిగాఁ డిట్లు కలదె జగతి ‘‘కా.వ్యా—

సూ:— గాప్రత్యయముమీఁద సంబుద్ధిడువర్ణకము రాదు. ప్రత్యయ దీర్ఘము వైకల్పికముగా హ్రస్వ మగును. ౪౧

ఉదా— ఎల్లిగా-ఎల్లిగ. ‘‘నాపాల నుండు మెప్పుడు గోపాలిగ రమ్మ టంచుఁ గొడుకుం బిలిచెన్ కా—వ్యా—

సూ:— ఆఁడు-గాఁడు-ప్రత్యయాంతములకుఁ దఱుచుగా బహువచ నము గలుగదు. ౪౨

ఉదా:— పగలాఁడు-వన్నెలాఁడు-చిన్నెలాఁడు-ఖాలిగాఁడు- మొదలగు

వానికి బహువచనప్రయోగములు కానరావు. వీనికి బహువచనము కావలసినయెడల వగలవాండ్రు—ఎల్లయ్య పుల్లయ్యగాండ్లు అనునట్లు ప్రయోగింపవలెను.

ద్వితీ—వగలానిని, చిన్నెలానిని, గోపాలిగానిని. ఇత్యాదులు.

సూ:—ప్రథమాంతరూపములపై ఏకత్వబోధకమగుచుఁ బూజ్యార్థమున-గారు- వారు- శబ్దములు బహుళముగా వచ్చును. 'వారు' పరమగుచో బహువచనలువర్ణకముయొక్క ఉకారమునకు అకారము వచ్చును. ౪౩

ఉదా:—రాజుగారు-రాణిగారు- రాయఁడుగారు- అమ్మగారు- దేవరవారు—అయ్యవారు; పంతులవారు- స్వాములవారు, మొద—వీనిమీఁద లుప్రత్యయమును వినఁబడును. వెంకయ్య సుబ్బయ్యగార్లు— అయ్యవార్లు- మొ— కొన్ని ప్రాచీనశాసనములలో 'గారు' బహువచనముగా నున్నది. "ఆయనకొమాళ్ళు... పాపరాజు బసవరాజుగారికి" 'వారు' మీఁద 'గారు' చేరుట కలదు. అయ్యవార్లుగారు, కొన్నిమండలములలో 'గారు' బదులుగా 'వారు' వాడుదురు. వరదరాజువారు. మొద—వీనికి సంబోధనమున ఊకారము వచ్చును. అమ్మగారూ! పంతులవారూ! మొద—

వీనికి ద్వితీయాదులయేలవచనమందు ఇకారము వచ్చును.

ఉదా:—రాజుగారిని—రాజుగారికి-అయ్యవారిని- మొద—

సూ:—గారు-వారు- లేకత్వబోధకము లైనను, విశేషణక్రియాపదములు తఱచుగా బహువచనము లగును. ౪౪

ఉదా:—గురువుగారు పుణ్యాత్ములు- అయ్యవారు వచ్చిరి. అమ్మగారిచ్చిరి. మొ—

,,చిత్ర మిది యయ్యవారి సంసేనవేళ, నమ్మవా రుగ్గడించిరో యనుచు నడిగె" కళా—తఱచుగ ననుటచే, అయ్యగారు మంచివాఁడు- అమ్మగారిచ్చినది.

కయన మాతాతగారు_మొదలయినవి వాడుకయందును—,,పెట్టెదొడ్డుగ నా పెంత
ప్రెగడగారు'' శివరా— ,,తోడరి యయ్యగారు దొసఁగులఁ బెట్టెడుఁ బోవ
వలయు'' దశకు— ,,పోకార్చె మాపుగా రేకాలమును'' రుక్మాం— ఇత్యాదుల
కావ్యములందును గల వని యెఱుఁగునది.

## ముప్రత్యయాంతముల రూపనిష్పత్తి.

సూ:—ఎకారాంతములు అకారాంతములు ముపర్ణకయోగ్యములు
నగు నాచ్ఛికశబ్దములు జలశబ్దతుల్యములు. ౪౫

ఉదా:—అన్నెము—పున్నెము—బల్లెము—బత్తెము- పద్దెము- ఓరెము-
కారెము- నాణెము- పందెము- విద్దెము- మొదలయినవి ఎకా
రాంతములు.

మొగము-వియ్యము- బెల్లము- పల్లము- మొల్లము- సన్నము-
చిన్నము- నెయ్యము - సున్నము - నెత్తము - మొదలయినవి
అకారాంతములు.

ఇట్టిశబ్దములకు జలశబ్దమునకువలెనే విభక్తికార్యము లగును.
ఎకార, అకారాంతములనుటచే, గీము-వాము-*పాము-నాము-ప్రేము
మినుము-ఇనుము- వేము- మొదలయినవి ముపర్ణాంతములు కాని ము
ప్రత్యయాంతములు కా వనియు వానికి జలశబ్దమునకువలె వ్యాకరణ
కార్యములు రా వనియుఁ దెలియునది. ఇపుడు చూపిన గీము మొద
లయినవి త్రీసమములు. ఇవియు నిట్టివియు ముందు చెప్పఁబోవు చెఱువు
శబ్దమును బోలును.

౧౮ వ సూత్రముచే జలశబ్దమునకును పైసూత్రముచే మొగ
శబ్దమునకును ప్రథమైకవచనమున ముపర్ణకము రాఁగా, జలము-
మొగము- అగును.

సూ:—ము వర్ణకము రాఁదగిన అకారాంతనామములకు ప్రథమా

---

* పాంబు_వేంబు_ప్రేంబు_ఇనుంబు_మొదలగు రూపములు ప్రాచీనభాష
యందు కనఁబడును గాని యిట్టి విపుడు వాడుకలో లేవు.

బహువచనాదులు పర మగునపుడు ము వర్ణ మాగమ మగును. ౪౬

ఉదా:—జల+ము+లు=జలములు, మొగ+ము+లు=మొగములు.

సూ:—ము ప్రత్యయ మువర్ణములకు ద్విత్వమేని పూర్ణబిందు పూర్వక బువర్ణమేని విభాష నగును. ౪౭

ఉదా:—జలమ్ము-జలంబు-జలము; మొగమ్ములు-మొగంబులు-మొగములు. ఇట్లు ము వర్ణకాంతము లన్నిటికి నన్నివిభక్తులయందు నీకార్యము వచ్చు నని తెలియునది.

సూ:—ఈకార్యము ప్రత్యయాగమేతరమువర్ణమునకును గనంబడుచున్నది. ౪౮

ఉదా:—అనయము-అనయమ్ము-అనయంబు-కరము-కరమ్ము-కరంబు-ఇవి యవ్యయము లైనను నైకార్యము వచ్చినది. ఇట్టివాని నిందు చేర్పందగును.

స:— జలమునందు-జలమునన్-మొగమునందు-మొగమునన్.

౧౫ సూత్రముచే అందు-నన్-వచ్చెను. ౧౬ సూత్రముచే 'అందు' పర మగునపుడు నకారము వైకల్పికము. ఇట్లు, మిత్రము-కళత్రము-ధనము-వనము-మొదలగు తత్సమములు, బియ్యము-అద్దము అందము-ముత్తెము-పళ్ళెము-పళ్లెరము-మొదలగు నాచ్ఛికములు, వైకల్పికముగా ము వర్ణకము విధింపంబోవు శబ్దములును జెప్పందగును.

సూ:—చరిత్రాదులకు ము వర్ణకము వైకల్పికము. ౪౯

ఉదా:—చరిత్ర-చరిత్రము, అభిలాష-అభిలాషము, ఇట్లు, చిహ్న-ప్రశ్న-నిష్కర్ష-ప్రయాగ-ప్రాస-విసర్గ-హంస-వధ-వేగ-ఘోష సర్గ (కావ్యభాగము) పురుష (ప్రథమమధ్యమోత్తమ) మాం జిష్ఠ-స్ఫురణ-గద్య-కర్మధారయ-విమర్శ-పరామర్శ-అలకలు-అక్షతలు-తరంగలు-భ్రమ-శ్రమ-తత్పురుష-విజృంభణ-మధ్య-

మొద—ము వర్ణకము రానపుడు త్రిసమము లగును. వీనిలో ననేకములు కావ్యముల నున్నవి.

,,మంగళసూచకచిహ్న లేర్పడన్, రామా—మీ శాసక్తితోఁ బ్రశ్న చేసిన దీలోకహితంబు, వేంక—నిష్కర్ష గావించి—ఇం పారఁగ నిరువదిసర్గలు, ఉదా—వృష మకరస్థుఁ డైనయప్పుడు ప్రయాగ, కాశీ—మీ రీమొద లెఱుఁగ రిదియె మీదు విమర్శల్, భోజ—ఉద్ధతులమధ్యఁ బేదల కుండఁ దరమె, కవిక—మూలు గా నైచినమాంజిష్ఠ తెరయెత్తి, హరవి"

సూ:—ము లోపము వచ్చినప్పుడు కొన్ని నామములతుది అకారము ఉకార మగును. 30

ఉదా—బీభత్సు-బీభత్సము, రూపు-రూపము, శరణు-శరణము,వర్గు వర్గము, మొద—

,,పంచమునియింటఁ గలుగుబీభత్సు నెఱిఁగి, శివరా—లతాంగి రూపు కన్నారఁగఁ జూచి నచ్చితి, వసు—వరదు నగ్నిదేవు శరణుఁజొత్తు, మార్కం—మనుష్యవర్గు-దేవవర్గు-కోశములలో—

సూ:—ఆత్మశబ్దమునకును అమహద్వాచకములైన నకారాంతశబ్దములకును దెలుఁగునందు నకారము లోపించును, ము ప్రత్యయము బహుళముగా నగును.

ఉదా:—ఆత్మ-ఆత్మము; మహిమ-మహిమము, ఇట్లు-గరిమ-లఘిమ-అణిమ-జన్మ-కర్మ-ప్రేమ- రాజయక్ష్మ- మొద—కర్మశబ్దము న కేయర్థమం దైనను ము వర్ణకము వైకల్పికము. కర్తకర్మ క్రియలు. జన్మ-కర్మ-అని-యిపుడు పెక్కండ్రు వాడుచున్నారు. ,,చెలఁగి వూఁచు నేకర్మ పంచిన లతాంగి" శివరా—ఇట్లు ము లోపము వచ్చిన నకారాంతము లాత్మాదిగణములోఁ జేరును.

తత్త్వతపోయోగవాచకమైన బ్రహ్మశబ్దమునకు ము లోపము

లేదు. బ్రహ్మము. పరమాత్మవాచక మగుచో, పరబ్రహ్మము-పర బ్రహ్మ-బ్రహ్మము-బ్రహ్మ.

సూ:—అహమద్వాచకము లయిన కొన్ని హలంతముల తుదివర్ణము బహుళముగా లోపించును. లోపించునపుడు అకారముమీఁద ము వర్ణకము వచ్చును. ౧౨

ఉదా:—జగత్-జగము, ఉరస్-ఉరము, తేజస్-తేజము, ఇట్లు-ఉర ము-మనము- వక్షము- శిరము- తనము- అహము- బీజము- మొద—తుదిహల్లు లోపింపనపుడు, జగత్తు-మనస్సు-మొద లగు రూపము లగును. బహుళ మనుటచే సుదినాహము-పుణ్యాహము-శుభాహము-మొదలగుచోట్లఁ దుదిహల్లు నిత్య ముగా లోపించును. మువర్ణకము నిత్యముగ నగును.

'అకారముమీఁద' అనుటచే అర్చిస్-అర్చి-అర్చిస్సు, ధనుస్-ధనువు-ధనుస్సు, మొదలగుచోట్ల ఇకార ఉకారములమీఁద మువర్ణకము రాదు.

సూ:—అమహద్వాచకములైన మఱికొన్ని సంస్కృతహలంతముల ద్వితీయావిభక్తిరూపములు తెలుఁగున నామము లగును. అగుచోఁ దుదిహల్లునకు లోపమును మువర్ణకమును బహుళ ముగా నగును. ౧౩

ఉదా—ముత్-ముదమ్-ముదము, స్రక్-స్రజమ్-స్రజము. ఇట్లు-ఉపాన హము నీవృతము-బలవంతము-మధులిహము - అనడ్వాహము - శ్వానము - మొద—బహుళమనుటచేఁ గొన్నిటికి మువర్ణకము రాదు. ఆపద-సంపద-మొద—

సూ:—కంధరాదులకు మువర్ణకము బహుళము. ౧౪

ఉదా—కంధరము-కంధర, ఇట్లు- నాసిక-భిక్షు- దంష్ట్రి-గ్రీవ- ఉల్క-పాదుకలు- మొద—బహుళ మనుటచే విధశబ్దమునకు మువర్ణ

కము నిత్యము. విధము.

సూ:—రచనాదులకు మువర్ణకము బహుళము. ౫౫

ఉదా:—రచనము-రచన, ఇట్లు- గణన- పాలన-విజ్ఞాపన- విమర్శన-
భజన-బోధన-శోధన- ఆలోచన- యోచన- యోజన- సృజన
సంతర్పణ-పోషణ-స్మరణ-వర్ణన-మొద—

"సృజన చేసి గౌతమముని కొసంగె, సమీర-శుండాస్ఫోటన చేసె, తామ-వారిగుఱించి కొంతవడి వర్ణనచేయుచు, మీయందలు నాలోచనసేయందగు, ఉరా-పోవలసినవనములందు పోషణచేయున్, మున్ను నేను విప్రముఖ్య సంతర్పణలందు, వి-వి-రా-ఆ స్తజనపోషణకంటెను, ఆముక్త-పర్యుషితమును నర్పణ చేయఁజాల, పాండు—"ఇది యాకృతిగణము.

సూ:—లు-ల-నన్-న-పర మగునపుడు కొన్నిశబ్దముల ఆగమమువర్ణమునకు లోపమును దానివెనుకటి యచ్చునకు దీర్ఘమును బహుళముగా నగును.

ఉదా:—గోపురములు-గోపురాలు, గోపురాలను-గోపురాన్-ప్రాణానకు-ఇట్లు-వజ్రము-ప్రాణము-క్షేమము-సీసము (మల్లబంధము) స్నానము - పగడము - చందము - మిరియము - ముత్యము - అలుపము-మొద—

"ఈకార్యమునకుఁ బ్రయోగవైరళ్యము సూచింపఁబడియె" నని చిన్నయసూరి చెప్పెను గాని-లు-ల-పర మగునపు డధికముగాను, నన్-న-పర మగునపుడు కొలఁదిగాను, ఈకార్యము గనవచ్చును.

"ప్రాణానం గలుగంగ-సీసానఁ బట్టియు-అలుపాలఁ బొనుపడు-ఏనుగ నీదు ప్రాణాన కింతనిజము-సారసానకు వచ్చినచందనమునను, భార-క్షేమాననున్నాఁడు, ఉ.రా-గౌతమీస్నానాన, నర-శ-పెక్కు-చందాలం బందు,మను-దీనారటంకాలఁ దీర్థమాడించితి దక్షిణాధీశుముత్యాలశాల, శ్రీనాథ-ఎంత తఱిఁగిన మిరియాలుం జొన్నల సరిపోవే, ఉ-హరి-నలు వగుడాలన్ బిసాళినలువగుడాలన్, పాండు-మొద-గుట్టమునకు ద్విత్వలోపమునంగు ములోపదీర్ఘములు నిత్యము.

బహుళ మనుటచే మిత్రము-జనము-మొదలగుచోట్లఁ బైకార్యము రాదు. దీనికి వాడుకయే ప్రమాణము.

సూ:—అహమద్వాచకములైనషష్ఠ్యంతములకు-కంటెన్-అందు-పర మగునపుడు నవర్ణాగమము గనవచ్చును. ౫౭

క్రతుశతంబునకంటె సుతుండు మేలు—అనఘచరిత్రమునకంటె నధికం బగుటన్—ఉరమునయందు గన్నులు—మానుగ వైనంబునయందు— దేహంబునయందు-మనంబునయందు-గోలోకమునయందు-ఇట్లు అనేకములు భారతాదులఁ గలవు. "కంటెన్" విభక్తిప్రత్యయము కాదనువారు "శతంబునకున్-అంటె" శతంబుకున్+"అంటె" అని పదవిభాగము చేయుదురు.

ఈకార్యము వువర్ణముమీఁదఁ గలుగుటకు భారతమందు "మునిప్రవరుని తనువునయందు-జంబువునయందు-" అను ప్రయోగములు గలవు.

సూ:—బహువచనప్రత్యయము పర మగునపుడు-ఆవు-జాము-మొదలగు కొన్నిటి తుదివర్ణమును, మీసము మొదలగువాని మువర్ణమును బహుళముగా లోపించును. ము లోపమున మీసాదులకు దీర్ఘము వైకల్పికము- ౫౮

ఉదా—ఆవు+లు=ఆలు - ఆవులు, జాము+లు=జాలు - జాములు. మీసము+లు—మీసలు=మీసాలు-మీసములు. ఇట్లుచుట్టము మొదలగువానికగును. ఏతాలు-గోతాలు-మొదలయినవియుఁ గలవు.

"ఇట్టి తుచ్ఛసుఖమున్ మీసాలపై తేనియల్, ముష్టిగ్రాసవాసోదైన్యం బులువచ్చు నాయరయునిచుట్టాలకుం గావునన్, కోమసుమీసలు దీర్ఘ నేత్రములు మెఱయ-చెలులుం జుట్టలు దేశంబులరాజులు, భార—తలుచుగ నేతా లెత్తిగ, కాళ—

సూ:—ము వర్ణకము పర మగునపుడును, అవసానమందును, ఇయకు ఎకారము బహుళముగా నగును. ౫౯

ఉదా:—పల్లియము-పళ్ళెము, ఇట్లు-కల్లెము- కొంచెము-వీడెము-ముత్తెము-కొండెము- మొద.—కన్నియ-కన్నె, ఇట్లు-పన్నె-జన్నె-దివ్వె- మొద.—బహుళ మనుటచే సందియము-కాఱియ-మొదలగుచోట్లఁ బైకార్యము రాదు.

సూ:—మువర్ణకము పర మగునపుడు కొన్నిశబ్దముల 'ఇయ' లోని ఇకారము వైకల్పికముగా లోపించును. దానితో ద్విత్వము పోవును. ౬౦

ఉదా.—కళ్ళియ+ము=కళ్యము. ఇట్లు-పళ్యము-ముత్యము-మిర్యము-వీడ్యము; ఈకార్య మవసానమందును గనవచ్చుచున్నది. ఉదా-కన్నియ-కన్య, దివ్వియ-దివ్య, మొద.—

వుప్రత్యయాంతములరూపనిష్పత్తి

౧౭ సూత్రముచేఁ బ్రథమైకవచనమున వుప్రత్యయము రాఁగా, గురువు-వధువు-ధేనువు-తరువు-ఇత్యాదిరూపము లగును.

*సూ:—గోవధ్వాదులకు నిత్యముగా ఉకారాంతతత్సమనామము లకు బహుళముగాఁ బ్రథమాబహువచనాదివిభక్తులు పర మగునపుడు వువర్ణమాగమ మగును. ౬౧

ఉదా:—గోవులు-వధువులు-మనువులు-ఆదిపదముచే-సుభ్రు - సుతను పునర్భు- మొదలయినవి గ్రాహ్యములు.

వుప్రత్యయమును వువర్ణాగమును ఏశబ్దములకు నిత్యములో వేనికి వైకల్పికములో పూర్వులు నిర్ణయింపలేదు. కావునఁ బూర్వ ప్రయోగములనుబట్టి కొంతవఱ కానిర్ణయము చేయుచున్నాను.

---

* వాగనుశాసనునిమతమున గుర్వాదులకుఁ దప్పఁ దక్కిన ఉకారాంతముల కెల్ల వువర్ణాగమము నిత్యము. ఆధర్వణమతమున స్త్రీవాచకములకు నిత్యము. తరు వాతఁ గొందఱిమతమునందు ఉకారాంతము లన్నిటికిని వువర్ణాగమము వైకల్పికము కాని, యీమతమునకుఁ దగినట్టు ప్రయోగములు కనరావు.

౧. గుర్వాదులకును-శతక్రతు-శతమన్యు-మధు-ప్రభు-విధు-చిత్రగు-ప్రభవిష్ణు-భాను-భృగు-జిష్ణు-రోచిష్ణు - ఆజానుబాహు - మొదలగు పుంలింగములకును - డు - వు - ప్రత్యయములు రెండును వచ్చును.

౨. పాండు-కురు-పూరు - శంతను - అభిమన్యు - కంతు - మొదలగు కొన్నిటికి వుప్రత్యయము రాదు. ఇవి యన్నియు డుప్రత్యయాంతములుగానే యున్నవి. వి

సూ:—మహాత్తు లయినమన్వాదులకును, అమహాత్తులయిన మధ్వాదులకును వుప్రత్యయవువర్ణాగమములు నిత్యముగా నగును. ౬౩

ఉదా:—మనువు-మనువులు, స్వాయంభువు - స్వాయంభువులు, దనువు-దనువులు, ఇట్టివి మన్వాదులు, మధువు- మధువులు, పటువు-కటువు-మృదువు- మేరువు-ఇట్టివి మధ్వాదులు, అమహత్తులలో, ధేను-కరేణు- చము-రజ్జు-చరు-పాయు-తరు - దారు-వస్తు- మొదలగువానికి బహువచనములందు వువర్ణము వైకల్పికముగా నగును.

ఉదా: —ధేనువు- ధేనువులు- ధేనులు.

సూ:—రాహ్వాదులకుఁ బ్రథమైకవచనమున వుప్రత్యయమును తక్కినయెల్లవచనముల వువర్ణమును వైకల్పికముగ నగును. ౬౩

ఉదా:—రాహు-రాహువు, రాహులు-రాహువులు-ఇట్లు, కేతు-బాహు-బిందు- మొ—కొన్ని యాచ్ఛికములకును బ్రథమైకవచనమున వుప్రత్యయము వైకల్పిక మగుచున్నది.

ఉదా:—పుట్టు-పుట్టువు, అన్ను-అన్నువు, మొద—

ప్ర:—మనువు-మనువులు-తరువు-తరువులు తరులు. సంబోధనసూత్రములను సుప్రత్యయ~~ములు వర్ణా~~మాదిసూత్రములను సమన్వ

వర్ణాగ

యించునది. ౧౪ సూ—షష్ఠిని నవర్ణము ౧౬ సూ—సప్తమిని నకారము ఆగమములు.

ష:—మనువునకున్- తరువునకున్-తరునకున్.

స:—మనువునందు- తరువునందు-తరువందు-తరువునన్-

విడిచిన విభక్తులను రూపాంతరముల నూహించునది.

సూ:—ధర్మాదులకు వువర్ణకమును వచ్చును. అపుడు తుది అకారము ఉకార మగును. ౬౪

ఉదా:—ధర్మువు-ధర్మము, ఇట్లు, కర్మువు- వర్మువు -అర్ఘు- వు-వర్గువు-మొద—ఇవి వుప్రత్యయము వచ్చినపుడు మనువుశబ్దమువలె నుండును. 'అందు' పర మగునపుడు తరుశబ్దమును బోలును. వీనికి నన్-విభక్తియు వచ్చును. ఉదా—ధర్మువందు, ధర్మువునందు-ధర్మువునన్-

బందువుఁడు-నట్టువుఁడు-మొదలగువానికిఁ బ్రథమైకవచనమున వుప్రత్యయ మున్నను, వీని తక్కినరూపములు మనువుశబ్దమునకువలెనే యుండును,ఉదా--బందువుఁడు-బందువులు,బందువుర్-బందువులన్-

మఱియు, ఉకారాంతము లయిన యాచ్ఛికశబ్దములలో, జడవాచకములు కాని వన్నియు మనుశబ్దమువలెను జడవాచకములు తరుశబ్దమువలెను జెప్పఁదగును. కాని జడవాచకములలో చెఱువు మొదలుగా వువర్ణముచివరఁ గలశబ్దములకు 'అందు' పర మగునపుడు నకారాగమము నిత్య మని తెలియునది. చెఱువునందు-ఇందలి వువర్ణము సహజము కాని, ఆగమవువర్ణము కాదు. వుప్రత్యయము రాని ఉకారాంతములకు రెండు ఉదాహరించెదను.

ప్ర:—కొడుకు-కొడుకులు, చెఱువు-చెఱువులు-

స:—కొడుకునందు-చెఱువునందు-చెఱువునన్

ఈ రెండింటికిని భేదము, జడవాచకమునకు సప్తమిని నన్ప్ర

త్యయము వచ్చుట యొక్కటియే. ఇట్లు రాజు-రౌతు-తిండిపోతు-బందువు-జోదు-బాబు మొదలయినవి కొడుకుశబ్దమువలె విభక్తులను గాంచును.

సూ:—రాజన్ శబ్దమునకుఁ దత్సమరూపము రాజు. ౬౫

మఱియు, కొలువు-గొనుగు-ఈసు-కాసు-తలుపు-మోద్దు-పద్దు బొందు-సందు-హెచ్చు-తగ్గు-ఫుంజు-గుంజు-బదువు-దరువు-రజ్జు-ఎత్తు-లోఁతు-ఆకు-ముకు-గీము-వాము-కొమ్ము-కల్లు (మద్యము) పల్లు (పల్లము) త్రెల్లు మొదలయినవి చెఱువుశబ్దమునలెఁ జెప్పదగును.

సూ:—కొన్ని యాచ్ఛికపదముల నడుమ నుండెడి అ-ఇ-ఉ-వర్ణములకుఁ గొన్నిహల్లులు పర మగునపుడు లోపము బహుళముగా నగును. ౬౬

ఉదా:—మొలక-మొల్క, అలుక-అల్క, కలికి-కల్కి, ములికి-ముల్కి, కలిమి-కల్మి, చెలిమి-చెల్మి, కోరికి-కోర్కి, కూరిమి-కూర్మి, పేరిమి-పేర్మి, కాలువ-కాల్వ, చిలుక-చిల్క, తూరుపు-తూర్పు, అడుగు-అడ్గు, పురువు-పుర్వు, ఇరువురు-ఇర్వురు, కలువ-కల్వ, గొఱితి-గొర్తి, కూరుకు-కూర్కు, నూఱుగురు-నూర్గురు, బుడిపి-బుడ్పి,-ఎడద-ఎడ్ద-వేడుక-వేడ్క-అపుడు-అప్డు ఉంగరము-ఉంగ్రము-సంబరము-సంబ్రము-కపురము-కప్రము, కదుపు-కడ్పు-ములికి-ముల్కి-ఇత్యాదులు-

ఈసూత్రము సార్వత్రికము గాదు. వాడుకలోఁ బదమధ్యాచ్చులు లోపించినపదములు మాత్రమే దీని కుదాహరణము లగును.

బహుళ మనుటచే, ఇప్పుడు-చప్పుడు-మొదలగువానిలోని ద్విత్వవర్ణముగూడ లోపించును. ఉదా—ఇప్డు-అప్డు-ఎప్డు-చప్డు-

సూ:—శకటరేఫము, మీఁదిహల్లుతోఁ గూడినపుడు సాధురేఫ మగును. ౬౭

ఉదా:—చెఱువు-చెర్వు, నూఱువురు- నూర్వురు- కాఱులు- కార్లు-
గొఱితి-గొర్తి-ఇత్యాదు లూహ్యములు.

సూ:—కొన్ని యాచ్ఛికములద్విత్వహల్లునకు లోపము బహుళముగా
నగును. అచ్చుతోఁ గలియుచోఁ గాదు. ౬౮

ఉదా:—నను-నన్ను, మిము-మిమ్ము, కను-కన్ను, అచ్చుపరమగుచో,
నన్నడిగె-మిమ్మెఱుగు-కన్నెత్తి-మొద—
ఇట్లు, నిన్ను-మమ్ము-తన్ను-తమ్ము- వెన్ను-విల్లు-పల్లు-ముల్లు-
అట్టె-అట్టు-పుప్పు- అట్టు-జాబిల్లి- దవ్వు- మొద—కొన్నిటికి
వైకల్పికముగా సమాసమందుమాత్రమే లోపించును. పెద
తండ్రి-చినబాబు-అచోటు-అచటు-ఇచటు-ఎచటు-మొద-- మఱి
కొన్నిటిమధ్యద్విత్వము లోపించును. అక్కట-అకట, అప్పుడు-
అపుడు, నిద్దుర-నిదుర-ఇట్లు కప్పురము-చెప్పుము-కమ్మతము-
తమ్ములము-ప్రెగ్గడ-మొద—బహుళ మనుటచే, పన్ను-పిల్లి-
చెట్టు-హెచ్చు-మెప్పు-మొదలగు పెక్కుశబ్దముల ద్విత్వము
లోపింపదు. “అక్కటాదుల జడ్డకు లోపంబు విభాష నగు'
ననెడి చిన్నయసూరి సూత్రము సార్వత్రికము కాదు.

శబ్దములకు బహువచనమువచ్చు మార్పులు

ఇకారాంతములు ఉకారాంతములు ఔపవిభక్తికములు నైన
యాచ్ఛికములకు బహువచనమందు కలుగుమార్పులు కొన్ని సూచిం
పఁబడుచున్నవి. ఇకారాంతములకు ౧౦౧ సూత్రముచే దడి+లు=
దడులు, అన్నట్లుగా బహువచనము పర మగునపుడు ఉకారము
వచ్చును.

సూ:—కొన్ని శబ్దములు బహువచనరూపముల తుదనుండెడి-ండ్రు-
ండ్లు-డులు-లులు-రులు- ఱులు-ల్లులు-లు-అనువానికి బహుళ
ముగా, ళ్లు వర్ణ మాదేశ మగును. ౬౯

ఇది భాషాసంప్రదాయము ననుసరించిన సామాన్యసూత్రము. బహువచనమందు ళకారమును విధించుసూత్రములు కొన్ని వేఱుగా నున్నను, వానికిఁ గాని దీనికిఁ గాని పునరుక్తిదోష మాపాదింప రాదు. పైవాని కొక్కొక్క యుదాహరణము క్రమముగాఁ జూపఁ బడును.

ఉదా:—ఒక్కండ్రు-ఒక్కళ్ళు, గూండ్లు-గూళ్ళు, త్రాడులు-త్రాళ్ళు, కాలులు-కాళ్ళు, నీరులు-నీళ్ళు, ఏఱులు-ఏళ్ళు, ఇల్లులు-ఇళ్ళు, రాలు-రాళ్ళు-

సూ:—లు-ల-పర మగునపుడు-ట-డ-ర-ల-అను హల్లులమీఁది ఉకారను బహుళముగా లోపించును. ౭౦

ఈ సూత్రముచే వచ్చులోపము ప్రయోగముల ననుసరించి నిత్యముగాను వైకల్పికముగాను గూడ నుండును.

ఉదా:—పాటులు-పాట్లు, పోటులు-పోట్లు, తూఁటులు-తూంట్లు-కోమటులు-కోమట్లు, తుంటులు-తుంట్లు, బంటులు-బంట్లు, చోటులు-చోట్లు; గుండులు-గుండ్లు, గిండులు-గిండ్లు, బండులు-బండ్లు, పేరులు-పేర్లు (హారములు) బారులు-బార్లు, చేరులు-చేర్లు, మొగిలులు-మొగిళ్ళు-మొసలులు-మొసళ్ళు.

వీనికి వక్ష్యమాణసూత్రముచే ళకారము వచ్చును.

బహుళ మనుటచే నొక్కొకచో అకారమును లోపించును.

ఉదా:—చాఱలమెకము-చార్లమెకము. మఱియు, పిల్లులు-పులులు-తల్లులు - నల్లులు - గాలులు - ఇత్యాదులందు ఉకార లోపము రాదు.

మఱియుఁ గొన్ని తత్సమముల ఉకారమునకును లోపము వచ్చును. ఉదా—కోటులు-కోట్లు, పిప్పలులు-పిప్పళ్ళు-

సూ:—లు-ల-వర్ణములతోఁ గలిసినను లేక ఉకారముతో వ్యవధాన

మున్నను-ర-ల-ఱ-అను హల్లులకు ళకారము బహుళముగా నగును. ౭౧

౭౦ సూత్రముచేఁ బ్రయోగముల ననుసరించి ఉకారలోపము చేయఁదగును.

ఉదా:—గోరు+లు = గోళ్ళు-గోళులు, గోళ్ళను-గోళులను. ఇట్లు, వేళ్ళు-వేళులు (సంజ్ఞలు) ఊళ్ళు-ఊళులు, పందిళ్ళు-పందిళులు, నీళ్లు-నీళులు, నోళ్ళు-నోళులు; వెదుళ్ళు- కుదుళ్ళు - కదుళ్ళు-ఎసళ్ళు-విస్తళ్ళు-కొమాళ్ళు- మొద—

కాలు+లు = కాళ్ళు- కాళులు- కాళ్ళను, వ్రేళ్ళు- వ్రేళులు. ఇట్లు, దోసిళ్ళు-పిడికిళ్ళు-గుప్పిళ్ళు-సందిళ్ళు-కౌఁగిళ్లు- చెక్కిళ్ళు-దోయిళ్ళు-పుక్కిళ్ళు—అంబళ్ళు—కంబళ్ళు-కొడవళ్ళు- ఆఁకళ్ళు-పాళ్ళు (భాగము) ఎంగిళ్ళు- ముంగిళ్లు- పొంగళ్లు.; కుందేళ్ళు-నోసళ్ళు-చాళ్ళు-నూళ్ళు-ఱోళ్ళు-కోఁకళ్లు- మొదళ్లు- మొద—

ఏఱు+లు=ఏళ్లు-ఏళులు, వాఱు+లు=వాళ్ళు. మొద—

ఈళకారాదేశమును బ్రయోగవ్యవహారములనుబట్టి గ్రహించునది. బహుళమనుటచే, నీరులు-ఏఱులు-కొమారులు-మున్నగుప్రయోగములు కల వని తెలియునది.

,,మున్నరులయేట నయ్యనఁటెనిట్టలపై'' కవిక—,,సెలయేఱులలోఁ జిల్లులు చిలుకలు నాడునురు'' హర—కొమాళ్ళవలెనే తత్సమమైన కుమాళ్ళపదమును గ్రంథములం దున్నది. ,,శుభము నిమ్మలే। నయ్యకొమాళ్ళతండ్రి నయి'' కువ—,,అపజయం బెఱుఁగనియ చటిరాచకొమాళ్ళు'' రాధా—,,లోకపుసుం గొమా। ళ్ళని గా కెవ్వరివమ్మకొవలయువేళన'' సారం—సుమాళ్ళు—హంస—శుక—

మఱియు బహుళ మనుటచే - తేరులు - దారులు - బారులు-గాలులు-కాఱులు- మొదలగువానిలోని ర- ల- ఱ- లకు ళకారము రాదు.

సూ:—ఏకపదమునందు టకారడకారములు- లు-ల-వర్ణములతోఁ

గలిసినపుడు దీర్ఘముమీఁది అరసున్న నిత్యముగా నిండుసున్న యగును. 22

ఉదా:—— తేఁటులు-ఉకారములోపించినపుడు తేంట్లు. ఇట్లే, గోంట్లు-గూండ్లు-తూండ్లు-ఏండ్లు- కాండ్లు- నాండ్లు- ఱేండ్లు- మొద——

అనఁటులు-అనంటులు, పనఁటులు- పంటులు- మొదలగుచోట్ల సం. ప్ర- ౬౦ సూత్రముచే నిండుసున్న వచ్చుచున్నది. అనంటులు-ఉకారలోపమున అనంట్లు అగుచున్నది కావునఁ జిన్నయసూరిసూత్రమం దీయర్థము విస్పష్టముగా లేకపోవుటచే దీర్ఘముమీఁది యరసున్న యని చెప్పఁబడినది.

సూ:——బహువచనమందు ఉకారము లోపించునపుడు పండు మొదలగు కొన్నిశబ్దముల డకారమునకు ళకారమును దానివెనుక నుండు సున్నకు లోపమును బహుళముగా నగును. 23

ఉదా:——పండులు-పండ్లు-పళ్ళు, ఇట్లే ఏండ్లు-ఏళ్ళు, తూండ్లు-తూళ్ళు, కాండ్లు-కాళ్ళు, గూండ్లు-గూళ్ళు, బండ్లు-బళ్ళు, గండ్లు-గళ్ళు, (మూండ్లు) మూళ్ళు (నాండ్లు) నాళ్ళు- మొద——

,,ఏండ్లు కాండ్లిత్యాదులందు డాకు ళాదేశము కొందఱు వక్కాణించిరి. తెలుఁగున బిందుపూర్వకస్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబు గాదు" అని చిన్నయసూరి చెప్పెనుగాని యది సరి కాదు. పూర్వు లిట్టి శబ్దములను నిండుసున్నతోఁ గలిపి పలికెడివారు, అట్లే వ్రాసెడివారు. అని తెలిసియే గురుమూర్తి శాస్త్రి పంళ్ళు-పుంళ్ళు-ఇంళ్ళు-కంళ్లు-మున్నగు సబిందురూపమ్ములను గూడఁ దన వ్యాకరణమున నుదాహరించియున్నాఁడు. ఇదిగాక, కొడవలి-రోఁకలి- మొదలగు శబ్దములకు మొదటిబహువచనరూపములు కొడవండ్లు-రోఁకండ్లు- మొదలగునవియై యుండఁగా, డకారమునకు ళకారము వచ్చిన దని చెప్పక, కొడవల్లు-కొడవళ్ళుగా మాఱు నని వేఱుసూత్రమును చిన్నయసూరి రచియించినను, కొడవల్లు- రోఁకల్లు- ఇల్లులు-అనెడివాడుక యెపుడును లేదనుట ధ్రువము. అట్లయినఁ గొడవండ్లులోని డకారమే ళకారమయిన దనుట శాస్త్రవ్యవహారసమ్మతము. దీనిలోని బిందువు క్రమముగా వాడుకలోఁ బోయినట్లే ఏళ్లు మొదలగుచోట్లను బోయినది. కావున బిందు

లోపమునచ్చిన గూళ్లు-నాళ్లు-మూళ్లు-మొదలగువానివలెను. రోఁకళ్లు మున్నగువాని వలెను ఏళ్ళు-కాళ్లు-మొదలయినవియు సాధువు లగును.

పళ్లు-ఏళ్లు-తూళ్లు-తాటాకుపుస్తకములలో నున్నవి. ఇప్పటి కృతులలో నున్నవి. ,, లేళ్లం దుప్పులు లోనుగా నగు మృగాళింగూడి యేనుంపలో తూళ్ళో తిండికిఁ గావగంబోగలు'' కృ. భా—

సూ:—లు-ల-పర మగునపుడు-లి-ల్లు-న్ను-వర్ణములు తుదఁగలకొన్ని శబ్దముల తుదివర్ణములకు నిండుసున్న వెనుకఁగల డకారము బహుళముగా నగును. 28

ఉదా:—కొడవలి+లు= ౧౦౧ సూత్రముచే ఇకారమునకు ఉకారము. కొడవలులు. దీనిచే 'ండ్' కొడవండ్లు- కొడవండ్లను. ఇట్లు, రోఁకలి-రోఁకండ్లు, తిరుగలి-తిరుగండ్లు, వాకిలి-వాకిండ్లు, లోఁగిలి-లోఁగిండ్లు. మొ—

విల్లు+లు=విండ్లు. ఇట్లు, పల్లు-పండ్లు, ముల్లు-ముండ్లు, ఇల్లు-ఇండ్లు, కల్లు (రాయి) కండ్లు- మొద— కన్ను+లు = కండ్లు. ఇట్లు పక్షోజవాచకమునకు నగును. ౯౯ సూత్రముచే ళ్ళ వర్ణ మాదేశము. కొడవళ్ళు-ముళ్ళు-కళ్ళు- మొద—బహుళ మనుటచే అంబలి-కంబలి-దోసిలి- మొదలగు పెక్కులివర్ణాంతములకును, కల్లు (మద్యము) పల్లు (పల్లము) తెల్లు-వెన్ను- జున్ను- మున్నగు వానికిని పైకార్యము రాదు. ఈరెండుసూత్రములలోను బహుళ మనుటచే, కొడవళులు, ఇండులు-కన్నులు- మొదలగురూపములును బ్రయోగానుగుణముగా నగును. రాయి యర్థముగలకండ్లు కళ్ళు కాదు. ఇట్లేయూహించునది.

కన్ను లర్థముగల కండ్లుశబ్దమును బూర్వకవులు పెక్కండ్రు వాడిరి.

,, ఏవేల్పు తలపంగ నినచంద్రులను బండికండ్లుగాఁ గండ్లుగా ఘనతఁ జేసె'' కళ్లా—ఇందలికండ్లుశబ్దము కన్నుశబ్దము బహువచనరూపములలో నొకటి యనుట క్లిష్టములేక శబ్దరత్నాకరకారులు కల్లుశబ్దమునకు నేత్రమ నెడియర్థమున నీప్రయోగ మొక

టియే కనఁబడుచున్నదని చెప్ప సాహసించిరి. 'కల్లు' బహువచనము కండ్లు. 'కన్ను' బహువచనములు—కన్నులు—కండ్లు—కళ్లు—ఇట్టి—ండ్లు—ళ్లు—వర్ణాంత రూపములనేకములు శిష్టవ్యవహారానుగుణముగాఁ దెలుఁగువ్యాకరణమున నున్నవి. కండ్లు—కళ్లు—వీనికిఁ బ్రయోగములు ,,బొట్టు దిద్ది యం జనమును గండ్లఁ దీర్చి'' కవిజ—కడగండ్లఁబడువారిఁ గడగండ్ల నీక్షించి,, ని—వి.రా—కడుపడిఁ దా నొక్కొక్కయెడఁ గం డ్లెఱచేయుచు'' రాజశే—ముండ్లకట్టెనొకనికండ్లు పెటిలి,, సానం—ఈబాళిపందుమసగొని యాబిడలేన కండ్లు గట్టి'' కండ్లు మీాల్సింగాణివిండ్లు బొమలు,, హంస—కలిగెఁ జూపెఁ గళ్లకఱవు దీఱ''ని—వి—,,

సూ:—కోడలు మొదలగువానిమీఁది బహువచన లకారమునకు రేఫము వైకల్పికముగాను, దానివెనుక నుండు లువర్ణమునకు నిండుసున్న పూర్వమందు గల డకారము బహుళముగాను ఆదేశము లగును. ౭౫

ఉదా:—కోడలు+లు=కోడంద్రు-కోడండ్లు-ఇట్లు, మఱదండ్రు-మఱదండ్లు, చెల్లెంద్రు-చెల్లెండ్లు, ఆంద్రు-ఆండ్లు. 'ఆండురు' అను రూపమును నన్నెచోడుఁడు ప్రయోగించెను.

సూ:—కా-గా-ప్రత్యయాంతము లయిన కొన్నిశబ్దములకు లు-లు-పరమగునపుడు పూర్ణబిందుపూర్వకడకారము బహుళముగా నాగమ మగును. ౭౬

ఉదా:—చెలికాండ్లు- అందగాండ్లు- కోడెగాండ్లు, లంచగాండ్లు-జీతగాండ్లు - పందెగాండ్లు - కొండెగాండ్లు, బాలిగాఁడుగోపాలిగాండ్లు. మొద—బహుళ మనుటచే ౩౫ సూత్రముచే, చెలికాంద్రు- చెలికాఱు- మున్నగురూపములును ప్రయోగముల కనుగుణముగా నగును.

పైరెండుసూత్రములచే నయిన ండ్లు - ంద్రు- వర్ణములకు ౬౮ సూత్రముచే ళ్ళువర్ణము బహుళముగా నగును.

ఉదా:—కోడళ్ళు- చెల్లెళ్లు-అందగాళ్ళు-పందెగాళ్ళు- మొద—

ఆంధ్రుడు- ఆంధ్లు, ఆళ్ళుగా మారవు. ఇందుకు వాడుక లేదు. ఇట్లే ప్రయోగవ్యవహారములనుబట్టి యూహించునది.

కోడండ్లు—అండ్లు—మఱదండ్లు—మొద—తె. వ్యా—చెల్లెండ్లపై. విజయ—కోడండ్లకున్—శివసు—కోడండ్లపై—శుక—,,బహువచనే గాండ్లు స్యాత్'' ఆన్ధ్రకౌ—గాండ్లు ర్బహ్వా అం—కా—కొండెగాండ్లు—కోడెగాండ్లు. సానం—అందగాండ్లు—లంచగాండ్లు. హంస—ఎనయ పచ్చిరి పందెగాళ్ళిపుడు రేగి'' హంస—

సూ:—కూఁతుశబ్దమునకుఁ బ్రథమైకవచనమున నిత్యముగాను తక్కిన యెల్లవచనములందు వైకల్పికముగాను, రువర్ణ మాగమ మగును. 22

దీనికిఁ బ్రథమైకవచనప్రత్యయము వేఱుగా లేదు.

ఉదా:—కూఁతురు-కూఁతురులు-కూఁతులు-ఇది యౌపవిభక్తికము.

కూఁతురిని-కూఁతురిచేతన్-కూఁతును-కూఁతుచేతన్—మొ—

దీనికిఁ బ్రథమైకవచనమునఁ దప్పఁ దక్కిన యెల్లవచనములందును రువర్ణ ముండ దని కేతన్న-ద్వితీయాద్యేకవచనములందు రువర్ణము వైకల్పిక మని పెద్దన్న. తరువాత బహువచనములందును రువర్ణము వైకల్పికమై ప్రయోగములఁ గనఁబడుచున్నది. ఇది తొలుత ననౌపవిభక్తికముగా నుండి కాలక్రమమున నౌపవిభక్తిక మైనది. దేశభాషలోనిపదములు వాడుకలో మాఱుచుండు ననుట కీశబ్ద మొక ప్రబలదృష్టాంతము కాఁగలదు. దీనికిఁ బ్రయోగములు:—

,,గేయవిశారదఁ జేసెఁ గూఁతురన్'' వసు-కూఁతురువలపు'' శృ-శా—,,జనకప్రభుకూఁతుర నేలికొందు'' ని-పి—ముద్దుకూఁతురుల వివాహముల్'' చంపూ—తనకూఁతురుమనమున'' పరమ.—శోభనమూర్తిని రుక్మికూఁతురిన్'' విష్ణు—కమలదళాక్షికూఁతురిని గాంచుట'' ఉ-రా—పెండ్లికూఁతురికి'' సుభ—కూఁతురి నీయఁ జూడ'' పార్వ—కూఁతురిం గాంచినన్'' సమీర—ఇట్లనియెఁ గూఁతురికిన్—దశా—తెల్లనికూఁతురితండ్రి''—రుక్మా—చేతిలోఁ గూఁతురిచేయి వేసి'' మృత్యు—దొరకూఁతురికిన్ వెస'' రాజ—కూఁతురిబిడ్డ'' ఆం—నా—కూఁతురిమోవి'' అహో—ఇట్లు లాక్షణికులు కవులు ప్రయోగించినవి పెక్కులు గలవు.

సూ:—కూఁతు- అల్లు- శబ్దములమీఁది బహువచనలకారమునకు రేఫము బహుళముగా నగును. దానివెనుకఁ బూర్ణబిందు పూర్వకడకారము బహుళముగా నాగమ మగును. ౭౮ కూఁతుశబ్దమునకు రువర్ణము రానపు డని తెలియునది.

ఉదా:—కూఁతు+లు= కూతుండ్రు- కూఁతుండ్రను- అల్లు+లు= అల్లుండ్రు-అల్లుండ్రను. రేఫము బహుళ మనుటచే కూఁతుండ్లు-అల్లుండ్లు, మొద—ండ్' బహుళ మనుటచే కూఁతులు. ౩౨ సూత్రమున-అల్లురు. మొదటి ;రెండుపక్షములందును ౬౯ సూత్రముచే ళ్ళు వర్ణ మగును. కూఁతుళ్ళు-అల్లుళ్ళు- ఇందుకుఁ బ్రయోగములు:—

,,రాచకూఁతుండ్రు సుతుల సంగ్రామనిరత హృదయులగువారిఁ గాంచఁ గోరుదురు కాదె'' భారత—స్త్రీ. 2—165 [1863—1901 ముద్రణములు) కంసభార్య లిద్దఱు తనకూతుండ్రుగావున'' ఉ—హరి—పెండ్లికూతుండ్రచందాన వెడలివచ్చు'' పార్వ—పెంపుడుకూఁతుండ్ర పెద్దపిడుగు'' శుక—అనుఁగుఁగూఁతుర్లు'' ని—వి—రా—పెండ్లి కౌనికూఁతుం డ్రున్న పక్షమున'' హిం. ధర్మ—,,దక్షునల్లుండ్ర మెడల సూత్రములు కట్టి'' కాశీ—,,నడయూస జోకొట్టి నవకంపుటల్లుండ్ర'' కవిక—కదలి రత్యుత్కంఠ నలుండ్రు సోదరులున్''చంద్రభా—ఇట్లు బహుప్రయోగములు కలవు.

కూఁతుండ్లు-అల్లుండ్లు, కొన్ని మండలములలో నిప్పటికిని వాడుకలో నున్నవి. కూఁతుళ్ళు-అల్లుండ్లు- తె-వ్యా—కొన్ని యర్వాచీనకృతులందు నున్నవి.

లిక్కననాఁటనుండి వచ్చుకూఁతుండ్రుశబ్దమును దాను గూడఁ బ్రయోగించియుఁ జిన్నయసూరి దాని కనుశాసనము చేయకుండుట చిత్రము.

సూ:—బహువచనము పర మగునపుడు త్రాడు మొదలగువాని డువర్ణమునకుఁ గాని డకారమునకుఁ గాని ళకారము బహుళముగా నగును. ౭౯

ఉదా:—త్రాడు+లు= త్రాడులు. త్రాడులు- ౨౦ సూత్రముచే ఉకారలోపము. త్రాళ్ళు-త్రాళ్లను-త్రాళ్లచేన్-మొద—

గుమ్మడి+లు- ౧౦౧ సూత్రముచే ఇకారమున ఉకారము. గుమ్మడులు. గుమ్మళులు. గుమ్మడులు. ఉకారలోపము. గుమ్మళ్ళు. గుమ్మళ్లను. మొద—

ఇట్లు, తాడు—పోడు-కోడు-పేడు-కూడు- కీడు- జోడు- కాడు- మోడు-బీడు-కరుడు-బరడు-రాడు-చప్పుడు-మొద— లేడి- తడి-పొడి-మడి-కడి-వడి-జడి-ముడి-దడి-గుడి-సుడి-బడి- కావిడి- మామిడి- మొద—

బహుళ మనుటచే తోడు-చవుడు—మొదలగువాని కీకార్యము రాదు. జాడు-మాడు-మొదలగువానికిని, తడి-దడి-మొదలగువానికిని నిత్యముగా వచ్చును.

సూ:—కొన్ని నామములయొక్కయు ధాతువులయొక్కయు-డలు-రలు- కూడ బహుళముగా ళ్ళువర్ణ మగును. ౮౦

ఉదా:—ఒడలు- ఒళ్ళు- బహువచనము ఒడళ్ళు. ఇది విశేష్యము. వెడలు-వెళ్ళు, సడలు-సళ్ళు, మరలు-మళ్లు, మర్లు అనియుం గలదు. ఇట్లు, దొరలు—దొర్లు, పొరలు-పొర్లు, అకారలోపము మాత్రము. ఇవి యన్నియు ధాతువులు. వీనికిఁ గొన్ని ప్రయోగములు:—

„ఒళ్ళెరకమున్న వచ్చి యొకయంగన చూచె నరేంద్రచంద్రునిన్'' కవిక— „ఒళ్ళెల విఱిచెడి యుజ్జ్వలాంగి'' రా. వి. భాస్కరుఁడు వెళ్ళిపోయినపాడుమేడ'' శా:—పఱచె వెళ్ళెను బరుగత్తె'' ఆ. భా— యాత్ర యొనరించి వెళ్ళుద మర్థ రాత్రి మీవిచారంబు'' శివరా—వాగె సళ్ళి యొయ్యన „కువ—సళ్లించుఁ గళ్ళెముల్ ఘళ్ళనంగ'' కృష్ణరా—తరువాతను మళ్లి పంపఁ దగ దంపినచో'' విప్రనా— మళ్ళవారును నిల్చి త్రెళ్ళువారు'' మిత్రవిం—కుతుయె! ల్లను దప్తం బగుటకా జలించి యువి మర్లక గ్రామముఁజొచ్చెకా'' చంపూ—ఇట్లనేకములు గలవు.

సూ:—పెండ్లిశబ్దమునకు-లు-ల-పర మగునెడ నిందుసున్న వెనుకఁగల డువర్ణ మాగమ మగును. ౮౧

ఉదా:—పెండ్లి+ండు+లు=పెండ్లిండులు-ఉకారలోపము-పెండ్లిండ్లు-పెండ్లిండ్లను.

సూ:—పెండ్లిరూపాంతరమైన పెళ్ళికి-లు-ల-పర మగుచో ళకార మాగమ మగును. ౮౨

ఉదా:—పెళ్ళి+ళ్+లు=పెళ్ళిళ్లు-పెళ్ళిళ్ళను. ఈశబ్దము శుద్ధదేశ్య మని తె-వ్యా—ఇపు డనేకులు దీనిని వాడుచున్నారు.

సూ:—కొన్ని సంశ్లిష్టబహువచనాంతములమీఁద మరల బహువచన ప్రత్యయము నొక్కొ-కచో నగును. ౮౩

౭౦ సూత్రముచే ఉకారము లోపించినపుడు నామముతుదిహల్లు బహువచన-లు-ల-వర్ణములతోఁ గలియును. అదియే సంశ్లిష్టము.

ఉదా:—కొడవళ్ళులు - కోడండ్రురయందు ఇల్లాండ్రులు- మొదలగు కొన్ని మాత్రమే ప్రాచీనకావ్యములఁ గలవు.

సూ:—చెట్టు మొదలగువానిలోని టువర్ణముమాత్రము బహువచన మందు బహుళముగా లోపించును. ౮౪

ఉదా:—చెట్టులు-చెట్లు—చెట్లను-చెట్లకున్- మొద—ఇట్లు, కొట్లు, కట్లు—బొట్లు-జుట్లు-తిట్లు-అట్లు-రట్లు-గట్లు-మెట్లు-వట్లు- పొట్లు మొద—బహుళ మనుటచే బట్టు మొదలగు కొన్నిటి కీకార్య ము రాదు. 'బహువచనమందు' అన్నమాట క్రిందిసూత్రముల కనువర్తించును.

సూ:—గొడ్డు మొదలగువాని డువర్ణము బహుళముగా లోపించును.

ఉదా:—గొడ్డులు-గొడ్లు-గొడ్లను, ఇట్లు, గుడ్డు- తెడ్డు- ఒడ్డు- జిడ్డు- అడ్డు-బొడ్డు మొద—వీనిలోని 'డ్లు' ళ్ళవర్ణము కాదు.

సూ:—ఎద్దుదకారద్వయము డకారద్వయ మగును. డువర్ణము తెలు

చుగా లోపించును. ౭౫

ఉదా:—ఎద్దు+లు=ఎడ్డులు-ఎడ్లు-ఎడ్లను. ఎద్దులు-ఎద్దులను. మొ—

"దుత్వ మబ్బు నెద్దునకు వరికి నెడ్లు వడ్లు" కా-చూ—

"అందులోనిబండి కలనడ్డయెడ్లను । విలిచి తెచ్చి" దశకు—

ఉత్తరమండలములవారు 'ఎడ్లు' అందురు. కర్నూలు ప్రాంతమందలి కాపులు 'ఎద్దులు' అందురు.

సూ:—చెయువుబహువచనలకారమునకు శకటరేఫము వైకల్పికముగా నగును. ౭౬

ఉదా:—చెయువు+లు=చెయువులు. చెయువులను- మొద—దీని రూపాంతరము చెయ్వు.

సూ:—బహువచనము పర మగునపుడు చేను మొదలగువాని నువర్ణము లోపించును. ౭౭

ఉదా:—చేను, చేలు, పేను-పేలు, మీను-మీలు-'మీనులన్' అని కొందఱు కవులు ప్రయోగించిరి. "చక్రయుగంబుల గండు మీనులన్" కవికర్ణ—

*సూ:—కలను మొదలగువాని నువర్ణము ఏకవచనమున వైకల్పికముగాను బహువచనమున నిత్యముగాను, కువర్ణ మగును. అగుచో దానివెనుక సరసున్న చేరును. ౭౮

ఉదా:—కలను- కలఁకు- కలఁకులు, కలంకు- కలంకులు -కలంకులన్- కలను-కెలను-కొలను-కొఱను- గవను-నెఱను- మ్రాను-వరను. కలఁకు- కొలఁకు- మ్రాఁకు- మొదలగు నేకవచనరూపములు

---

* "కొఱను నెఱను నాఁగఁ గొలను నా మ్రా ననఁగ గలను గవను కెలను వల ను నాఁగఁబరగుశబ్దములకు బహువచనంబుల నులకుఁ గులు విధించె నూత్నదండి." అని బహువచనమందు మాత్రమే కువర్ణము విధించెను. చిన్నకోటపెద్దనార్యుఁడు నిట్లె చెప్పెను. కొలఁకులు మున్నగు బహువచనరూపములలోని కువర్ణాంతము లేక వచనరూప మని భ్రాంతిపడి యర్వాచీను లట్లు ప్రయోగించిరి. దానినిబట్టి యేక వచనమందు కువర్ణము వైకల్పిక మనెడి సూత్రములు పుట్టినవి.

భారతమునఁ గనరావు. "కలనికిన్-కొలనుసొచ్చి-వ్రాని మొద లగ్" ఇత్యాదిరూపములే కనఁబడును.

సూ:—అక్లే, రేను - గోను - శబ్దముల నువర్ణము గువర్ణ మగును. ౯౦

ఉదా:—రేను-రేఁగు-రేఁగులు, గోను-గోఁగు-గోఁగులు.

సూ:—బహువచనము పర మగునపుడు రేయి మొదలగువాని యివ ర్ణము బహుళముగ లోపించును. ౯౧

ఉదా:—రేయి-రేలు, రాయి-రాలు, వేయి-వేలు, వ్రాయి, వ్రాలు రోయి-(రోలు) మొద—

బహుళ మనుటచే నీకార్యము ప్రథమైకవచనమందును గొన్ని చోట్లఁ గలదనియు, సమాసములందు గూడఁ గలుగు ననియుఁ దెలియునది.

రే న్నిద్రించుఁ బ్రభాతంబైనను మేల్కని స్రృజించు-భార-రే రాజు-ఆం. రాముఁడు, రాచందమువాన్పఁ దపసిరాచానకు-రామా-మొగములు వేగలకేషుండు కనిక-వేనెలుఁగు రోవెలఁది-మొ—రాయిరూపాంతరము-తాయి-మగతాపలేకము-

ఇట్లు బహువచనముల మార్పు చెందిన ఉకారాంతములు, కొడుకు-చెఱువు-శబ్దములవలెను, ఇకారాంతములు చెప్పఁబోవు వాటి-తల్లి-శబ్దములవలెను యథాయోగ్యముగా విభక్తు లొందు నని తెలి యునది. ద్వితీయాద్యేకవచనములందు మార్పు చెందు ట్రై యాప విభక్తికాంతములు వేఱుగాఁ జూపఁబడును.

## స్త్రీలింగములు-స్త్రీసమములు.

ఇంతకు మున్ను గొన్ని సందర్భవశమునఁ జేర్కొనఁబడినవి తక్కినవి కొన్ని యుదాహరింపఁబడును.

సూ:—సంస్కృతదీర్ఘాంతములు నిత్యముగాను ఆచ్ఛికదీర్ఘాంతములు కొన్ని వైకల్పికముగాను హ్రస్వాంతము లగును. ఏకస్వరము లు గావు. ౯౨

ఉదా:—సంస్కృత:సీతా-సీత, లక్ష్మీ-లక్ష్మి- వధూ-వధు- సేనానీ-సేనాని, మొద—ధరణీ-అవని-పురంధ్రి- మొదలగు కొన్ని సంస్కృతమునందే హ్రస్వాంతములు గూడ నగును.

ఆచ్ఛిక—నవలా-నవల, నేజా-నేజ,లకోరీ-లకోరి,పల్లకీ-పల్లకి, దుప్పటీ-దుప్పటి, తేజీ-తేజి,తంబుఱా-తంబుఱ,మొ-ఇట్టివానిలోఁ దొలుత నేవి దీర్ఘాంతములో నేవి హ్రస్వాంతములో యిపుడు నిర్ణయింప వీలు లేదు గాని పైరెండువిధము లైనరూపములును బూర్వకావ్యముల నున్నవి.

ఏకస్వరములు:—శ్రీ- స్త్రీ- హ్రీ- జ్యా- మా- క్ష్మా- ధీ- భ్రూ-గో-ఇత్యాదులు. ౯౩

సూ:—దాసీశబ్దము బహువచనమందును సమాసమందును వైకల్పికముగా హ్రస్వాంతమగును.

ఉదా:—దాసీలు-దాసులు, దాసీ+అది-అకారలోపము-దాసీది-

ఈబహువచనరూపము పుంలింగస్త్రీలింగములందు సమానముగా నుండుటచే నర్థసంశయము గలుగకుండుటకై ఆబాలగోపాలమాంధ్రు లీశబ్దమును దాసీలు-దాసీది-దాసీదానికి-అని వాడుచున్నారు-దీనికిఁ బూర్వకవిప్రయోగములు లేవు

సూ:—మహతీ వాచకములు వాని విశేషణములు స్త్రీలింగములు. ౯౪

ఉదా:—రమ-రమణి, బాల-యువతి, గౌరి-సతి, విదుషి, అమ్మ-తల్లి, ఇల్లాలు-కూఁతురు-వెలఁది-నాతి,చెలికత్తె-ననఁబోఁడి-మొద—లింగనిర్ణయము నామవాచకప్రకరణమునఁ జేయఁబడినది. వ్యాకరణకావ్యములకై ప్రథమైకవచన ప్రత్యయము లేని స్త్రీలింగశబ్దములు గూడ స్త్రీసమము లని చెప్పఁబడుచుండును. ప్రథమైకవచనప్రత్యయము లేనిశబ్దములు స్త్రీసమ

ము లని ప్రకరణము మొదటనే చెప్పఁబడినది. అట్టి మహద

మహద్వాచకములు కొన్ని యుదాహరింపఁబడును.

మేడ-గది-ఇల్లు-ఏఱు-కాఁపు-నీరు-కన్నె-గోనె- మొద- ఆచ్ఛిక-హరి-పతి-మతి-లత-విద్య-నది; కర్మ-వేధ-సవిత-చరిత్ర-ఆత్మ-విశ్వకర్మ మహిమ-వాక్కు-సంపద-దూత- మొద-తత్సమ—

సూ:—ఋకారాంతముల తుది ఋకారమునకు అకార మగును. అవు డవి స్త్రీసమము లగును. ౯౩

ఉదా:—పితృ-పిత, మాతృ-మాతృ, ఇట్లు భ్రాత- జామాత- భర్త-స్రష్ట-హర్త-గంత-త్వష్ట-ఉద్గాత- దుహిత—స్వస- మొద—

సూ:—దర్భాదులు స్త్రీసమములు. ౯౬

వీనికిఁ బ్రథమైకవచనమున నేప్రత్యయమును రాకపోవుటచే నివి స్త్రీసమము లయినవి.

ఉదా:—దర్భ-పనస-కుశ-కుండ- మొద —

సూ:—భూ-హృత్—దివ్-కద్రూ- నౌ—శబ్దములు క్రమక్రమముగా భువి-హృది-దివి-కద్రువు-నావ—లయి స్త్రీసమము లగును. ౯౭

'కద్రువ' ఇది పొరపాటున వచ్చిన రూపము. ప్రాచీనగ్రంథము లందు 'కద్రువు' అనియే యున్నది.

సూ:—రై-గ్లౌ-ఇవి వైకల్పికముగా-రో-గ్లో-యగును. ౯౮

ఉదా:—రై-రో, గ్లౌ-గ్లో,రో యనునది ధనార్థమున దేశ్యము గూడ నగును. ఇవన్నియు స్త్రీసమములు. ౧౦ సూత్రముచే ద్వితీయైకవచనమున రైశబ్దమునకు నివర్ణకమును తక్కినవానికి నువర్ణకమును వచ్చును. ఈ శబ్దముల ప్రథమైకవచనరూపము లు మాత్రమే కావ్యములఁ గనఁబడును.

సూ:—అప్సరశ్శబ్దము ద్వితీయాంతరూపము మలోపమునఁ దెలుఁగున నామమై స్త్రీసమ మగును. ౯౯

ఉదా:—అప్సరసమ్-అప్సరస-అప్సరసలు- ఇత్యాదిరూపములు.

'అప్సరా' అని ఆకారాంతమును క్షీరస్వామి నిర్దేశించెను.
(తత్సమము) అప్సర- (తద్భవము) అచ్చెర

సూ:—అశ్వత్థామాదులు నలోపమునఁ దెలుఁగున నామములై త్రీసమము లగును. ౧౦౦

ఉదా:—అశ్వత్థామన్-అశ్వత్థామ; ఇట్లు కృష్ణవర్త్మ-యువ-యజ్వ-బ్రహ్మ- (ధాత) భాగ్యశాలి, మనీషి- గుణి-కరి-శూలి-ధన్వి-ధని-సుకృతి- మొద——

ఇట్లు త్రీసమశబ్దములను బరిశీలించునది. వీనిలో, ఉకారము తుదఁ గలవానిలోఁ జేతనవాచకములు కొడుకుశబ్దమువలెను జడవాచకములు చెఱువుశబ్దమువలెను జెప్పఁదగు నని యింతకు మున్నే చెప్పఁబడినది. తక్కినయచ్చులు తుదఁ గలవాని కిఁక రూపనిష్పత్తి తెలుపఁబడును.

అ-ఆ-ఎ-ఓ-ఔ-ఈయచ్చులు తుదఁగలవి సీత-అయ్యా-శబ్దముల వలెను, ఇ- ఈ- ఐ-తుదఁగలవి, హరి-తల్లి-శబ్దములవలెను విభక్తులను బొందును. సంబోధనాదికార్యముల కాయాసూత్రములు చూచునది.

ప్ర- సీత-సీతలు, అయ్యా-అయ్యలు, ద్వి. సీతను- అయ్యను-ఏకవచనమున—కిన్- నన్- రావు. సీతకున్- సీతయందు- అయ్యకున్-అయ్యయందు-

సూ:—ఇకారమునకు బహువచనము పరమగునపుడు ఉకారము వచ్చును. ౧౦౧

ప్ర-హరి-హరులు, తల్లి-తల్లులు, హరిని-తల్లిని, ఏకవచనమున-కున్-నన్-రావు. హరికిన్-తల్లికిన్-హరియందు-తల్లియందు.

సూ:—బహువచనము పర మగునపు డాచ్ఛికశబ్దముల తుది ఇకారమునకు వెనుక నుండెడి ఇకారమునకుఁ గూడ, ఉకారము

వచ్చును. ౧౦౨

ఉదా:—కలికి+లు. పూర్వసూత్రముచేఁ గడపటి ఇకారమున కును, దీనిచే, దానికివెనుక లకారముమీఁద నున్నఇకారము నకును ఉకారములు వచ్చినవి. కలుకులు- అయినది. ఇట్లు, ములికి-ములుకులు, చెలిమి—చెలుములు, బలిమి-బలుములు, కలిమి-కలుములు, మానిసి—మానుసులు, విడిది-విడుదులు.

వెనుకటిఇకారమనుటచే మొదటిఇకారమున కీకార్యము రాదు. జిగి-జిగులు, బిగి-బిగులు, నిసి-నిసులు, గిఱి-గిఱులు. మొద—

సూ:—రి- లి- డి— వర్ణములకు వెనుకనున్న ఇకారమునకు ఉకారము రాదు. ౧౦౩

ఉదా:—పందిరి + లు = (పందిరులు) పందిళ్ళు. గుప్పిలి + లు= (గుప్పిలులు) గుపిళ్ళు. మామిడి+లు=(మామిడులు)మామిళ్లు ఇట్లు పిడికిలి-రాపిడి- మొద—

తొమ్మిది మొద లగువాని కీకార్యము రా దని చిన్నయసూరి చెప్పెను గాని 'తొమ్ముదులు' వ్రాఁతప్రతులలో నున్నది. "మొద లైనరెండుతొమ్ముదులు విద్యలలోన" అనుకాశీఖండపాఠ మచ్చులో, మే లైన రెండుతొమ్మిదులు-అని మాఱినది. ఎనిముదులు-ఎనుముదులు- వాడుకలో నున్నవి.

సూ:—సంబోధనమునం దొకానొకచోఁ స్త్రీసమములకు, కానశబ్ద మను ప్రయుక్త మగును. ౧౦౪

ఉదా:—నాయయ్యకాన, నాతల్లికాన, నాసామికాన, మొద—

"ధర్మమే మఱకుండుమీ తల్లికాన" నైష- ఇది యాచ్ఛిక శబ్దములకు మాత్రమే చేరు నని యధర్వణాచార్యు లనిరి కాని, పాప జాతికాన!, ఇత్యాదిప్రయోగములు కనవచ్చుచున్నవి.

సూ:—[illegible] గలదు. ౧౦౫

అక్కలు! కన్యకాత్వ మిటు లాఁజెడిపోవ నకారణంబ పే । కెక్కడిచూలు వచ్చె. నిర్వచ—లాలలు దొరఁగంగ నన్నలా! యని యొఱలుచున్" హరి—వోడిఁబడ నమ్మలక్కలని తూలుచు దీనత దోయి లొగ్గుచున్" అము.

సూ:—స్త్రీవాచకములకు సంబోధనమున రోశబ్దము చేరును. ౧౦౬

ఉదా:—అక్కరో-చెలియరో-దీనికి హ్రస్వమును వచ్చును. అమ్మరొ అన్నరొ-ఏనుంగురొ-యనియుఁ బ్రయోగములు కలవు.

సూ:—సంబోధ్యమునకు నెడముగా ఓశబ్దముండుట పద్యకావ్యములఁ గానవచ్చెడి. ౧౦౭

ఉదా:—ఓవినువీథినున్న ఖచరోత్తములార! ఆము- ఓ, తోయజ నేత్రుఁగాంచిన వధూమణి!—విజయ-

దీర్ఘాంతశబ్దములకు రెం డుదాహరణములు.

ప్ర- శ్రీ- శ్రీలు. నవలా- నవలాలు.

ద్వి- శ్రీని- శ్రీలను. నవలాను- నవలాలను.

శేషమూహ్యము. నవలాలు- అని బహువచనప్రయోగము కనఁబడలేదు.

## సర్వనామముల రూపనిష్పత్తి

సర్వనామవాచకశబ్దముల ప్రథమైకవచన బహువచనరూపములును ఉన్నవాని రూపాంతరములును సర్వనామప్రకరణమునఁ జూపఁబడినవి. ఆరూపముల సిద్ధికై యెన్నిసూత్రములు రచియించినను జాలవు. కావున వాని నట్లే గ్రహింపఁదగును. ఇపుడు ద్వితీయాది విభక్తులయందు తెల్పఁదగిన విశేషాంశములను దెల్పుదును.

సర్వనామములకు సంబోధన ప్రథమావిభక్తి లే దనియు వీనిలో డువర్ణకము తుదఁగలవి డుమంతములలోఁ జేరు ననియు మున్ను చెప్పఁబడినది.

డుమంతములకు ౧౦- సూత్రముచే 'ని'వర్ణకమును, ౧౧-సూత్రముచే 'ని'వర్ణాగమమును వచ్చును. ఉదా:—ఒకనిని, ఒకని

చేతన్-వానిని-వానితోడన్-వీనిని-వీనికంటెన్-ఎవనిని-ఎవనికొఱకున్.

సూ:—వారు మొదలగు డుమంతముల బహువచనరూపములకు ద్వితీయాదివిభక్తులు పర మగునపుడు ఇకారము బహుళముగా నగును. ౧౦౮

సూ:—ఇకారముమీఁది-ను-కున్-విభక్తుల ఉకారమునకు ఇకారము వచ్చును. ౧౦౯

ఉదా:—ఒకరు+ను, పూర్వసూత్రముచే రేఫమీఁది ఉకారమున కికారము. దీనిచే ప్రత్యయముయొక్క ఉకారమునకు ఇకారము-ఒకరిని. ఇట్లే వారు+ను=వారిని, వీరిని-ఎవరిని, వారిచేతన్-వీరివలనన్-ఒకరికిన్-వారికిన్-ఎవరికిన్-మొ॥

బహుళ మనుట వాండ్రను- వారలను- మొదలగురూపములకు బాధ కలుగకుండుటకు.

సూ:—నీ- నా- తన- శబ్దములకుఁ బ్రథమారూపములు క్రమముగా నీవు-మీరు, నేను-మేము, తాను-తారు-లగును. ౧౧౦

సూ:—నీ- నా- తన- శబ్దములకు ద్వితీయైకవచన బహువచనముల యందు క్రమముగా నిన్ను-మిమ్ము, నన్ను-మమ్ము, తన్ను-తమ్ము, లాదేశము లగును. ౧౧౧

వీనికి 'ను'వర్ణకము చేర్చినచో నిన్నున్ మిమ్మున్- ఇత్యాది రూపము లగును. * తాము-తమరు" అనురూపములు వాడుకలో వ్యాపించినవి.

సూ:—'తమరు' శబ్దమునకు ద్వితీయాదివిభక్తులు పర మగునపుడు ఇకార మగును. ౧౧౨

ఉదా:—తమరు+ను=తమరి+ను. ౧౦౯ సూత్రముచే విభక్తి ఉకార

* తాము-తమరు. అనునవి గౌరవార్థమునందు 'మీరు' అనుటకు బదులుగా వాడఁబడుచున్నవి. ఒకని నుద్దేశించునపుడును 'తాము తమరు' అనుట కలదు.

మునకు ఇకారము. తమరిని-ఇట్లు తమరికిన్ మొద—

సూ:—మిమ్ము- మమ్ము- లకు, నుప్రత్యయము పర మగునపుడు 'ల'వర్ణము వైకల్పికముగా నాగమ మగును. ౧౧౩

ఉదా:—మిమ్ములన్-మిమ్మున్, మమ్ములన్-మమ్మున్-

సూ:—వీనికిఁ దృతీయాదిబహువచనములందు క్రమముగా-మీ-మా-తమ-లాదేశము లగును. ౧౧౪

ఉదా:—నీచేతన్-మీచేతన్; నాచేతన్-మాచేతన్- తనచేతన్- తమచేతన్- తక్కినరూపములు పూర్వోక్త సూత్రములనుబట్టి గ్రహించునది.

సూ:—అమహదర్థకములైన, అది-ఇది-ఎది-శబ్దముల దివర్ణమునకుఁ బ్రథమాబహువచనమున 'వి' వర్ణము వచ్చును. ౧౧౫

ఇఁక బహువచనప్రత్యయము లేదనుట

ఉదా:—అది-అవి, ఇది-ఇవి, ఎది-ఎవి, ఏది-ఏవి- మొద—

సూ:—వీనికి ద్వితీయాద్యేకవచనములందు దాని-దీని-దేని; బహువచనములందు వాని-వాటి, వీని-వీటి, వేని- వేటి, క్రమముగా నాదేశము లగును. ౧౧౬

ద్వితీయైక వచనము లందు ని ప్రత్యయము. దానిన్-దీనిన్-దేనిన్- బహువచనమందు 'ను' ప్రత్యయము. ౧౦౯ సూత్రముచే దీని ఉకారమునకు ఇకారము-వానిని-వాటిని, వీనిని-వీటిని, వేనిని-వేటిని. అగును. అట్లే తృతీయాదిరూపములు గ్రాహ్యములు.

'వాటిని' మొదలగురూపములను అహోబలుఁ డంగీకరించినట్లు కనఁబడును. గురుమూర్తిశాస్త్రి యుదాహరించెను. అప్పకవి మున్నగువారు ప్రయోగించిరి.

అమహదర్థపుం దివి చిరకాలముగా వాడుకలో నున్నవి. కావున శ్రుతిరమ్యము లయిన యీరూపములు గ్రాహ్యము లగును.

ఇందుకుఁ బ్రయోగములు—

వాటి విడిపించుకోలేక నోటితాళవాద్యములచేత-శశరే, వాటివీటిలో నింత తాటోటు చేసి-కృష్ణరా, వీటిలోపలనొకమాఁటిచే వడిలేని- అప్పక- రేఖలఁ వాటిం గనుమంగ-''కునల-

యతిప్రాసస్థానముల లేని యిట్టి ప్రయోగము లనేకము లచ్చులో మాఱిపోయినవి. ఇప్పటివార లనేకులు వాటిని మొదలగు రూపములను ప్రయోగించియున్నారు.

సూ:—అమహదర్థకమైన 'ఒకఁడు' శబ్దమునకు ద్వితీయాద్యేకవచనములందు 'ఒకటి' యాదేశ మగును. ౧౧౭

ఉదా:—ఒకటిని-ఒకటికంటెన్-ఒకటికిన్- మొ— ప్రథమైకవచనరూపమైన ఒకటిశబ్దమునకు నిట్లే రూపములుండును.

సూ:—అది-ఇది-ఎది-శబ్దములకు మహత్యర్థమున ద్వితీయాద్యేకవచనములందు దాని - దీని - దేని - యను నాదేశము లగును. ౧౧౮

ఉదా:—అది=ఆమె-దానిని, ఇది=ఈమె-దీనిని, ఎది=ఎవతె- దేనిని- మొద—బహువచనమందు వారిని-వీరిని-ఎవరిని-మున్నగు రూపములు వచ్చు నని మున్నే చెప్పఁబడినది.

సూ:—వారు-వీరు-పదములపై మరల-లు-ల-వర్ణములు చేరుటయుఁ గలదు. అపుడు వెనుకనున్న ఉకార మకారమగును. ౧౧౯

ఉదా:—వారు+లు=వారలు- వారలను-వీరు+లు=వీరలు-వీరలను-

సూ:—ఒకరు మొదలగువాని రువర్ణమునకు వెనుకఁ బూర్ణబిందుపూర్వకడకారము బహుళముగా నగును. ౧౨౦

ఉదా:—ఒకండ్రు-ఒకరు, వాండ్రు-వారు, వీండ్రు-వీరు, ఎవండ్రు-ఎవరు-పెక్కులోనిఉకార మకార మగును. పెక్కండ్రు.

సూ:—వాఁడు-వీఁడు-శబ్దములకు బహువచనమందు వాండ్లు-వీండ్లు రూపములు నగును. ౧౨౧

ఇవి ఒకండ్రు-వాండ్రు-వీండ్రు- శబ్దములువలెనే మహతీమహ దర్థకములు, నీచత్వమిత్రత్వబోధకములు. నన్నెచోడుఁడు, వాండు-వీండు-అను నేకవచనమునరూపములను ప్రాసస్థానమునఁ గూర్చియున్నాఁడు. వీనిపై లుప్రత్యయము, ఉకారలోపము చేసినను, వాండ్లు-వీండ్లు-అగును.

* ఆంధ్రకౌముది, తెలుఁగువ్యాకరణము, మున్నగు పూర్వలక్షణములం దీరూపములు కలవు.

సూ:—నీచత్వ మిత్రత్వములు తోఁచునపుడు ఒక్కండ్రు మున్నగు వానిలోని 'ండ్రు' వర్ణము బహుళముగా ళ్ళువర్ణమగును. ౧-౨-౨

ఉదా:—ఒక్కళ్ళు-వాళ్ళు-వీళ్ళు-ఎవళ్లు.

బహుళ మనుటచే ఒక్కళులు అనెడిరూపమును గల దని తెలియునది. మాన్యుల ప్రసంగమునందు ఒకరు-వారు-వీరు-మున్నగు గౌరవార్థకరూపములును, పుత్రమిత్రకళత్రాదులను దాసీదాసాదులను గూర్చి ప్రసంగించునపుడు వాండ్రు-వాండ్లు-వాళ్లు మున్నగు నీచత్వమిత్రత్వబోధకరూపములును మిక్కిలి ప్రాచీనకాలమునుండి తెలుఁగుదేశ మెల్లయెడల నాయామండలములలో వాడుకయం దున్నవనుట తెల్లము. ఇందు ఒకండ్రు-వాండ్రువంటిరూపములు ప్రాచీన కృతుల కెక్కినవి. వాండ్లు-వీండ్లువంటి వర్వాచీనకావ్యముల కెక్కినవి. ఒకళ్ళు శబ్దము మాత్ర మెట్లో తిక్కనశ్రీనాథాదులయాదరము గాంచినది. ఇందుకుఁ బ్రయోగములు-

"కడవఁగ నొకళ్ళు పసరమునడిచిన నొక్కళులు పెయ్య నడుపవలయునే" భార-ఉ— "ఆవేళ నొకళ్ళు లేమి నష్ఫలమయ్యెన్" హరవి— "సిసుఁదగిన

* నిత్యం జశ్శసోః వాండ్లు ర్బహువచనేఽపి వా స్త్రీయాంచ. ఆం-కౌ- వాండ్లు-వాండ్లను-వీండ్లు-వీండను-మొ-తె-వ్యా-

గోవాళ్ళమహిఁ—" మను—గోవ+వారలు=గోవాళ్ళు-శబ్దర- "వాండ్లువ్వీండ్లను" ప్రాసస్థానమున, రాధా—

వాళ్ళు-వీళ్ళు-రూపములు తాళపత్రపుస్తకములఁగలవు కాని యతిప్రాసస్థానములఁ గనఁబడలేదు. అయినను తిక్కయజ్వాదులు వాడిన ఒకళ్ళుపదమువలెనే యివియును భాషాసంప్రదాయమునుబట్టి సాధువు లగుచున్నవి.

ఒకళ్ళు మొదలగునాలుగుశబ్దము లన్నివిధముల నొక్కజాతిలోఁ జేరిన వగుటచే సంస్కారమున కనుగుణముగా ననుశాసనము చేయఁ బడినది. వీనిని బ్రయోగించుట ప్రయోగింపకపోవుట కవులరుచినిబట్టి యుండును. ఇఁక నింతవఱకు ననుశాసించిన-కూఁతుళ్ళు-కళ్ళు-వాళ్ళు మున్నగు ళ్ళువర్ణాంతశబ్దముల యౌచిత్యవిమర్శనము భాషాసంప్ర దాయవేత్త లగువిద్వాంసులకు విడిచిపెట్టుచు నిప్పటి పెద్దలప్రయోగ ములు గొన్నియుదాహరించుచున్నాను.

"మీవాళ్ళు-ఆఁడవాళ్లు (స.చరి—ఇంకను చెక్కచోట్ల) మూఁగవాళ్ళు (మాతృ. సే) వాళ్లు—వీళ్ళు—మీవాళ్ళము (సుధాశ—పెక్కుచోట్ల) వాళ్లు—పెళ్ళికూతు ళ్ళు— (సారం. సా) కొజ్జావాళ్ళు (చం. శే) x స్త్రీవాళ్ళు—ఏళ్ళు (సంవత్సరములు) వాళ్ళు-కళ్ళు—వీళ్లు—కూఁతుళ్ళు— మొదలయినవి తక్కిన నవలలోను నాటకము లోను వంద లున్నవి.

సూ:—ఇద్దఱు- అందఱు- మొదలగువాని తుదిఉకారమునకు ద్వితీ యాదివిభక్తులు పర మగునపుడు అకారముగాని ఇకారము గాని విభాష నగును. ౧—౩

ఇకారము వచ్చునపుడు విభక్తిఉకారమునకు ఇకారము వచ్చును. అందఱు మొదలగువానికి ఇకారము వైకల్పిక మని తె. వ్యా, ఆంధ్రకౌ, చెప్పుచున్నవి. కొందఱు కవులును బ్రయో గించిరి. వాడుకయు సుప్రసిద్ధము.

ఉదా:—ఇద్దఱను-ఇద్దఱిని, అందఱను-అందఱిని, అందఱికిఁ-మొ..

ఇట్లు, ఇరువురు-ముువ్వురు-పలువురు- మొదలయిన-గురు-వుప-తుదఁగలయీాజాతిశబ్దములును, పెక్కురు-అందఱు- ఇందఱు-ఎందఱు-ఎల్లరు- మొదలయినవియు గ్రాహ్యములు.

క. దనుజుఁబరిమార్చియందఱకి । కిని దానవబాధతీర్చి కృత కృత్యుండై. శృం. శా

సూ:—ఎనమండ్రు మొదలగువానికి అకారమే వచ్చును. ౧-౨౪

ఉదా:—ఎనమండ్రను-తొమ్మండ్రకు-పదుండ్రలోఁ-మొ—

'గురు' చేరినచో, ఎనమండుగురిని - ఇత్యాదిరూపములే యగును.

సూ:—మన-శబ్దమునకు ద్వితీయావిభక్తి పర మగునపుడు లవర్ణము నిత్యముగా నాగమ మగును. ౧-౨౫

ఉదా:—మనము, మనలను- తృతీయాదులందు మనచేతఁ-మనకుఁ. మొద—"మనలచేతఁ-మనలకొఱకుఁ-మనలయిల్లు" ఇత్యాదిప్రయోగములు శ్రావ్యములు గావు.

ఔపవిభక్తికములరూపనిష్పత్తి.

సూ:—నామవిభక్తులకు దగ్గఱగా వెనుక వచ్చునట్టి ఇ-టి-ంటి-తి అనునవి యౌపవిభక్తికము లనఁబడును. ౧-౨౬

ఇవి కలవి యగుటచే ఔపవిభక్తికము లనియు, లేక యివి యంతమునందు గలవియగుటచే ఔపవిభక్తికాంతము లనియు, నట్టి శబ్దములకుఁ బేరు వచ్చినది. దీనిచే ఇవి రాఁదగినశబ్దముల కౌపవిభక్తికాంతము లని వాడుక కలిగినది.

సూ:—ఇవి కొన్నియాచ్ఛికనామముల తుదనుండెడి, లి-లు-ల్లు-ను-న్ను-డు-రు-ఱు-ఱ్ఱు-యి- మొదలగువర్ణములకు ద్వితీయాద్యేక వచనములు పర మగునపుడును సమాసమందును యథా ప్రయోగముగా బహుళముగా నాగమాదేశము లగును.

అనఁగా, సూత్రములోఁ జూపినవర్ణములకు ఇ-టి-ంటి-తి-అను వానిలో నొకటిగాని రెండుగాని యాయాశబ్దములకుఁ దగినట్లుగా ఆగమముగాఁగాని ఆదేశముగాఁగాని నిత్యముగాఁగాని వైకల్పికముగాఁగాని వచ్చునని యర్థము. కాని మెల్లనామములతుదనుండెడి లి-లు- మొదలగువర్ణముల కీప్రత్యయములలో నేదేని యొకటి తప్పక వచ్చునని తలంపరాదు. కావున నేనితుద నీప్రత్యయములు కనఁబడుచున్నవో యవి యౌపవిభక్తికాంతము లని గ్రహింపఁదగుననుటకే 'కొన్ని'పదము చేర్పఁబడినది. మఱియుఁ గొన్నిటికి విభక్తి పర మగునపుడు వైకల్పికముగా వచ్చినను సమాసమందు నిత్యముగా వచ్చును. అందుచేత "సమాసమందు" ననుమాట చేర్పఁబడినది. మఱియు బహుళ మనుటచేఁ గొన్నిటికిఁ కొన్ని యేకవచనములు పర మగునపుడే వచ్చును. మఱికొన్నిటికిఁ బ్రథమాదిబహువచనములు పర మగునపుడు గూడఁ బైకార్యము కలుగు నని తెలియునది.

ఉదా:—నూయి, నూతులు- నూతులన్ మొద—

ప్రథమైకవచనమునందే యీకార్యము కొన్నిటికిఁ గన వచ్చును. ఉదా—ముక్కంటి- వెడవింటి-కడలిరాచూలి- ఇత్యాదులు. ఇవి సమాసాంతకార్యము లని పూర్వులమతము.

పైసూత్రమందలి "ద్వితీయాద్యేకవచనములు పరమగునపుడును, సమాసమందును, బహుళము" అన్నమాటలు ముందుచెప్పఁబోవుసూత్రముల కనువర్తించుచుండును.

ఔపవిభక్తికాంతము లుదాహరించుటకు ముందుగాఁ గొన్ని శబ్దములు పూర్వు లెట్లువాడఁబడినవో తెల్పెదను.

సూ:—మన్ను మొదలయిన కొన్నిశబ్దములు తొల్లి యౌపవిభక్తికములు కావు. ౧౨౭

,,వినయమ్మున ద్రోణురూపు మన్నునఁజేసి నమర్చి'' విన్నన నేను, భార—,,మన్ను

నసుండి భిరంబున-పో,రున కరు దెంచె వేల్పుఁగొమరుండు" పారిజా—"ఈ పేరువం బిల్వఁవే" కువల— "మేనునన్-కేలునన్-" చంద్రికా-చంద్ర-"ద్రాఁగన్నువడి నెడ దూఁగుమేనున నింట" కవిక—"తలిరుటరిగెలక్రిందున వెలయుపడ" ఇలదుమ "నీడునఁ గలమానికములు వివిధాంబరముల్" సర్వల— "కొండొక సేపునకు, అక్కడ-ఇక్కడ-ఎక్కడ-ముందు-ప్రొద్దు-మొ-భార—

మిన్ను-వీను-ప్రోలు-మేను-మొదలగు కొన్నిశబ్దములు పూర్వకాలమున నౌపవిభక్తికము లైనట్లు భారతమువలనఁ దెలియునుగాని వీనిని దరువాతివారు యతిప్రాసానుకూల్యమున కనౌపవిభక్తికములుగా వాడిరి.

సూ:—పండు మొదలగు కొన్నితొల్లి యౌపవిభక్తిములుగా వాడఁబడినవి. ౧౨౯

ఈక్రిందిప్రయోగములు కొన్నిగ్రంథములందుమాత్రమే కనవచ్చును. అన్నియు నన్నిగ్రంథములందును గనరావు.

"అల్లో నేరేడుపంటి యాకృతి చూపెన్-కవిక—మారెడుపంటికై-ఉ. రా-చల్లనిరేయిటి తట్టుపుగ్గు- అము—పేరుకొని నైచు తెల్లటిచీరవోలె- ఉ. హరి—చేలుసిగిచేతఁ జేర్చినమున్నింటి విత్తరాసులెల్ల-హ-నర— నేరెటేటియసల్-వసు-తెంగెటిజున్ను-మను-పుంటిపైనుప్పు" ఇత్యాదులు.

ఇట్లు కొన్నియనౌపవిభక్తికము లౌపవిభక్తికములుగాను, ఔపవిభక్తికము లనౌపవిభక్తికములుగాను, కొన్ని ద్వివిధముగాను మాఱిపోయినవి. కావున నిపుడు వ్యవహారమం దున్నరీతిని వీని నుదాహరించెదను.

### లివర్ణాంతములు.

సూ:—రోఁకలి మొదలగువాని తుదివర్ణమునకు టివర్ణ మాదేశమగును. ౧౩౦

ఉదా:—రోఁకలి, రోఁకటిని- రోఁకటితోన్- రోఁకటిపోటు - ఇట్లు, ఆఁకలి-నాఁగలి-తిరుగలి-అంబలి-వాకిలి-గొడ్డలి-పిడికిలి-గుప్పిలి-కొడవలి-ముంగిలి-పుక్కిలి-చెక్కిలి- కాఁగిలి- దోసిలి- సందిలి-

మొద—బహుళమనుటచే గొడ్డలి మొదలగు కొన్నిటికి,
ంటి-కూడ వచ్చును. గొడ్డంట నఱికెను. ఏదియు రాక
పోవును. గొడ్డలితో నఱికె ననియు వాడుక గలదు. కొన్నిటికి,
టి-ంటి-ఆగమము లాదేశములు గూడ నగును.

ఉదా:—తొల్లిటికంటె-తొంటికంటె-తొల్లింటివారు-మొ—

కరువలి-కడలి-వేసవి-వావిలి-జోలి-కూలి— ముదుసలి- అంకిలి-
ఇత్యాదుల తౌపవిభక్తికములు కావు.

లువర్ణాంతములు.

సూ:—కాలు మొదలగువాని తుదియచ్చునకు ఇవర్ణము వచ్చును.

ఉదా:—కాలు, కాలిని- కాలితోఁ- కాలిక్రింద- ఇట్లు, మోఁకాలు-
వ్రేలు-కోడలు-మఱదలు- చెల్లెలు- ప్రోలు- చూలు— నూలు-
ఒడలు- మొదలు- కేలు-ఆలు-చదలు-పాలు (భాగాదులు) మొ.

సూ:—పగలు మొదలగు కొన్నిటికి-టి-ంటి-ఇంటి-ఇటి-యథాప్రయో
గముగా నాగమాదేశము లగును. ౧౩౨

ఉదా:—పగటికి-పగలిటి-పగలింటి, పాలింటను, అసటన్-కుందేటిని-
తాఁబేటిని—నొసటన్—బోటిని, మొదటికి- మొదలిటికి- మొద
లింటికి, బయటన్— మొద—

జోలు-డాలు-జూలు—చాలు- తేలు- మొదలయినవి యౌపవిభక్తి
కములు కావు-

ళువర్ణాంతములు.

సూ:—విల్లు మొదలగువానికి, ంటి యాదేశ మగును. ౧౩౩

ఉదా:—వింటిని- వింటికొన, ఇంటిని- ఇంటికప్పు- ఇట్లు, ముల్లు-పల్లు
(దంతము) కల్లు (చక్రము రాయి) ఒళ్ళు- మొ— బెల్లు-పొల్లు.
జల్లు— మొదలగువానికిరాదు.

సూ:—ద్విత్వము లోపించినపు డౌపవిభక్తికకార్యము రాదు. ౧౩౪

ఉదా:—వినువీథి-ములుకంప-పలువరుస-కనుదోయి- మొ—

నువర్ణాంతములు.

సూ:—చేను మొదలగువానికి ఇవర్ణమువచ్చును. ౧౩౫

ఉదా:—చేనిని— చేనిచెంత; చేను- పేను- మ్రాను- కొలను- మేను— గూను— కలను- వలను- మొద—కొన్నిటికిఁ గొన్నియెడల వచ్చును. అదనికిఁ-పదనికిఁ- భార—కోను- జోను- మీను- మొదలగువానికి రాదు.

న్నువర్ణాంతములు.

సూ:—కన్ను మొలగువానికి, ంటి-ఆదేశ మగును. ౧౩౬

ఉదా:—కంటిని-కంటితుద. ఇట్లు, మన్ను-జున్ను-మిన్ను-విన్ను-మొ కొన్నిటికి ద్విత్వలోపమునందు రాదు. కొన్నిటికి సమాస మందు వైకల్పికము. ఉదా—వినువాక - కనుదోయి, జున్నుగడ్డ- మన్నేఱు-మొ— ఎన్ను- తెన్ను- పొన్ను- పన్ను-మొదలయినవానికి రాదు. వెన్నుశబ్దము భారతకాలమున నౌపవిభక్తికము. దాని ప్తమీరూపము, వెంటన్-(వీఁపుమీఁద) ఇది వెంబడి యనునర్థమునఁ డప నవ్యయమైనది.

డువర్ణాంతములు.

సూ:—త్రాడు మొదలగువానికి టివర్ణ మాదేశ మగును. ౧౩౭

ఉదా:—త్రాటిని-త్రాటికొన. ఇట్లు, వీడు-పాడు-కాడు-ఏఁడు-రాడు- ఓడు-బీడు—నాఁడు-గూఁడు-పోడు-కోడు-కూడు- తాడు- పెరడు- మెదడు-జోడు-పురుడు-తవుడు-పుండు-పదడు-చవుడు - నిరుడు మూఁకుడు— తూఁడు- నేరెడు- తంగెడు- అప్పుడు- ఇప్పుడు- ఎప్పుడు- మొ—పుండుశబ్దమును, నేరేడు-తంగేడు- మొదలగు దీర్ఘమధ్యములను ఇపు డనౌపవిభక్తికములుగా వాడు చున్నారు. వాని పూర్వ మివి యౌపవిభక్తికములే. ఉదా—

పుండుమీఁద - నేరేడుపండు- తంగేడుపువ్వు- మారేడుదళము.
మొద___కీడు-జాడు-మాడు- పేడు- మోడు- మొదలగువానికి
రాదు.

సూ:___ఒండు-రెండు- మొదలగుసంఖ్యావాచకములకు-టి-ఇటి-ఇంటి
యథాప్రయోగముగా నగును. ౧౩౫

ఉదా:___ఒండు, ఒంటిఁ జేసి పోయిరి, ఒకండు-ఒకంటికి. ఇట్లు, రెం
టిని-మూఁటిని-నాలుగిటిని-నాలుగింటిని- ఏనిటిని- అయిదిటిని
ఏడింటిని - ఎనిమిదింటిని- తొమ్మిదింటిని- పదింటిని- నూటిని
నూఱింటిని- వేయింటిని- పెక్కిటిని- పెక్కింటిని- మొద___

రు-ఉ-వర్ణాంతములు.

సూ:___ఊరు, నోరు- మొదలగువానికి, ఇ-టి, వర్ణములు యథాప్ర
యోగముగా నగును. ౧౩౬

ఉదా:___ఊరిని-ఊరివారు. ఇట్లు, పేరు- తేరు-కూఁతురు-నీరు-నోరు
గోరు-పోరు_నగరు- మొద___
నోటిని-నోటిమాట, ఇట్లు, నీరు-నెత్తురు-గోరు-ఎసరు-నదురు
ఎదురు- మొద___ఇపుడు కొందఱు- విస్తరి-పందిరి- మొదలగు
రివర్ణాంతములకు టివర్ణాదేశము చేయుచున్నారు.

ఉదా:___విస్తటియన్నము-విస్తటిలో-పందిటిలో- మొద___
కొన్నిటికి టివర్ణాదేశము నిత్యము. ఉదా___కోనేరు-కోనేటికి
కోనేటినీరు-ఏఱు-ఏటికి-ఏటికాలువ. మొద___

. పల్లేరు-గన్నేరు-పల్లేరు- పైరు- చూరు-కారు- కదురు-వెదురు-
మొదలగువానిలోఁ గొన్ని పూర్వ మాపవిభక్తికములైనను, ఇపు
యన్నియు నిపు డనాపవిభక్తికములుగా వాడఁబడుచున్నవి.

ఱువర్ణాంతములు.

సూ:___ఱు- మొదలగువానికి టివర్ణ మాదేశము నగుచో ద్విత్వ

ము నిత్యముగా లోపించును. ఉకారమున కికారము బహుళ ముగా నగును. ౧౮౦

దా:—అతితిని. అతితికిక్-అతుతర్-అతితిమీఁద-గొట్టు-గొతితిని-గొర్తిని-గొర్తికంప-ఇచ్చట, ఉవర్ణమునకే తివర్ణ మాదేశ మైనది. అట్టు-కట్టు,గొట్టు-మిట్టు,వట్టు-కొట్టు-కుట్టు-మొ—సంయోగమునందు శకటరేఫము సాధురేఫ మగును గాని జ్ఞలయందు కాదని శాసనములవలనఁ దెలియుచున్నది.

దా:—మోడేకుత్తిని; మొగలతుత్తికి. మొద—

బహుళ మనుటచే అతుతర్ నతుతన్ ఇత్యాదులందు ఇకార ము రాదు. పాఁతటి ఔపవిభక్తికము. "పతిగలనేతిననంగొలుచుపాఁతి కింగలదే తలంపఁగన్" ఉ-హరి—

## యివర్ణాంతములు.

:—చేయి మొదలగువానికిఁ బ్రథమాబహువచనాదులు పర మగునపుడును సమాసమందును తివర్ణము వచ్చును. ౧౮౧

దా:—చేయి,చేతులు-చేతిని- చేతులక్- చేతికట్టు- మొద—చేయి-నూయి-గోయి-నేయి-వాయి-రాయి- మొద—వాయిశబ్దము బహువచనరూపమునకు--"చిద్రుపలుచేరుఁ దత్సతుల చేతులఁ గాక కులంబువాతులన్" ఉ. హరి- రాయిశబ్దమునకు బహు వచనము 'రాలు'. దోయి-కూయి-వ్రాయి- మొదలగుకొన్నిటికి రాదు.

:—ఇతర వర్ణములకును ఔపవిభక్తికకార్యము గనవచ్చు చున్నది. ౧౮౨

లి-లు—మొదలగువానికే కాక వేఱువర్ణములకుఁ గూడ, టి-తి మొదలగు నాగమాదేశములు భాషలోఁ గనవచ్చు చున్నవి.

సూ:—అక్కడ మొదలగువానికి ఇప్రత్యయ మగును. ౧౪

ఉదా:—అక్కడికి-అక్కడినుండి-ఇక్కడివారు-ఎక్కడియూరు-మొద
అక్కడ—ఇక్కడ-ఎక్కడ-చోటు-మాటు (తడవ) ముందల
మీఁదు-క్రిందు-పిఱుందు-పిమ్మట—

సూ:—క్రిందు మొదలగువానికి 'టి' వర్ణ మాగమ మగున
అగుచోఁ బూర్వమం దున్న ఉకారము ప్రాయికము
అకార మగును. ౧౪

ఉదా:—క్రిందు-క్రిందటికి- క్రిందటిమాట, ఇట్లు మీఁదు- ముందు
మాపు- రేపు- నేఁపు-మునుపు; నిన్న-నిన్నటికి-నిన్నటిపని, ఇట్ల
మొన్న-అంత-ఇంత-ఎంత-తొలుత-వెనుక-పిదప-మొ—

ప్రాయిక మనుటచే ప్రొద్దు మొదలగు కొన్నిటి ఉకా
మకారము కాదు-ఉదా—ప్రొద్దుటికి-ప్రొద్దుటివేళ-

సూ:—ఔపవిభక్తిక మైన ఇ వర్ణ మాదేశ మగుచో నొక్క
యెడఁ బూర్వమం దున్న ఉకార మికార మగును. ౧౪

ఉదా:—నడుము-నడిమికి-నడిమివాఁడు,

"దుస్సనేనుబిల్ నడిమికిఁ ద్రుంచి-భార, సరోజ। గంధినడిమి
బేదటికంబు మానె-వరా, నెన్నడిమి లేములు—శకుం, నెన్నడిమి
మింట-ప్రభా, కౌ నర్థమునఁ గొందఱు దీని ననౌపవిభక్తికము
వాడిరి. "కనకాంగినడుముపోలిక—కవిరాజ-

సూ:—అన్ని మొదలగువానికి విభక్తి పర మగునపుడు మాత్రమ
టి-ంటి. వచ్చును. ౧౪

ఉదా:—అన్నిటిని-అన్నింటిని-అన్నిటియందు- అన్నింటికి- మొ
అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-

సూ:—మఱికొన్నిటికి టి వర్ణ మాగమము నాదేశము గా
నగును. ౧

ఉదా:—ఏమి, ఏమిటి-ఏటికిన్-ఏటిమాట-మొద—

'ఏమిటి' ప్రాచీనకృతులలో లేదు. ఏటికి-ఏటిమాట-మొద
లయినవి పూర్వకావ్యముల నున్నవి గాని యిపుడు శిష్టవ్యవహార
మున లేవు.

సూ:—ఔపవిభక్తికముల తృతీయాసప్తమీ విభక్తులకు 'అను'
బహుళముగా నాదేశ మగును. ౧౪౮

ఉదా:—గోరిచేతను- గోరను, ఊరియందు- ఊరను- ఇకారసంధి
నిత్యము. ఇంట నున్నాఁడు. చేతఁ బట్టెను- మొద—
తక్కిన యౌపవిభక్తికవిశేషములను ప్రయోగములనుబట్టి
గ్రహించునది.

ఇ ది శ బ్ద ప్ర క ర ణ ము.

---

## కారకప్రకరణము

### వాక్యపద్ధతి

సూ:—పరస్పరసంబంధము గల పదములసముదాయము, లేక కర్త్రా
దులతోఁ గూడిన క్రియాపదము వాక్యము. ౧

సం. ప్ర. లోని ౧౧ సూత్రమునర్థమే యిట్లు వివరింపఁబడినది
అనఁగా నొకయభిప్రాయము తెలియఁజేయుమాటలకూడిక వాక్య
మని యర్థము.

సూ:—సంపూర్ణాసంపూర్ణభేదమున వాక్యము ద్వివిధము. ౨

భూతార్థకాదిక్రియాపదములలో నొకదానితో సమాప్తి చెం
దునది సంపూర్ణవాక్యము. రాముఁ డింటికి వచ్చెను. మొ—క్త్వార్థ

కము మొదలగు లాక్షణికావ్యయములలో నొకదానితో సమాప్తి
చెందునది యసంపూర్ణ వాక్యము. వాఁడు వచ్చి-నేను వెళ్ళఁగా-
మొద—ఇట్టివి సంపూర్ణ వాక్యములతోఁ గలిసి యుండును.

సూ:—సంపూర్ణ వాక్యము సామాన్యాదిభేదమునఁ ద్రివిధము. ౩

సామాన్యవాక్యము-సంశ్లిష్టవాక్యము - మహా వాక్యము - అని
మూఁడు తెఱఁగుల నుండును.

సూ:—ఒక్కసమాపకక్రియతోఁ గూడినది సామాన్యవాక్యము. ౪

ఉదా:—శ్రీరాముఁ డయోధ్య నేలెను. మొద—

సూ:—అసంపూర్ణ వాక్యముతోఁగాని అవాంతరవాక్యముతోఁగాని
కూడిన సంపూర్ణ వాక్యము సంశ్లిష్టవాక్య మనఁబడును. ౫

ఉదా:—చంద్రుఁ డుదయింపఁ గలువలు వికసించెను. నీవు సత్యము
చెప్పితివేని దండనము నొందవు. ఇందు మొదటి వాక్యము
లోని మొదటిభాగ మసంపూర్ణ వాక్యము రెండవవాక్యము
లోని మొదటిభాగ మవాంతరవాక్యము. కావునఁ బై రెండు
వాక్యములు సంశ్లిష్టవాక్యము లనఁబడును.

సూ:—అసంపూర్ణములు అవాంతరములు సంపూర్ణములు నగు
కొన్ని వాక్యములకూడిక మహావాక్యము. ౬

ఉదా:—మంధర చెప్పినమాటలకుఁ జెవి యొగ్గి, లోకాపవాదము
నకు వెఱవక, కైక తన్నుఁ జూడవచ్చిన దశరథునితో
శ్రీరాము నడవికిఁ బంపియు భరతునకు రాజ్యాభిషేకము గావిం
చియుఁ 'దొల్లి నా కిచ్చెద నన్న రెండువరములు దీర్పు' మని
పలికెను. పెద్దయభిప్రాయమును సంగ్రహించి చెప్పవలసివచ్చి
నపు డిట్టివాక్యము లుపయోగింపఁబడును. వాక్యరచనకుఁ
గొన్ని నియమములు.

౧. సంభాషణములో మాట లేవరుసను వచ్చునో వాని నట్లే

వ్యాకరణయుక్తముగా వ్రాసిన వాక్యము సంప్రదాయసిద్ధ మగును. పద మెక్కడ నుపయోగించిన బాగుండునో తెలిసికొని యుప యోగించుట యౌచిత్య మనఁబడును. పదౌచిత్యము నర్థౌచిత్యమును గూడినవాక్యము వినుటకుఁ జదువుటకు నింపు పుట్టించును గావున సంప్రదాయము నౌచిత్యము నెఱిఁగి వాక్యము వ్రాయఁదగును.

౨. వాక్యమునందు పదములకూర్పున కొకనియమము లేదు కదా యని యిష్టమైనట్లు కూర్చుట తగదు గాని సందర్భోచిత ముగాఁ గొన్నియెడల వరుస మార్చుట దోషము గాదు.

ఉదా:—బాలుఁడు పాఠము చదివెను. పాఠము చదివెను బాలుఁడు చదివెను పాఠము బాలుఁడు. మొద—

3. ప్రాచీనకావ్యములందు తప్పక కలిసియుండఁ దగిన రెండు శబ్దములను వేఱుపఱిచి దూరముగాఁ బ్రయోగించుట కనవచ్చును.

"పితృసంకల్పము సేయంగ సుతుల కవశ్యంబు వలయు" "ఉత్సవముల్ నియాడ నెవ్వరికి వచ్చునె" "నృపు లెట్లు గల్గిరి ల యెల్లం గైకొనం గ్రమ్మఱ"

పైపద్ధతి యిప్పుడు తగదు. చేయవలయు-కొనియాడవచ్చునె-కొనఁగల్గిరి-అనురీతి నిట్టిశబ్దములను గలిపి వ్రాయుటయే యుచితము

౪. పద్యమందును ప్రౌఢగద్యమందును వాడిన వాడవచ్చును గాని, రాముండు-మృగంబు-పుస్తకంబు-ఎఱుఁగు-వెలుంగు-వంటినిండు సున్నలతోడిరూపములను అద్ది-ఎద్ది-వనమ్ము-వంటి ద్విత్వములతోడి రూపములను, ఇలు-పలు-కలు-కను-మిము-వంటి ద్విత్వహీనరూపము లను, మారెడు-తోడెలు-వంటి హ్రస్వము వచ్చినరూపములను సర్వ జనసాధారణముగాఁ జదువుకొనఁదగిన వచనములం దుపయోగించుట తగదు.

౫. పద్యములోఁ బ్రత్యయసముచ్చయాదులను విడుచుట దోషముగాదు కాని వచనమున విడువరాదు.

ఉదా:—నీవువచ్చితి (వి)-వాఁడు వచ్చె (ను) అందఱు (ను) వచ్చి
మొదలయినవి.

కుండలీకరణము చేసినవర్ణములు పద్యములోఁ బోయినఁ బో
చ్చును గాని వచనమునఁ బోఁగూడదు.

౬. అమహదర్థకములను వాడునపుడు ద్వితీయార్థమం
ప్రథమ వాడుటయే సముచితము.

ఉదా:—ఆవు పాల నిచ్చును. వాఁడు చెట్టు నెక్కెను. అనుచో
ద్వితీయ వినిపించుగాదు-పాలిచ్చును-చెట్టెక్కెను. అనురీతియే
యుచితము.

౭. అన్యభాషాసంప్రదాయము గ్రాహ్యము కాదు.

ఉదా:—అయూర నేనొక్కయిల్లు గలిగియున్నాను. వాఁ డాహారమ
తీసికొనుచున్నాఁడు. నన్ను వినుము. అని యాంగ్లసంప్రదా
యము ననుకరించుట తగదు. ఆయూర నా కొక యిల్లున్న
అనురీతిని వ్రాయఁదగును.

౮. కొన్నిచోట్ల నుచితముగా నున్నను పెక్కుచోట్లఁ గర్మా
ర్థకప్రయోగము శ్రావ్యము గాదు.

ఉదా:—నన్నయార్యునిచే భారతము తెనిఁగింపఁబడియె. ఇది శ్రా
మగును గాని, నాచే భారతము చదువఁబడినది. నేను వాని
జూడఁబడితిని, మొదలగు ప్రయోగములు శ్రావ్యములు గా
ఇది సంప్రదాయము కాదు.

౯. ఏని మొదలగు వికల్పార్థములతోఁ గూడిన కర్తృపద
లేకవచనము లైనను క్రియాపదము బహుళముగా బహువచనమగు

ఉదా:—వాఁడేని నీవేని రండు. అతఁడైన నేనైన వత్తుము-అన్నయో
తమ్ముఁడో వత్తురు. మొద—బహుళ మనుటచే నీవు నే
శబ్దములు కర్తలు గానిచోఁ గ్రియ యేకవచనము నగు

ఉదా:—రాముఁడేని కృష్ణుఁడేని వచ్చును.

౧౦. అనేకకర్తలలో 'నీవు' శబ్ద మున్నయెడలఁ గ్రియ మధ్యమపురుషము, నేను శబ్ద మున్నచో నుత్తమపురుషము, రెండు నున్నయెడల నుత్తమపురుషము నగును.

ఉదా:—రాముఁడును సీతయు నీవును వచ్చితిరి. సీతయు సౌమిత్రియు నేనును వచ్చితిమి. రాముఁడును నేనును నీవును వచ్చితిమి.

ఇట్లు క్రియాపదము బహువచన మగుట యర్వాచీనసంప్రదాయము. నీవు-నేను-శబ్దములనుబట్టి క్రియ తఱచుగా నేకవచన మగుట ప్రాచీనసంప్రదాయము.

"విప్రవరులుండ వెల్వడుము వేగమ నీవును నినిషాదియుక్." ఆతనిఁ బొందిన బ్రదుకు దీవు తమ్ముఁడు సుతులుక్, భార—నేను నాసేనయు దాడివెట్టెద విశ్శృంఖలతక్, హరి—రాఘవుండు నీవు నన్న, రణ్యభూములందు రక్షించి నేఁడు కా, అడవి నెట్టులొంటి విడిచె 'దనిన, జైమి—తఱచుగ ననుటచే నొక్కొక్కచో, క్రియ బహువచనము గాను గనవచ్చును. "మోహాంధుండు భీష్ముండుఁ గేశవ నీవుం గడఁగుండు. భార—

౧౧. ఒకవాక్యములో నేకవచనము లైనకర్త లనేకము లున్నను తానుశబ్ద మున్నచోఁ గ్రియాపద మేకవచన మగును.

ఉదా:—శ్రీరాముఁడు సీతయుఁ దానును సౌమిత్రియుఁ జిత్రకూటము చేరెను.

౧౨. తాను శబ్దముతో నున్న యనేక కర్తృపదములలో నొకటిగాని యంతకంటె నెక్కువగాని బహువచనపదము లున్నయెడల నర్థసందర్భమునుబట్టి క్రియాపద మేకవచనము బహువచనము గూడ నగుట కలదు.

తాను ననుజుల్ శోకించెనో, తానుఁ దమ్ములుఁ జెడును. అను ద్రోణపర్వ పాఠములను బహువచనములుగాఁ బరిష్కర్తలు తెలియక దిద్దిరి. వ్రాఁతలో నివి యేకవచనములుగానే యున్నవి. "పాండవాగ్రజుండు...తానుఁ దమ్ములుఁ బాంచాలియుఁ బరివారంబును నుచితప్రకారంబున నిజవాసంబులకుం జనిరి."

ఇచ్చట బహువచనక్రియయే యున్నది. బహువచనకర్తృపదముగూడ నున్నచో నెక్కుడు ప్రాచీనార్వాచీనకవు లిట్టిచోట్ల బహువచనక్రియయే యుపయోగించియున్నారు. ప్రాచీనార్వాచీనభాషాసంప్రదాయభేదముల కిది యొక తార్కాణము.

౧౩. ఏకవాక్యమునందు మహదాదివాచకము లైనకర్తృపదము లనేకము లున్నయెడలఁ గ్రియాపదము చివరనుండుదానినిబట్టి యుండును.

ఉదా:—రథమును సారథియు వచ్చిరి. రౌతును గుఱ్ఱమును వచ్చెను. రథమును సారథియు గుఱ్ఱములును వచ్చుచున్నవి.

విభక్త్యర్థములు

వాక్యములు వ్రాయునపు డేవిభక్తి యేయర్థమున వచ్చునో యిందు వివరింపఁబడును. వీనికే కారకము లను వ్యవహారము గలదు, కారక మనఁగాఁ గ్రియతో నన్వయించునది లేక క్రియను బుట్టించునది యని యర్థము. అన్ని విభక్తులును క్రియలతో నన్వయింపవు. కొన్ని విభక్తులు కొన్ని యర్థముల నన్వయించును కొన్నియర్థముల నన్వయింపవు. తెలుఁగున నొక విభక్తికి మఱియొకవిభక్తి వచ్చుట కూడ నిందుకుఁ గారణ మగును. సంబోధనప్రథమావిభక్తియు కంటెన్ - యొక్క - విభక్తులును ఏయర్థమునందును గ్రియతో నన్వయింపవు. విశేషములు లక్ష్యలక్షణములఁ దెలియఁగలవు.

సూ:—కారకము లాఱువిధములు. ౭

కర్మకారకము-కర్తృకారకము- కరణకారక...-సంప్రదానకారకము-అపాదానకారకము-అధికరణకారకము. ఇవి క్రమముగా నీప్రకరణమున వివరింపఁబడును.

ప్రథమావిభక్తి.

[ఇందు వాక్యములలో కర్త లగువానికే కాదు, ఇతరము లైనవానికిఁ గూడ నెట్టిసందర్భములఁ బ్రథమ వచ్చునో తెలుపఁ

బడును. ఇట్లే తక్కినచోట్ల నూహింపునది]

సూ:—అన్ని ప్రాతిపదికములకంటెను, వానివాని యర్థములకుఁ దగినట్లుగా, ముందుగాఁ బ్రథమావిభక్తి ప్రత్యయములు వచ్చును. ౮

ఉదా:—రాముఁడు-వనము-గురువు-ధేనువు-మొద—

ఇందు-డు-ము-వు-అనునవి యేనామమున కేయర్థము కలదో ఆయర్థమునుఁ దే వచ్చిన వని గ్రహించునది. ఈయర్థమునే ప్రాతిపదికార్థ మందురు.

సూ:—ప్రథమావిభక్తిప్రత్యయములు లేనికొన్ని నామవాచకాదులు కలవు, అవియును ప్రథమావిభక్త్యంతములే యగును. ౯

ఆదిపదముచే విశేషణములు సర్వనామములు గ్రహింపఁ దగును. ఇట్టి రూపములు శబ్దప్రకరణమునఁ జూపఁబడినవి. ఇందు కొన్ని—ధాత-కవి-సీత-నది-రమణి; అమ్మ-అన్న-కొడుకు-కూఁతురు-పేద-గోనె-పల్లకీ-నేను-అంత-అన్ని-ఇద్దఱు-అందఱు-మొద—

సూ:—క్రియాపదముచేఁ జెప్పఁబడునది కర్తయైనను కర్మయైనను దానికిఁ బ్రథమ వచ్చును, ౧౦

ఉదా:—హనుమంతుఁడు సీతను చూచెను. ఇందు, చూచె నన్న పుడు ఎవడు? అని ప్రశ్నించినచో హనుమంతుఁ డని బదులు వచ్చునుగావున నిదిక్రియచేఁ జెప్పఁబడుచున్నది. సీతనుజూచిన వాఁడు గావునఁ గర్త యగుచున్నది. అందుచే దీనికి, ఉక్తార్థ మందుప్రథమవచ్చినది. ఉక్తమనఁగాఁ క్రియచేఁ జెప్పఁబడుట. ఇట్లే, కిరీటిచే సైంధవుఁడు చంపఁబడెను. అనుచో నెవఁడు చంపఁబడెనన్నప్రశ్నకు సైంధవుఁ డనిబదులువచ్చును గావున నిది క్రియచేఁ జెప్పఁబడుచున్నది. క్రియాఫలమును జెందు చున్నది గావునఁ గర్మమైనది. అందుచే దీనికిని ఉక్తార్థమందు

ప్రథమ వచ్చినది. ఇదియే కర్మార్థకప్రయోగ మనఁబడును. ఈప్రయోగమునఁ గర్త తృతీయా విభక్తియందును కర్మ ప్రథమయందు నుండును.

అసమాపకక్రియచే జెప్పఁబడినను గొన్నిసందర్భములందు గర్తృపదమునకుఁ బ్రథమ వచ్చును.

ఉదా:—వానలు కురిసి పంట పండెను. నేను రాక యాపని జరుగదు నీవు చెప్పఁగా వింటిని మొద—

భావార్థకాదులకుఁ గర్త యగుదానికిఁ బ్రథమ యగును.

ఉదా:—నీవు వచ్చుట చూచితిని. రాముఁ డుండఁగా లోప మేమి? భగవంతుఁడు కరుణించినఁ జాలును మొద—

సూ:—సంబోధనమునందు ప్రథమవచ్చును, కాని యది క్రియతో నన్వయింపదు. ౧౧

ఉదా:—ఓరాముఁడా రక్షింపుము. ఇందు, అధ్యాహార్యమైన 'నీవు' కర్త యగును. అదియే క్రియతో నన్వయించును. 'ఓరాముఁడా' యనది క్రియతో నన్వయింపదు.

సూ:—పరిమాణార్థమునందును ప్రథమ వచ్చును. ౧౨

ఉదా:—వీసెఁడుపంచదార, పాలు రెండుసేర్లు కొంటిని. వీసె రాతితో సరిగాఁ దూఁగుసంతటిపంచదార యని యర్థము. ఇట్లే యూహించునది.

సూ:—అగు మొదలగువానితోఁ గూడిన విశేషణములకుఁ బ్రథమ వచ్చును. ౧౩

అగు-అయి-అయిన-అయినట్టి మొదలయినవి.

ఉదా:—మహావీరుఁ డగు రామునకుఁ గన్య నిచ్చెను. మొద—

సూ:—విశేష్యమునకు దగ్గఱగా నుండు విశేషణమునకు-అగు-బో-
లు చేరును. [illegible] అవిశేష

ణములు ప్రథమాంతములే యగును. ౧౪

ఉదా:—ధీరుఁడై చతురుఁడై విద్యాశాలి యగుపురుషునకు శ్రేయము గలుగును. మొద—

సూ:—అయి, చేరనిచోఁ దుదివిశేషణమునకేని విశేషణము లన్నిటికేని సముచ్చయ మైన 'ను' వర్ణము బహుళముగాఁ జేరును. ౧౫

ఉదా:—ఆద్యుఁ డప్రమేయుఁ డవ్యయుఁడు నగు పరమేశ్వరుని దలఁచెద ; అశుచియుఁ గష్టుఁడున్ లఘువు నైననిజాగ్రజు మేనితోఁడ మొద—

సూ:—క్రియాజన్యవిశేషణముతో వ్యవధానము కలిగెనేని విశేషణము లన్నిటికిని 'అయి' చేరును. ౧౬

ఉదా:—నిత్యుఁడై శుద్ధుఁడై బుద్ధుఁడై ముక్తస్వభావుఁడై వెలయు సచ్చిదానందమయుని సంస్మరింతు. ఇట్లు విశేషణములకు అయి-అగు-ను-చేరుట ప్రయోగములందు విచిత్రముగాఁ గనవచ్చెడి.

సూ:—ఒకానొకచో విశేషణములషష్ఠికిఁ బ్రథమ బహుళముగాఁ నగును. ౧౭

ఉదా:—జగదేకవీరుఁడు రామునకు మ్రొక్కి - జగదేకవీరునకు రామునకు మ్రొక్కి, యుద్ధం బయ్యెరిపుభయదభుజుఁడు భీమునకపరిమితబలుండు కౌరవాధీశునకున్, మొద—

బహుళ మనుటచే షష్ఠీసమాసములో నిమిడియున్న విశేష్యములయొక్క విశేషణములకు వచ్చుషష్ఠికిఁ బ్రథమ నిత్యముగా వచ్చును.

ఉదా:—"భయంకరుఁ డగ్గనుకోపానలము." "ఘనతపోధనుఁడు భార్గవునిమొద."

ఇచ్చటివిశేషణములకుఁ గావలసినయెడల అయి-అగు-చేర్చ వచ్చును గాని షష్ఠీవిభక్తి చేర్చుటకు వలనుపడదు. సమాసము చేసి నచో, భయంకరార్జును - తపోధనభార్గవు-ఇత్యాది రూపము లే యగును.

“ ఆహీనబాహుబలసారఘనుల్ మధుకైటభాదిదైత్యపతుల నెల్లఁ దుర్మ డఁచె; మాతండ్రి పరాశరుచేతన్ బడసితి ననుజ్ఞ”; కృతపుణ్యుఁడు లక్ష్మణుఁ తోడఁ జెల్మియున్” “అన్యుఁడు హిరణ్యగర్భునం దంతకంబె”

ఈప్రయోగములలో విశేషణములద్వితీయకు తృతీయకు సప్త మికిని గూడఁ బ్రథమ వచ్చినది. కాని యీప్రాచీనపద్ధతి యిపుడు వచనముల ననుకరింపఁ దగదు.

సూ:—జడవాచకము లైనకర్మపదములకుఁ బ్రథమ బహుళముగా వచ్చును. ౧౫

ఉదా:—సీత పువ్వులు కోసెను. రాముఁడు పండ్లు తెచ్చెను. మొద.

బహుళ మనుట పద్యరచనయందు కావలసినయెడల ద్వితీయ రావచ్చు ననుటకు. ప్రాణివాచకము లైన కొన్ని కర్మపదములకు బ్రథమావిభక్తి భారతాదులం దక్కడక్కడఁ గనవచ్చును. “అమ్మ దనాగ మెదిర్చి క్రమ్మరించినపరికాఁడువోలె” ఇందు, మదనాగము నెదిర్చియనుటకు మదనాగ మెదిర్చి యని ప్రయోగింపఁబడినది. కాని యిపుడు వాడుకలో లేదు గావున నమహత్తు లైనచేతనవాచకములు కర్మపదము లగునపుడు ప్రథమ వాడఁగూడదు.

సూ:—ఒకానొకచో నమహద్వాచకముల కితరవిభక్తులకు బదులుగా ప్రథమయు వచ్చును. ౧౬

ఉదా:—రాజు గుఱ్ఱము దిగెను. గుఱ్ఱమునుండి-అతఁడు వేఁట వచ్చెను వేటకు- తేఁడు పేరోలగం బుండె=పేరోలగమునందు—

సూ:—కాలవాచకములకు మార్గవాచకములకు సప్తమ్యర్థమున

బ్రథమ బహుళముగా నగును. ౨

ఉదా:—వానిని నిన్న చూచితిని-ఇతఁడు రెండేండ్లు చదివెను. ఇచటికి మాయూరు నాలుగుక్రోసు లున్నది-వా రామడ వెళ్ళిరి-మొద—బహుళ మనుటచే ప్రొద్దుటఁ బోయెను. రాత్రివేళ నింటికి వచ్చెను. అనియుఁ బ్రయోగింపవచ్చును.

సూ:—విశేషణము లయినసర్వనామసంఖ్యావాచకములలోను వాని విశేష్యములలోను ఏది ముందు ప్రయోగింపఁబడునో దాని ద్వితీయాదులకు బదులుగాఁ బ్రథమ బహుళముగా నగును.

ఉదా:—అందఱు మిత్రులతోను-మిత్రు లందఱితోను, రెండుగుఱ్ఱములను గొంటిని-గుఱ్ఱములు రెంటిని గొంటిని. లక్షభటులకు-భటులు లక్షకు-మొద—

బహుళ మనుటచే మిత్రులకందఱికి నిచ్చెను - అనవచ్చును గాని, మిత్రులతో నందఱితో వచ్చెను - అన్నిటికి గోవులకు మేఁత పెట్టెను - మున్నగు ప్రయోగము లుచితములు గావు.

సూ:—విశేష్యము ద్వితీయాంత మైనను విశేషణము-అని-కాన్-మొదలగువానితోఁ జేరి ప్రథమాంతము నగును. ౨౨

ఉదా:—వానిని సచ్చరిత్రుఁ డని విందుము ‘ఎవ్వనిఁ బ్రాహ్మణ ముఖ్యుఁ బురోహితుండుగాఁ జేకొనువారము’ మొద—

## ద్వితీయా విభక్తి

సూ:—క్రియచేఁ జెప్పఁబడని కర్మవాచకపదమునకు ద్వితీయ వచ్చును. ఇదియే కర్మకారకమనఁబడును. ౨౩

ఉదా:—రాముఁడు రావణుని సంహరించెను. ఇందు సంహారఫలము చెందినవాఁడు రావణుఁడు గావున రావణపదమునకు ద్వితీయ వచ్చినది. ఇది క్రియచేఁ జెప్పఁబడదు. ఇట్లే గోపాలుఁడు గోవులను మేపెను. మొద—

సూ:—కోరు మొదలగుధాతువులకర్మపదములకు సంబంధించిన వాని
కిని ద్వితీయ వచ్చును. ౨౪

ఉదా:—యాచకుఁడు రాజును ధనము గోరెను. గొల్లవాఁ డావును
పాలు పితికెను. మొద—కోరు-వేఁడు-యాచించు-అడుగు-
పితుకు-కోయు- మొద—

సూ:—ఉద్దేశార్థమందు ద్వితీయమీఁద - కూర్చి - గుఱించి - గుఱిచి-
చేరును. ౨౫

ఉదా:—నర్మముఁగూర్చి జపము-దేవునిగుఱించి తపస్సు-మొద—
గుఱిచి పూర్వకావ్యములఁ గనవచ్చును.

సూ:—జడవాచకములకుఁ దృతీయాసప్తమ్యర్థములందు ద్వితీయ
బహుళముగా నగును. ౨౬

ఉదా:—రాముఁడు వాలి నొక్కకోలను గూల్చెను. కోలతో-వాఁడు
నేలను గూలెను. నేలమీఁద—

బహుళ మనుటచే ఈకార్యము ఉకారాంతములకు బహువచ
నమున మాత్రమే వచ్చును.

ఉదా:—క్రీడి రిపుల వాఁడితూపుల దూపుమాపె. తూపులచే.
మునులు వనంబుల నివసింతురు. వనములందు—మొద—

తృతీయా విభక్తి.

సూ:—క్రియచేఁ జెప్పఁబడనికర్తకు చేతఁ బ్రత్యయ మగును. ఇదియే
కర్తృకారక మనఁబడును.

ఉదా—హనుమంతునిచేత సీత చూడఁబడెను. ఇందు క్రియచేఁ
గర్మ చెప్పఁబడినది కాని కర్త చెప్పఁబడలేదు. కావునఁ
గర్తృపదమునకుఁ దృతీయ వచ్చినది. క్రియచేఁ జెప్పఁబడిన
కర్మ పదమునకుఁ బ్రథమవచ్చినది.

సూ:—క్రియచేఁ జెప్పఁబడని కరణమునకు చేతఁ-తోడఁ-ప్రత్య

యము లగును. ఇదియే కరణకారక మనఁబడును. ౨౮
కార్యసిద్ధికి మిక్కిలి యుపయోగించుపదార్థము కరణ మనఁబడును.

ఉదా:—రాముఁడు బాణముచేత వాలిని గూల్చెను. రాముఁడు బాణముతోడ వాలిని గూల్చెను. కుమ్మరి మట్టితోఁ గుండ చేసెను. మొద—

సూ:—హేతువునకును కొనుట-వినుట-ఎఱుఁగుట-మొదలగు నర్థములయందును చేతన్ ప్రత్యయము బహుళముగ నగును. ౨౯
ఒక ఫలమును సాధించుటకుఁ దగినపదార్థము హేతు వనఁబడును.

ఉదా:—ధనముచేత సౌఖ్యము గలుగును. బహుళ మనుటచేఁ వలనన్ కూడ హేత్వర్థమున రావచ్చును. ధనమువలన సౌఖ్యముగలుగును. ఇట్లు, రాజు ప్రజలచేఁ బన్ను గైకొనియె. ప్రజలవలనఁ గైకొనియె. మొద—

సూ:—సహార్థమునందును తుల్యార్థకపదములు పర మగునప్పుడును తృతీయకు ‹తోడన్› బహుళముగా నగును. ౩౦

ఉదా.—తల్లి పిల్లలతో వచ్చినది. పిల్లలతోఁగూడి—భోజరాజు కర్ణునితో సమానుఁడు. నీతో సాటి యగువాఁడు లేఁడు-మొద—బహుళ మనుటచే తుల్యార్థకపదములు పర మగుచో షష్ఠియువచ్చును.

ఉదా:—అతని కతండె సాటి. రామునకుఁ దుల్యుఁడయిన వీరుఁడేఁడి ? మొ—

సూ:—‹అనుట› యర్థము గలక్రియలు ప్రయోగించునపుడు అప్రధాన కర్మకు ‹తోడన్› బహుళముగా నగును. ౩౧

ఉదా:—నేను వానితోడ నిట్లంటిని. ఇందు ‹ఇట్లు› కర్మ-‹వాఁడు›

అప్రధానకర్మ. బహుళ మనుటచే షష్ఠియు రావచ్చును. నేను వాని కిట్లంటిని. అను-పలుకు-చెప్పు-విన్నవించు-మొద- వీఁడు వానితో మాట్లాడఁడు. నీ వేల నాతోఁ బలుకవు. ఇత్యాదులందు ఉద్దేశించి యనునర్థమున 'తోన్' వచ్చినది.

సూ:—జడవాచకముల ద్వితీయాదిరూపముమీఁద చేతన్ విభక్తి యర్థమున 'చేసి' వచ్చుటయు గలదు. 32

ఉదా:—విప్రసంబోధనఁజేసి - గద్గదభాషితములఁజేసి - భక్తింజేసి, "ఇదుమగుదువ వలసెధర్మతనూభవువలనఁజేసి"—ఒక్కవేటు నంజేసి ఇత్యాది ప్రయోగములు గలవు.

సూ:—అమహత్తులైన అది-ఇది-శబ్దముల కాదేశములగు దాని-దీని- యనువానిమీఁది 'చేతను' విభక్తికి 'అను' వర్ణకాదేశమును దానిమీఁద 'చేసి' యును బహుళముగా నగును. 33

ఉదా:—దాని+అను=దానను. (ఇకారసంధి నిత్యము) దానన్- దానిచేతన్, దీనను-దీనన్-దీనిచేతన్, దానంజేసి-దీనంజేసి.

సూ:—జడవాచకములమీఁది తోడన్ విభక్తికి బదులుగా మైన్- మెయిన్—అనునవి చేరుటయుఁ గలదు. 34

ఉదా:—నేర్పుమైన్-నేర్పుతోన్, భక్తిమెయిన్-భక్తితోన్-మొ— తోడన్ అనుటకుఁ దఱుచుగా "తోన్" వాడఁబడును.

పూర్వకావ్యములందు 'తోడుతన్' కనవచ్చును.

ఓర్పియణఁకువతోడుత ననికి యరిది—భార, ప్రాణముతోడుత నున్నవాఁడవే—భార, 'తోడన్' అనుదానిని వేఱుపఱిచి ప్రయోగించుటయుఁ గనవచ్చును.

,,అపగాతనూజుఁ డఖిలబాంధవులయు బ్రాహ్మణులయుఁ దోడ భానుభుఁడు-ధర్మజునలువురు తమ్ములు తమవస్త్రములయుఁ దమశస్త్రవరూథమ్ములతోడ- భార, పైవాక్యములలో బాంధవులతోడ-బ్రాహ్మణులతోడ; తమవస్త్రములతోడ అని యన్వయము.

సూ:—నియమపూర్వక విద్యాభ్యాసము తోఁచునపుడు గురువాచక

పదమునకుఁ బంచమ్యర్థమున 'తోడన్' వచ్చును. ౩౫

ఉదా:—"ఆ స్త్రీసుఁడు ప్రమతితోఁ జదివె సకలవేద వేదాంగములు" "రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి" ఇట్టి ప్రయోగ మిపుడు వాడుకలో లేదు.

## చతుర్థీ విభక్తి.

సూ:—దానాదిక్రియలకు ఉద్దేశ్యమగుదానికిఁ జతుర్థి వచ్చును. ఇదియే సంప్రదానకారక మనఁబడును. ౩౬

ఉదా:—జనకుఁడు రామునికొఱకు సీత నిచ్చెను. బుద్ధుఁడు నిర్వాణముకొఱకు యత్నించెను. సన్న్యాసి భిక్షకై వెడలెను. మొద—ఇపు డిట్టిస్థలముల షష్ఠియే వాడఁబడుచున్నది.

ఉదా:—వానికిఁ బిల్ల నిచ్చెను. పురుషార్థమునకు యత్నించెను.

సూ:—నిమిత్తార్థమునందు చతుర్థ్యర్థమున-కోసము-కోసరము-పొంటెన్-అనునవి వచ్చును. ౩౭

ఉదా—నీకోసము-దానికోసరము-లోకహితముపొంటెన్.

,,వసుదేవకుమారకు ముక్తికోసమై—అని, నీకోసమేకదా నీరజాక్షి—భూసుత కోస మేను—ఉ—రా, ఎవ్వరికోస మీవగలకేమి యిఁకె—అనిరు, దానికోసమై గుంపులుగూడి—హంస, కర్ణాటాంధ్రకవులు 'కోసరము' వాడియున్నారు.

సూ:—కర్మపదముతో సంబంధ మున్నపుడు నిమిత్తార్థమందు చతుర్థి గాని షష్ఠిగాని వచ్చును. ౩౮

ఉదా:—బొగ్గులకొఱకుఁ జెట్టు నఱికెను. బొగ్గులకుఁ జెట్టునఱికెను. మొ—

## పంచమీ విభక్తి.

సూ:—ఎడఁబాటు-భయము-మొదలగువాని కేది యవధి యగునో దానికి 'వలనన్' వచ్చును. ఇదియే అపాదానకారకము. ౩౯

ఉదా:—రాజ్యమువలన భ్రష్టుఁడయ్యె-దొంగవలన భయపడె-చదువు

వలన శ్రమపడె-ధర్మమువలనఁ బరాకుపడెను-ప్రజలవలనఁ బన్ను గైకొనియె-సూర్యునివలనఁ గుంతికిఁ గర్ణుఁడు పుట్టె-కృష్ణుఁడు తల్లివలన దాఁగె-రాజు శత్రువువలనఁ గాచె-నీవలన వింటిని. రాముఁడు కౌశికునివలన విలువిద్య నేర్చె-మొద-ఇట్టియెడఁ గొన్నిటికి షష్ఠియు వచ్చును.

ఉదా:—దశరథునకు రాముఁడు పుట్టె-చోరులకు జడిసెను. మొద-

వలన రూపాంతర మైనవల్లనను దాని కనేకప్రయోగములు కలవు. కొన్ని-

„నేరము నావల్ల నెమకినలేదు, రంగ-చలిమలవల్ల నుల్లసిలుచల్లదనంబు, మను, ఎవ్వనివల్నఁ బుట్టె జగ మెల్లను, శివర-కల్ల నావల్ల గోరంత కలిగె నేని. పారం-ఈశ శానిధివల్లనే కదా దిక్కులు, బిల్హ-అదియు నావల్లఁ దెలిసి యయ్యథపమ్య-కువ-ఏలఘునపుంజమున్వల్ల బలాకమాలికల్,ఆము-జళిపించువిచ్చుకత్తులవల్లఁ దులకించు, ఉ-రా-ఒచ్చెము నావల్లఁ గలదె యొకనాఁడైనన్, రాధా-వీణామౌనిం బనరించి తుంబురునివల్నం గన్న, చంద్రభా-చేడియవల్ల నించుక ప్రసిద్ధి వహించెను, చెన్నబ” (వలనన్-వల్నన్-వల్లన్-ఇది క్రమము).

సూ:—జడవాచకముల సప్తమీరూపముపై పంచమ్యర్థమున ఉండి-ఉంచి-బహుళముగా నగును. రం

ఉదా:—వృక్షముననుండి-ఆకాశముననుండి - నీరిలోననుండి - మొదలయినవి భారతాదిప్రాచీనగ్రంథములందు గలవు. బహుళమనుట యాధునికులు ద్వితీయారూపముపై ఉండి ప్రయోగించుట సాధు వనుటకు.

ఉదా:—ఇంటినుండి-ఊరినుండి-మొద—నానుండి-నీనుండి-యనియుఁ గొందఱు ప్రయోగించుచున్నారు. కాని యది సరిగాదు. ‘ఉంచి’ ప్రయోగ మసాధు వని కొంద అందురు కాని పూర్వ లాక్షణికులు దీనిని సమ్మతించిరి. కవులు దీనిని బ్రయోగించిరి-శాసనములలో నిది యున్నది.

‘ఉంచి కుండా ఎల్ల నలన నంక యుం డీ పంచమీ’ అథర్వణవ్యా—
కంచి కన్న పట్టి కంటె ఎల్ల నలన ఎం కోండ్యో జనిసు.’ ఆం_కా—‘కాంచి
యమ్మంత్రి యచ్చోటనుంచి వచ్చె-కృష్ణరా, నన్నుంచే యింతలు పుట్టె నంచు ద...
వర్యాగంబునం గన్గొనం। జంచద్దర్పకకోటి నించిలి నవున్—జ్ఞా-శ, ఇట్లు, రంగా
రాయచరిత్ర-ఉత్తరరామాయణము మున్నగువానిలో ‘ఉంచి’ కనవచ్చును.

అథర్వణుఁ డిచ్చిన‘కుండా’ గుండా యని వాడఁబడుచున్నది.
(దానిగుండా) వలనఁ మీఁదనే ఉండి చేరుటయుఁ గలదు. ఉదా—
హిమగిరివలననుండి గంగ వొడమె- మొద—కొన్నియెడలఁ బంచ
మ్యర్థమునఁ దృతీయయు వచ్చును. ఉదా—కొడుకు తండ్రితో వేఱు
పడెను. మొ—

సూ:—అన్యపూర్వాదిశబ్దముల సంబంధమునందు “కంటెన్” బహు
ళముగా నగును. ౪౧

ఉదా:—రాముని కంటె నన్యుఁడు శూరుఁడు లేఁడు. వాఁడు వీని
కంటెఁ బూర్వుఁడు-లేమికంటె లాఁతి లేదు వీడ-మొద—

ఆదిశబ్దముచే ఇతరము-వెలి- వేఱు- దక్షిణము-ఉత్తరము-పడు
మఱ-పరము- దవ్వు- దూరము- సమీపము- మొద—ప్రాచీనలిఖిత
పుస్తకములందు ‘పడుమఱ’ రూపము కనఁబడును. ఇది క్రమముగా
‘పడమర’ యని మాఱినది.

సూ:—నిర్ధారణార్థమందు కంటెన్ వచ్చును. ౪౨

ఉదా:—మానహానికంటె మరణము మేలు. లేనిదాతకంటె నున్న
లోభి మేలు. మొద—రెండువస్తువులను బోల్చి యిది యిట్టి
దని నిశ్చయించుట యిక్కడ నిర్ధారణమున కర్థము. “ఎల్ల
ధర్మంబులకంటెఁ గులంబు నిలుపుట మిక్కిలిధర్మంబు” భార-

సూ:—కొన్నియెడల సప్తమీరూపముపై ‘పట్టి’ బహుళముగా
నగును. ౪౩

ఉదా:—పెద్దకాలమునంబట్టి-చిరకాలంబునంబట్టి-దానంబట్టి- ఇత్యా
దులు పూర్వకావ్యముల నున్నవి. బహుళ మనుట ద్వితీయా
రూపములపై 'పట్టి' వచ్చిన యాధునికప్రయోగములు సాధ
చుటకు. ఉదా—జ్ఞానముంబట్టి మోక్షము - నీవు వచ్చుట
బట్టి ధన్యుఁడ నైతిని- మొద—ఇట్టియెడ 'వలనన్' కూ
రావచ్చును. జ్ఞానమువలన ముక్తి కలుగును. ఇది కొన్ని
యవ్యయములమీఁదను గనవచ్చును. ఇటవట్టి-అటవట్టి. ఇట
బట్టి యనరాదు.

## షష్ఠీ విభక్తి.

సూ:—సంబంధార్థమున 'యొక్క' వచ్చును.

ఇంతదనుకఁ జెప్పినకారకములకంటె వేఱయిన స్వస్వా
భావము జన్యజనకభావము గుణగుణిభావము మొదలయినవి సంబం
ము లనఁబడును. దీనిని శేషషష్ఠి యందురు. విగ్రహము చెప్పున
డిది వాడఁబడును. దీనికిఁ గారకత్వము లేదు.

ఉదా:—రామునియొక్కదూత- రామునిదూత- సీతయొక్కపతిభక్తి
సీతపతిభక్తి. వానియొక్క తెలివి- వాని తెలివి- మొద—

సూ:—కొన్నియెడల సంబధార్థమున-కిన్-కున్-వచ్చును.

,, రామునికిఁ దమ్ముఁడు—రామా, పార్థునకుఁ జెలికాఁడు— నీకు నెచ్చెలి-
జాణనిపుణుఁడవై నీమఱఁదికినపరాధశతంబు సైఁపుమయ్య ముకుందా'' భార—

సూ:—కిన్-కున్-విభక్తులకుఁ గారకత్వము కనవచ్చును.

ఉదా:—రామునికి భూమి యున్నది. గోవిందున కిల్లు లేదు. వా
కిమ్ము-నీకుఁ జెప్పచున్నాను. మొద—

సూ:—దిగ్దూరాన్తికాదివాచకములు పర మగునపుడు కిన్- కున్
వచ్చును.

ఉదా:—మాయింటికిఁ దూర్పుగా-వారిమేడకు దక్షిణమున- ఆ

తోఁటకు సమీపమున- ఏటికి దూరమందు. మొ—

సూ:—కొన్ని యెడల, అప్రేరణమునఁ గర్త లగువానికిఁ బ్రేరణమున కిఁ-కున్-వచ్చును. ౪౮

ఉదా:—రాముఁ డస్త్రరహస్య మెఱిఁగెను-విశ్వామిత్రుఁడు రాముని కస్త్రరహస్య మెఱిఁగించెను, పిల్లవాఁ డన్నము తినెను- తల్లి పిల్లవాని కన్నము తినిపించెను. ఇట్టిచోట్ల ద్వితీయ- తృతీయ గూడ రావచ్చును. తల్లి పిల్లవాని నన్నము తినిపించెను—పిల్ల వానిచే- మొద—

సూ:—క్రియాజన్యవిశేషణములకర్తలకుఁ గొన్నియెడల సమాసమున షష్ఠి యగును. ౪౯

ఉదా:—"నేను రచించినకావ్యము" అనుటకు నారచియించిన కావ్య ము-అనుట ప్రాచీనసంప్రదాయము. ఇట్లే భీమునిచేసిన ప్రతిజ్ఞ.

సూ:—నిర్ధారణార్థమున-లోన్-లోపలన్-అందు-వచ్చును. ౫౦

ఉదా:—వీరులలో రాముఁడు మహావీరుఁడు-దానములలోపల నన్న దానము గొప్పది. శిల్పకళలయందు చిత్రలేఖనము శ్రేష్ఠము.

సప్తమీ విభక్తి.

సూ:—అధికరణవాచకమునకు సప్తమి వచ్చును. ఇదియే అధికరణ కారకము. ౫౧

అధికరణ మనఁగా ఆధారము. ఒకవస్తువునకుఁ గాని కోరిక మొదలగు గుణములకుఁ గాని యాశ్రయ మైనది యధికరణ మనఁ బడును.

ఉదా:—సర్వమునం దీశ్వరుఁ డున్నాఁడు. ఏటియందు జల మున్నది. ముక్తియందు వాంఛ కలదు. పాలయందు వెన్న కలదు. వన మున మును లున్నారు. మొద—

సూ:—దూరాన్తికార్థములకును సప్తమి వచ్చును. ౫౨

ఉదా:—ఊరికి దూరమందు నది యున్నది. ఇంటికి సమీపమందు పూలతోట యున్నది. మొద—

సూ:—ఉకారాంతజడవాచకములమీఁదఁ దృతీయకు బదులుగా 'ఎన్' విభక్తియు వచ్చును. 78

ఉదా:—సత్యమున సకలార్థములు సిద్ధించు. వాఁడు ధనమున మత్తుఁడయ్యె. మిత్రుఁడు నన్నాదరమునఁ జూచెను. మొ—

సూ:—కొన్ని యెడల నొకవిభక్తికి మఱియొకవిభక్తియు నగును. 79

మనభాషలో, కారకములకు సంపూర్ణమైనయనుశాసనమేర్పడలేదు. ప్రాచీనకారకములు కొన్ని యర్వాచీనకృతులందు మాఱినవి. అవియును మరల మాఱుచున్నవి.

| ప్రాచీనకారకములు. | అర్వాచీనకారకములు |
|---|---|
| అతండు తేని కనియె | అతండు తేనితో ననియె |
| వారల నధ్యయనంబు సేయించును | వారిచే నధ్యయనంబు |
| విలువిద్య నిన్నుఁ గఱపుదును | విలువిద్య నీకుఁ గఱపుదును |
| అది వానికి వలచినది | అది వానిని వలచినది |
| వాఁడు నన్నలిగెను | వాఁడు నాపై నలిగెను |
| ఇతనికిఁ గూర్తువేని | ఇతనిని గూర్తువేని |
| నాకచ్చటికిఁ బోఁగూడదు | నే నచ్చటికిఁ బోఁగూడదు. |
| ఇంట నున్నాఁడు | ఇంటిలో నున్నాఁడు |
| ఇంటనుండి వెడలెను | ఇంటిలోనుండి-ఇంటినుండి— |

వాఁ డిల్లు చేరెను. ఇంటిని జేరెను- ఇంటికిఁ జేరెను ; వారు సుఖమున్నారు- సుఖముతోనున్నారు- సుఖమున నున్నారు. ఏయూరు వెళ్లెను— ఏయూరికి వెళ్లెను- ఇత్యాదులందు విభక్తులమార్పు తెలుచుగాఁ గననచ్చును.

సూ:—నీవు—మీరు-విశేష్యము లగునప్పుడు విశేషణముల కేకవచన

బహువచనములందు క్రమముగా వు-రు, నేను-మేము-విశేష్యము లగునపుడు-ను-ము; అనునవి బహుళముగా నాగమము లగును. అగుచోఁ బూర్వమం దున్నఉకార మకార మగును.

ఉదా:—నీవు పూజ్యుడవు- మీరు పూజ్యులరు.

నేను ధన్యుఁడను-మేము ధన్యులము.

సూ:—వు-ను-పర మగునపుడు సంబోధనమున, అదిశబ్దమునకుఁ'దాన' ఆదేశ మగును. ౫౬

ఉదా:—నీవు చిన్నదానవు. నేను చిన్నదానను. ఓచిన్నదాన; మొ—

సూ:—ఇకారాంతములమీఁది ను- వు- వర్ణముల ఉకార మికార మగును. ౫౭

ఉదా:—నీవు నేర్పరివి. నేను సుకృతిని. మొద—

౫౭ సూత్రములో బహుళ మనుటచే-రువర్ణాగమ మిపుడు తఱచుగాఁ గనరా దని తెలియునది.

ఉదా:—మీరుపెద్దలు. మీరు మంచివారు. పెద్దలరు-మంచివారరు-అనెడివాడుకయుఁ బ్రయోగములుగూడ నిపుడు లేవు.

ధర్మజ్ఞుఁ డైననిన్ను, శిష్యు లైనమమ్ము, జయలక్ష్మీధవుఁ డైన నీవు, అవతంసం బైతివి, పాంశుభూషితునకుఁ గోడ లైతివి, వెలయుగోసంఘ మెల్లఁగ గోవిందుఁ డైతి, గ్రామమధ్యంబునం బదిలుం డైతిఁ బ్రసూతివేళ,

ఇత్యాదిభారతాది ప్రయోగములందు అగుధాతురూపములతోఁ జేరినవిశేషణములకు- వు-ను-ము- ఆగమములు గూడఁ గనరావు. కొన్నిజిల్లాలలో నిట్టివాడుక యిప్పుడును గలదు. కాని, అగుధాతురూపములతోఁ జేరనపుడు-నీవు ధన్యుఁడు- నేను గృతార్థుఁడు-మేము పుణ్యాత్ములు-అని ప్రయోగింపరాదు.

సూ:—విశేష్యమునకువలెనే విశేషణమునకును లింగ విభక్తి వచనము లగును. ౫౮

ఉదా:—సత్యసంధుండు రాముండు శరణు మాకు। దివ్యగుణధాము రాము నుతింతు నెపుడు। పుణ్యశీలను సీతను బొగడుచుందు। వరదులకు వారల కొనర్తు వందనములు।

ఇందలి విశేషణములు విశేష్యములంబట్టి క్రియలతో నన్వయించుచున్నను బ్రత్యేకముగాం గూడ వానికిం గారకత్వము గలదు. ఉదా—సత్యసంధుండు మాకు శరణగును-రాముండు మాకు శరణగును. మొద —

సూ:—జడవాచకము లైనవిశేషణముల బహువచనమున కేకవచనము బహుళముగా నగును. ౫౫

దా:—పావన మైనశిరోజములు-పావనము లైనశిరోజములు, మాటలిం పయ్యె-మాట లింపయ్యె-మొగ—

బహుళ మనుటచే సీకార్యము తత్సమములకు వైకల్పిక మనియు నాచ్ఛికముల కరుదుగా నగు ననియు గ్రహించునది.

ప్రాచీనార్వాచీనకావ్యములను బహుకాలము పరిశోధించినం గాని కారకత్వ మంతయు విశదపఱుచుటకు వలనుపడదు. కావునం గారకములకు శిష్టవ్యవహారమే శరణ మగును.

ఇది కారకప్రకరణము.

---

సమాసప్రకరణము.

సూ:—సమర్థము లైనపదము లేకపద మగుట సమాసము. ౧

అనగాం వేఱువేఱు అర్థములయందు స్థిరపడియున్న రెండుగాని యంతకంటె నెక్కువగాని పదము లొక్కయర్థమును బోధించుచు నొక్కపద మగుట సమాస మనంబడును.

సూ:—సంస్కృతికాది భేదమున సమాసము నాలుగు విధము లగును. ౨

సాంస్కృతికము-తత్సమము-ఆచ్ఛికము-మిశ్రము-అని తెలుఁగు లోని సమాసములు నాలుగువిధము లగుచున్నవి.

సూ:— కేవలము సంస్కృతశబ్దములసమాసము సాంస్కృతికము. ౩

ఉదా:—రాజపుత్రుఁడు- పంకజాతుఁడు - సీతారాములు-మొద—

రాజ్ఞఃపుత్రః 'రాజపుత్రః' అనునది సంస్కృతమందే సమాసమై తెలుఁగునకు రాజపుత్రుఁ డను తత్సమరూపమున వచ్చినది. ఇట్టిది సాంస్కృతికసమాసము. దీనినే సిద్ధసమాస మనియుఁ జెప్పుదురు.

సూ:—సంస్కృతసమములసమాసము తత్సమము. ౪

ఉదా:—పండితులసభ-సరసప్రవచనము- మొద— ఈసమాసములలోని పదములు సంస్కృతసమములు గావున నివి తత్సమసమాసము లు. వీనిని సాధ్యసమాసము లందురు.

సూ:—తద్భవదేశ్యములసమాస మాచ్ఛికము. ౫

ఉదా:—తేనియానతి-చెఱువునీరు-నాల్గుదెసలు- మొ—

సూ:—తత్సమాచ్ఛికములు కలిసినది మిశ్ర మనఁబడును. ౬

ఉదా:— తెల్లపద్మము-రాజులచెలిమి- మూఁడులోకములు- మొ—

సూ:—ప్రథమావిభక్తిమువర్ణకము తప్పఁ దక్కిన విభక్తులు సమాసమందు లోపించును. ౭

కర్మధారయసమాసమందు మువర్ణము లోపింపదు గాని దానికి పు-ంపు-లాదేశ మగును. ఉదా—కపటపుఁ జెలిమి-విరసంపు వచనము- షష్ఠి మున్నగు సమాసములలో మువర్ణమునకుఁగూడ పుం-పు-లాదేశ మగుట యాధునికకృతులందు గనవచ్చును గాని ప్రాచీనకావ్యములఁ గనఁబడదు. ఉదా—ధర్మము తెలుఁగు-ఆదేశము

రాజు- మంచముకోడు- మొద.—సముద్రపుటొడ్డు- మంచపుఁగోడు- మొదలయిన వాధునికములు. నాతోడిచెలిమి-నీచేతిపోడు-వానివలని నేరము-మొదలగుచోట్ల విభక్తి లోపింపదు. అందుచేతనే యివి యలుక్సమాసములైనవి. 'తోడి'కి బదులుగా 'తోటి' యని యాధునికులు వాడియున్నారు. "జారవనిత! తోటిసఖ్యంబు మఱి దానిమాట నమ్మి" శ్రీకృ|జ—

సూ:—డు-వు-ప్రత్యయాంతములు మీఁదిపదముతో సమసింపవు. ౮

ఉదా:—సుందరుఁడు రాముఁడు-మృదువుపలుకు-ఇవి సమాసములు కావు. గురువునానతి మొదలగువానిలోని వువర్ణ మాగమము గాని ప్రత్యయము గాదు.

సూ:—ఆగమము లైన-ము-వు-వర్ణములు సమాసమున లోపింపవు. ౯

ఉదా:—గృహమునొద్ద-ప్రభువుమాట- మొద.—

సూ:—కపిలకన్నులు మొదలయినవి పూర్వకవిప్రయోగ సిద్ధములు. ౧౦

ములోపము చెందిన యీక్రింది మిశ్రసమాసములు పూర్వకావ్యములఁ గలవు.

ఉదా:—కపిలకన్నులు-కపిలజడలు- జీవగఱ్ఱ-ప్రాణగొడ్డము- దినవెచ్చము-నిత్యపడి-ఉత్తరజందెములు- మొద.—ఇట్టి వనింద్యగ్రామ్యము లనఁబడుచున్నవి. ఎల్లవిధముల వీనిని బోలి శిష్టవ్యవహారమున నాటుకొనియున్న శుద్ధతప్పు-అల్పసిరి-శుష్కదండుగ-అనేకసార్లు- అనేకమంది- మొదలయినవి గూడ వీనివలెనే గ్రాహ్యము లగును.

సూ:—శుద్ధ శుక్ల బహుళ శబ్దములకు పాడ్యమి మొదలగునవి పర మగునపుడు ములోపము సుప్రసిద్ధము. ౧౧

ఉదా:—శుద్ధపాడ్యమి-శుద్ధతదియ-శుద్ధచవుతి-ఇట్లు, శుక్లపాడ్యమి-బహుళపాడ్యమి- మొద—

సూ:—అపదూఱు మొదలయిన మిశ్రసమాసములు పూర్వప్రయోగసిద్ధములు. ౧౨

ఉదా:—అపదూఱు-అపపాఁడి- అపసిరి- అపనెపము-అపరాతిరి- అపనమ్మిక-పంచవన్నెలు- వీనివలెనే అపనమ్మకము-దురలవాటు-మొదలయినవియు గ్రామ్యము లగును.

సూ:—కేవలసంస్కృతశబ్ద మాచ్ఛికశబ్దముతో యథేచ్ఛముగా సమసింపరాదు. ౧౩

పూర్వోక్తప్రయోగసిద్ధములు శిష్టవ్యవహారసిద్ధములు తప్పఁ దక్కిన సంస్కృతశబ్దము లని యర్థము.

ఉదా:—రక్తతామర-పదతమ్ములు-సువర్ణనగ- దుష్టపులి-స్వల్పడబ్బు-మొదలగునవి ప్రయోగార్హములు గావు.

సూ:—తత్పురుషము బహువ్రీహి ద్వంద్వము అని సమాసములు మూఁడు విధములు. ౧౪

వీనిలో నవాంతరభేదములు గలవు. వానిని ముందుముందు వివరించెదను.

సూ:—ఉత్తర ప్రదార్థప్రధానము తత్పురుషము. ౧౫

ఏసమాసమందు రెండవపదమునర్థము ప్రధాన మగునో, అది తత్పురుషము.

ఉదా:—ఆవుపాలు పుష్టి గలిగించును. పుష్టిని జేయునవి పాలు గావున అవి యిందు ముఖ్యమైనది.

సూ:—అన్యపదార్థప్రధానము బహువ్రీహి. ౧౬

ఉదా:—ముక్కంటికి మ్రొక్కెను. మూఁడుకన్నులు గలవాఁడు శివుఁడు. అతనికి మ్రొక్కెను. ఇందు, మూఁడు-కన్ను-శబ్ద

ములు ప్రధానములు గావు. అవి కలిగిన 'శివుఁడు' ప్రధానము.
సమాసపదములకంటె వేఱయిన శివశబ్దార్థ మిందు ముఖ్య
మైనది.

సూ:—ఉభయపదార్థప్రధానము ద్వంద్వము. ౧౭

ఏసమాసమం దున్నపదము లన్నిటియొక్క యర్థము ప్రధాన
మగునో అది ద్వంద్వ మనఁబడును.

ఉదా:—సీతారాములు వచ్చిరి. సీతయు రాముఁడు నిద్దఱు
గూడ వచ్చిరి గావున నిందు రెండుశబ్దములయర్థము ప్రధాన
మైనది.

అనేకపదము లున్నది బహుపదద్వంద్వ మనఁబడును.

ఉదా:—హనుమత్సీతారామలక్ష్మణులు-మొద—

కర్మధారయము - దానిభేదములు

సూ:—సమానాధికరణము వ్యధికరణము నని తత్పురుష సమాసము
రెండువిధములు. ౧౮

సూ:—విశేషణ విశేష్యములకలయిక సమానాధికరణము, ఇదియే
కర్మధారయ మనఁబడును. ౧౯

విశేషణవిశేష్యముల ధర్మము లొక్కవస్తు వాధారముగాఁ
గలిగియుండుట సమానాధికరణ మని పాణినిమతము. ఇందు విశేషణ
విశేష్యములు రెండు నొక్కవిభక్తియందే యుండును. ఇది విశేషణ
పూర్వపదము, ఉపమానోత్తరపదము ద్విగువు మొదలుగా ననేక
భేదముల విలసిల్లును. క్రమముగా నుదాహరణము.

ఉదా:—సరసవచనము - సరసపువచనము - చక్కనిపలుకు - సరసపు
బలుకు - సాంస్కృతికతత్సమాచ్ఛికమిశ్రముల కుదాహరణము
లైన పైనాల్గుసమాసములందును మొదటిపదములు విశేషణ
ములు, రెండవపదములు విశేష్యములు, సరస మైనవచనము.

అనెడివిగ్రహమున రెండు నొకవిభక్తియందే యుండును. అది యును గాక, నరసత్వము వచనసత్వము, అనెడి రెండుధర్మము లును ఒక్కవచనమునే యాశ్రయించి యున్నవి. అందుచేఁ బైయుదాహరణములందు సామానాధికరణ్యము సిద్ధ మయ్యె ను. ఇట్లు, మంచిరాజు- తెల్లగుఱ్ఱము- మొ- కెంపువంటిమోవి= కెమ్మోవి,చిగురువంటి కేలు=చిగురుఁగేలు,జున్నువంటిమోవి= జుంటిమోవి, తేనెవంటిమాటలు = తేనెమాటలు, ఇత్యాదు లైన యుపమానపూర్వపద్మకర్మధారయములు తెలుఁగునఁ గొన్ని మాత్రమే కలవు. సంస్కృతమున నిట్టివి లేవు.

సూ:—ఉపమానవాచకపదము కడపట నున్నయెడల నుపమానోత్త రపదకర్మధారయ మగును. ఇదియే, ఉపమితసమాస మనఁ బడును. ౨౦

ఉదా:—ముఖపద్మము (పద్మమువంటి ముఖము) చరణకమలములు- పురుషవ్యాఘ్రము- మొద—మోముఁదామర- కాఁదీగ- మైదీగ చెక్కుటద్దము - మున్నగు కొన్ని యాచ్ఛికములు గూడఁ గిలవు గాని తఱుచుగా నుపమితసమాసములు సాంస్కృతిక ములే యగును. కావున ముఖంపుఁబద్మ మనితత్సమసమాస మును, మోముఁదామరస మని మిశ్రసమాసమును చేయరాదు

సూ:—ఉపమానపదము సాధారణధర్మవాచకపదముతో సమసించిన యెడల నుపమానపూర్వపదకర్మధారయ మగును. ౨౧

శౌర్యము-సౌందర్యము - నైల్యము- మొదలయినవి సాధారణ ధర్మములు. వానిని జెప్పునట్టి-శూర-సుందర-నీల- మొదలగు పదము లను సమాసములోఁ గూర్చిన యెడల నుపమానవాచకము పూర్వ పద మగును. అది ఉపమానపూర్వపదకర్మధారయ మగును.

ఉదా:—వ్యాఘ్రమువలె శూరుఁడు=వ్యాఘ్రశూరుఁడు- ఇట్లు, చంద్ర

సుందరము-ఇందీవరదళశ్యాముఁడు-మొద—

ఉపమేయవాచకమును బ్రయోగించిన యెడల నది యుపమా నోత్తరపదమే యగును-ఉదా:—ముఖపద్మము. కాని, పద్మమువంటి ముఖము-పద్మముఖ మనెడి యుపమానపూర్వపదము మాత్రము కాదు. అనఁగా, ఉపమానవాచకమునకును ఉపమేయవాచకమునకును సమాసము చేసిన యెడల ఉపమానవాచకము రెండవపదమగును. ఉపమానవాచకమునకు సాధారణ ధర్మవాచకమునకు సమాసము చేసిన యెడల ఉపమానవాచకము మొదటి పద మగును.

సూ:—సమాసములోని రెండుపదములు విశేషణము లయిన యెడల నది విశేషణోభయపదకర్మధారయ మనఁబడును.

ఉదా:—పండితుఁడును కవియు నైనవాఁడు = పండితకవి, ఎత్తును పల్లము నైనది=ఎత్తుపల్లము- మొద—

సూ:—జాతిసంజ్ఞావాచకము మొదటిపదముగాను సామాన్యనామవాచకము రెండవపదముగాను ఉన్నసమాసము సంభావనాపూర్వపదకర్మధారయ మనఁబడును.

ఈసమాసము చేయునపుడు సంస్కృతమందు మొదటిపదమునకు 'ఇతి' చేరును. తెనుఁగులో 'అను' చేరును.

ఉదా:—(వింధ్యఇతిపర్వతః) వింధ్యమనుపర్వతము=వింధ్యపర్వతము-ఇట్లే, నన్నయమహాకవి-మామిడిచెట్టు-సర్పభ్రాంతి- మొ—

సూ:—పూర్వపదమునర్థమందు ఉత్తరపదార్థధర్మ మారోపించిన యెడల రూపకసమాస మగును.

ఉదా:—సంసార మనెడిసాగరము=సంసారసాగరము. ఇట్లు, సేనాసముద్రము-అర్జునద్వీపము ; కెంపుమిన్ను-మోముచందురుఁడు మొదలగునవి.

ఇందు కొన్ని యర్థసందర్భమును బట్టి యుపమితములు కా

చ్చును. తపస్సే ధనము=తపోధనము-అనునట్లు సమాసము చేసి యిది అవధారణపూర్వపదకర్మధారయ మని కొంద అందురు గాని, 'తపస్సనెడిధనము' అనువిగ్రహామే తెలుఁగున వ్యాపించి యుండుటచే నిది రూపక మనియే చెప్పవచ్చును.

సూ:—ఆ-ఈ-ఏ-లకు త్రిక మని పేరు ౨౫

సూ:—కర్మధారయమునందు త్రికము త్రీసమములు మువర్ణకాంతములు క్రియాజన్య విశేషణములు పూర్వపదము లగును. ౨౬

ఉదా:—ఆయిల్లు-ఈమాట-ఏబాలుఁడు, వాఁడికత్తి - పెద్దచెఱువు, కష్టపుఁబని-పల్లపునేల, చెప్పినమాట - వచ్చుచున్నబాలుఁడు-మొద—ఇట్లు, "పసితుదఁగల విశేషణములును పూర్వపదము లగును. ఉదా—రెండేసిచీరలు-గంపెఁడేసి పండ్లు-మొద—

అవ్యయములు గూడఁ బూర్వపదము లగు నని మున్నే చెప్పఁబడినది-కట్టెదురు-మిక్కిలి కన్నులు-ఎల్లలోకములు-మొద—

రెండేసిక్రియాజన్యవిశేషణములు పూర్వము లగుటయు క్త్వార్థకము వాని వెనుకఁ జేరుటయుఁ గలదు.

ఉదా:—వినవికననిమహిమ-నావినినకనినయద్భుతంబు — లేనిపోనిమాట, కనిపెంచిన తలిదండ్రులు-ఇచ్చిపుచ్చుకోని వ్యాపారము-మొద—ఇట్టి వాభాసకర్మధారయము లనఁబడును.

సూ:—సమాసాంతమందలిపదము ఉత్తరపదమునకువలెనే పూర్వపదమునకును సంబంధించును. ౨౭

ఉదా:—కన్న పెంచినవారు (కన్నవారు పెంచినవారు) ఇళ్లే, అయిదాఱుమాట్లు - ఏడెనిమిదిదినములు - మొద—, ఈసూత్రము తఱుచుగా ద్వంద్వసమాసములకు వర్తించును.

సూ:—అసంయుక్తము లైన కొన్ని హల్లులు పర మగునపుడు, ఆ-ఈ-ఏ-లకుహ్రస్వమును, పర మయినహల్లుకు ద్విత్వమును బహు

శముగా నగును. ౨౮

ఉదా:—అక్కన్య-ఆకన్య, ఇవ్వనము-ఈవనము, ఎయ్యెడల-ఏయెడల, మొదలయినవి.

అసంయుక్తము లనుటచే అద్ద్వారము - ఇమ్మ్రాను- మొదలగు రూపములు కావు. కొన్నిహల్లు లనుటచే శ-ష-స-హ-ర-ఱ-పరమగునపు డీకార్యమురాదు. మఱియు ఖ-ఘ-ఠ-ఢ-ఫ-పర మగునపుడు నీకార్యము కానరాదు. బహుళ మనుటచే నాఁడు-నీరు-మొదలగు కొన్నిశబ్దములు పర మగునపుడు-అన్నాఁడు- ఇన్నాఁడు-ఎన్నీరు-మున్నగు రూపములు కావు. ఇద్ధాత్రీపతి-ఎబ్భంగిన్- మొదలగు కొన్నిచోట్ల ద్విత్వము వచ్చి నపుడు మొదటిహల్లుయొక్క ఒత్తు పోవును. ఇట్లే ప్రయోగములను బట్టి యూహించునది-

సూ:—హ్రస్వ మైనత్రికముమీఁది చోటుశబ్దముయొక్క ఓకారమునకు హ్రస్వముగాని అకారముగాని విభాష నగును. ౨౯

ఉదా:—అచ్చోటు-అచ్చటు-అచ్చోటు-శ-ప్ర- ౭౦ సూత్రముచే ద్విత్వలోపము-అచటు. ఇట్లు- ఇచ్చోటు-ఎచ్చోటు - మొదలగు రూపము లగును. ముచ్చోటులు-ముచ్చోటులు-ముచ్చటులు- అనురూపములు పూర్వకావ్యములఁ గలవు.

సూ:—సమాసగత మయిన 'చోటన్' లోని టవర్ణము వైకల్పికముగా లోపించును. ౩౦

ఉదా:—అచ్చోన్-అచ్చోటన్, ఇట్లే, ఇచ్చోన్-ఎచ్చోన్-ఒకచోన్. మొద—అయినచోన్-రానిచోన్-మొదలగుచోట్లఅయినపక్షమున-రానిపక్షమున-అని యర్థ మగును.

సూ:—కర్మకరణాదులకుఁ బ్రాధాన్యము వివక్షించునపుడు క్రియాజన్యవిశేషణములు కర్తతో సమసించునట్లే వానితోడను సమసించును. ౩౧

కర్మ కరణ సంప్రదానాది ప్రాధాన్యమునకుఁ గ్రమముగా నుదాహరణములు. నన్నయభట్టు రచియించిన భారతము-రాముఁడు వాలిని గూల్చినశరము-జనకుఁడు సీత నిచ్చిన మహావీరుఁడు-గంగా నది పుట్టినపర్వతము-బలిచక్రవర్తి యజ్ఞముచేసిన స్థలము- మొద.—

సూ:—సమాసమందు ఆ యనుదానియామ్రేడితమునకు అయి-ఆయి-వైకల్పికముగా నాదేశము లగును. 32

యకారాగమము, అయికి ఐకారము-యకారమునకు ద్విత్వము మొదలయిన కార్యములాయా సూత్రముల వలన గ్రహించునది. ఆయాకాలము-అయ్యాకాలము-ఆయయికాలము - అయ్యాయికాలము. ఆయాయికాలము-అయ్యాయికాలము-ఆయైకాలము-అయ్యైకాలము-ఆయక్కాలము-అయ్యక్కాలము.

సూ:—అకారాంతము లైనగుణవాచకములకుఁ గర్మధారయమున నివర్ణము బహుళముగా నాగమ మగును. 33

ఉదా:—తెల్లనిగుఱ్ఱము- తెల్లగుఱ్ఱము-ఇట్లు, నల్ల-ఎఱ్ఱ-పచ్చ-తియ్య-కమ్మ-ఫుల్ల-తిన్న-మొద—బహుళ మనుటచే చక్క శబ్దమునకు నిత్యము-చక్కనిమాట-చక్కని మొగము-మొ—

సూ:—గుణవాచక మైన కమ్మశబ్దమునకుఁ గొన్ని పరుషాదిశబ్దములు పరమగునపుడు నకార మాగమ మగును. 34

ఉదా:—కమ్మఁదేనె-కమ్మఁదావి-కమ్మఁగస్తురి- మొద—

మరువాలారుశరమ్ములం దొరఁగుకమ్మందేనె-నైష—కమ్మఁగస్తురితిలకమ్ము దీర్చి-చంద్రభా—

ఈకార్యము తెల్ల మొదలగు కొన్నిటికి వ్రాఁతపుస్తకము లలోఁ గనవచ్చుచున్నది. ఉదా:—తెల్లఁదామర-నల్లఁగలువ-చక్కఁ జూపు- మొ—

సూ:—సంఖ్యావాచకశబ్దము పూర్వమం దున్న కర్మధారయము

ద్విగు వనఁబడును. 36

ఉదా:—సప్తసముద్రములు-ఏడులోకములు-నాలుగు దెసలు- మొ—

సూ:—అకారాంతము లైనకొన్ని సాంస్కృతికద్విగువులతుదియచ్చు నకు ఈకారము వచ్చును. అది తెలుఁగున హ్రస్వ మగును.

ఉదా:—(త్రిలోకీ) త్రిలోకి-ఇట్లు శతాబ్ది-పంచవటి- మొద—

కొన్ని యనుటచే త్రిభువనము-పంచపాత్రము మొదలగువాని కీకారము రాదు.

సూ:—పంచ-సప్త-శబ్దములమీఁది నదీగోదావరీ శబ్దముల ఈకార మకార మగును. 37

ఉదా:—పంచనదము-సప్తగోదావరము

సూ:—సాంస్కృతికసమాహారద్విగువు బహుళముగా నేకవచన మగును. 38

ఉదా:—(అయిదుగోవులగుంపు) పంచగవము-ఇట్లు సప్తాశ్వము-త్రిభువనము. కాని తెలుఁగున సప్తలోకములు-చతుర్వేదములు-షడంగములు- మొదలుగా బహువచనాంతములే 'వాడఁబడుచున్నవి

సూ:—ఆచ్ఛికద్విగువులు బహుళముగా నేకవచనము లగును. 39

ఉదా:—ఇరువాఁగు- ఇరువాఁగులు, నలుఁగడ- నలుఁగడలు- మొద-

బహుళ మనుటచే-నలుమఱు-పదామడ-ఇనుమ్నాఱు-ననుమ్నాఱు-ఇనుమూఁడు - ఇనుమడి - మొదలగు పెక్కుచోట్ల నేకవచనము నిత్యము-పదిసార్లు-రెన్నెల్లు-మూన్నాళ్ళు- మొదలగుచోట్ల నీకార్యము రాదు.

సూ:—కర్మధారయమున మూఁడులోని డువర్ణమునకు లోపమును ఊకారమునకు హ్రస్వమును మీఁదిహల్లునకు ద్విత్వమును బహుళముగా నగును. ౪౦

ఉదా:—ముజ్జగములు- మూఁడుజగములు- ముల్లోకములు- మూఁడు

లోకములు మొదలయినవి-

,,ముయ్యేడుమాఱుల్ రణ ప్రీతిక్ - భార, ముయ్యాఱువార్గణముల-రామా బహుళ మనుటచే మూన్నాళ్ళు మొదలగుచోట్ల హ్రస్వము రాదు. ,,నరవరోత్తమ నేఁడు మూన్నాళ్ళనుండి" మను—

సూ:—కొన్ని మిశ్రద్విగువులుబహుళముగా నేకవచనములగును. ౪౧

ఉదా:—ముజ్జగము-ముజ్జగములు-మొ-

,,నల్దిక్కు-తిరిగినిలిచి యావులించుచునుండెన్ -హరి, ముల్లోకము దాన యేలు గలి లోలనిలోచన యేమి చెప్పెదున్ -పారి, మమ్మహార్తమునకు-జైమి-బహుళ మనుటచే, ముక్కోటి యిత్యాదులందు నిత్యము. కాని మిశ్రద్విగువుల కేకవచనము విరళము.

సూ:—(మూఁడు' డు' లోప హ్రస్వాదులు వచ్చిన సమాసము తఱు చుగా నేకవచన మగును- ౪౨

ఉదా:—మువ్వన్నె-ముమ్మాఱు-ముచ్చిచ్చు-ముక్కారు-ముక్కాలు-ముప్పేసము-ముప్పాతిక- మునున్నాఱు-ముమ్మాటు- ముమ్మడి-ముప్ప్రొద్దు-మొద—

మధ్యమపదలోపి సమాసాదులు.

సూ:—సమాసమందు పూర్వోత్తరపదముల కర్థసందర్భము కలుగు నట్టి నడిమిపదము లోపించునది మధ్యమపదలోపి. ౪౩

ఉదా:—గుఱ్ఱపుకాతు (గుఱ్ఱమెక్కు-కాతు-ఇత్లేయర్థము లూహించు నది) వంటలక్క-పాలకుండ-వాటయిల్లు- రోవెలఁది-పూఁటకూళ్ళమ్మ-పాఁడియావు- కన్నపుఁగత్తి-సువారపుదారి-మొద—

ఇట్టిచోట్ల మొదటిపదము ద్వితీయాంత మగు నని యథర్వ ణుఁడు చెప్పెను గాని ద్వితీయార్థమందు ప్రథమాంతము లను టయే యుచితము.

సూ:—సమాసమునఁ బూర్వపదమందలి బహువచన లువర్ణకము యొక్క ఉకారము అకార మగును. ౪౪

ఉదా:—గాజులసెట్టి-పాలగొల్ల-నీళ్ళబ్రాహ్మణుఁడు మొ—

సూ:—మతుబర్థకమై 'కల' లోపించునది మతుప్సమాసము. ౪౭

ఉదా:—మువ్వన్నెమెకము(మూఁడువన్నెలు కలమెకము)ఇట్లు-వెన్నెల
రాత్రి-తావిమొగ్గ-పోటుబంటు; చార్లపులి-పిల్లలతల్లి-మొ—
ఈరెండుచోట్లఁ బూర్వసూత్రముచే అకారము.

సూ:—సాంస్కృతిక కర్మధారయ బహువ్రీహిసమాసములందు
మహచ్ఛబ్దముతుదివర్ణమునకు లోపము పూర్వస్వరమునకు
దీర్ఘము నగును. ౪౮

ఉదా:—మహాదేవుఁడు-మహాపతివ్రత- మహాకార్యము- మొ—ఇతర
సమాసములందు-మహత్సేవ-మహదవుత్తులు-మొ—
మహత్ప్రయత్నము-మహత్కార్యము మున్నగు కర్మధారయ
ములు దుష్టములు.

సూ:—పూర్వపదార్థ ముత్తరపదార్థముయొక్క- భాగ మైన యెడల
నది యేకదేశిసమాస మనఁబడును. ౪౯

దీనినే ప్రథమాతత్పురుష మని కొందఱందురు. ఇది చేయు
నపుడు సంస్కృతమున అహన్ శబ్దమునకు 'అహ్న' ఆదేశ మగును.
'రాత్రి' ఇకార మకార మగును.

ఉదా:—కాయముయొక్క పూర్వము=పూర్వకాయము, ఇట్లు ఉత్త
రకాయము-అధఃకాయము, అర్ధరాత్రము-అర్ధపిప్పలి-ఇపు డ
రాత్రివేళ యని కొందఱు వాడుచున్నారు.

సూ:—రేఫమీఁద నున్న 'అహ్న' లోని నకారము ణకా
మగును, అర్ధశబ్దముమీఁదఁ గాదు. ౫౦

ఉదా:—పూర్వాహ్ణము-అపరాహ్ణము-ఉత్తరాహ్ణము-అర్ధాహ్నము
మధ్యాహ్నము-సాయాహ్నము-మొ—

ఆచ్ఛికములు:—కంటియొక్క అర=అరగన్ను-ఇట్లు క్రేగన్ను-క

గన్ను-పెడతల-సామేను-క్రీఁగాలు-నడునెత్తి-నడుఁ రేయి-అద్దమ రేయి-మొద—సమాసములో 'అద్ద' కు మకారముచేరును.

సూ:—సమాసమునందు 'నడుము' మువర్ణమునకు లోపమునుపూర్వ మందున్న ఉకారమునకు ఇకారమును బహుళము. ౭౯

ఉదా:—నడుము+వ్రేలు=నడివ్రేలు-ఇట్లు నడికట్టు-నడిగట్టు-మొ—

బహుళ మనుట ఇకారము రానిప్రయోగములు కల వనుటకు

ఉదా:—నడునెత్తి-నడుగుంట-నడువీథి-నట్టిల్లు-మొద—నడి రేయి-నడి నెత్తి-యనియు నిపుడు వాడుక కలదు-నడికి రేయియనుచో 'కి' వర్ణమాగమము. ఔపవిభక్తిక కార్యమునచ్చునపుడు ములోపము రాదు. నడిమికి-నడిమివాఁడు. మఱియు 'నడుము' అనునర్థమున 'నడ్డి' శబ్దము వాడఁబడుచున్నది. నడుము+ అంతరము=నడుమంతరము-మిశ్రసమాసము-ఇది తొల్లి వాడుకలో నడుమంత్ర మైనది-అయినను గావ్యముల కెక్కినది.

నడుమంత్రపుబల్మి తెచ్చుకొని—ఉ—రా, క్షితి నిటు గాదె యొక్కకనికిన్ నడుమంత్రపుఁగల్మి కల్గినన్—విజయ—ఇట్లనేక ప్రయోగములు కలవు.

## తత్పురుషసమాసములు

సూ:—ద్వితీయాదివిభక్త్యంతములకు మీఁదిపదములతోడి సమాసము తత్పురుష మనఁబడును. ౭౦

ఇదియే వ్యధికరణతత్పురుషసమాసము. ఇందు పూర్వపదము విశేషణము కాదు. సమాసములోనిపదములు వేఱు వేఱువిభక్తుల నుండును.

ద్వి. రాజాశ్రితుఁడు-లోకాతీతుఁడు, నెలతాల్పు-పోరుదిండి-మొ—

తృ. వాక్కలహము-గురుతుల్యుఁడు-నెలతక్కువవాఁడు-మొ—

చ. భూతబలి-లోకహితము-దేవరమేలు-దూడగడ్డి-మొ—

పం. పాపభీతి-[illegible]-మొ—

ష. రాజపుత్రుఁడు-జనకునాజ్ఞ-తల్లియాదరము-చెట్టునీడ-మొ—

స. దానకర్ణుఁడు-వేల్పుపెద్ద-యుద్ధధీరుఁడు-పనినేర్పు-మొ—

సూ:—షష్ఠీసమాసమందు సఖశబ్దమునుతుదియచ్చునకు అకార మగును

ఉదా:—గోవిందసఖుఁడు-కుబేరసఖుఁడు-వ్యస్తముగాఁ గూడఁ దెనుఁగున "ఓసఖీ-ఓసఖా-సమీరణుఁడన్సఖుఁడు-నీసఖుం డీతఁడు" అనుప్రాచీనార్వాచీన ప్రయోగములు కలవు.

సూ:—సమాసమందు మువర్ణాంతములకు 'న' వర్ణ మాగమ మగుటయుఁ గలదు. ౫౨

,, అధమలోకమున తెరువు — యోగక్షేమంబున తెలుఁగు — సభాపర్వంబున కథ-జూదమున యప్పుడు—రాజధర్మంబునకీడు — వాగణావతమునవారు—ఉపాఖ్యానంబున యర్థంబు—చిత్తమున సుఖంబుల్-భార—ఇట్టి వనేకములు కలవు.

సూ:—సంస్కృతమందు నవర్ణము తోడిసమాసము నఞ్ సమాసమనఁబడును. ౫౩

ఉదా:—(న+బ్రాహ్మణః) అబ్రాహ్మణుఁడు-ఇట్లు అవిద్య-అభేదము-మొద—హల్లు పరమగుపుడు నకారము లోపించును. అచ్చు పర మగునపుడు తెలుచుగా, నవర్ణమునకు 'అన్' ఆదేశ మగును.

ఉదా:—(న+అశ్వః) అనశ్వము-ఇట్లు-అనాదరము-అనంతము-అనేకము-మొద—తెలుచుగ ననుటచే నైకము-నైకాంతము-మొదలగుచోట్ల 'అన్' రాదు.

సూ:—నీ-మీ-నా-మా-తన-తమ-శబ్దములకు సంబంధార్థమున దువర్ణము బహుళముగా నాగమ మగును. ౫౪

ఉదా:—నీదుకరుణ-మీదుచెలిమి-నాదునేర్పు-మాదుకులము - తనదుబలిమి-తమదుభాగ్యము-మొద—

,, మీ రీమొద లెఱుఁగ రిదియె మీమువిమర్శల్, భోజ—తమదురాచతీకంబుల్, హరి.పూ—తమదుపంచమములు తృతీయములు నగుచు, అప్పక— మొద—

సూ:—సంస్కృతసమాసము [illegible] మొదల పూర్వపద

ముయొక్కతుదిదీర్ఘము బహుళముగా హ్రస్వ మగును. ౫౯

ఉదా:—కాళిదాసు- రేవతిపుత్రుఁడు-అజక్షీరము, నదిసుతుఁడు-నదీసుతుఁడు- మొద— "నదిసుతగురుకర్ణశల్యనాగపురీశుల్" సిద్ధసమాసమందలిదీర్ఘాంతము హ్రస్వాంత మగుటయుఁ గలదు. "కాశికురుక్షేత్రగయా ప్రయాగముల" మను—

సూ:—సమాసమందు నాము మొదలగు కొన్నిటి మువర్ణమునకు బిందుపూర్వకపవర్ణము యథాప్రయోగముగా నగును. ౬౦

ఉదా:—నాము+చేను=నాంపచేను అమ్మ+వాన—అంపవాన; ఇట్లు సాము- వేము-ప్రేము-ఎమ్ము-దమ్ము- మొద— పూర్వప్రయోగములనుబట్టి బిందువు విధింపఁబడినది కాని పెక్కండ్రు వేపచెట్టని యరసున్న విడిచియే వ్రాయుచున్నారు. ఇట్లే నాపచేను-పాపతేఁడు - అని ప్రయోగించినను దోషము లేదు. పాముశబ్దమునకుఁ బెక్కుశబ్దములు పరమగునపుడు పవర్ణము కనరాదు. ఉదా:—పాముకాటు - పాముచెవులు - పాముకుబుసము- మొ—

సూ:—సమాసమందు మినుము మొదలగువాని మువర్ణమునకు పవర్ణ మగును. అగుచో, బూర్వమం దున్నయచ్చునకు అకారము బహుళముగా నగును. ౬౧

ఉదా:—మినుము+చేను=మినపచేను-మినుపచేను, మిరెము+కాయమిరపకాయ-మిరెపకాయ-ఇట్లు- అనుము - జనుము - కనుము-ఉనుము-ఎనుము- మొద—

గా:—వేనవేలు-నడగొండ- మొదలగు సమాసములు యథాప్రయోగముగా గ్రహించునది. ౬౨

ఆగమాదేశలోపద్విత్వాదులను జెంది కవిశిష్టవ్యవహారసిద్ధములైన యీక్రింది సమాసముల నిట్లే గ్రహించునది. (వేలకువేలు) వేన

నేలు-(నడచునట్టికొండ) నడగొండ - ఇట్లే యర్థమూహించునది. కోటానకోట్లు-కోటానంగోట్లు-ఇలువరుస - తలఁబ్రాలు - నసుఁబ్రాయి-చను బాలు-నడబావి- దేశద్రిమ్మరి-ఏఁడాది-పంచాది-పంచేపాళీ - మఱుసటినాఁడు-మఱుసనాఁడు-మఱునాఁడు-మర్నాఁడు-పఱగడుపు.

బహువ్రీహిసమాసము

ఈసమాసము మఱియొకపదమునకు విశేషణ మగును. ఇందు రెండుగాని యంతకంటెనెక్కువగాని పదము లుండవచ్చును గాని మొదటిపదములు విశేషణములే యగును. ఈసమాసమున కర్థము చెప్పునపుడు సాధారణముగా "కలవాడు లేక కలది' యనుమాటలు కడపటఁ జేరుచుండును. ఈ బహువ్రీహియు బహువిధములుగా నున్నది. కొన్ని సాంస్కృతికాచ్ఛికాదు లుదాహరింతును.

శీతకిరణుఁడు=చల్లని కిరణములు కలవాఁడు=చంద్రుఁడు. ఇట్లే యర్థము లూహించునది. పీతాంబరుఁడు-నీలదేహుఁడు; చలివెలుఁగు ముక్కంటి-అలరువిల్తుఁడు- మొద—ద్విపదములు. దివ్యసుందర విగ్రహుఁడు-పీనవిశాలవక్షుఁడు- మొద —బహుపదములు-

వేఁడివెలుఁగులవేల్పు-పట్టుపుట్టముదొర- నీలంపుముంగర నీలవేణి-వంటివి ఆభాసబహువ్రీహు లని యథర్వణమతము.

సూ:—ఉపమానముతోఁ గూడినది ఉపమానగర్భవ్రీహి. ౫౯

ఉదా:—పంకజనేత్రుఁడు-కువలయనేత్ర-తమ్మికంటి- మొ—

సూ:—బహువ్రీహియందు శరీరావయవవాచకము లైన అక్షిసక్థిశబ్దముల ఇకారమునకు అకారము వచ్చును. ౬౦

ఉదా:—జలజాక్షుఁడు-దీర్ఘసక్థుఁడు. ఇవి స్త్రీవిశేషణము లగుచో వీనికి ఈకారము వచ్చును. తెలుఁగున హ్రస్వ మగును. జలజాక్షి-దీర్ఘసక్థి- మొ—ఈసూత్రము మొదలుగా ౬౮ సూత్ర [illegible] కార్యములు సాంస్కృతిక బహు

వ్రీహినిగూర్చి యని తెలియునది.

సూ:—పుష్పకోమలి-కమలనేత్రి-మున్నగుప్రయోగములుగలవు. ౬౧

సంయోగోపధములకు, అనఁగా సంయుక్తాక్షర ముపధగాఁ గలవానికి (జీప్) ఈకారము రాదు గావున మీననేత్రి-పద్మనేత్రి మొదలయిన వసాధువు లని కొంద ఱనిరి గాని యిట్టి వానికిఁ బ్రయోగములు గనవచ్చుచున్నవి.

,, తెమ్మనిచెప్ప నాతఁడును దెచ్చెఁ బ్రియంబునఁ బుష్పకోమలిన్! భార-వి, కైకొని యిట్టుల వరుసఁ బుష్పకోమలి ప్రియుఁ బ్రీతుని-అర-౩ పుత్త్రీసారంగనేత్రీ కనకవిరచితం—అమర నిచ్చె విమలకమలనేత్రి—సో-శా., తాటాకుపుస్తకములలో నున్న యిట్టి ప్రయోగము లనేకము లచ్చులో 'నేత్ర' యని దిద్దఁబడినవి.

పాణినీయముఁబట్టి యసాధువు లయిన సోదరీసహోదరీశబ్దములను బూర్వ మహాకవు లనేకులు వాడిరి. అపాణినీయము లయిన చారుగాత్రీత్యాదిశబ్దములకు వామనకాత్యాయనులు గతి కలిగించినారు. అట్లే విశ్రామశబ్దము చాంద్రవ్యాకరణమున సాధు వైనది. సారస్వతవ్యాకరణమునందు పద్మనేత్రీత్యాదుల కనుశాసన మున్న దఁట. పాణినీయంబున 'ముష్టీముష్టి' కాఁదగియుండఁగా నన్నయశ్రీనాథాదులు ముష్టాముష్టి యని ప్రయోగించియున్నారు. ఇట్లే పెక్కు-శబ్దములు వాడుకలో మాఱుటయు మాఱినవానికి వైయాకరణు లనుశాసనము చేయుటయుఁ బ్రాచీనసంప్రదాయసిద్ధము. లోకులు వాడుశబ్దముల కనుగుణముగా వ్యాకరణకర్త లనుశాసనముచేయుట కలదు గాని పూర్వవ్యాకరణములో నియమించియున్నట్లుగా లోకులు శబ్దములను వాడుట గలుగదు. కావునఁ గవిశిష్టవ్యవహారసమ్మతములైన పద్మనేత్రీత్యాదిరూపములు సాధువు లని గ్రహించునది.

సూ:—సహ శబ్దముతోఁ గూడినది సహపూర్వబహువ్రీహి. ౬౨

సమాసములో సహశబ్దమునకు 'స' వర్ణము విభాష నాదేశమగును.

ఉ :—సహపుత్త్రుఁడు- సమిత్త్రుఁడు- మొద—ఆశీర్వచనమందు 'స' వర్ణ మాదేశము కాదు. సహామాత్యుఁ డయిన రాజునకు జయ మగుఁగాక.

సూ:— రెండుదిక్కులమధ్యభాగమును దెల్పునది దిగంతరాళ బహుబ్రీహి. ౬౩

ఉదా— పూర్వోత్తరము-తూర్పునకు ఉత్తరమునకు మధ్యభాగమయినయీశాన్య మర్థము. ఇట్లే-పూర్వదక్షిణము-పశ్చిమోత్తరము- మొద—

సూ:— కలహసాధనవాచకములు సమానరూపములు నగురెండు పదములలో మొదటిదానితుదియచ్చునకు దీర్ఘమును రెండవదాని తుదియచ్చునకు ఇకారమును వచ్చును. ఇది వ్యతిహారలక్షణ బహుబ్రీహి. ౬౪

ఉదా:— కేశములు కేశములు పట్టుకొని మొదలుపెట్టిన యుద్ధము= కేశాకేశి. ఇట్లే దండాదండి-కచాకచి- ముసలాముసలి-బాహూబాహవి-ముష్టీముష్టి-ముష్టాముష్టి యనియుఁగలదు-

"భీమాసురవీరులముష్టాముష్టిరణచ్ఛటచ్ఛటాశబ్దంబు" భార—

సూ:— బహుబ్రీహిని జాయాశబ్దలోని 'యా' వర్ణమునకు నివర్ణమగును. ౬౫

ఉదా:— భూమి జాయగాఁ గలవాఁడు=భూజాని. ఇట్లే రమాజాని-మహీజాని- మొద—

సూ:— సురభిమొదలగుకొన్నిశబ్దములమీఁదిపరిమళవాచక మైనగంధ శబ్దముయొక్క తుదిఅకారమునకు ఇకారము వచ్చును. ౬౬.

ఉదా:— మనోజ్ఞ మైనపరిమళము గలది-సురభిగంధి; మంచివాసన గలది-సుగంధి-పుష్పము; ఇట్లే చంపకముయొక్కగంధము వంటిగంధము గలది=చంపకగంధి-పద్మగంధి-యోజనగంధి- మొ—గంధశబ్దము వస్తువాచక మగుచో రాదు. మంచివస్తువులు కలవాఁడు సుగంధుఁడు-ఆపణికుఁడు.

సూ:— ఇచ్ప్రత్యయాదులు రానిచోట బహుబ్రీహిని 'క' ప్రత్యయము

వైకల్పికముగా నగును. ౬౭

ఉదా:—మహాయశస్కుఁడు. మహాయశుఁడు, ఉపాత్తవిద్యాకుఁడు- ఉపాత్తవిద్యుఁడు- మొద—

సూ:—నిషేధార్థక మైన 'న' వర్ణముపూర్వమందు కలది నఞ్ బహువ్రీహి. ౬౮

వెనుకఁ జెప్పినట్లుగా హల్లు పర మగుచో నకారలోపము. అచ్చు పర మగుచో 'అన్' ఆదేశము నగును.

ఉదా:—దేనికి అంతము లేదో అది-అనంతము=ఆకాశము. ఇట్లే, అసహాయుఁడు-అపారము-మొద—

సూ:—స్త్రీవిశేషణ మగునపుడు ఆచ్ఛిక మైనయుపమానవాచకము మీఁది మేనుశబ్దమునకు 'బోఁడి' యగును. ఇది పరమగుచో నకార మాగమ మగును. ౬౯

ఉదా:—అలరుఁబోఁడి-విరిఁబోఁడి- మొద—బోఁడిరూపాంతరము-బోణి- పూఁబోణి- మొ—

సూ:—ఆచ్ఛికబహువ్రీహి యందును సమాసాంత కార్యములు గనవచ్చును. ౭౦

ఉదా:—అలరువిలుతుఁడు-తమ్మిచూలి-వాలుఁగంటి-నలువ- మొ—

సూ:—అవ్యయవ్యవహితము లైన సమాసములును తెనుఁగునఁ గలవు. ౭౧

ఉదా:—కువలయాప్తుమిగులఁ జక్కనికొడుకు (బుధుఁడు) కాళీఖం-

## ద్వంద్వ సమాసము.

సూ:—స్త్రీసమము లయినతత్సమములు తత్సమములతోఁ గలిసి ద్వంద్వము లగును. ౭౨

ఉదా:—జననిజనకులు-కర్తృకర్మక్రియలు- మొ—కాని సీతరాములు- ధాతహరివాసవులు- మొదలయినవి సా[illegible]ములు గావు.

సూ:—పతిశబ్దముతోఁ గలిసి ద్వంద్వ మగునపుడు జాయాశబ్దము నకు-జమ్-దమ్-అనునాదేశములు వైకల్పికముగా నగును. 23

ఉదా:—జాయాపతులు=జంపతులు-దంపతులు-ఇవి తెలుఁగున నిత్య బహువచనాంతములు-జంపతి-దంపతి యని ప్రయోగింపరాదు. 'లోకదంపతికి దృక్కు-లశిఖలు' అనుకాశీఖండప్రయోగము సాహసికము.

సూ:—ఆచ్ఛికమైనస్త్రీసమ మాచ్ఛికముతోఁ బ్రాయికముగా ద్వంద్వ మగును. 24

ఉదా:—తల్లిదండ్రులు-మంచిచెడ్డలు-రాకపోకలు-మొ—

ద్వంద్వమం దైనను సర్వత్ర గసడదవాదేశము శ్రావ్యముగా దని యర్వాచీనసంప్రదాయమునఁ దెలియును.

సూ:—సమాసమందు-ము-డు-ప్రత్యయములు లోపించుటయుఁ బ్రయోగములఁ గనవచ్చును. 25

ఉదా:—అందచందములు- నెచ్చనచ్చములు-అడ్డదిడ్డములు (ములోపము) మిండతపసి (డువర్ణలోపము) సగపాలు- గందవొడి-బోనవుట్టిక - అచ్చతెలుపు- కప్పురవీడెము- గుండ్రమొగము-ఏటవాలు-సుంకసరకు- నెత్తపలక-చందురకావి (ములోపము) ఇత్యాదు లనేకములు పూర్వకావ్యములఁ గలవు. ఇప్పటి కృతులందును వ్యవహారమందును అనేకమంది- మొద—

సూ:—ఆచ్ఛికద్వంద్వమందు పూర్వపదముతుదియచ్చునకుఁ గొన్నియెడల దీర్ఘము బహుళముగా నగును. 26

ఉదా:—అన్నాదమ్ములు-అడ్డాదిడ్డాలు-అప్పాసెల్లెండ్రు- మొ—

ఇందుకుఁ గొన్నిప్రయోగములు.

అన్నాదమ్ములఁ గని మీ। కెన్నఁగ-హరి.ఉ, అడ్డాదిడ్డాలు పలుకునంతటిలో నర్ల-బసవ, గాలిం బోవక సన్నదుప్పటియు రోకొక్క రోక్క మువ్ – క్షాళవ

కను(గొని మానికొంతలు కకాపికలా మది నమ్మచెల్ల-మవల, అక్కా-పిల్లేంద్రయ్యు నుదక్కరు నాతోడిపోరు-భాగ, .అ( బెయ్యావై ఖరి ఏయిద్దఱిసుద్దులన్ బ్రమసి రాక పోక గావించె-చంపూ, ఏమిటికి( దలకె( దల్లీ .తామరయును బోలియుండి-హరి-పూ,

కొన్నియెడల విభక్తి ప్రత్యలోపము పూర్వస్వరదీర్ఘమును గనవచ్చును. వనితామణిరో, శ్లారో(కండ్లంబాడిన హారములు-ప్రభావ, చేతావాతాగొట్టే, ఘాతుకులవిపేసలు-సంపం-శ, ఇట్లే శ్రుతిరమ్యము లైనప్రయోగములు గ్రాహ్యములు.

సూ:—ద్వంద్వమున భావార్థక టవర్ణము లోపించుట కలదు. ౭౭

ఉదా:— పొగాములు-చెప్పచే(తలు-చెల్లుచెల్లములు-మొద—

సూ:—క్త్వార్థక మైనయవ్యయము సమానధాతుజన్య మైనవ్యతిరేక భావార్థకముతో( బ్రాయికముగా ద్వంద్వమున సమసించును. ౭౮

ఉదా:—చేసిచేయములు-వచ్చిరాములు- చూచిచూడములు-మొ—

ప్రాయిక మనుటచే ఇచ్చిపుచ్చుకొనుటలు-మొ—

సూ:—సంఖ్యావాచకపదములదంద్వ మేకవచన మగును. ౭౯

ఉదా:—పంచవింశతి- చతుష్షష్టి, ఇరువదియైదు- అఱువదినాలుగు-

సూ:—సంస్కృత సంఖ్యాద్వంద్వమందలి సంఖ్యలకు వామగతి విహితము. ౮౦

అన(గా ఎడమప్రక్క నుండి యారంభింపవలె ననుట

ఉదా:—త్రివింశతి ౨౩. పంచసప్తతి ౭౫-మొద—

ఇట్టివి తెలు(గున రెండుమూ(డుమాత్రము గలవు.

ఉదా:—చౌషష్టి-౬౪. చౌసీతి ౮౪.

సూ:—కొన్నియాచ్ఛికద్వంద్వము లేకవచనము లగును. ౮౧

ఉదా:—కూడుగుడ్డ- కూరగాయ- కాలుసేయి- కూడుసీర-పిన్నపెద్ద-భాకాసోక-ముందువెనుక- తేపుమాపు—గొడ్డుగోద—మొద—

ఇట్టి వనేకములు గ్రంథముల( గలవు. కొన్నిప్రయోగములు.

కాలుసే యాడుతటియందు కదలనలయు—కాశీ, కాలుసేతిబల్ త్రొక్కు—ఆము, అరయంగాఁ బిన్నపెద్దయై యతఁడుండున్—కాశీ, కూడుసీరకు నింటఁ గొదలేకయుండునే—హర, సంసారంబునదల విడిచి కూడుసీరకు నవసియుండు నట్టివాఁడు—భార, కాం-౪-౩౨—కొన్ని ద్విగువులకు—,, పాదంబు లిరుచేతఁబట్టి గుంజుండు—కాశీ, ఇరుతెలుఁగు న్మదీప్సితమె—ఆము, ఇరుచెళ్లి యెఱుఁగక యుండన్-ఉ-హరి, ఇత్యాదులు

సూ:—పువ్విలుకాఁడు మొదలయినవి యథాప్రయోగముగా గ్రాహ్యములు. ౮౨

ఉదా:—పువ్విలుకాఁడు-కవ్వడి-పెత్తనము—వేఁగురుఁజుక్క-చిత్తరుబొమ్మ—నిక్కల—ఎగాదిగ-ఎగుదల—బళాబళి- హాళాహాళి-పోటాపోటి-ఎడవంక-వలవంక-అవతల-ఇవతల-బెబ్బులి-మొద-

అవ్యయీభావాదులు

సూ:—అవ్యయము మీఁదిపదముతో సమసించుట యవ్యయీభావము- ౮౩

ఉదా:—యథోచితము-యథాశక్తి ఆబాలగోపాలము-మధ్యేమార్గము ఉపకంఠము-నిష్కారణము- మొదలయిన సాంస్కృతికములు తెలుఁగున వాఁడఁబడుచున్నవి.

సూ:—సమాసమునఁ బూర్వపదముయొక్కవిభక్తి లోపింపనిచో అలుక్సమాస మగును. ౮౪

ఉదా:—సాంస్కృ- జనుసాంధుఁడు-యుధిష్ఠిరుఁడు-పశ్యతోహరుఁడు-కంఠేకాలుఁడు - సరసిజము - అన్తేవాసి- మొ—నిందయందు దాస్యాఃపుత్రుఁడు-దేవానాంప్రియుఁడు-మొ—

ఆచ్ఛికములలో నాతోడిచెలిమి- పురమండలిజనులు-వారిలోనివాఁడు-మొదలయినవి అలుక్సమాసము లనిచెప్పుదురు గాని యివి 'ఇ' ప్రత్యయయోగమున విశేషణములైనవి.

తలంబ్రాలు-ఒడిఁబ్రాలు-ఊరఁబంది-మొదలగుకొన్ని యలుక్స

మాసము లగును.

సూ:—కుంభకారాదులు నిత్యసమాసములు. ౮౫

ఉదా:—కుంభకారుఁడు-తిలఘాతుకుఁడు- వృక్షచ్ఛేదకుఁడు-పంకజము మొ—ఇవియే ఉపపదసమాసము లనఁబడును.

## కృదాదివృత్తులు

సూ:—కృదాదివృత్తు లయిదు. ౮౬

కృద్వృత్తి-తద్ధితవృత్తి-సమాసవృత్తి- ఏకశేషవృత్తి-సనాద్యంతధాతురూపవృత్తి యని వ్యాకరణవృత్తు లైదువిధములు. సమాసము లన్నియు సమాసవృత్తి కుదాహరణము లగును. ఆచ్ఛికము లైన కృత్తద్ధితవృత్తుల కాయాప్రకరణములలోని వుదాహరము లగును. కావున సమాసేతరము లయినసాంస్కృతికవృత్తులు మాత్ర ముదాహరింపఁబడును.

సూ:—ధాతువులకంటె విహితములగునట్టి క్రియావిభక్తులు కాని ప్రత్యయములు కృత్తు లనఁబడును. వాని కూడికవలనఁ గలుగు విశిష్టార్థమును బోధించునది వృత్తి. ౮౭

ఉదా:—భర్త—అమరుఁడు-భార్య- దేదీప్యమానము-భక్తుఁడు- మొ—

సూ:—నామవాచకములకంటె నర్థవిశేషములందు నచ్చునవి తద్ధిత ప్రత్యయములు. వానికూడికచేఁ దోఁచువిశేషార్థమును దెలుపునది తద్ధితవృత్తి. ౮౮

తద్ధితప్రత్యయము లపత్యార్థకాదిభేదముః బహువిధములు.

అపత్యార్థకములు:—జానకి-పాండవులు- గాంగేయుఁడు.

గోత్రాపత్యార్థ:—కౌరవులు-మానవులు-పౌలస్త్యుఁడు.

భావార్థ:—శౌర్యము-కవిత్వము-అణిమ-స్థిరత.

తరతమార్థ:—మృదుతరము-దివ్యతమము-గరిష్ఠము.

సంబంధార్థ:—మదీయము-వన్యము-దైనికము.

అర్హార్థ:—వధ్యుఁడు-పూజ్యుఁడు-దండనీయుఁడు.
భవార్థ:—మానసికము-లౌకికము-ఆధ్యాత్మికము.
వికారార్థ:—కనకమయము-ఆయసము-హైమము.
పరిమాణా:—కటిద్వయసము-కంఠదఘ్నము-ఊరుమాత్రము.
ప్రోక్తార్థ:—నన్నయభట్టీయము-సూర్యనారాయణీయము.
అధికృతగ్రంథార్థ:—నరసభూపాలీయము-విక్రమోర్వశీయము.
మత్వర్థీయ:—శ్రీమంతుఁడు-యశస్వి-వాగ్మి-మొద—

సూ:—ద్వంద్వసమాసములో మొదటిపదము లోపించుటయు శేషిం
చిన రెండవపదము లోపించినదానియర్థమునుగూడఁ జెప్పు
యు నెందు సంభవించునో యది యేకశేషవృత్తి యన
బడును.

సూ:—ఒకశబ్దముయొక్క స్త్రీలింగపుంలింగరూపములలో పుంలింగ
రూపము బహుళముగా శేషించును.

ఉదా:—జననియు జనకుఁడును=జనకులు. హంసియుహంసమును=
హంసలు-మొద—

సూ:—కొన్నిభిన్నపదములు కలిపి చెప్పినపుడుగూడఁ బుంలిం
శబ్దమే మిగులును.

ఉదా:—దుహితయు పుత్రుఁడును=పుత్రులు- మాతయు-పితయు=
పితలు- ఆచ్ఛికములలోఁగూడ నేకశేషవృత్తి కలదు.

ఉదా:—బిడ్డ బిడ్డఁడు=బిడ్డలు, పెద్దది పెద్దవాఁడు=పెద్దలు, మొద—

సూ:—సంస్కృతధాతువులకు 'సన్' మొదలగుప్రత్యయములు చేరు
టచేఁ గలుగునర్థవిశేషము తెల్పునది సనాద్యంతధాతువృత్తి.

ఉదా:—జిజ్ఞాస-పిపాస-బుభుక్ష-ముముక్షువు- మొ—

ఇది సమాసప్రకరణము.

# తద్ధిత ప్రకరణము.

ఇందు తెలుఁగుతద్ధితాంతములుమాత్ర ముదాహరింపఁబడును. ధాతువులపై వచ్చుభావార్థకప్రత్యయములు క్రియాప్రకరణమునఁ జూపఁబడినవి. సూత్రముల కిచ్చుమొదటియుదాహరణములనుబట్టి "ఇవి ప్రథమావిభక్తిప్రత్యయాంతములు ఇవి స్త్రీసమములు" అని గ్రహించునది. అజాదిప్రత్యయములు పర మగునపు డెల్లయచ్చులకు సంధి నిత్య మగును. కొన్ని ప్రత్యయములు పర మగునపుడు-ము-డు-వర్ణకములు లోపించును. 'తన' వర్ణకము పర మగునపుడు వచ్చునకారాగమాదులను, సంధి ప్ర-లోనిసూత్రములనుబట్టి చేయునది.

సూ:—నామవాచములకంటెను కొన్నివిశేషణములకంటెను విశేషార్థమందును స్వార్థమందును విధింపఁబడు ప్రత్యయములు తద్ధితములు. ౧

సూ:—భావార్థమందు తన వర్ణక మగును. ౨

ఉదా:—దొరతనము-మగతనము- పెంకెతనము-మంచితనము. తెల్లఁదనము-కమ్మఁదనము-గడుసుఁదనము—పనివానితనము.

"మరలంగఁ గొనుటె పోటువానితనము" పారిజా। ఇది తత్సమములమీఁదను క్రియాజన్యవిశేషణములమీఁదను గూడఁ గావ్యవ్యవహారములఁ గనవచ్చుచున్నది వెల్లఁ గొన్నతనాన' భీమ—ఓర్వలేనితనము— చేఁతకానితనము – మొ—"దుర్బుద్ధితనము—ఉపకారితనము" అధికారితనము – మొ—

సూ:—చిన్న మొదలగువానికి ఱిక ప్రత్యయ మగును. ౩

ఉదా:—చిన్నఱికము-చుట్టఱికము—మిండఱికము-రాచఱికము-దుండఱికము-(గలోపము) పెద్దఱికము-మొ—

సూ:—'ఱిక'పర మగుచోఁ బూర్వ మం దున్నఉకారము అకార మగును-

ఉదా:—వెజ్జు, వెజ్జఱికము-ఇట్లు తొత్తఱికము-పెద్దఱికము-మొ—

సూ:—పేరు మొదలగువానికి 'ఇమి' వర్ణక మగును. ౫

ఉదా:—పేరిమి-కడిమి-ముచ్చిమి-మేలిమి-చెలిమి-పోఁడిమి-వాఁడిమి.

సూ:—కొన్ని గుణాదినామవాచకములకు, నవర్ణక మగును. ౬

ఉదా:—తెల్ల-తెల్లన,-గుండ్రము-గుండ్రన-, ఇట్లు పచ్చ-ఎఱ్ఱ-చామ-తిన్న-తియ్య-పుల్ల—ఒయ్య-మెత్త-చిక్క-వేఁక-చక్క-సన్నము మొ- ఉప్పు-ఉప్పన- (అకారాదేశము)

సూ:—స్వార్థమునందు అరమర మొదలగువాని తుదియచ్చునకు 'ఇక' యాదేశ మగును. ౭

ఉదా:—అరమర-అరమరిక. ఇట్లు నడవడి-ఆను-అల్లిబిల్లి-గండి-నాడు-నివ్వాళి-పొత్తి-మాన-మెలి-నాలు- మొ—

సూ:—చిఱుత మొదలగువాని తుదియచ్చునకు 'ఉక' యాదేశ మగును. ౮

ఉదా:—చిఱుత- చిఱుతుక. ఇట్లు నెలఁత- మొలఁత- నాతి- పడఁతి- మడఁతి-పొలఁతి—నిప్పు- ఎమ్ము- మొద— 'మొలఁత' మొకటి రూపము మొలుఁత.

"ఆకొలను సారఁగ నమ్మని।లోకము సేరుటయు నమ్మొలుఁతయొలుఁ గనఁగన్- భార-అను-3-221

సూ:—చెలిమి మొదలగువానికి పురుషవాచకమై కాఁప్రత్యయమును స్త్రీవాచకమై కత్తియ ప్రత్యయము నగును. ౯

ఉదా:—చెలిమికాఁడు-చెలిమికత్తియ-చెలిమికత్తె-ఇట్లు వేఁట-సొగసు-నేర్పు-చొరవ-అడపము-విలు-వన్నె-ఎమ్మె- నీటు- నగ- తిండి-సంగడి-కటారి—వెచ్చము-మొద—పనికత్తె (పనికాఁడు లేదు)

సూ:—కొన్ని శబ్దములమీఁది కాకత్తెల కకారము గకార మగును. ౧౦

ఈగకారాదేశమును కవిప్రయోగ శిష్టవ్యవహారములనుబట్టి గ్రహించునది.

ఉదా:—కొండెగాఁడు-కొండెగత్తె, అందగాఁడు-అందగత్తె, విండ గాఁడు-ఇల్లు జూకము-ఆట-పాట-జీతము-బేరము- మొద—'కత్తె' రూపమే యెక్కువగా వాడుకలో నున్నది.

సూ:—కొన్ని తత్సమములమీఁద నీప్రత్యయములు గనవచ్చును. ౧౧

హాస్యగాఁడు-విటకాఁడు-విటకత్తె-కోపగాఁడు- మొద—

సూ:—రూపు-బలువు-శబ్దములకు 'అసి' ప్రత్యయ మగును. ౧౨

ఉదా:—రూపసి-బలువసి-ఉకారము లోపమైనది. ఇది వాడుకలోనిది.

"అన్న మీతండ్రి కోపగాఁడౌనో కాదో" కాశీ-నాకీరూ పింతటిమేటి రూపసికిఁ దాఁ నిల్లాలు-ఉ-హరి-

సూ:—కా-కత్తెలు-కొన్నిటికి స్వార్థమందును వచ్చును ౧౩

ఉదా: చెలికాఁడు- చెలికత్తె-ఇల్లు-హెగ్గడి-మాలిమి- మొక్కలి-మొ.

సూ:—కాప్రత్యయము కొన్ని మృగాదివాచకములకు నగును. ౧౪

ఉదా:—ఇబ్బందికాఁడు-ఒంటికాఁడు కొమ్ముకాఁడు-పరికాఁడు-మొ-

సూ:—అటమటము మొదలగువానికి మత్వర్థమందును, మావటి మొదలగువానికి స్వార్థమందును 'ఈ'ప్రత్యయ మగును. ౧౫

ఉదా:—అటమటీఁడు-కమ్మతీఁడు-కన్నడీఁడు- బానిసీఁడు-కొండీఁడు-మొక్కలీఁడు-మన్నీఁడు-సంగడీఁడు- దుండగీఁడు- బాసనీఁడు-మందడీఁడు-సాలీఁడు- మొద—మావటీఁడు- కల్లరీఁడు-త్రిమ్మరీఁడు-మొద—ఉక్కివము, ఉక్కీఁడు- వకారలోపము-మిండ, మిండగీఁడు-గవర్ణాగమము.

సూ:—మత్వర్థస్వార్థాదులందు జాలము మొదలగువానికి 'అరి' వర్ణక మగును. ౧౬

ఉదా.—జాలము-జాలరి, కల్ల-కల్లరి, ఇల్లు చదువు-జూదము-సిగ్గు-తగవు-తీర్పు-తెంపు- తెలుపు- నేర్పు - పోటు-వెరవు- టక్కు-సుంకము-వేఁట-పొదుపు-ఒజుపు-గడుసు- దోఁపు-కాపు-మేపు;

తుంటరి-మేటరి; చూపరి, దొమ్మరి, సొన్నకు దీర్ఘము-సొన్నారి, పూజకు వైకల్పికము-పూజారి-పూజరి, కలము-కలమరి, ఎత్తరి-పొడుగరి-మొ—వాడుకలోనివి.

సూ:—కొన్నిటికి మత్వర్థమున 'ఇ' ప్రత్యయ మగును. ౧౭

ఉదా:—ఒయారము- ఒయారి-ఇల్లు-అక్కసము- చాగము-జోగము-తమకము-సయగారము-మొక్కలము-తుటారము- ఆఁడంగు-బండారము-బేహారము- మచ్చరము- విన్నాణము- మిటారము-జవ్వనము-బిటారము-కడలు- రాయబారము-మొ, రాయభార ము-రాయభారి- యనురూపములు పూర్వపుఁ(వ్రా)తపుస్తకము లం దెల్లెడలఁ గనవచ్చును. ఆఁడంగి- పురుషునిఁజెప్పుచో నిత్యైకవచనము. స్త్రీవాచక మగుచో నిత్యబహువచనము. ఆఁడంగులు,

సూ:—కులవాచక శబ్దముకంటె స్త్రీవాచకమై 'త' ప్రత్యయ మగును. ౧౮

ఉదా:—చాకిత-అలవత-పల్లెత-వేత-వాసెత-గొల్లత- సాలెత-కోమటి బోయత- మొద —

సూ:—'త'వర్ణకము పర మగుచోఁ గొన్నిటితుదియుచ్చు, ఎకార మగును. ౧౯

ఉదా:—మాల-మాలెత, చెంచు-చెంచెత-బోయ-బోయెత-చెంచిత-యనియుఁగలదు.

సూ:—కొన్నిటికి మత్వర్థమున 'త' ప్రత్యయ మగును. ౨౦

ఉదా:—మిండత-ముట్టుత, గుబ్బెత-అకార మేకార మైనది.

సూ:—చెడుగు-దుడుకు-నిడుపు-శబ్దములకు మత్వర్థమున, 'అ' వర్ణ మగును. ౨౧

ఉదా:—చెడుగఁడు-దుడుకఁడు-నిడుపఁడు (సర్పము) మొదటిరెండు

మగాదిగణములోను! మూఁడవది కమురాదిగణములోను జేరును.

సూ:—వగాదులబహువచనలువర్ణకములమీఁద మత్వర్థమునఁ బురుష వాచకమై 'ఆ' ప్రత్యయమును, స్త్రీవాచకమై 'ఆఁడి' వర్ణకమును వచ్చును. ౨౨

ఉదా:—వగలు, పగలాఁడు-వగలాఁడి-ఇట్లు చిన్నెలాఁడు చిన్నెలాఁడి వన్నెలాఁడు-వన్నెలాఁడి; మాయలాఁడు-మాయలాఁడి, మొ—

సూ:—వినికి మొదలగువానికి స్వార్థమున 'ఇడి' వచ్చును. ౨౩

ఉదా:—వినికిడి-విరివిడి-రాపిడి-లేమిడి-దోఁపిడి-తెలివి కర్థవిశేషమునఁ తెలివిడి-మొద—

సూ:—ముక్కు మొదలగువానికి వానిలేమిని దెలుపుచు 'ఇఁడి' ప్రత్యయ మగును. ౨౪

ఉదా:—ముక్కిఁడి- వెరవిఁడి- నేతిఁడి- పీతిఁడి- సిగ్గిఁడి- వాలిఁడి- ప్రాయిఁడి-మొద—

సూ:—చెవికి అర్థవిశేషముల 'ఉడు-ఇటి' ప్రత్యయము లగును. ౨౫

ఉదా:—చెవుడు-చెవిరోగము, చెవిటి-చెవుడు గలవాఁడు.

సూ:—'ఇత' వర్ణకము కొన్నిటికి స్వార్థమునం దగును. ౨౬

ఉదా:—ఇంపు-ఇంపితము, పోరు- పోరితము- బిగి- బిగితము- తప్పు తప్పితము-మొద—

సూ:—ఒప్పు మొదలగువానికి 'ఇద' వర్ణక మగును. ౨౭

ఉదా:—ఒప్పిదము-తప్పిదము-పెల్లిదము; మత్వర్థమున-క్రొవ్విదము-బెట్టిదము-మొద—

సూ:—సంస్కృతమందలి వికారార్థకమైన 'మయ' ప్రత్యయము కొన్ని యాచ్ఛికములమీఁదను గనవచ్చును. ౨౮

"తనమయంబుగా గగనంబున నిగుడునచ్చక్రంబు-ఉ-హరి, తనమయంబుగ

సంతమసంబు ఇచ్చినన్-దళక, చదలు తమమయంబుగా-నిర్వ, మెదడు ప్రోవుల మయ మయ్యె-హరి,

సూ:—వాగ్మి మాటకారి, వాచాటుఁడు మాటలమారి, యనఁబడుదురు. ౨౯

సూ:—'కార' ప్రత్యయము కొన్నిటి కర్థవిశేషముల వచ్చును. ౩౦

ఉదా:—చెలికారము - నయగారము - నుడికారము- (కొలత) కొలగారము.

సూ:—పరిమాణార్థమునందు 'ఎఁడు' వర్ణక మగును. ౩౧

ఉదా:—తూమెఁడు-వీసెఁడు-గుప్పెఁడు-కుంచెఁడు- మొద—

సూ:—'అంత' వర్ణకము కొన్నిటి కగును. ౩౨

ఉదా:—గంపంత-చేటంత-నిమ్మకాయంత-కాసంత- మొద—

సూ:—అంత మొదలగువానికి 'మాత్ర' వర్ణక మగును. ౩౩

ఉదా:—అంతమాత్రము - ఇంతమాత్రము- ఎంతమాత్రము- కొంతమాత్రము.

సూ:—ప్రమాణార్థమున 'బంటి-కొలఁది' వర్ణకము లగును. ౩౪

ఉదా:—కుత్తుకబంటి - బొమ్మబంటి- మోఁకాలిబంటి- మోఁకాలికొలఁది- మొద—

ప్రాచీనాంధ్రమందు బొమ్మనబంటి- పుక్కిటిబంటి-ముక్కనబంటి-యని కనవచ్చును. తత్సమముమీఁద- 'కటిబంటి' ప్రయోగము గలదు.

సూ:—కులవాచకశబ్దములకు మహన్మహత్యర్థములందు వాఁడు- అది- శబ్దములు ప్రత్యయకల్పములై చేరును. ౩౫

ఉదా:— బాపనవాఁడు- రాచవాఁడు- కోమటివాఁడు- కాఁపువాఁడు- కంసాలివాఁడు - పల్లెవాఁడు- బాపనది- రాచది- కోమటిది- కాఁపుది-కంసాలిది-పల్లెది- మొద—

సూ:—పెండ్లాము మొదలయినవి యథాప్రయోగవ్యవహారముగా గ్రాహ్యములు. 3౬

ఉదా:—పెండ్లాము-పెండ్లము-కోటరము-కోడంట్రము- కోడంట్రికము-కోడలికము-కోమలికము-కరణికము-కరణీకము-నాయంకరము-నాయకరము.

సూ:—కొన్ని కొన్ని శబ్దములకు తాచ్ఛీల్యము మున్నగునర్థవిశేషము లందు-మారి-పోతు-కోరు- దారు— గొట్టు- మొదలగు ప్రత్యయము లగును. 3౭

ఉదా:—మంటమారి-మాయలమారి-తలగొట్లమారి- మొద—తిండిపోతు-వదరుఁబోతు - త్రాగుఁబోతు- గొడ్డుఁబోతు- పొగరుఁబోతు- (గొడ్డుమోతు-పొగరుమోతు-వాడుకలో') మొద—జగడాలకోరు— అబద్ధాలకోరు - వ్యాజ్యాలకోరు- దగాకోరు-మొద-చోపుదారు—అంచనాదారు- పెత్తనదారు (పెత్తందారు) మొద-వాపిరిగొట్టు-కడగొట్టు-చెడుగొట్టు-మొద - తక్కుంగలతద్ధిత విశేషములను ప్రయోగవ్యవహారములఁ దెలియునది.

ఇది తద్ధితప్రకరణము.

---

## క్రియా ప్రకరణము.

సం. ప్ర. ౮౧- వి.ప్ర. ౧౫-౧౬-౧౭-౧౮-౧౯-౨౦-౨౧-౨౨-౨౩- సూత్రముల నిచ్చట సమన్వయించునది.

సూ:—ధాతువు లన్నియు ఉకారాంతములు. ౧

ఉదా:—చేయు-పోషించు-వచ్చు-చదివించు—పనుచు-మొద—

సూ:—సకర్మకాకర్మకభేదమున ధాతువులు రెండువిధములు. ౨

కర్మను గోరునది సకర్మకము ... మొద—

కర్మ నపేక్షింపనది అకర్మకము-వచ్చు-వెళ్ళు-ఉండు-మొద—

సూ:—అకర్మక ధాతువులు ప్రేరణమున సకర్మకము లగును. 3

ఉదా:—(కదలు) కదలుచు—(వచ్చు) రావించు (పోవు) పనుచు, మొ-

సూ:—సకర్మకములు కొన్ని ద్వికర్మకములు గూడ నగును. ౪

ఉదా:—పితుకు—గొల్లవాఁ డావును పాలు పితికెను. ఇట్లు, వేఁడు-
కోరు-మొద—

సూ:—మహదర్థకాదిభేదమునఁ గ్రియ మూఁడువిధములు. ౫

పురుషుని దెల్పునది మహదర్థకము. స్త్రీని దెలుపునది మహ
త్యర్థకము. పశుపక్ష్యాదులను దెల్పునది అమహదర్థకము.

సూ:—క్రియావిభక్తులు ప్రాయికముగా సానుబంధములు. ౬

భూత వర్తమాన భవిష్య త్తద్ధర్మాద్యర్థముల వచ్చునట్టి- ను-
డు- మొదలగు క్రియావిభక్తులు ఎ-ఉన్న-మొదలగు ననుబంధము
లతోఁ గలిసియుండును. ప్రాయిక మనుటచే- 'రి'వర్ణకమున కనుబం
ధము లేదు. ము-డు-ను-వర్ణములకు అర్థభేదమునుబట్టి యొకప్పు డను
బంధము చేరును. ఈవిషయము క్రియావిభక్తుల పట్టికలవలన
గ్రహించునది.

సూ:—ది-వి-తప్పఁ దక్కినక్రియావిభక్తులు పర మగునపుడు-న-ఉన్న-
అనుబంధములకు దీర్ఘము నిత్యము. ౭

ఉదా:—న+రు=నారు, చేసినారు. ఉన్న+వు=ఉన్నావు. చేయు
చున్నావు. మొద—

సూ:—'ఎడి' అనుబంధ మగునపుడు 'ను'వర్ణకముయొక్క ఉకారము
నకు ఇకార మగును. ౮

ఉదా:—ఎడి+ను=ఎడిని, చేసెడిని.

సూ:—అనుబంధముతోఁ గాని ధాతువుతోఁ గాని కలిసినపుడు
'డు' ప్రత్యయమువెనుక బిందువు చేరును. ౯

ఉదా:—చేసినాఁడు-చూచుచున్నాఁడు-చేయఁడు- కోరుఁడు. మొద-

అనుబంధములతోఁ గూడిన భూతకాలాదిక్రియావిభక్తు లీక్రింది పట్టికలలోఁ జూపఁబడుచున్నవి. వానిలో చివరనున్న యక్షరము క్రియావిభక్తి యనియు దానికి వెనుకనున్నవి యనుబంధ మనియు గ్రహించునది. ఒకటే యక్షర మున్నయెడల అది క్రియావిభక్తియే. పట్టికలలోని గుర్తులు. ప్ర. ప్రథమపురుష, మ. మధ్యమపురుష, ఉ. ఉత్తమపురుష, మహ. మహదర్థకము, మ-తి. మహత్యర్థకము, అమ. అమహదర్థకము. పైమూఁడింటికి నొకటే క్రియావిభక్తి యైనయెడల 3 అంకెగుర్తు. ఏ. ఏకవచనము, బ. బహువచనము. క్రియావిభక్తులు చేర్చి క్రియాపదములు గూడ నుదాహరింపఁబడును.

౧. భూతకాలక్రియావిభక్తులు.

| పురుష-మహదా. | | క్రియావిభక్తులు ఏ | బ | క్రియారూపములు ఏ | బ |
|---|---|---|---|---|---|
| ప్ర. | మహ. | ఎను | రి | వచ్చెను | వచ్చిరి |
| ,, | మ-తి. | ఎను | రి | వచ్చెను | వచ్చిరి |
| ,, | అమ. | ఎను | ఎను | వచ్చెను | వచ్చెను |
| మ. | 3 | తివి | తిరి | వచ్చితివి | వచ్చితిరి |
| ఉ. | 3 | తిని | తిమి | వచ్చితిని | వచ్చితిమి |

౨. అద్యతనభూతకాలక్రియావిభక్తులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్ర. | మహ. | నాఁడు | నారు | వచ్చినాఁడు | వచ్చినారు |
| ,, | మ-తి. | నది | నారు | వచ్చినది | వచ్చినారు |
| ,, | అమ. | నది | నవి | వచ్చినది | వచ్చినవి |
| మ. | 3 | నావు | నారు | వచ్చినావు | వచ్చినారు |
| ఉ. | 3 | నాను | నాము | వచ్చినాను | వచ్చినాము |

౩. వర మాసకాల క్రియావిభక్తులు

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. మహ. | ఉన్నాఁడు | ఉన్నారు | చేయుచున్నాఁడు | చేయుచున్నారు |
| ,, మ-తి. | ఉన్నది | ఉన్నారు | చేయుచున్నది | చేయుచున్నారు |
| ,, అమ. | ఉన్నది | ఉన్నవి | చేయుచున్నది | చేయుచున్నవి |
| మ. పు | ఉన్నావు | ఉన్నారు | చేయుచున్నావు | చేయుచున్నారు |
| ఉ. పు | ఉన్నాను | ఉన్నాము | చేయుచున్నాను | చేయుచున్నాము |

౮ భవిష్యత్కాలక్రియావిభక్తులు.

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. మహ. | కలఁడు | కలరు | కోరఁగలఁడు | కోరఁగలరు |
| ,, మ-తి. | కలదు | కలరు | కోరఁగలదు | కోరఁగలరు |
| ,, అమ | కలదు | కలవు | కోరఁగలదు | కోరఁగలవు |
| మ. పు | కలవు | కలరు | కోరఁగలవు | కోరఁగలరు |
| ఉ. పు | కలను | కలము | కోరఁగలను | కోరఁగలము |

౯ తద్ధర్మాద్యర్థక క్రియావిభక్తులు.

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. మహ. | ను | దురు | చేరును | చేరుదురు |
| ,, మ-తి. | ను | దురు | చేరును | చేరుదురు |
| ,, అమ | ను | ను | చేరును | చేరును |
| మ. పు | దువు | దురు | చేరుదువు | చేరుదురు |
| ఉ. పు | దును | దుము | చేరుదును | చేరుదుము |

౧౦ తద్ధర్మార్థక క్రియావిభక్తులు.

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. మహ } | ఎడును | ఎదరు | చేరెడుఁ | చేరెదరు |
| ,, మ-తి } | ఎడిని | | చేరెడిన్ | |
| ,, అమ | ఎడును | ఎడును | చేరెడున్ | చేరెడుఁ |

| అమ | ఎఁగని | ఎఁగని | చేరెడిన్ | చేరెదీర్ |
|---|---|---|---|---|
| మ. పు | ఎఁగవు | ఎఁగరు | చేరెదవు | చేరెదరు |
| ఉ. పు | ఎఁగను | ఎఁగము | చేరెదను | చేరెదము |

2 వ్యతిరేకతద్ధర్మార్థక క్రియావిభక్తులు.

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. మ | అఁడు | అరు | ఉండఁడు | ఉండరు |
| ,, మ-స్త్రీ | అదు | అరు | ఉండదు | ఉండరు |
| ,, అ-మ | అదు | అవు | ఉండదు | ఉండవు |
| మ. పు | అవు | అరు | ఉండవు | ఉండరు |
| ఉ. పు | అను | అము | ఉండను | ఉండము |

౩. ఆశీశ్శాపప్రార్థనార్థకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్ర. | ఎడును | తను | కలిగెడున్ | కలుగుతన్* | |
| మ. | | ము | డు | చేయుము | చేయుఁడు |
| మ. | విధ్యర్థకము. | ము | డు | చెప్పుము | చెప్పుఁడు |
| ప్ర. మ | విధ్యర్థకము. | నది | | వ్రాయునది | వ్రాయునది |

ఈక్రిందివి వ్యతిరేకప్రార్థనార్థకములు

| | | | | |
|---|---|---|---|---|
| మ. | అకుము | అకుఁడు | ఆడకుము | ఆడకుఁడు |

---

* ఎడిను-తను అనురూపములు ప్రాచీనశాసనములఁ గనవచ్చును. "దీవన కిడుమయ్యుఁగాతయు గావుతయును చనుఁగలఁగుగలవుద్రుమహీన్। శ్రీవెలుఁగెడుమధి పుఁడు మే। ల్గాంచునుగాత మేలుగావుత పనఁగన్" అనుకేతనాఖ్యానిపద్యము ముద్రణములో మాఱిపోయినది. అయ్యెడమ+అని=అయ్యెడమని, కావుతము+అని= కావుతమని, ప్రథమపురుషకవచనముతో గలియునపుడు ముగాగమ మగును. అయ్యెడమ+అని=అయ్యెడమని, అయ్యెడమనియు రెండు రూపములగును. ఇవి తాళపత్రగ్రంథము లందు గనవచ్చును. ప్రాచీనసంప్రదాయసిద్ధములైనయీరెండును గ్రమముగా ప్రకృత్యంతములుగా మాఱిపోయి-ఎడున్-తన్-అనురూపములను దాల్చి నవి. ఈమార్పునుబట్టి చిన్నయసూరి "ఎడు-త-లనునివి బునకచ్చుపరమగునపుడు ప కారంబగు" నను సూత్రము కల్పించెను. అర్వాచీనసంప్రదాయమునుబట్టి నేను దీనిని పైవిధముగా విధించితిని..

ఈక్రిందిది ఉభయప్రార్థనార్థకము

ఉ. వము వ్రాయువము

వ్యతిరేకార్థక క్రియావిభక్తులు తద్ధర్మమునందును ప్రార్థనార్థమునందును గలవు. తక్కిన వానియందు లేవు

క్రియావిభక్తుల వివరము

నూఁవటి యేకపట్టికలలోని మధ్యమోత్తమ పురుషవిభక్తులును ఎనిమిదవపట్టికలోని యన్నియును మహదమహన్మహాత్మ్యర్థములందు సమానముగా నుండును. ౧-౫-౬. పట్టికలలోని ప్రథమపురుష విభక్తులు మహన్మహాత్మ్యర్థములందు ఏకవచనబహువచనములలో నొకటిగానే యుండును. మఱియు నందలి యేకవచనవిభక్తులే అమహదర్థమున నేకవచనబహువచనము లగును. ౨-౩-౪-౭-పట్టికలలోని ప్రథమపురుషైకవచనవిభక్తులు మహత్యర్థమునందు నమహదర్థమునందు నొకటియగును. బహువచనవిభక్తులు మహాన్మహాత్మ్యర్థముల నొకటియగును. ఎనిమిదవపట్టికలోని పుప్వగుర్తుగలవాని కేకవచనబహువచనభేదము లేదు.

భూతకాల క్రియాపదముల రూపనిష్పత్తి

సూ:—భూతకాలక్రియావిభక్తులు పర మగునపుడు ధాతువులతుది యచ్చునకు 'ఇ' వర్ణక మాదేశ మగును. ౧౦

ఉదా:—చేరు + ఎను, చేసు + నాఁడు - ఇకారాదేశము - చేరి - ఇట్లు, పోషించి-వ్రాయించి-సంధిల్లి-విని-పాడి- మొద—

సూ:—ఎకారాదిప్రత్యయములు పర మగునపుడు అన్వాదులకు పడ్వాదులకుఁ దక్కఁ దక్కిన ధాతువుల ఇకారమునకు సంధి నిత్యము. ౧౧

ఉదా:—చేరి + ఎను = చేరెను, ఇట్లు పోషించెను-పాడెను- మొ-అన్వాదిపడ్వాదుల ఇకారమునకు సంధి వైకల్పికము.

ఉదా:—అనెను-అనియెను-పడెను-పడియెను - సంధి లేనిచో యకార
మాగమము-అను-కొను-తిను-కను-విను-మను-చను-అన్వాదులు
-పడు-చెడు-ఇడు-తగు-నగు-పడ్వాదులు.

చేరెను-చేరిరి, చేరినాఁడు-చేరినారు-ఇట్లే ౧-౨-పట్టికలలోని
క్రియావిభక్తులను జేర్చుకొనునది.

చేయు మొదలగు యువర్ణాంతధాతువులకు ఇకారాదేశము
చేయఁగా, చేయ్+ఇ=అనియగును. అ. ప్ర. ౧౫ సూత్రముచే సకా
రాదేశము-చేసి - చేసెను - చేసినాఁడు- మొద—తక్కిన రూపములను
౧-౨-పట్టికలలోని యుదాహరణములనుబట్టి గ్రహించునది.

రెండవపట్టికలోని భూతకాలక్రియ లెట్లు వచ్చెనో క్రియా
జన్యవిశేషణసందర్భమునఁ దెలుపఁబడును. ఇవి మొదటిపట్టికలోని
వానివలె మిక్కిలి పూర్వము జరిగినవిషయమును దెల్పక యిప్పటికిఁ
గొంచెము పూర్వము జరిగిన విషయమును బోధించును. అందుచే
వీనికి "అద్యతనభూతకాలక్రియలు" అనుపేరు పెట్టితిని. వచ్చెను-
ఇచ్చిరి-చెప్పితిమి- మొదలగువానికి బదులుగా వచ్చినాఁడు-ఇచ్చినారు-
చెప్పినాము- మొదలగు రూపములే వాడుకలో నెక్కువగా నున్న
వనుట విదితము-ఇందు వచ్చినాఁడు-వచ్చినారు-వంటిరూపములు ప్రథ
మపురుషక్రియలుగా నెల్ల కావ్యములఁ గనవచ్చును. ఇపుడు మధ్య
మోత్తమపురుషక్రియలకుఁ బ్రయోగములు—

పల్లనిచూపు చూచి యిట్లు సంగతులై చనుదెంచినారు (వీరు), ఆడవిలో
గొల్లమందలయందు పెరిగినారు (వీరు) హరి-పూ—మీ రేయేగిరులఁ జూచినా!
రేయేతీర్థములందు, మను—కలి మిచ్చినావు కేలను, అప్పక—వనాంతరవాసము చెంది
నావు (సీతనుగూర్చి) ఉ-రా—భీ! లిత్యాగంబొనరించినా ననుడు నక్కి—నుండు,
కళా—మీ రిద్దఱ ప్రస్థముగ! న్నారా పాండవులఁ జూచినారా, విజ—చూచెద
నని వచ్చినాను సుదతి నిన్నుఁ, హంస—దమవు కొన్నా మంచు జటచెప్పు,
కుపల—చంచలింప — అయ్యా

యొక్కడనుండి యిక్కడికి తీర్థంబు విచ్చేసినా! కియ్యాజ్ఞానన, ఉ-రా—పౌరు తుతోఁ గూడి క్రీడసఁ బోయినావా, పట్టాభి—ఇత్యాదు లనేకములు గలవు. చనుదెంచినవారము-ఇచ్చినవాఁడవు-చెందినదానవు-చనుచున్న వారము - వంటివిశేషణ రూపములు పైవిధముగాఁ గ్రియారూపములతో మాటియల్లును, భూతబహుకాలముక్రింద టనే కావ్యములఁ బ్రయుక్తము లయినట్లును తెలియుచున్నది గావున శబ్దసంస్కారము ననుసరించి వచ్చిన యీ ప్రయోగములనుబట్టి అద్యతనభూతకాలక్రియానిర్వచన మావశ్యకమైన దని తెలియునది.

ఉండుధాతువు వర్తమానార్థకరూపములు

ప్ర. పు. ఉన్నాఁడు-ఉన్నారు, ఉన్నది - ఉన్నారు, ఉన్నది-ఉన్నవి.
మ. పు. 3. ఉన్నావు - ఉన్నారు, ఉ. పు. 3 ఉన్నాను-ఉన్నాము.

ఇవి వర్తమానార్థముకంటె భూతార్థమునే యధికముగాఁ జెప్పుచున్నవి. "నిన్న సభ జరిగినపు డతఁ డున్నాఁడు నేనున్నాను" పైరూపములకుఁ గేవలవర్తమానార్థకత్వము లేదనుటకు "ఉంటున్నాఁడు-ఉంచున్నాను" వంటివ్యావహారికరూపములే నిదర్శనము.

ఉండుధాతువునకుఁ దక్కినకాలములందు తక్కినధాతువులకు వలెనే క్రియారూపములు గలవు.

ఉదా:—ఉండెను-ఉండిరి-ఉండఁగలఁడు-ఉండును-ఉందుము - మొద.—
'ఉండుట' యర్థముగల 'కలుగు' ధాతువువర్తమానార్థక రూపములు.

ప్ర. పు. కలఁడు-కలరు, కలదు-కలరు, కలదు-కలవు.
మ. పు. కలవు-కలరు, ఉ. పు. కలను-కలము.

ఉండుధాతువురూపములకువలెనే వీనికిని భూతార్థకత్వము గూడఁ గలదు. ఈధాతువునకు-పుట్టుట-కూడుట-పొందుట-మొదలగు నర్థములందు తక్కినధాతువులకువలెనే క్రియారూపము లగును.

ఉదా:—కలిగెను-కలిగిరి, కలిగినాఁడు-కలుగుచున్నాఁడు, కలుగఁ గలఁడు-కలుగును-కలుగుదుము-మొద—

పైని జెప్పిన ఉండుధాతువునుండి పుట్టిన 'ఉన్న' వర్తమాన కాలక్రియావిభక్తులకును, కలుగుధాతువునుండి పుట్టిన 'కల' భవిష్యత్కాలక్రియావిభక్తులకును అనుబంధము లయిన వని గ్రహించునది.

సూ:—కలఁడు మున్నగురూపముల మధ్యస్వరము దీర్ఘ మగుట యుఁ గలదు. ౧౨

వారు సాధులు కాఁగలా రని వారి కానతియిచ్చె. ప్రభావ—చైత్యారి కాఁకోలు ఏమున గాఁపున్నఁ గలావె యన్యులకు ఏయుంచత్ప్రభావోన్నతుల్, ఉ—రా—సకలమహిమలు ఏనుపట్టికిని జేసి అంగలా వంగ లార్వఁ గుఁగనయున, కలాఁడు—కలాను—సమీర—మొ—

వర్తమానకాలక్రియలరూపనిష్పత్తి

సూ:—వర్తమానకాలక్రియావిభక్తులు పర మగునపుడు ధాతువునకు 'చు' వర్ణ మాగమ మగును. ౧౩

ఉదా:—చేయు+చు+ఉన్నాఁడు=చేయుచున్నాఁడు-ఇట్లే చెయుచున్నది-చేయుచున్నాము-మొ—

సూ:—చువర్ణము పర మగునపుడు అన్వాదుల ఉకారమునకు లోపమును నకారమునకు నింతునున్నయు వైకల్పికము. ౧౪

ఉదా:—అను+చు+ఉన్నాఁడు—అంచున్నాఁడు-అన్చున్నాఁడు-అనుచున్నాఁడు-ఇట్లు విను-కొను-మొదలగువానికగును, చనుధాతువునకు మాత్రము కాదు.

భవిష్యత్కాలక్రియలరూపనిష్పత్తి

సూ:—భవిష్యత్కాలక్రియావిభక్తులు పర మగునపుడు ధాతువునకు 'అన్' వచ్చును. ౧౫

ఉదా:—కోరు+అన్+కలఁడు=కోరఁగలడు- ఇక్కడ ద్రుతమునకు సంశ్లేషము రాదు. ఇట్లు కోరఁగలదు-వినఁగలరు- చదువఁగలవు-కొనఁగలము- మొద—

అ. ప్ర. ౧౦ సూత్రముచే నొప్పి మన్నదా ధాతువులచకా

రమునకు 'అన్' పర మగునపుడు వకారము వచ్చును. ఉదా:— పిలువఁగలఁడు-నిలువఁగలరు-కొలువఁగలను- మొద— హెచ్చు మొద లగు వానికి రాదు. హెచ్చఁగలను. మెచ్చఁగలవు-మొద—

భారతాది ప్రాచీనగ్రంథములందు 'కలఁడు' మున్నగు రూపములు భవిష్య త్కాలసూచకములుగాఁ గనఁబడవు. కలఁడు-కలరు-కలను-మొదలయినవి స్వతంత్రములై యన్వయించును. పరశురాముఁ డొండె వాఁడుఁ డొండె...ఒరులు గలరె కర్ణునోర్వ" భీముఁడొండె బలదేవుఁడొండెఁ గా కొరులు శల్యు నోర్వఁగలరె? అనుచోట్ల ఓర్వఁజాలునురా యనునర్థ మగును. ఇంద్రునట్ల నీవు భోగము లనుభవింపఁ గలవు, అనుచోట నీవనుభవించుటకు భోగము లున్న వని యర్థ మగును, శ్రీకృష్ణ దేవరాయలు ఆముక్తమాల్యదలో " చేసినది చేయుచున్నది సేయవలయు, నది యనంగల కార్యం బులందు—" అనుచోట భవిష్యదర్థమందు 'కల' యుపయోగింపక 'వలయు' ఉపయోగించి యున్నాఁడు. కేతనార్యుఁడు " పలుకును-పలుకుదురు" మొదలగు వానిని భవిష్యత్కాలక్రియలకును, అడిగెదున్-అడిగెదవు, మొదలగువానిని వర్తమానకాలక్రియలకు నుదాహరించెను. ఆతనిలక్షణములో తద్ధర్మకాలక్రియలు వేఱుగా లేవు. దీనింబట్టి చూడగా, 'కల' భవిష్యత్కాలసూచకము గా దని తోఁచుచున్నది.

తద్ధర్మాద్యర్థక క్రియాపదములరూపనిష్పత్తి

సూ:—ధాతువులకు అయిదవ మూఁడవ యేడవ పట్టికలలోని క్రియా విభక్తులు చేరుటచే తద్ధర్మాద్యర్థకక్రియ లేర్పడును. ౧౬.

ఉదా:—పోవు+ను=పోవును-ఇట్లు పోవుదువు-పోవుదును- మొద— వచ్చు+ఎదుక్=వచ్చెదుక్-వచ్చు+ఎదరు=వచ్చెదరు- మొ- చేయు+అఁడు=చేయుఁడు-ఇట్లు చేయవు-చేయను - మొద—

అ. ప్రి. ౧౯ సూత్రముచే సకారాదేశము చేయఁగా చేసెదుక్-చేసెడిన్-చేసెదరు-చేసెదము- మొదలగు రూపము లగును.

ఎనిమిదవపట్టికలోని యుదాహరణములను బట్టి యాశీరాద్యర్థకక్రియలరూపనిష్పత్తి నూహించుకొనవలెను.

## తద్ధర్మక్రియల యుపయోగము

ధాతువుయొక్క ధర్మము గలది యనియు, మూఁడు కాలముల యొక్క ధర్మము గలది యనియు, తద్ధర్మశబ్దమునకు వ్యుత్పత్తులు గలవు. ఆదిశబ్దముచే తాచ్ఛీల్య సంభావనా సంప్రశ్న సాతత్యాద్యర్థములును చెప్పఁబడును. ప్రాచీనకావ్యప్రయోగములను జూడఁగా అయిదవపట్టికలోని క్రియలు భూతార్థమందు మిక్కిలి తక్కువగాను వర్తమానభవిష్యదర్థములందు తఱచుగాను గనవచ్చును. ఆఱవపట్టికలోనివి వర్తమానభవిష్యదర్థములందు తక్కువగాను వర్తమాన సామీప్యములం దెక్కువగాను గనఁబడును. ఏడవపట్టికలోనివానికి మూఁడు కాలములందు ప్రయోగములు గలవు. కొన్ని యుదాహరణములు—

భూతా:—నీకీపద్యము వచ్చునా? వచ్చును. దీనియర్థము తెలియునా? తెలియును—
"ద్యూతక్రీడకుఁ గొండొక నేతున్—[నేర్చుచున్నాను] భార—వాసవిమూప చిహ్నములవార్తలు మున్వని యుండుదుం గదా,—విజ

వర్తమా:—నీరు లవి పాండుసుతులకు నెఱతు నేను, పెఱచుటకుఁ దోడుగా—
ఏ నెల్ల పొద్దు నామదిలోనఁ దలఁతు నీయభిప్రాయంబు—భార.—

భవిష్య:—అప్పుడుమఁ జేగు, హింస చేసినవారలయేసుగలికి—భార—

వర్తమా:...ఎందుండి వచ్చెదు పాపుల కేగెదు—నాకు నినుమించికొనివచ్చుకా
జేల పడిచె దీవు—భార—

భవిష్య:—దీనికి మీఁద తెఱఁగు నాకుఁ దెల్లముగఁ జెప్పఁడు తీర్పద—భార—
సొదెలికాఁ డిమ్ముల నున్నచందమేర్పడఁ జెలిపెద నేతెమ్ముకొన్ని దివసంబులకుఁజా, దశ—వర్తమానసామీ—నిన్ను వధించి యుర్వనము నెట్టనఁ జేసెద
నిర్భయంబుగా—నీయుక్కను దీరము చూచెదఁ జక్క నిలుము—భార—

త్రికాల—ఎఱుఁగు మెల్లధర్మములకు నెంతయుఁ బెద్ద యంద్రు—భార, మొద—

తద్ధర్మ—ఇల్లాలు వంట వండును. తచ్ఛీల—పువ్వు వికసించును. సంభావ—ఇపుడు వాఁడు వచ్చును. సంప్రశ్న—వారు ఎత్తురా? సాతత్య—వాయువు సర్వత్ర వ్యాపించును.

భూత:—నలుగ గాన ఓప్పసంబున, ఐ గ్రహా—పుఠకదు సఖులతో లలితాంగి,గవిష్ట
నలువకాని వశివదళ క్షేత్ర వరియింపద బ్జై—భార—

ధాతుస్వరూపనిరూపణము-స్వార్థక ధాతువులు

సూ:—తత్సమాచ్ఛేకభేదమున ధాతువులు రెండువిధములు. ౧

సూ:—సంస్కృతము లైనకొన్ని నామములును ధాతువులును ఇంచు
ఇల్లు-చేరుటచే తత్సమధాతువు లగును. ౨

సూ:—ఇంచు-ఇల్లు-ఇంప్-పర మగునప్పుడు అచ్చులకు సంధి యగును

ఉదా:—నుతి-నుతించు, కరుణా-కరుణించు, శయన-శయనించు, సంధి-
సంధిల్లు, భజ్-భజించు, రచ్-రచించు, మొద—

సూ:—కొన్ని సంస్కృతము లైననామములకును ధాతువులకును
అచ్ఛికధాతువులకును 'ఇంచు' పర మగునప్పుడు 'ఇయ్' వైకల్పిక
ముగా నగును. ౩

ఉదా:—(స్తుతి-) స్తుతియించు-స్తుతించు, (వస్-) వసియించు-వసించు,
గుణియించు-గుణించు, సృజియించు-సృజించు; నుతియించు-
నుతించు, స్మరియించు-స్మరించు, స్పృశించు, రచియించు-
రచించు; నగు-నగియించు-నగించు-మొ—

సూ:—'ఇంచు' పర మగునప్పుడు సంస్కృతధాతువులతుది-ఇ-ఉ-ఋ-వర్ణ
ములకు గ్రమముగా-అయ్-అవ్-అర్. ఆదేశము లగును. ౪

ఉదా:—జి-జయించు, స్రు-స్రవించు, లూ-లవించు, హృ-హరించు,
తౄ-తరించు, ఇట్లు ధృ-ధరించు-భరించు-స్మరించు-మొద—

సూ:—ఇంచు-ఇల్లు-పర మగునప్పుడు సంస్కృతధాతువులఉపధావర్ణము
లైన-ఇ-ఉ-ఋ-అనువానికి గ్రమముగా-ఏ-ఓ-అర్-బహుళము
గా నాదేశ మగును. ౫

ఉదా:—భిద్-భేదించు-భేదిల్లు, పుష్-పోషించు, వృధ్-వర్ధిల్లు-వృత్-
వర్తించు, ఇట్లు ఛేదించు-మోహించు-ద్వేషించు-బోధించు

వర్షించు-హర్షించు- మొద___బహుళ మనుటచే సృజికి రాదు-సృజించు. ఉపసర్గపూర్వమునకు వచ్చును. విసర్జించు-

సూ:___భ్వాదులు కొన్ని యుపసర్గలం గూడి తెలుఁగునఁ బ్రయోగింపఁబడును. ౨౩

ఉదా:___అనుభవించు-పరిభవించు-ఆలోచించు-విలపించు-అనుకరించు-ఆకర్షించు-సంతోషించు-ఆలోకించు- వ్యతిరేకించు-సంకోచించు సందేహించు-వికసించు- ప్రకాశించు మొదలయినవూహ్యములు

సూ:___రంజాదులకు స్వార్థమున 'ఇల్లు' చేరును. ౨౪

ఉదా:___రంజిల్లు-భాసిల్లు-విలసిల్లు-రాజిల్లు-వర్ధిల్లు-

సూ:___ఇల్లుతోఁ గూడిన తత్సమాచ్ఛిక ధాతువులు అకర్మకములగును. ౨౫

ఉదా:___భేదిల్లు-కంపిల్లు-రంజిల్లు; విలసిల్లు-సంధిల్లు-తారసిల్లు-ఓరసిల్లు దురపిల్లు-సంతసిల్లు-మొద___

సూ:___కొన్నియాచ్ఛికనామములకు స్వార్థమందు 'ఇల్లించు' లాగమము లగును. ౨౬

ఉదా:___సంతోస-సంతోసిల్లు, తెలుఁగు- తెలిఁగించు-ఇట్లు-పయనించు-సంతసించు-సంతసిల్లు-కౌఁగిలించు-కనికరించు-మొ___

సూ:___స్వార్థమందు 'ఇల్లించు'లతోఁ గూడినయాచ్ఛిక ధాతువులును కొన్ని గలవు. ౨౭

ఉదా:___తాలించు-సడ్డించు-ఓసరిల్లు - తత్తతిల్లు-పంకించు-ఆరగించు-ఉగ్గడించు___ఆలకించు- మొద___కొన్ని యనుటచే 'ఇల్లించులు' లేనిస్వార్థక ధాతువులే యధికముగాఁ గల వని తెలియునది.

ఉదా___వండు-తిను-పాడు-ఉండు-వచ్చు-తగు- తోఁచు-మొద___'ఇల్లు తుదఁ గల వన్నియును స్వార్థకములే యగును.

సూ:___కొన్ని తత్సమాచ్ఛికములకు ఇల్లించులు పర మగునప్పుడు

'గు' వర్ణము బహుళముగా నాగమ మగును. ౨౮

ఉదా:---చిత్తగించు-అడ్డగించు-బోరగిల్లు- సన్నగిల్లు-ప్రాఁతగిల్లు-చెమ్మగిల్లు-పంతగించు-ఓరగించు; కోపగించు -కోపించు, ఒప్పగించు-ఒప్పించు-పల్లగించు-పల్లించు-మొద.—

సూ:—'గు' వర్ణాగమము వచ్చునపుడు కొన్ని ధాతువులఉకారమునకు అకారము బహుళముగా నగును. ౨౯

ఉదా:—చేరు-చేరగిల్లు, ఒప్పు-ఒప్పగించు, తేలు-తేలగిల్లు, ఒత్తు-ఒత్తగిల్లు-బహుళమనుటచే దీని కికారము నగును. ఒత్తిగిల్లు-

సూ:—'ఇల్లు' ద్విత్వలకారము బహుళముగా లోపించును. 30

ఉదా:—రంజిలు-రంజిల్లు, చేరగిలు-చేరగిల్లు-మొ.—బహుళ మనుటచే విలసిల్లు-సంతోసిల్లు-మున్నగు కొన్నిటి కీకార్యము రాదు.

సూ:—కొన్ని యాచ్ఛికధాతువులనడిమి ఉకారము వైకల్పికముగా లోపించును. ౩౧

ఉదా:—కల్గు-కలుగు-మున్గు-మునుఁగు, నేర్చు-నేరుచు, ఎదుర్చు-ఎదురుచు, మొద—కొన్ని యనుట అతుకు-పిదుకు-కొలుకు-చదువు-మొదలగువానియందు లోపము రాదనుటకు. ఇది వాడుకనుబట్టి తెలియునది.

ప్రేరణార్థక ధాతువులు

సూ:—తత్సమాచ్ఛికముల కెల్ల ప్రేరణంబున 'ఇంచు' ఆగమ మగును, ౩౨

తత్సమధాతువులు స్వార్థేంచుతోఁ గూడినవి యిచ్చట గ్రాహ్యములు.

సూ:—ప్రేరణేంచు పర మగునపుడు వెనుక నున్నయేచకారమునకైనను పకారము బహుళముగా నగును. 33

ఉదా:—పోషించు-పోషింపించు, చూచు-చూపించు, నేర్చు-నేర్పించు,

మొలచు-మొలపించు, ఇచ్చు-ఇప్పించు; పండు-పండించు, కోయు-కోయించు, పాడు-పాడించు, మొద—పకారము మెచ్చునకు రాదు. మెచ్చించు-మెచ్చునకు వైకల్పికము-మెప్పించు-మెచ్చించు, ఈరూపమే పూర్వమందు వాడఁబడినది 'మెప్పించు' అర్వాచీనము.

"మెచ్చించినయాజగజెట్టియితఁడె—చేసినలిం గ్రాలఁగఁ గ్రీడసల్పునిను మెచ్చించున్ సుదిన్—భార, మెచ్చించెదవే నపుడు నిన్ను సేబాసంచున్—హర—

ఇట్లు విధి యున్నను తత్సమములమీఁదఁ బ్రేరణేంచు సర్వత్ర ప్రాప్యము గాదు. హరింపించు-గణింపించు-వంటి ప్రయోగములును గనరావు.

సూ;—ప్రేరణేంచు పర మగునపుడు కొన్ని తత్సమాచ్ఛికముల స్వార్థేంచు లోపించును. ౩౮

ఉదా:—రంజించు+ఇంచు= రంజించు= ఇట్లు భేదించు-సంధించు-మేళగించు-మొద—

సూ:—ప్రేరణార్థకము లైన-ఇంచు-చు-పు-లమీఁదఁ బ్రేరణేంచు వచ్చుటయుఁ గలదు. ౩౯

ఉదా:—అగు-కావించు-కావింపించు, చదువు-చదివించు-చదివింపించు, పూడు-పూడుచు- పూడిపించు, నేర్చు- నేర్పు- నేర్పించు-

సూ:—ఇకారాదిప్రత్యయములును ఏకారాదిక్రియావిభక్తులును పర మగునపుడు ధాతువులతోఁలియచ్చుమీఁది ఉకారమునకు ఇకారము బహుళముగా నగును. ౩౬

ఆగమప్రేరణార్థకము లైన-పు-చు - వర్ణములతోఁ గూడినవి కూడ నిందు చేరును. ఈసూత్రము అవ్యయములు క్రియలు క్రియాజన్యవిశేషణములు మున్నగు వాని రూపనిష్పత్తికిఁ గూడ నుపయోగించును.

ఉదా:—కడుగు-కడిగించు, మానుపు-మానిపించు, విడుచు-విడిపించు; అడుగు-అడిగి-అడిగెను-అడిగెడు-అడిగిన-చదివించెదవు - పిలిపింపుము- మొద—బహుళ మనుట ఇకారము రానిపూర్వప్రయోగములు గల వనుటకు—

ఉదా:—నిగుడు-నిగుడి-నిగుడించు, వెలుఁగించెదవు-మగుడించెను- వినుపించు కనుపించెను-కానుపింపక-ఎలుఁగించిన-పిలుపించు- వంటి ప్రయోగములు వ్రాఁతపుస్తకములందును ప్రాచీనముద్రణములందుఁ గూడఁ గలవు. ఈరూపములు తరువాత-నిగిడి-వెలిఁగించి-యనురీతిని-మాఱినవి-ఇవి యర్వాచీనములు.

సూ:—పూను మొదలగు వానికిఁ బ్రేరణమున-చు-ఇంచు-లాగమమగును. 32

ఉదా:—పూను-పూనుచు-పూనించు, ఇట్లు తేలుచు- తేలించు, కదలుచు-కదలించు- విదుల్చు-విదిలించు, మగుడుచు-మగిడించు, మొదలయినవి.

సూ:—పగులు మున్నగువానికి 'చు' వర్ణ మాగమ మగును. 33

ఉదా:—పగులు-పగులుచు, ఇట్లు మెదలుచు-వినుచు-మానుచు-మనుచు-విదురుచు- మొద—మానుపు-మనుపు - అనియు నగును. ఇకార మాదేశ మగుచో-పగిల్చి-వినిపించెను- మొదలగురూపము లగును.

సూ:—కను మొదలగువానికిఁ 'బ్రేరణేంచు పర మగునపుడు 'పు' వర్ణ మాగను మగును. 34

ఉదా:—కను+పు+ఇంచు=కనుపించు-ఇది పూర్వరూపము-ఇకారాదేశమున నర్వాచీనరూపము కనిపించు-ఇట్లు కాను-తిను-విను-కొను- మొద—

సూ:—ప్రేరణమునఁ గొన్ని ధాతువులకు-ఇంచు-చు-పు - వర్ణకములు

యథాప్రయోగముగా నగును-చు-పు-పర మగుచో ధాతువుల తుదివర్ణములు యథావ్యవహారముగా లోపించును. ౪౦

ఉదా:—అడఁగు-అడఁగించు-అడఁచు, ఆఁగు-ఆఁగించు-ఆఁపు, ఇట్లు కుడిపించు-కుడుపు, తొలఁగించు-తొలఁచు, (పాయు) పాచు-పాపు, ఉడిగించు-ఉడుపు, కదలించు-కదపు, మెదలించు-మెదపు, (చాఁగు) చాఁచు-చాఁపు, (ఊఁగు) ఊఁచు-ఊఁపు, చూపు-చూపించు, మేపు-మేపించు- మొద—

సూ:—'చు' వర్ణకము పర మగునపుడు-ఆడు-ఓడు-కూడు-ధాతువుల డకారమునకు రేఫ మగును. ౪౧

ఉదా:—ఆరుచు-ఓరుచు-కూర్చు-ఇంచు పర మగుచో, ఆడించు ఓడించు-కూడించు-

సూ:—కొన్ని యువర్ణాంతధాతువులకు-చు-పర మగుచో యువర్ణలోపమును వెనుకటి ఇకారమునకు ఉకారమును బహుళముగా నగును. ౪౨

ఉదా:—బిగియు-బిగుచు, తడియు-తడుపు, తెలియు- తెలుపు, మొద— బహుళమనుటచే బిగించు-బిగియించు-అనుచో 'ఇంచు' పర మగునపుడును 'యు' లోప మగును.

ప్రాచీనకాలమున అకారమధ్యమైన 'కలయు' 'కలియు'గా మాఱినది. కలసి-కలపెను-కలయఁదిరిగి-మున్నగురూపములు భారతాదులందు గలవు. ఇది వాడుకలో ఇకారమధ్యముముగామాఱి, కలిసి-కలిపి-కలిపెను.కలుపు-కలిపించు-మున్నగురూపములతో గ్రాంథికమైనది. ఇట్లు అకారమధ్యము లైన కొన్ని ధాతువులు ఉకారమధ్యములుగాను మాఱి గ్రాంథికము లైనవి. ఉదా—నడచు-నడుచు-మొ— ఇట్లే సకర్మక మైన 'కురియు' ప్రేరణరూపము కురియించు. ఇది యిపుడు కురిపించుగా మాఱినది. ఇట్లే ప్రేరణరూపములందు బహు

భేదములు కనవచ్చును. వానిని శిష్టవ్యవహారము ననుసరించి ప్రయో
గింపవలెను.

సూ:—ప్రేరణమున చెఱునకు-చు-పు-లును, పఱునకు-చు వర్ణకము
నాగమము లగును-అగుచో డకారమునకు శకటరేఫము
వచ్చును. ౪:

ఉదా:— చెఱుచు-చెఱుపు, పఱుచు-పఱు తుదఁ గలవానికి నగును
వెలుపఱుచు-చొప్పఱుచు-తేటపఱుచు-విశదపఱుచు-మొద-

సూ:—ఇంచు పర మగుచో వెలువఱు-చొప్పఱు-ల డకారమునకు
రేఫ మగును. ౪౫

ఉదా:— వెలువరించు—చొప్పరించు.

సూ:—రావించు మొదలైనవి యథాప్రయోగముగా గ్రాహ్యములు

ఉదా:—వచ్చు-రావించు, అగు-కావించు, ఉండు-ఉనుచు-ఉంచు,
పోవు-పుచ్చు,- పనుచు - పంచు - పంపు- - అనుచు - అంచు
అనుపు-అంపు-పంపించు-అంపించు-పోవుధాతువునకు ౧౧ రూప
ములుకలవు. ఇచ్చు-ఇప్పించు, చచ్చు-చంపు-చంపించు, నిలు
చు-నిలుపు-నిలువరించు, చినుఁగు-చించు-చింపు, తిరుగు-త్రిప్పు
తిప్పు, చొచ్చు-చొనుపు-నొప్పించు, నొచ్చు-నొంచు-నొంపి
చు-నొప్పించు, తెగు-తెంచు-తెంపు-త్రెంచు, తునుఁగు-తుం
చు-త్రుంచు, పెరుగు-పెనుచు-పెంచు, దిగు-దించు-దింపించు,
(మోఁకాలు) మోఁకారించు - మోఁకఱిల్లు-మోఁకఱించు,
(కేక) కేకరించు, (వ్రక్క-) వ్రక్కలించు, (పలవరము) పల
రించు (విన్నపము) విన్నవించు (ఆలక్షించు) ఆలకించు-ఆలిం
చు, తలఁగు (అంతర్భావితప్రేరణము) కొన్ని తత్సమములు
గూడఁ గలవు-ఆజ్ఞాపించు-విజ్ఞాపించు, స్థాపించు, వర్తమానిం
చు-ఇట్లనేకములు ప్రేరణమునందు రూపభేదము నొందినవి

క్రొత్తగాఁ గలిసినవియుఁ గలవు వీనిస్వరూపము లెఱుఁగుటకు వాడుకయే శరణము. ప్రేరణార్థకము లెల్ల సకర్మకములు.

సూ:—కోరు మొదలగు కొన్నిటికి ప్రేరణార్థకప్రత్యయము రాదు.

ఉదా:—కోరు-వేఁడు-మీఱు-చను-కసరు - కొసరు-ఇది యాకృతిగ ణము-ఏఁగుధాతువునకు ‹ఏఁగించు› రూపమును నన్నయార్యుఁ డు ప్రయోగించెను.

శబ్దపల్లవధాతువులు

సూ:—ధాతు నామావ్యయములతుదఁ జేరి కొన్నిధాతువు లర్థాం తరములను దెల్పును. అవియే శబ్దపల్లవము లనఁబడును. ౪౭

ఉదా:—కొంపోవు-పర్వడు-ఆపోవు-తలపోయు-వెలువడు - కూర్చుండు నిలుచుండు-పరుండు-పన్నుండు-అలముకొను, విజయముచేయు- విజయంచేయు-విచ్చేయు-వేంచేయు - ఈయకొను - ఈకొను - రక్కొను-మేలుకొను-మేకొను-మేలుకను - అరిగొను - ఈఁచఁ బోవు-ఇగ్గలాడు-ఈడేఱు-తగవులాడు!- కుతకుతలాడు - ఉల్లస మాడు-ఉరియాడు-పాటాఱు - ఐదుపదిసేయు - కనుఁబ్రాము - ఏపారు-కైసేయు-కైవ్రాలు-చేపట్టు- చేమోడ్చు-చెరలాడు-ఎఱ గొను-చక్కఁజేయు-ఎత్తువెట్టు-చవికొను-మొద—ఇట్టి వసం ఖ్యములుగా నున్నవి. వీనిరూపములనుబట్టియే ఆగమాదేశలో పాదులు గ్రహింపనగును.

సూ:—అగు మొదలగుకొన్నిటికి ‹తెంచు›అనుప్రయుక్త మగును దానితకారము దకార మగును. ౪౮

ఉదా:—అగుదెంచు-పోవుదెంచు-నెగయుదెంచు

సూ:—వచ్చుట యనునర్థమున అరుగు మొదలగువానికి ‹తెంచు› అనుప్రయుక్త మగు,ననుచో ధాతువుతుదివర్ణము వైకల్పికము గా లోపించును [illegible] దకార

మగును. ౪౯

ఉదా:—అరుగు-అరుదెంచు, ఏఁగు-ఏతెంచు, చనుదెంచు-మొద—

ఇప్పటికవులు కొందఱు వెళ్ళుటయనునర్థమున ఏతెంచు-చనుదెంచుధాతువు లుపయోగించుచున్నారు. అది తగదు.

సూ:—ద్విత్వమువిూఁది "తెంచు"తకారములకు ద్విత్వ మగును. తెంచు పర మగునపుడు చువర్ణము లోపించును. ౫౦

ఉదా:—చొచ్చు-చొత్తెంచు, పుచ్చు-పుత్తెంచు, వీచు—వీతెంచు. మొలచు - మొలతెంచు, నడచు - నడతెంచు, తోఁచు-తోఁతెంచు-మొద—

సూ:—క్రియాఫలము కర్తనుజెందుచో ధాతువునకు 'కొను'బహుళముగా ననుప్రయుక్త మగును. ఇదియే ఆత్మనేపద మనఁబడును. ౫౧

ఉదా:—వండుకొను - చదువుకొను- పుచ్చుకొను- వ్రాయించుకొను-మొ—బహుళమనుటచే క్రియాఫలముకర్తను జెందినను గొన్నిచోట్ల వైకల్పికముగ నగును. ఉదా వాఁ డిల్లు చేరెను-చేరుకొనెను. మొద—

సూ:—'కొను'పర మగునపు డెల్లధాతువులతుదిఉకారమునకు ఇకారము వైకల్పికముగ నగును. ౫౨

ఉదా:—వండికొనెను-వ్రాయించికొనెను-వ్రాయించుకొనెను. మొ—

సూ:—'కొను'పర మగునపుడు యువర్ణాంతధాతువులయకారమునకు సకారము బహుళముగా నగును. ౫౩

ఉదా:—చేసికొను-చేసుకొను-మొద—బహుళ మనుట యీసకాదేశము-ట-ను-పర మగునపుడు గూడఁ బూర్వకావ్యములఁ గనవచ్చుచున్న దనుటకు. యువర్ణాంతములకు ఇకారాదేశము నిత్య మని చిన్నయసూరి చెప్పెనుగాని పూర్వగ్రంథములందు

ఉకారముతోడి రూపములు గనవచ్చుచున్నవి.

"బలుతోలుకుళ్ళాయిపై నిన్నగోల్సెన,బట్టి జంబెంబు వేసుకొని విల్లు, రంగ ఛందఁ—కోసుక తింసునో, శుక—చేసుక-తెలుసుక-రంగరా—వ్రాసుటనుం జరుగ్భుజవిలాసము పూనినవేల్పు సత్య—ప్రోల్లాసము, రాజరా-చేసుటనో భవద్భాసురాంఘ్రి, వీరనా-మేసుటనుప్పక మింపఁగ। వ్యాసముహమ్మాని, శక్తి-ఏకుపాడమ్మలన్నియుఁ జెల్ప మాను,హరి—స్వ-సుందరుఁ డి: పుతోడఁ గలసుం బలనూదవ భోగభాగ్యుఁడై, ద్రావ—అసనము గడునడిగాఁ బోసుకొని, కవిజ-చ—లుసుచు మూర్ఛిలి తెలుసుక కళవళపడి లేచి, హంస—వేసు-కోసుక—చేసుక—పెస్య—ఖోట్ల నన్నవి.

సూ:—అనుప్రయుక్తమైన కొనుధాతువుక్త్వార్థకరూపమునకు -క-కు - అనునవి వైకల్పికముగా నాదేశములగును. అగుచో పూర్వమందున్న ఉకారమునకు ఇకారము రాదు. గిర

ఉదా:—ఎత్తుక-ఎత్తుకు, ఎత్తుకొని-ఎత్తికొని, తీసుక-తీసుకు,తీసుకొని-తీసికొని, మొద—"చండగతి నేగి యీడ్చుకు రెండిప్పుకు కడఁగి" మూర్త—(వ్రాఁతప్రతి) ప్రాచ్యలాక్షణికు లెవ్వరును 'కొనునకు' కవర్ణాదేశమును విధింపలేదు గాని హరికారికలలో "ఉత్తరస్య కొనో ధాతోః కం బుధాః కేచి దూచిరే" యనుసూత్రము గలదు. చేసుక-చదువుక- మొదలగు రూపములు లక్షణగ్రంథములందును పూర్వకావ్యములందును గూడఁ గనవచ్చుచున్నను చిన్నయసూరి కారూపము లిష్టములు గాకపోవుటచే నను శాసనము చేయలేదు.

సారది తుకారము గూడుక। నది నేఁబది యాయె, అనంతు—టకా। రము వెట్టుక సంధిఁ జెందఁ బ్రాణముతోడనే, అప్పక—గిరతం జెప్పక క్రోలఁగాఁ దలఁచితే, రామా, వలఁ బడి చిక్కు-టొండె వల ద్రెచ్చుక పొవుట యుండె, పంచత—శరభుల్ చుట్టుక ముమ్మొహరూ త్తమున, జైమిని—ఒగి నేను తల పోఁచి యొం డెద్దు పెట్టుక, షట్చ—సుత్రాముఁ బట్టి యీడ్చుక వచ్చి, రాజశే—చెట్ట పట్టుక యేలిఁట్టిదెట్ల, ఆం-భా-అహం కారము మీఱఁగ ంకణము గట్టుక యుం

డడు, సుభ-కొఁగవాల్ను అనులంగరులఁ బట్టుక-అను-ఇకుక-పట్టుక-సుక్రి-అప్ప ఇట్లు వందలకొలఁది ప్రయోగములు కలవు.

ఎత్తుక-తీసుక-వంటిరూపములు చిరకాలముగా దక్షిణమండలములలో వాడుకయందున్నట్లే ఎత్తుకపోయెను-పట్టుకవచ్చె నన్నట్లుగా కువర్ణాదేశము వచ్చినరూపములును బహుకాలముగా నుత్తరమండలముల వాడుకలో నున్నవనుట విదితము-సాధుత్వమునందు వానికిని వీనికిని భేదము లేదు. పూర్వలాక్షణికు లంగీకరింపక పోయినను అవి కవిప్రయుక్తములై గ్రాంథికములైనవి. వానివలె నివియుఁ బహుప్రయోజ్యములై గ్రాంథికములు కాఁదగును. ఇప్పటికవులు కొందఱు "ఎత్తుకుపోతివి-తీసుకుపోయెను" అనరీతిని ప్రయోగించుచున్నారు.

సూ:—సకర్మకములైన తుమున్నంతరూపములపై కర్మార్థమందు 'పడు' అనుప్రయుక్తమగును. ౧౬౩

ఉదా:—చేయఁబడు-రచియింపఁబడు-నిర్మింపఁబడు-కొట్టఁబడు. మొ- సకర్మకములమీఁద వచ్చినను 'నాచే నన్నము తినఁబడెను' నంటిప్రయోగములు తెలుఁగున లేవు. అకర్మకములపై 'పడు' చేర్చి "వానిచే రాఁబడెను-వీనిచేఁ బోఁబడెను" అన్నట్లు ప్రయోగింపరాదు.

సూ:—కొన్నితుమున్నంతరూపములపై భావార్థమందు 'పడు' చేరును. ౧౬౪

ఉదా:—అది కనఁబడదు. నీమాట నాకు వినఁబడదు. ఎద్దు తిరుగఁబడెను-ధృతరాష్ట్రునకు వారలమత మనుష్ఠించుంగాక మఱి బడునే ఇత్యాదులు.

సూ:—పడు-కొను-కొన్నిటికి స్వార్థమందే వచ్చును. ౧౬౫

ఉదా:—నిలువఁబడు-చొరఁబడు-కూడఁబడు-చేరఁబడు- పండుకొను పడుకొను-పేరుకొను (గడ్డకట్టు) మొద—

సూ:—నశించుట యర్థము గల-అను-ఏను-ధాతువులు నామవాచకములపైఁ జేరి యభావద్యోతకము లగును. ౫౯

ఉదా:—సిగ్గులు-ఉక్కులు-సూపలు-పొలుపలు - ఏపలు - పెపలు; పేంపేను-సుఖమేను-చలమేను-భయమేను- మొద—

'పారం బేవనింతి' మొదలగుచోట్ల ఏను ధాతువునకు కలుగుట యర్థము-ఏవని=లేని. రఘువమాలు నేదిరి దాటల్—మొదలగుచోట్ల పెంచుట యర్థము.

క్రియాజన్యవిశేషణములు.

సూ: భూతార్థమునందు ధాతువునకు 'ఇన' వర్ణక మాగమ మగును

ఉదా:—వచ్చు+ఇన-వచ్చిన, చేయు+ఇన=చేసిన, ఇట్లు ఇచ్చిన-చేసికొనిన-తెలియఁబడిన- మొద—

సూ:—వ్యతిరేకార్థమున 'అని' వర్ణక మగును. ౬౦

ఉదా:—ఉండు+అని=ఉండని, ఇట్లు చేయని-వెళ్ళని-రాని-పోని-ఈని-చూడని-మొద—

సూ:—వర్తమానార్థమున ధాతువునకు 'ఉన్న' వర్ణక మగును-అగుచో 'చు' వర్ణ మాగమ మగును. ౬౧

ఉదా:—చేయు+చు+ఉన్న=చేయుచున్న-ఇట్లు కోరుచున్న-వచ్చుచున్న-కనుచున్న- మొద—

సూ:—భవిష్యదర్థమందు 'కల' వర్ణక మగు నగుచో 'అన్' ఆగమ మగును. ౬౨

ఉదా:—చేయు+అన్+కల=చేయఁగల-ఇట్లు పాడఁగల-కొనఁగల-పెట్టఁగల- మొద—

సూ:—తద్ధర్మార్థమందు-ఉ-ఎడు-ఎడి-వర్ణకము లగును. ౬౩

వచ్చు+ఉ=వచ్చు, వచ్చెడు-వచ్చెడి-ఇట్లు-చేయు - ను -చేసెడు చేసెడి-తిను-తినెడు-తినెడి- మొ—

కేవలధాతువు క్రియాజన్యవిశేషణమగు నసుట యుచితము

కాదు కావున 'ఉ' వర్ణకముకూడ వినింపఁబడెను.

ఇంతలి ఏకవర్ణకము వాడుకలో ఏటి-ఏ-అనురూపములకు మాఱినది. ఈరూపములు మూఁడునునలయే౦డ్లనుఁ బై కాలమునుండియు నాయాకవులయాదరము గాంచి గ్రాంథికము లైనవి.

,, పెద్దలు తెద్ద నమ్మి నయి దాఁచేవానికిన్, పాండు-అనేటి-మ్రింగేవానికిన్, మక్కొం-మ్రింగేవానికిన్, ప్రబోధ-ఉండేవారలు, చెన్నబస-మెలిగే, ప్రమలిం-ఆశ్రయించె, కవిసార్వ - అనెభావంబు, శశాం-పోయేటి—అనే-అనేటి-వాహాయ్యేటి-ఏలేటి, హంస-చెప్పేనేనుపు, శ్రీరంగమా—గోఁబోయేటి, ఉ. నై-వాహాయ్యేటి, అప్పక-వోసివేసి- పాపాలందోలేటి, రఘు-క-పూజించేఫలంబు, చంపూరా-ఆరగేపత్యులు-పాకేచీమలు, రంగరాయ- చెలఁగఁగనుండేవారివన్నన్-రామరా-

ఇట్లనేకములు కలవు. కావునఁ బూర్వలక్షణసమ్మతములు గాక గ్రాంథికములై యున్న యితర బహుప్రయోగములవలెనే యివి యును గ్రాహ్యములు గా ననుట యుచితము.

సూ:—క్రియాజన్యవిశేషణములకు విభక్తి వివక్షించునప్పుడు మహదర్థమునందు 'వాఁడు' మహత్యమహదర్థములందు 'అవి' అను శబ్దము లన్వయము క్తము లగును. ౬౪

ఉదా:—చేసినవాఁడు-చేసినది, ఉండనివాఁడు-ఉండనిది, పోవుచున్న వాఁడు- పోవుచున్నది, కోరువాఁడు-కోరెడువాఁడు-మొద— ఇవి విశేషణము లగును.

సూ:—ఇన- ఉన్న- కల- వర్ణకములు తుదఁ గలధాతువులమీఁది వాఁడు-వారు-శబ్దముల వకారము వైకల్పికముగా లోపించును ఈక్రిందిరూపములలో అకారసంధి నిత్యముగ నగును.

ఉదా-౧

వాఁడు చదివినవాఁడు-చదివినాఁడు *

వారు చదివినవారు-చదివినారు *

వాఁడు చదువుచున్న వాఁడు-చదువుచున్నాఁడు
వారు చదువుచున్నవారు-చదువుచున్నారు
వాఁడు చదువఁగలవాఁడు-చదువఁగలాఁడు
వారు చదువఁగలవారు-చదువఁగలారు

కా. ప్ర. ౫౫ సూత్రముచే.వు-రు-ను-ము-అనునవియు వానికి వెనుక 'అ' కారమును ఆగమము లగును.

ఉదా;—౨

నీవు చదివినఁవాఁడవు-చదివినాఁడవు *
మీరు చదివినవారరు-చదివినారరు *
నేను చదివినవాఁడను-చదివినాఁడను *
మేము చదివిన వారము-చదివినారము *
నీవు చదువుచున్న వాఁడవు-చదువుచున్నాఁడవు
మీరు చదువుచున్న వారరు-చదువుచున్నారరు
నేను చదువుచున్న వాఁడను-చదువుచున్నాఁడను
మేము చదువుచున్న వారము—చదువుచున్నారము
నీవు చదువఁగలవాఁడవు-చదువఁగలాఁడవు
మీరు చదువఁగలవారరు-చదువఁగలారరు
నేను చదువఁగలవాఁడను-చదువఁగలాఁడను
మేము చదువఁగలవారము-చదువఁగలారము

ఉదా:—౩

ఇట్లు మహతి వాచ్య యగునప్పుడు, అది-వారు శబ్దములును అమహత్తు వాచ్య మగునప్పుడు అది-అవి శబ్దములును ఏకవచనబహువచనములఁ జేరును-అప్పు డీక్రిందిరూపము లగును. అకారసంధి నిత్యము. స్త్రీ, చదివినది*-చదువుచున్నది- చదువఁగలది-బహువచనరూపములు వెనుకటిరూపములవలెనే యుండును.

చిలుక, చదివినది*చదివినవి, చదువుచున్నది-చదువుచున్నవి, చదువఁగలది-చదువఁగలవి.

మొదటిగుంపులో నిప్పువ్రాసినట్లు గలరెండురూపములును వకార లోపమునఁ బ్రథమపురుషక్రియలుగా మాఱినట్లుకనఁబడుచునే యున్న వి. అవి క్రియలుగాఁ బూర్వకావ్యములందును గనఁబడుచున్నవి. ఇఁక రెండవగుంపులో నిప్పువ్రాసినట్టు గలవి వాడుకలో -డ-ర-వర్ణములు లోపింపఁగా—చదివినావు-చదివినారు, చదివినాను-చదివినాము-అను నట్లుమధ్యమోత్తమపురుషక్రియలుగా మాఱి యట్లే స్థిరపడి పూర్వ కావ్యముల కెక్కినట్లు ప్రయోగములు మున్నే చూపఁబడినవి. కావునఁ దొలుత రెండవపట్టికలోఁ జేర్పఁబడిన్న అవ్యతీతభూతకాల క్రియావిభక్తులయొక్కయు క్రియారూపములయొక్కయు సంప్రదాయ మిది యని గ్రహించునది.

భా వా ర్థ క ము లు.

సూ:—ధాతువునకు భావార్థమునందు 'ట' వర్ణకమును వ్యతిరేకభావార్థ మునందు 'అమి' వర్ణకమును ఆగమమ్ములగును. ౬౬

ఉదా:—వండుట-వినుట-చేయుట; వండమి-వినమి-చేయమి- మొ—

ఇవియు నీక్రిందఁ జెప్పఁబోవునవియు నగుభావార్థకము లెల్ల భావార్థకనామవాచకము లనఁబడుచు వాక్యములందు కర్త లగుచున్నవి.

సూ:—అనుప్రయుక్తమైనకొనుధాతువునకు వైకల్పికముగా 'కోలు' ఆదేశ మగును. ౬౭

ఉదా:—వేఁడుకోలు-వేఁడుకొనుట, పుచ్చుకోలు-పుచ్చుకొనుట, మొ.

సూ:—'ట' వర్ణకము పర మగునప్పుడు 'ఉండు' దువర్ణకమునకు లోప మును, అనుమొదలగువానిను వర్ణమునకు నిండుసున్నయు వైకల్పికము. ౬౮

ఉదా:—ఉంట-ఉండుట, అంట-అనుట, వింట-వినుట, కొంట-కొనుట కంట-కనుట, తింట-తినుట; చాట-చనుట, మన ధాతువులకు రాదు. మనుట, నన్నయభారతములో నీరూపములు లేవను కారణమున అధర్వణాహోబిలులు అంట-కొంట-మొదలయి నవి యప్రయోజ్యము లనిరిగాని తిక్కనాదిప్రాచీనులు వీనిని ప్రయోగింపక పోలేదు.

అర్వాచీనులు వాడక మానలేదు. కొన్నియెడల లాక్షణికుల దారి వేఱు కవులదారి వేఱు నను ననుటకిది యొక దృష్టాంతము. కవులు లోకము ననుసరింతురు.

"ఘనము నడిరి వాకిదం బిలుసుమార్చన వట-పాలికల వినిగంటనిధానం బుగంట గాదే సనసన్—సుజనవస్త్రల నీ విటు లంట-పరికాంతి యునక్చకొంట యున్-పాడన్నపాలుపాలు కైకొంటము చాలు కుంచెలు దింట భోగిపల నెజింగి' భార, తొంటికథలయందు చెప్పఁగా వింట గలను-వంట నియుర మానక చంట దగునె, సార—ఇట్లు బహుప్రయోగములు సర్వత్ర గలవు.

సూ:—కొన్ని ధాతువుల 'ఇంచు' చువర్ణమునకు భావార్థమున 'పు' వర్ణక మాదేశ మగును. ౬౯

ఉదా:—ఆగించు- ఆగింపు- ఇట్లు బెదరింపు- తెగింపు- ముగింపు- తాలింపు-సడ్డింపు-ఊరేగింపు-చాటింపు- దండాడింపు-నశింపు- మందలింపు-సాదింపు-రెట్టింపు-పట్టింపు-మొద—

సూ:—ధాతువునకు భావార్థమందు "అడ" ప్రత్యయము నాగమ మగును. ౭౦

ఉదా:—చెక్కు+అడ= చెక్కడము-ఇట్లు మెట్టడము- ప్రేలడము- కేడము - కలపడము- కాపడము- మొద—'అడ' యొక్క పూర్వరూపము 'అట'

ఉదా-—ఇఱుకు+అట=ఇఱుకటము-ఇట్లు త్రవ్వటము మొద— కాని లాక్షణికులు కొందఱు 'అడ' ప్రత్యయమునే విధించిరి

‘ చెక్కుట’ వంటి టప్రత్యయాంతములు గ్రంథములందే కాని వాడుకలో నెక్కడను లేవు. చెక్కడము వంటి అడప్రత్యయాంతము లెల్లెడల వాడుకలో నున్నవి. అక్కడక్కడఁ గావ్యములలో నున్నవి. కావునఁ బ్రయోగవ్యవహారసిద్ధము లైనయివి యసాధువు లనుట యుచితము గాదు. నన్నెచోడుఁడు “ కోపును-చెఱుపు-ఏచుడు- మొదలుగా భావార్థకము లైన డుప్రత్యయాంతములను బ్రయోగించెను. ఇట్టి వితర కావ్యములఁ దఱచుగాఁ గానరావు.

### ధాతువులమార్పులు

అవ్యయప్రకరణమందును క్రియావిభక్తులపట్టికలందును తమ వాతను విధింపఁబడిన-ఇ-ఎ-అ- మొదటఁ గలప్రత్యయములును, తక్కిన హలాదిప్రత్యయములు కొన్నియుఁ బర మగునపుడు ధాతువులకు వచ్చుమార్పులు చెప్పఁగా మిగిలినవాని నిందు సూచించుచున్నాను. ము న్నుదాహరించినవి కూడఁ బ్రకరణవశమునఁ గొన్ని వచ్చు చుండును. అను క్తము లయిరూపముల నుదాహరించినవానినిబట్టి గ్రహించునది.

సూ:—ఇకారాదులు ఎకారాదులు నగుప్రత్యయములు పర మగునపుడు - అగు - పోవు - ధాతువులతుదిహల్లునకు యకారము వచ్చును. ౨౨

ఉదా:—అగు+ఇ=అయు+ఇ=అయి, పోవు+ఇ=పోయు+ఇ= పోయి. అయినన్-అయిన-పోయినన్-పోయిన.

సూ:—ఎకారాదిప్రత్యయములు పర మగునపుడు, అయి-అయు-ల అకారమునకు దీర్ఘముగాని యకారమునకు ద్విత్వము గాని వచ్చును. ౨౩

ఉదా:—ఆయెను-అయ్యెను-ఆయెనున్-అయ్యెనున్-ఆయెడు-అయ్యెడు ఆయెదరు-అయ్యెదరు-మొద—అగుపోవులకు విధించినయకా

రము సకారము కాదు.

సూ:—అచ్చతెనుఁగునందలి-అయి-అవు-లకుఁగ్రమముగా-ఐ-ఔ-లు బహుళముగా నాదేశము లగును. ౭౪

ఉదా:—అయి-ఐ, అవు-ఔ, కయి-కై, కవుఁగిలి-కౌఁగిలి, పయిడి-పైడి, చవుడు-చౌడు, కయిత-కైత, చవుతి-చౌతి, పయికము-పైకము, అవుదల-ఔదల, మొద— కొన్నిటిలోని 'అయి' 'ఐ' గా మాఱుటయుఁ గలదు. పయనము-పైనము, బయలు-బైలు-మొద—

అగు-పోవు-ధాతువులభూతకాలరూపములు-అయ్యెను-ఆయెను, అయిరి-ఐరి, అయితివి-ఐతివి, అయితిరి-ఐతిరి, అయితిని-ఐతిని, అయితిమి-ఐతిమి, పోయెను-పోయిరి,

సూ:—'తి' వర్ణకము పర మగునపుడు 'పోయి' యివర్ణము వైకల్పికముగా లోపించును. ౭౫

ఉదా:—పోతివి-పోయితివి, పోతిరి - పోయితిరి, పోతిని - పోయితిని, పోతిమి-పోయితిమి.

సీతా రామసుతా విడి! పోతే సుకుమార,లంకా—కటకట మోసపోతిఁ గదా కన్నను మూయము మటన్న—సానం—ఇట్టిప్రయోగము లింకను గలవు. యివర్ణలోప రూపము లర్వాచీనములు. ఇప్పటివారనేకు లీరూపములను గావ్యములఁ బ్రయోగించి యున్నారు.

అ. ప్ర. ౯౯ సూత్రముచే యువర్ణాంతములకు తీసి-తీసిన-తీసెదవు-మున్నగు రూపములును, ౨౧ సూత్రముచే చువర్ణాంతములు కొన్నిటికి పిలువక-పిలువన్-పిలువఁడు - మున్నగురూపములు నగును.

సూ:—అకారాదిప్రత్యయములును మధ్యమపురుష-ము-డు- వర్ణకములును పర మగునపుడు-చే-ఇంచే-ల చేకారమునకును, తలఁచు

మున్నగు కొన్ని ధాతువుల చేకారమునకును పకారము బహుళముగా నాదేశ మగును. ౨౯.

ఉదా:—అణఁచు, అణఁపక-అణఁపన్-అణఁపని-అణఁపఁగలఁడు-అణఁపఁగలదు-అణఁపఁడు-అణఁపకుము-అణఁపుము-అణఁపుడు-అణఁపమి-ఇట్లే-పోషింపక-పోషింపన్-పోషింపుము-మొ॥— ఇట్లే, తలఁచు, తలఁపక-తలఁపన్-తలఁపఁగలఁడు-తలఁపుము-మొద-ఇట్లు, కలఁచు-రేఁచు-నలచు-కఱచు-చాఁచు-వేఁచు; భరించు-హరించు-ఊహించు-చేయించు-రప్పించు; మొద—బహుళమనుటచే, హెచ్చు-మెచ్చు-దోఁచు-నోఁచు-ఎంచు-మించు-మొదలగు కొన్నిటి చకారమునకు వకారపకారములు రెండును రావు. ఏఁచునకు పకారము వైకల్పికము-ఏఁపక-ఏఁచక మొ—విఱుచు మొదలగు కొన్నిటిప్రేరణచువర్ణమునకు వకారము వచ్చును-విఱువక-విఱువన్-మొ—, 'అడ' ప్రత్యయ మకారాదులలోఁ జేరును. కాఁచు-కాఁపడము, వేఁచు-వేఁపడము, ప్రోచు-ప్రోవడము-ఇత్యాదు లూహ్యములు.

మఱియును గొన్ని తత్సమధాతువుల 'ఇంచు' చకారమునకును, కొన్ని యాచ్ఛికధాతువుల-చు-ఇంచు-లచకారమునకును పకారము రానిప్రయోగములు వందలకొలఁదిగా భారతేతరకృతులందు కలవు కావున పకారము చేయనిప్రయోగము శ్రావ్య మగుచోఁ జేయకపోయినను దోషము లేదు.

క్రించు వెడవింటిజోదు జయించరాదు, పరాహ—మించి వారాశి లంఘించఁగలఁడె, రాజశే—స్వామి తానకభుక్తశేషము భుజించంగల్గి—చెన్నబ—నొంచెఁగన్నార వీక్షించ లేక, చంద్రభా—సరసత్వం బని ప్రాజ్ఞులార నిరసించం బోకుఁడీ, ఉ—రా—సమ్మతించ కాడినపగ చెప్పకొంచు మించి, కువల—నిశ్చయించలేక మోము వంచి నడుచు, భోజరా—సూచించఁగఁ దాను భాస్కరుని చెన్ను వహించెను, ప్రభావ—నీవు నరింతువో నరించవో యని యెన్నుచుం గుడిబుజం బదరన్, ఇందు—ఊహించ

నొకనాల్గుగడియలు సంచారము, కళా-గొంచె మనక చిత్తగించవలయు, కృష్ణరా-మంచివి మీ రీసతిఁ బోషించుండని, దశా-మోము దమ్మి దీపించమి, వసు-ఎంచి చూచిన మదివిశ్వసించ రాదు, షట్చ-నించ నల్లునిఁ బ్రతిష్ఠించ దేని, బహులా-చంచరీకము ఝుంకరించ పెటిచు, కకుత్స-సకియా సమదిలోనికోరికి ఘటించన్ లేక, చంద్రభా-చంచలాకార నిర్జించఁదగునె, భానుమ-మించి తగినట్టిబుద్ధి చెప్పించవచ్చు, శుకస-జ్వాలనావాఙ్ముఖమై తపంబు సవరించఁగా సాఁగె, వసు-ప్రతిజ్ఞ చేసిన నట్లకావించఁ బాల్పడి, రుక్మా-ఇచ్చిన కేల పుట్టించఁ డయ్యె, సిలా-శంఖమును గాఁగ సుదుడు గూర్చంగవలయు, పద్మ—పఱచవై సంతోషపఱచ వైతి, పాండు—విలోకించి ప్రార్థనము గానించవలయు, ప్రబోధ—ఈవు వచ్చి గద్దించఁగ నేమికారణము, చంద్ర—ధీశు వచ్చుచు వెసఁబొమ్ము నమ్ము మనుచుం గదలెన్, కళా—ఇట్లే యతిప్రాసస్థానములందు—తోఁచక-దాఁచుము-తీర్చుము-తలఁచుము-తెరించన్-పోరించన్-మొదలగునవి యనేకతత్సమాచ్ఛికములు పకారరహితములై కనవచ్చును

సూ:—అకారాదిప్రత్యయములు పర మగునపుడు - అగు - వచ్చు-చొచ్చు-చూచు-ఇచ్చు-తెచ్చు-లకుఁ గ్రమముగా, కా-రా-చొరు-చూడు-ఈ-తే, తేరు-లగును, అగుచోఁ బ్రత్యయముల మొదటియచ్చు లోపించును. 22

ఉదా:—అగు+అక—కాక, కాన్-కాఁగల-కాఁగలఁడు - కాఁగలరు-కాఁడు-కాదు-కాకుము-కాఁకుఁడు-కామి-మొద—ఇట్లే రాక-రాన్, చొరక-చొరన్, చూడక-చూడన్, ఈక-ఈన్, తేక-తేన్, తేరక-తేరన్-మొదలగునవి గ్రాహ్యములు.

ఇచ్చున కీపట్టున నన్నయార్యుఁడు 'ఈ' కారము చేసి ఈన్-ఈఁడు-ఈను-ఈకుండెను అనునట్లు ప్రయోగించెను. తరువాతివారు కొందఱు 'ఈయు' ఆదేశము చేసి "ఈయక-ఈయన్-" మున్నగు రూపములను, మఱికొందఱు 'ఇయ్యు' ఆదేశముచేసి ఇయ్యక-ఇయ్యని-ఇయ్యన్-మున్నగురూపములను, మఱికొందఱు 'ఇవ్వు' ఆదేశము చేసి ఇవ్వక-ఇవ్వన్-ఇవ్వరు-మున్నగు రూపములను వాడిరి. తుది దానికిఁ బ్రయోగములు

దేవర వివరంబు లెఱువరి లేలవరి యెవ్వరు నివ్వరు నవ్వ రనఁగ, ఆప్పక—
2—196 ఇవ్వఁ దవ్వల నీక నేమి అవ్వ పలుక, రంగరా—2—ఇవ్వలేను,
మర్యాదరా—ఈప్రయోగములనుబట్టియు లోకప్రసిద్ధవ్యవహారమునుబట్టియు ఆకా
రాదిప్రత్యయములు పర మగునపుడు ఇయ్యు వలెనే ఇవ్వు కూడ నాదేశ మగుట
దోషము గా దని తోఁచుచున్నది.

సూ:—ఏతెంచు మున్నగువానిలోని తెంచునకును-తే-తేఱ-లగును.

ఉదా:—ఏతేక-ఏతేఁ-ఏతేఁడు-ఏతేరక-ఏతేరన్ - ఏతేరఁడు - మొ—

ఇట్లు అరుగుదెంచు-చనుదెంచు-మొద—

సూ:—ము-డు-పర మగునపుడు-కా-రా- ఈ- తే-పో-లే-కో-వర్ణముల
దీర్ఘమునకు హ్రస్వమును, ముువర్ణకమునకు ద్విత్వమును, డువ
ర్ణకము వెనుక నుండునరసున్నకు సంశుపున్నయు నగును. ౭౯

ఉదా:—కమ్ము-కండు, రమ్ము-రండు, ఇమ్ము-ఇండు, తెమ్ము-తెండు,
పొమ్ము-పొండు, లెమ్ము-లెండు-కొమ్ము-కొండు, ఇట్లు-పుచ్చు
కొమ్ము-పుచ్చుకొండు-మున్నగునవియు, అరుగుదెమ్ము-అరుగు
దెండు-మున్నగునవియు నగును.

సూ:—మఱియొకశబ్దముతోఁ గలియునపుడు 'కాన్' లోని దీర్ఘము
వైకల్పికముగా హ్రస్వ మగును. ౮౦

ఉదా:—చేయఁగన్-చేయఁగాన్, సరిగన్-సరిగాన్- మొద—

సూ:—ము-డు-పర మగునపుడు అగునకు కాదేశము వైకల్పికముగాఁ

ఉదా:—కమ్ము- అగుము- కండు- అగుఁడు- వకారము- ఔకారము
చేయఁగా, అవుము-అవుఁడు-ఔము-ఔడు-అనియు నగును.

సూ:—అగునకు-కా-కావు-మఱియొకచోటను గనవచ్చును. ౮౧

ఉదా:—కాతన్-కావుతన్—అగుతన్, కావుట-అగుట.

సూ:—అకారాదులు, దకారాదులు, ము-డు-ప్రత్యయములు పర
మగునపుడు 'పోవు' వువర్ణమువైకల్పికముగ లోపించును.
లోపించుచో, అజాదిప్రత్యయములతోలియచ్చు లోపించును.

ఉదా:—పోవు, పోక-పోక్-పోని-పోఁగలఁడు-పోఁడు-పోదు;పోదురు-పోదువు- పోదును- పోదుము; పోకుము-పోకుఁడు, పొమ్ము-పొండు, పోమి- మొద—పక్షమున- పోవక- పోవక్- పోవని-మొదలయినరూపము లగును.

సూ:—ము-డు-పర మగునపుడు పోవునకు-పొద-పద-ఆదేశ మగును

ఉదా:—పొదము-పొదఁడు, పదము-పదఁడు- ఈకడపటిరూపములు-పద-పదండి-యని కావ్యములందు వ్యవహారమునందు నుపయోగింపఁబడుచున్నవి.

సూ:—అకారాదిప్రత్యయములు-ము-డు-వర్ణకములును పర మగునపుడు-చచ్చు-నొచ్చు-లకుఁ గ్రమముగా-చా, నో-నోవు-బవాళముగా నాదేశము లగును. ౮౫

ఉదా:—చాక-చావక, చాన్- చావన్- చాఁగలఁడు- చావఁగలఁడు, చాకుము-చావకుము, మొద—ఇట్లే నోక-నోవక-నొవ్వక, నోన్-నోవక్-నొవ్వన్-మొద—బహుళమనుటచే-అఁడు-అదు మొదలగుకొన్నితద్ధర్మార్థకక్రియావిభక్తులును, ము-డు-ప్రత్యయములును, అని-అమి-వర్ణకములును పర మగునపుడు, చా-నో-వచ్చినప్రయోగములు గ్రాహ్యములు గావు. కావున నట్టి యెడ రాఁదగవు. ఉదా-చావఁడు-చానరు-చావుము-చావుఁడు చావని-చావమి,నోవఁడు-నొవ్వఁడు-నోవరు-నొవ్వరు-నోవమి-మొ—తక్కినరూపములను గ్రహించునది.

సూ:—అను-కను-లకుఁ గ్రమముగా,నా-కాను-వైకల్పికముగ నగును. ముఁడు-పర మగుచోఁ గావు. ౮౬

ఉదా:—నాక-అనక, నాన్-అనన్, నాఁగల-అనఁగల, నాఁడు-అనఁడు, నాకుము-అనకుము, నాని-అనని, నామి-అనమి, మొద—ఇట్లే కానక-కనక-కానమి-కనమి- మొద—అనుము-అనుఁడు-

కనుము-కనుఁడు-

సూ:—నేర్చు (నేరుచు) ధాతువునకుఁ గొన్నిభూతార్థములును, తద్ధర్మార్థకములును పర మగునపుడు శేషలోపమును, అకారాదులు, ము-ను-పర మగునపుడు చులోపమును బహుళముగా నగును. ౮౭

ఉదా:—నేచినన్-నేర్చినన్, నేచిన-నేర్చిన, నేచెను-నేర్చెను, నేచును-నేర్చును. నేరక-నేర్వక, నేరఁగ-నేర్వఁగ, నేరఁడు-నేర్వఁడు-నేరను నేర్వను, నేరకుము-నేర్వకుము, నేరకుఁడు-నేర్వకుఁడు-మొద—బహుళమనుటచేఁ బూర్వలాక్షణికులు విధించినను, నేచి-నేచెడున్-నేరుము-నేరుఁడు-మున్నగురూప ము లిపుడు గ్రాహ్యములు గావు. ము-డు-పర మగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తముగా, నేర్చుకొనుము-నేర్చుకొనుఁడు-అనియే ప్రయోగించుట శ్రుతిరమ్య మగును. మఱియు 'నేర్చు' అనుప్రయుక్తమగుచోఁ 'చేయనేరఁడు-చూడనేరను-అనునట్లు నిత్యముగా, చువర్ణలోపము చేయుటయు నుచితము.

సూ:—అనుప్రయుక్త మైనకొనుధాతువునకు అకారాదులు ము-డు-ప్రత్యయములు పర మగునపుడు 'కో'యాదేశము వైకల్పికము. ౮౮

ఉదా:—కైకోక-తీర్చుకోన్-కైకోవు-కైకోఁడు-పుచ్చుకో-కైకోని-మొద—పక్షమున-కైకొనక-తీర్చుకొనక-తీర్చుకొనన్-మొద. వ్యస్తమగునపుడు 'కొను' నకు కోయాదేశము కనవచ్చును-"కామముం జీరికిఁ గోక క్రోధము నహంకారంబు" హర—జన్వనంబిచ్చిముదిమిఁ గోఁ జాల మనుచు" విష్ణు,ఇట్లు-మేలుకొ చేయించుకోన్-తాగోర్ఁ-మొద—

సూ:—పిలుచు మొదలగుకొన్నిటితుదివర్ణము బహుళముగా లోపించును. ౮౯

ఉదా:—పిలక-పిలువక, పిలక్-పిలువన్-పిలుఁడు-పిలువఁడు-పిలకుము-పిలువకుము,పిలుము-పిలువుము- మొద—బహుళమనుటచే అని-అమి-పర మగుచో లోపము రాదు. పిలువని-పిలువమి-ఈలోపమును వాడుకనుబట్టి చేయుట యుక్తము-ఇట్లు-నిలుచు-తలఁగు- మొ—

సూ:—ము-డు-పర మగుచో లేచునకు లే యగును. ౯౦

ఉదా:—లెమ్ము లెండు.

సూ:—ఉండుట యర్థము గలకలుగుధాతువునకు వ్యతిరేకతద్ధర్మక్రియావిభక్తులును-అక-అను-అని-అమి-వడి- వర్ణకములును పర మగునపుడు 'లే' ఆదేశ మగును. అజాదిప్రత్యయములతోలి యచ్చు లోపించును. ౯౧

ఉదా:—లేఁడు-లేరు, లేదు-లేవు; లేవు-లేరు, లేను-లేము; లేక-లేన్-లేని-లేమి-లేవడి.

సూ:—'వడి' తప్పఁ దక్కినపైప్రత్యయములు పర మగుచో వలచునకు ఒల్ల యగును. ప్రత్యయముతొలియచ్చు పోవును. ౯౨

ఉదా:—ఒల్లఁడు-ఒల్లరు, ఒల్లదు-ఒల్లరు, ఒల్లవు-ఒల్లవు, ఒల్లవు-ఒల్లరు, ఒల్లను-ఒల్లము; ఒల్లక-ఒల్లన్-ఒల్లని-ఒల్లమి-ఒల్లమికి ఒల్లఁబా టనియుఁ గలదు. పైని జూపిన రెండుధాతువులరూపములును వ్యతిరేకార్థకము లని తెలియునది.

సూ:—దువర్ణాదిక్రియావిభక్తులు పర మగుచో ధాతువుల తుదివర్ణమునకు తువర్ణము వైకల్పికముగా నాదేశమగును. దువర్ణము లోపించును. ౯౩

ఉదా:—చూతుడు-చూచుదుడు, చూతుము-చూచుదుము, చూతురు.

చూచుదురు, చూతురు-చూచుదును, చూతుము-చూచు
దుము, ఇట్లు-పిలుచు-నిలుచు-పెంచు-ముంచు-దంచు-ఆకర్ణించు-
వచ్చు-చేయించు-చించు-వసించు-తెచ్చు-ఇచ్చు-మొ॥—

సూ:—కొన్ని యువర్ణాంతములయున్నర్థమునకు 'తు' వర్ణమును దాని
మీఁది మువర్ణమునకు లోపమును ప్రసిద్ధమై కనవచ్చును.

ఉదా:—చేతురు-చేయుదురు, చేతువు-చేయుదువు- చేతుము-మొద—
ఇట్లు-వ్రాయు-కోయు-వేయు-త్రోయు-మొద—

చేతురు కోతు రిత్యాదు లసాధువు లని చిన్నయసూరి చెప్పె
నుగాని యిట్టివి భారతేతరగ్రంథములందు వందలుగా నుండుటయే గాదు.
నన్నయతిక్కనలభారతమందును ఒకటిరెండు లేక పోలేదు. కావున
నిట్టిరూపములు సాధువు లగుటకు సందేహము లేదు. ఒక్క 'చేతురు'
అనుదానికే కొన్ని వందల ప్రయోగములు దొరికినవి. వాని నెల్ల నిం
దుదాహరించుటకు వీలులేదు కొన్ని యువర్ణాంతధాతువుల నుదాహ
రింతును. కుడిచినచోటికి గొడ్డలి సేతురు, భా-సభా-2-188

ఆకులతం బొందెడునప్డు మంటపము సంక్షోభింపంగాఁ జేతుఁ గట్టలుకన్, విరాట-2-281—చేరి చుంబించి మోహింపఁ జేతు రసిన, నైష—శరముఖంబులఁ డేఁగి సన్నుతిఁ జేతు-హరి-స్వా-ఆఁకలి గొన్నవాఁ డేమిసేతు ననుచు, వరాహ—కన్నియ నెన్నఁడు ప్రోడఁ జేతునో, కవిక-ఏ యోజఁ దొలంగఁ ద్రోతు గురు నుత్తము నెమ్మెయి, విక్రమా—లే దని తలపోతు నిట్టిసుతోగాకృపన్, భోజరా—వలపల వడుఁగు నూనెలఁ గాచిపోతురు, వేమఱు చట్రాతఁ వేతు రొకని, కొందరి యంగంబులఁ గోతు రొకని, తోలూడఁ దీతు రొక్కని, యోగీశులు తలపోతు రాత్మ నెక్కాలమునన్, సానం—సారె పద్యపుఁబలకపైఁ జమురు పూతు, హంస-అపవేకులు కొంత్రు సేతు రపయశమునకున్, ఉ. రా—తత్సహారణముఁ జేతువు శక్తిన్, వరాహ—నేఁ ముద్దలంటివి తీతు మెపుడు, ఇందు—దినంబుల్ ద్రోతు మిచ్ఛాగతిన్, చంద్రభా—ఒకరొక్క-సుపాలు చేతురే, కుమా—వంచనసేతురె యాశ్రయించినన్, ఉ. రా—కొండలు పిండిచేతుము, అచ్చ—ఎన్ని యెన్నని తలపోతు నేమి సేతు, రాధికా—కోతు గోతులితాజ్జ్వరించవె గోరఁ గొరకములు, కవిరా—భారతపాఠములకుఁ బాఠాంతరములు [illegible] ప్రయోగింతును.

సూ:—'దము' పరమగునపుడు కొన్ని ధాతువులతుది చువర్ణ యువర్ణములకు తవర్గము విభాష నాదేశ మగును. అగుచో 'దము' దవర్ణము లోపించును. ౯౫

ఉదా:—చూతము- చూచుదము- పోషింతము- పోషించుదము-ఇట్లు వచ్చు-చొచ్చు-ఇచ్చు-పుచ్చు- దంచు-పంచు-కావించు-చేయించు-వసించు-భరించు-చేయు-త్రోయు-వేయు-మొ॥—కొన్ని యగుటచే, కాంచు-నొచ్చు-దాయు- మొదలగువానికి రాదు.

సూ:—రివర్ణము పరమగునపుడు ఆదేశతువర్ణముయొక్క-ఉకారమునకు లోపము బహుళము. ౯౬

ఉదా:—పోషింత్రు-పోషింతురు, చేయింత్రు-చేయింతురు- మొ॥—

బహుళ మగుటచే ఇచ్చు-మెచ్చు- మొదలగుమఱికొన్నిటికి నీకార్య మగును. ఇత్రు-ఇత్తురు-మెత్రు-మెత్తురు- (తకారలోపము) "ఇత్రు నాయకద్వయమన కిందిరేశ' అప్పక-మఱియు, చింతురు. ముంతురు- మొదలగుకొన్నిచోట్లనుకారలోపరూపము గ్రామ్యము గాదు.

సూ:—తద్ధర్మార్థకప్రథమపురుష బహువచనగువర్ణముయొక్క- ఉకారమునకు హల్లు పరమగునపుడు లోపము వైకల్పికము. ౯౭

ఉదా:—ఘటింతు ర్పెద్దలు-చూడ ర్జనులు- మొద-ఇట్టిరూపములను బాలసరస్వతి యుదాహరించెను గాని యివి వచనమున రుచింపవు.

సూ:—దువర్ణాదులు పరమగునపుడు ఉండునకు డులోపమును, అన్వాదులనువర్ణమునకు నిండుసున్నయు బహుళముగ నగును.

ఉదా:—ఉందురు-ఉండుదురు, అందురు-అనుదురు, ఇట్లు విందువు-విందుము-కందును- మొ—బహుళ మగుటచే 'దము' పర మగునపుడు నీకార్యము వచ్చును. ఉదా—ఉందము-ఉండుదము- [illegible] లయినవి గ్రా

హ్యములు.

సూ:—భూతతద్ధర్మార్థక క్రియావిభక్తుల వకారము విభాషను లోపించును. ౯౯

ఉదా:—వచ్చితివి-వకారలోపము, వచ్చితి+ఇ = నిత్యసంధి-వచ్చితి-ఇట్లే చేయుదువు-చేయుదు, చేసెదవు-చేసెదు.

సూ:—ఉండవ్వాదుల సున్నమీఁది ప్రథమపురుషబహువచన మైన 'దురు' దకారమునకు డకారమును ఉకారమునకు లోపమును బహుళముగా నగును. ౧౦౦

ఉదా:—ఉండురు-ఉండ్రు-ఉందురు-ఉన్ద్రు, అందురు - అండ్రు-అందురు-అంద్రు, ఇట్లు కొండురు-కొండ్రు-మొదలు మూఁడు పురుషలలోని 'దు' వర్ణమునకును ద్వైకాల్యము వచ్చునని కొందఱు లాక్షణికు లనిరి. అందందు కొన్నిప్రయోగము లును గలవు, కాని 'నీవుండువు-నేనండును-మీరు తిండ్రు-వంటి ప్రయోగము లీకాలమున రుచింపమింజేసి పరిత్యాజ్యము లగును. భారతము లోని 'మాకొండును-కండును-ఆఁకొండును-కొండము." మొదలుగాఁ బ్రాసస్థానములఁ గనవచ్చు నుత్తమపురుషప్రయోగములనఁబట్టి ఉత్తమపురుషదకారము నకు డకారము చేయుట యందముగా నుండు నని కవిసంశయ విచ్ఛేదకారుఁడు చెప్పెను గాని యదియును నేఁడు గ్రాహ్యముగాదు. ఇతమేల? సుపరిచిత మగుటచే 'అంద్రు' అనెడి రూపమొకటియుఁ దక్కఁ దక్కినవన్నియుఁ గర్ణకఠోరములే యగును. 'ఉండ్రి' యనుటకు- తల్లికండ్రులు రక్షింపదలఁపకు డ్రి-భీను—అని యొకటి కనఁబడుచున్నది.

సూ:—తివర్ణాదక్రియావిభక్తులు పర మగునపుడు ఉండుసకు దులోపమును అన్వాదులదువర్ణమునకు నున్న ద్వైకల్పికము గ

నగును అగుచోఁ బ్రత్యయతకారము టకార మగును. ౧౦౧

ఉదా:—ఉంటివి-ఉంటి, ఉంటిని-ఉంటిమి, అంటివి-అంటిరి-అంటిని-అంటిమి-పక్షమున ఉండితివి-ఉండితిమి-అనితివి-అనితిమి-మొద లగు ప్రాచీనరూపములు నగును. బిందు టవర్ణాదేశములు వచ్చిన వర్వాచీనరూపములు. ఇట్లు కొను-కను-మొద—ప్రాచీనరూపములు గ్రామ్యములు కాకపోవుటచేతనే యర్వాచీను లండఱును ఉంటివి మొదలగు రూపములను వాడి రంట తెల్లము-కాని-చంటివి-చంటిని-మొదలగు రూపములు కనఁబడ లేదు.

సూ:—నకారాదిభూతకాలక్రియావిభక్తులు పర మగునపుడు అన్వాదుల ఇకారమునకు లోపము వైకల్పికము. ౧౦౨

ఉదా:—అన్నాఁడు-అనినాఁడు, విన్నాఁడు-వినినాఁడు-తిన్నది-తినినది, కొన్నావు-కొనినావు-కన్నాము-కనినాము- మొద—వెనుకఁజూపిన అద్యతనభూతకాలక్రియలవలెనే ‘అనినవాఁడు’ వంటివి ‘అనినాఁడు-అన్నాఁడు’ వంటి రూపములకు మాఱిన వని గ్రహించునది-అనినయది-అన్నయది-అన్నది-వంటివి సమాసమందు ‘అది’ శబ్దము చేరిన రూపములు. నిత్యసంధి వచ్చిన ‘అన్నది-విన్నది’ వంటి రూపములు క్రియలుగాను మాఱినవి-

సూ:—ఇనన్-ఇన-పర మగునపుడు ‘ఉండి’ తొలియచ్చుమీఁది వర్ణములకు నకారమును, ‘అని’ మొదలగువాని ఇకారమునకు లోపమును వైకల్పికముగ నగును. అగుచోఁ బ్రత్యయముయొక్క ఇకారములోపించును. ౧౦౩

ఉదా:—ఉండి+ఇనన్,ఉన్+నన్-ఉన్నన్ - ఉండినన్, అని+ఇనన్-అన్+నన్=అన్నన్-అనినన్-ఇట్లు ఉన్న-ఉండిన - విన్న-వినిన, మొద—అన్వాదులు

సూ:—ఇనన్-ఇన-పర మగునపుడు పడ్వాదులందు ద్విత్వ వర్ణమునకు అకార మాతోఁ గూడిన ద్విత్వము వైకల్పికముగ నగును. అగుచో 'ఇన' లోపించును. ౧.౪

ఉదా:—పడి+ఇనన్=పడ్డన్, పడి+ఇన=పడ్డ, ఇట్లు చెడ్డన్-చెడ్డ, మొదలగుపడ్వాదులు-ఈకార్యము నగుధాతువులకు రాదు నగినన్-నగిన. పడ్డవాఁడు 'పడ్డాఁడు' అగుటకు-కుంకం దానొక రుండు గెల్చుకడిమిం గీర్తింపఁబడ్డాఁడు. హరి—

సూ:—'వలయు, మొదలగుక్రియలకుఁ గర్తయగుభావమునందు ధాతువునకుఁ దుమున్నర్థకప్రత్యయము చేరును. ౧౦౫

ఉదా:—నీవు చేయవలయును. వాఁడు రాఁగూడదు. మీరువినఁదగదు ఇందు చేయన్-గాన్-వినన్- అనునవి క్రమముగా-వలయును-కూడదు-తగదు-అనువానికిఁ గర్తలగును. ఇట్లే వలెను-వలదు-వద్దు-తగును- అగును-వచ్చును - రాదు - చెల్లును - చెల్లదు-కూడును- కూడదు- మొదలయిన వలయ్యాదులు గ్రాహ్యములు

క్రియా పరియోగ విశేషములు.

సూ:—ఏర్యాది సంబంధమునందు భూతకాలక్రియలు భవిష్యదర్థము చెప్పును. ౧౦౬

ఉదా:—నీవు రేపు వచ్చితివేని సొమ్మిచ్చెదను. ఈకార్తెలో వాన కురిసెనా పంటలు పండును. మొద—

సూ:—వ్యతిరేకతద్ధర్మార్థకక్రియలకు భూతార్థమందు అగుధాతువు భూతకాలక్రియలు బహుళముగాఁ జేరును. ౧౦౭

ఉదా:—అతఁడు చేయఁడయ్యె-అది రాదయ్యె-నీ వుండవైతివి. మొ— బహుళమనుటచే వర్తమానభవిష్యదర్థములందు అగుధాతువు తద్ధర్మక్రియలు చేరినప్రయోగములును గల పని తెలియునది. ఎఱుఁగుకాలములను భారతప్రయోగములు.

కాన నీఁ జాల నయ్యెద వీని నేను, వ్యష్టి శేదవు, తద్విరహిత మ్మగుకామ్యక మొప్ప దయ్యెడిఁ, ఇప్పుడు కిఁకను నమ్మనేరనయ్యెద, కనుట కోర్వఁ జాల దయ్యెడుఁ గమలనాభ, ఎఱుఁగఁజాల రయ్యెదరు చూడు తమబంధు లగుట కృష్ణ, పలు కైనను బలుకంగఁ జాలఁ డయ్యెడు నకటా, ఇట్టివి వాడుకనుండి తొలఁగిపోయినందున, అర్వాచీనకృతులలో నైనను దఱచుగాఁ గానరావు. కావుననే కొందఱు పండితు లిట్టిప్రయోగములయెడఁ గాలభ్రాంతి జెందిరి.

సూ:—పోవుధాతువు వ్యతిరేకతద్ధర్మార్థక రూపములు చేరుటచే వ్యతిరేకక్త్వార్థకములకు సహజధాత్వర్థము కలుగును. ౧౦౮

ఉదా:—వాఁడు రాకపోఁడు=వచ్చు నని యర్థము. ఇట్లే లేకపోదు ఉండకపోరు. వినకపోను. మొద——

సూ:—ఎల్లక్రియారూపములమీఁదను ప్రశ్నార్థమున- ఆ-ఏ-ఏ గా-లు ను, సంశయార్థమున- ఓ-ఒకో-లును చేరును. ౧౦౯

ఉదా:—ప్రశ్న- వారు వచ్చిరా? నీవుందువా? మీరుపోఁగలరే? మేము చూతుమే? నీవేనా? రాముఁ డతఁడేనా? సంశ- వచ్చునో రాఁడో, చెప్పెనో లేదో, చూచునో కో-చేయునో క్కొ- మొద.

ప్రాచీనాంధ్రమందు, ఏ-ప్రశ్నార్థకము, అ-ఏవార్థకము. అర్వాచీనాంధ్రమందు, ఏ-ఏవార్థకము. ఆ-ప్రశ్నార్థకము ఒకో-అకో. ఒక్కొ-ఒకొ-అకొ-ఇవి యన్నియుఁ బ్రాచీనాంధ్రములోనివే.

సూ:—కాక్వర్థక మైన ఏకారము క్రియయొక్క సహజార్థమును వ్యతిరేకముగాను, వ్యతిరేకార్థమును సహజముగాను మార్చును.

కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే-భూమిపైఁ బేరైనం గలదే- ని వింతకుఁ జాలుట యెవ్వరు నెఱుఁగరే.

సూ:—ప్రశ్నార్థక మైన 'ఆ'తోఁ గలిసినపుడు వ్యతిరేకోత్తమపురుష క్రియలకు సహజధాత్వర్థము కలుగును. ౧౧౦

ఉదా:—నేనుగూడ రానా?=వత్తును. మేము వెళ్ళమా?=వెళ్ళుదుమా.

౦అచనా? రా—స్త్రీ౹ ప్రశ్నించునపు డుత్తరమండలములవా
ికారము చేర్తురు. నేఁజెప్పనే? చెపుదునా ?—ఇట్టిక్రియ లర్వాచీన
ంప్రదాయసిద్ధములు. భారతిమునందు-రారాజుల జెఱుపఁ బాపరా"
త్యాదిస్థలములందు "పాపినవాఁడుకారా" యనురీతి నర్థమువచ్చును.

సూ:—ఆశీశ్శాపములందు ధాతువులకు వచ్చు -ఎడును- తను-వర్ణక
ములందుత మచ్చు పర మగునపుడు మకారము నగును. ౧౧౨

ఉదా:—శుభంబయ్యెడు మని. మేలుకలుగుత మని, నాకలోకంబున
నుండి కూలెడుమని-కూలుత మని- మొద—

సూ:—ఆశీరాద్యర్థములందు తద్ధర్మార్థకక్రియలపై కాతఁ-కావుతన్-
కాక-యనునవి చేరును. అచ్చు పర మగునపుడు ద్రుతము
మకార మగును. ౧౧౩

ఉదా:—పోషించుఁగాతఁ-రక్షించుఁగాత మని, ఏలుఁగావుతఁ-ఏలుఁ
గావుత మని, వర్ధిల్లెడుఁగాక. మొద—

ఇట్టి యుదాహరణము లైనట్లు శాసనాదులవలనను కేతనకవిలక్షణము
లనను దెలియును. చేయుఁగాతయని- చేయుఁగావుతయనఁగిన్-
ాని యివి క్రమముగా ద్రుతాంతములుగా మూాడేనకీ. కాత-కావుత-
ఁగుధాతువునుండి పుట్టిన వగుటచే న్యస్తముగాను బ్రయోగింపఁ
డును. "జనార్దనుండు ప్రీతుండు గాత" భార — మేలుగావుత. ‚కాక'
నునదానికి సందర్భమునుబట్టి యర్థము మారును.

ఉదా:—అవుఁగాక=అయితేనేమి, కానిమ్ము. చెప్పితినిగాక=చెప్పి
నను, ఇట్లే యర్థము లూహించునది. కొందఱు ‚తను' చేర్చు
నపుడు ధాతువులకు మార్పు లెఱుఁగక "ఈయుతన్-ప్రోచు
తన్-అగుతఁ" అనువిధమున నపప్రయోగములు చేయు
చున్నారు. ఈవుతన్ - ప్రోవుతన్ - కావుతన్- అనువిధముగా
మార్పు లెఱిఁగి ప్రయోగింపవలెను. ఆమార్పులు తెలియని

వా రిట్టిప్రయోగములను విడుచుట యుచితము. భారతభాష చక్కఁగాఁ దెలిసినఁ గాని యామార్పులు తెలియవు. మార్పులే కాదు భాషాసంప్రదాయమే తెలియదు.

సూ:—తుమున్నర్థక మైనయవ్యయము గూడ శాపార్థకమై ప్రయోగింపఁబడుట కలదు. ౧౧౩

ఇట్టి దేవేంద్రువలన నీ వేమిఫలము వడసెదవు చాలు నీవాంఛ పాడుగాను" హార— పూని యేతువె నీపూని— బుగ్గిగాను, మిగుల వెత వెట్టెదవు నీ దొరతనము త్రుంగిపోను, మఱిఁడా నీచేతిపిల్లు మంటం గలయన్, కోకిలా నీయిల్లు కూలిపోను, నీలా—ఇట్టివి. వాడుకలోను గలవు. నీకడుపు కాల—నీ నంప తెగ॥ మొద—ఆశీరర్థమందును ఇది వాడుకలోఁ గలదు. నీ ముల్లుబంగారుగాను— మొద—

సూ:—తద్ధర్మార్థకక్రియావిభక్తులలో అనుబంధమైన 'ఎద'కు 'ఏ' ఆదేశము వైకల్పికముగా నగును. ౧౧౪

ఉదా:—నవ్వెదరు-నవ్వేరు, అలిగెదవు-అలిగేవు, వచ్చెదను-వచ్చేను, మ్రొక్కెదము-మ్రొక్కేము- మొద- ఈక్రియారూపము లీవిధముగాఁ జిరకాలము క్రిందటనే మాఱి వాడుకలో స్థిరపడి పిదపఁ గావ్యములఁ బ్రవేశించినవి.

జానానే వెలయాలనా యిటులు నీ వాడన్ బళా చాలుఁ బోపో నవ్వేరు శివరైన విన్నఁ గట, దశా—నవ్వులు పచరించినట్లు చనవుల్ సెలఁవే నది మంచి మాట గాను, రంగరా—మమ్ము నన్నమ్మ యిదేటిబుద్ధి వలదే మ్రొక్కేము నీకాళ్లకున్, పార్వ- మనుం జంపఁ జూ—చిఁ జచ్చేమని పల్కి—నారు, రాధా—స్త్రీకుంభిన్యధికార మిచ్చి కృశియించే వెంచ, షట్చక్ర-ఏమి చూచే వని నమ్ముచున్ బయటఁ జేతడి యొత్తి, రాధా—ఇత్యాదులు.

సూ:—అమహద్వాచకములు కర్త లగునపుడు. భూతతద్ధర్మార్థకక్రియారూపము లేకవచన బహువచనముల సమానముగా నుండును. ౧౧౫

ఉదా:—పక్షి కూసెను. పక్షులు కూసెను, చెట్టు కూలును. చెట్లు కూలును, ఆవు వచ్చెడిది-ఆవులు వచ్చెడిది, ఏఱు పొంగెను

వళ్ళు పొంగెడిరి. (౧-౫-౬ పట్టికలు చూచునది.)

సూ:—సంప్రార్థనంబునందు-ము-డు-వర్ణకములకు-అ-ఆ-ఇ- ఈ- వైకల్పికముగఁ జేరును. ౧౧౭

ఉదా:—చేయుము-చేయుమా-చేయుఁడి-చేయుఁడీ- మొద—

పాండ్యకర్ణాటమండలములందును తత్ప్రాంతములందు నుండు తెలుఁగువారు రండా-చెప్పండా, యని యందురు. అవి యిచ్చట వాడుకలో లేవు గావున శుద్ధిరమ్యములు గావు. 'అవధరింపుము' రూపాంతరము. అవధారు-కన్నడపదము. ఇది గ్రామ్య మనుట పొరపాటు.

సూ:—విధిప్రార్థనంబుల 'అండి' పర మగునపుడు మధ్యమ వ్యతిరేక మధ్యమ పురుష-ము-ను-వర్ణములకు లోపము వైకల్పికము. ౧౧౮

ఉదా:—చేయుము, చేయు+అండి=ఉకారసంధినిత్యము—చేయండి-చేయుఁడు+అండి=డువర్ణముతో బిందువు పోవును. చేయండి-చేయకుము+అండి=చేయకండి. చేయకుఁడు+అండి=చేయకండి. ఇట్లు వినండి-వ్రాయండి=పోకండి-చూడకండి- మొద— 'అండి' పూజ్యార్థక మైనయవ్యయము. ఏకవచన బహువచనములందు సమానముగా గౌరవార్థకమై చేరును. ఎనుటివారిని సగౌరవముగా సంబోధించునపుడు గూడ సంజ్ఞాక్రియావాచకాదులపై నిదిచేరుటకలదు. ఉదా-పంతులుగారండి! ఏమండి! దయచేసినారండి! మొద— దీనికి దీర్ఘమును వచ్చును. ఏమండీ మాటాడరు! మొ— ఇట్లు శ్రావ్యములై సర్వజన వ్యవహారసిద్ధములై నిర్దుష్టము లైన 'వినండి' వంటిప్రయోగములు గ్రామ్యము లనుటకంటె వింత వే ఉండదు.



సూ:—'అను' ధాతువు... ప్రార్థనాద్యర్థక

ము వర్ణకమునకు వెనుక నున్నఉకారము వైకల్పికముగా అకార మగుటయుఁ గలదు. ౧౮౯

"సీ. భుక్తి చేసినవెన్కఁ బోవచ్చు' నని చెప్ప, నబలను నీవు చేయమని శ్రోషి" పార్వ-ఉండమని, మధు-చా-ఇట్టివి వాడుకలో సుప్రసిద్ధములు.

సూ:—అమ్మాదులు పర మగునపుడు మధ్యమ-ము-డు-వర్ణకములకు బహుళముగా- వు-రు-వర్ణములు క్రమముగా నాదేశములగును. అగుచోఁ బూర్వమందున్నఉకార మకార మగును. ౧౯౦

ఉదా:—వినుము+అమ్మ = వినవమ్మ. చెప్పుఁడు+అమ్మ = చెప్పరమ్మ. ఇట్లు- పోషింపవయ్య-రక్షింపరే- తెలుపవో- మొద—

అమ్మ-అయ్య-ఎ-ఏ-ఒ-ఓ-ఒక్కో- మొ॥—అమ్మాదులు- బహుళమనుటచే 'ఇమ్ము'మాలోపమున ఇకారమునకు దీర్ఘము. కానీవమ్మా-రానీవయ్యా- మొద—మఱియు నీకార్యము రాని తెలుపుమమ్మా-రండయ్యా-యనుప్రయోగములును గలవు. 'సైఁపుమయ్య ముకుందా' భార—

సూ:—ఈకార్యము వ్యతిరేకమధ్యమపురుషక్రియల తుదనుండు-ము-డు-వర్ణములకు-ఎ-ఏ-పర మగునపుడు వచ్చును గాని పూర్వమందున్నఉకార మకారము కాదు. ౧౯౧

ఉదా:—వినకుము+ఎ= వినకువె, వినకుఁడు+ఏ = వినకురే. ఇట్టి ప్రయోగములు పూర్వకావ్యములందు మాత్రమే కలవు.

సూ:—అమ్మాదులు పర మగునపుడు 'కద'మీఁద వు వర్ణముచేరుటయుఁ గలదు. ౧౯౨

ఉదా:—తెల్పఁగద వమ్మ-తెల్పఁగదమ్మ-ప్రోవఁగదవన్న - ప్రోవఁగదన్న-తెల్పఁగదవే-తెల్పఁగదే- మొ॥—

సూ:—ఉభయప్రార్థనార్థకక్రియాపదముల తుదివర్ణమునకు వెనుక నున్నయుమ్మునకు దీర్ఘము వైకల్పికముగా వచ్చును. ౧౯౩

ఉదా:—చూతాము-చూతము, ఉందాము-ఉందము, మొ—

"విన మేకై డిం జాలిగల్గెం జెపువూ విందాము నిక్కంబుగన్, చెన్నబస—ఆనందమయులమై యాడుదాము, పుష్పశయ్యలమీఁదం బొందుదాము, పట్టాభి— అలయాటలాడుదాము, రాధికా—కోటలోపల నిల్తా మటుగానిచో, రంగారా— ఇట్లు ప్రయోగములు కలవు.

భాషాభిజ్ఞు లీప్రయోగములయౌచిత్య మూహింతురుగాక.

సూ:—తుమున్నర్థకావ్యయములమీఁది 'ఇమ్ము' నకు 'ఈ' వైకల్పికముగ నగును. ౧౩౮

ఉదా:—చేయనీ—చేయనిమ్ము, పోనీ-పోనిమ్ము. ఇట్లు కానీ-రానీ-ఉండనీ-మొద—దీనిమీఁద అండి చేయుచో కానీయండి-రానీయండి- (యకారమాగమము) 'అండి' అకారలోపముచేఁ గలిగిన 'కానీండి-రానీండి' వంటి వపభ్రంశములు.

సూ:—రమ్ము-పొమ్ము-తెమ్ము-లెమ్ము-లకుఁ గ్రమముగా రా-పో-తే-లే-వైకల్పికముగ నాదేశము లగును. ఇవి ద్విరుక్తములు నగును. ౧౩౯

ఉదా:—రా-రమ్ము, పో-పొమ్ము, తే-తెమ్ము, లే-లెమ్ము-రారా-పోపో-తేతే-లేలే-

సూ:—అనుప్రయుక్త మయినపుడు 'కొమ్ము'నకు 'కో' వచ్చును.

ఉదా:—పుచ్చుకో-పుచ్చుకొమ్ము-తీసికో-తీసికొమ్ము మొద—

సూ:—ఏకవచనబహువచనాంతము లైనవీని కామ్రేడితము పరమగునపు డీకార్యము గలుగును. ౧౪౦

ఉదా:—రారమ్ము - రమ్మురమ్ము- రారండు- రండురండు, ఇట్లు పో పొమ్ము- పోపొండు, తేతెమ్ము-తేతెండు, లేలెమ్ము-లేలెండు, కోకొమ్ము-కోకొండు-రాపొమ్ము-రాపొం డనియుఁ బ్రయోగములు గలవు.

సూ:—ప్రార్థననిషేధనాదులందు 'రా'పర మగుచో రమ్ము- పొమ్ము-
మొదలగువానికి-రా-పో- మొదలయిన వాదేశము లగును.

"రారా నందకుమారక, పోరా నాతండ్రి యిపుడు, తేరా కులమునకుఁ గీర్తి, లేరా యిప్పటికైన, కైకోరా పూజలు, రారా ప్రల్లదము లేల రణమొనరింపన్, పోరా మఱుమాట వలదు.

సూ:—ఉండును-చను-అను-క్రియలకు కాన్వర్థక మైన ఏకారము
పరమగుచో తొలియచ్చుమీఁది వర్ణములకెల్ల వైకల్పికముగా
ద్విత్వనకార మాదేశ మగును. ౧౨౯

"పురుషార్థంబునకు హాని పుట్టకయున్నే, మునీంద్ర నీకుఁ జన్నే నళినాక్షులందు మది నిల్పఁగ, (అనుప్రయుక్తమైన కొనునకు) ఆహితమున్ భయమున్ దొరకొన్నె నాకు, భార—పక్షమున-ఉండునే-చనునే-కొనునే-మొద—

శూ:—నిశ్చయార్థమునందు క్రియాపదముల వెనుక, ఆక్రియల తుము
న్నర్థకరూపములు ఏకారముతోఁ గలిసి చేరును. ౧౩౦

ఉదా:—రానేవచ్చెను—రానేరాఁడు-పోనేపోవును- చేయనేచేసితిని.

సూ:—'కంటెన్' పర మగునపుడు కొన్ని యెడల భూతార్థకక్రియా
జన్యవిశేషణముమీఁది అమహద్వాచకమైన 'అది' శబ్దము
లోపించుటయుఁ గలదు. ౧౩౧

"కుడిచినకంటెను క్షేత్రము!పడసిన తెలిపథిక మున్డ్రదు" విజ్ఞా—విభునిఁబంచినకంటెను, హరి...మనుపకుండినకంటెఁ గల్మషము గలదె, వి.క—సిద్ధియుఁ గన్నకంటె, కుమార—ఇట్టిప్రయోగములు తఱుచుగాఁ గానరావు వ్యవహారములో లేవు. పక్షమున, కుడిచినదానికంటె- మొదలగురూపము లగును.

సూ:—కొఱకున్-కంటెన్-పొంటెన్- పర మగునపు డొక్కొకచో
భావార్థక టవర్ణకము లోపించుటయుఁ గలదు. ౧౩౨

"భూమి పాలించుకొఱకునై పుట్టినాఁడ, విష్ణు—పతి కలుగుకంటె సౌఖ్యము!సతుల కొండొకటి కలదె, వి.క.౨—ఏపగిదినిబ్రతుకరాదె యిటు చెడుకంటెన్, హరి—అన్యతవిక్రమముం బ్రకటించుకంటె, నిర్వ—పట్టె నిట్టలంబుగ జడిపట్టుపొంటె-పక్షమున పాలించుటకొఱకు- మొ—ఇట్టి టవర్ణలోపప్రయోగము లిపుడు లేవు.

సూ:—ఒక్కొక్కచో, క్త్వార్థకము హేత్వర్థక మగును. ౧౩౩

ఉదా:—ఏఱు సొచ్చి చేలు మునింగి పోయెను-పొంగుటచే—

రాహుకంఠము తెగి దేహము ధరణిం బడియె, భార—ఏర్తెల ప్రేసి హోము దాంకి తిరిగె గరుడి, నిర్వ—అదియున్ మే నుచ్చి పోలక్ష్మణాయంచుం గూలె, రామా—ఇత్యాదులు.

సూ:—కర్త్రర్థకాదిభేదమున సకర్మకక్రియాపద మెనిమిదివిధములు. ౧౩౪

౧ కర్త్రర్థకము ౨ కర్మార్థకము. ౩ ఆత్మనేపదకర్త్రర్థకము. ౪ ఆత్మనేపదకర్మార్థకము. ౫ ప్రేరణకర్త్రర్థకము. ౬ ప్రేరణకర్మార్థకము ౭ ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము ౮ ప్రేరణాత్మనేపదకర్మార్థకము. వీనికిం గ్రమముగా లక్ష్యములు.

౧. పండితుండు పురాణము చదివెను.

౨. పండితునిచేం బురాణము చదువంబడెను.

౩ పండితుండు పురాణము చదువుకొనుచున్నాండు.

౪. పండితునిచేం బురాణము చదువుకొనంబడుచున్నది.

౫. రాజు పండితునిచేం బురాణము చదివింపంగలండు.

౬. రాజుచేతం బండితునిచేతం బురాణము చదివింపంబడంగలదు.

౭. రాజు పండితునిచేతం బురాణము చదివించుకొనును.

౮. రాజుచేం బండితునిచేం బురాణము చదివించుకొనంబడును.

ఇవి చదువుధాతువునకు నాలుగుకాలములయందును సిద్ధించిన రూపములు. ఇట్లు ప్రతిసకర్మకధాతువునకును ప్రతికాలమునందును ఎనిమిదిరూపములు సిద్ధించును.

స్వార్థకక్రియారూపమును, పడు-కొను-కొనంబడు-చేరినమూండు రూపములును గలిసి నాలుగు. ఇట్లే, ప్రేరణార్థకరూపమును, పడు-కొను-కొనంబడు-చేరినమూండురూపములును గలిసి నాలుగు. మొత్తె

మెనిమిదివిధములు-ఇందు, పడుధాతువు చేరినరూపములు సర్వత్రవిన నింపుగా నుండవు. పైరూపములు సమాపకములే కాక, వాక్యము లందు చదువఁబడి-చదువుకొని-చదువుకొనఁబడి- చదివించుకొనఁబడి- యనురీతి నసమాపకములు గూడ నగును.

సూ:—కర్త్రర్థకాదిభేదమున అకర్మకక్రియాపద మైదువిధము లగును. ౧౩౫

౧ కర్త్రర్థకము. ౨ ప్రేరణకర్త్రర్థకము. 3 ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము. ౪ ప్రేరణకర్మార్థకము. ౫ ప్రేరణాత్మనేపదకర్మార్థకము- అకర్మకధాతువునకు ప్రేరణేంచు చేరనపుడు, కొను-పడు-కొనఁబడు-చేరవు గావున నైదురూపములే యగును. వీనికిఁ గ్రమముగా లక్ష్యములు.

౧ బాలుఁడు వచ్చెను. ౨ తండ్రి బాలుని రప్పించెను. 3 తండ్రి బాలుని రప్పించుకొనెను. ౪ తండ్రిచే బాలుఁడు రప్పింపఁబడెను. ౫ తండ్రిచే బాలుఁడు రప్పించుకొనఁబడెను.

ఇ ట్లెల్లయకర్మకధాతువులకు నన్నికాలములందు నైదేసి రూపము లగును.

సూ:—పొందు-తిను-వచ్చు-పోవు- మొదలగుకొన్ని సకర్మకాకర్మక ధాతువులు ప్రయోగించునపుడు కర్త లగులవి ప్రేరణమునఁ గర్మ లగును. ౧౩౬

ఉదా:—రాముఁ డాశ్రమమును బొందెను-విశ్వామిత్రుఁడు రాము నాశ్రమముఁ బొందించెను, బాలు డన్నము తినెను-తల్లి బాలు నన్నము తినిపించెను, భటుఁడు కొలువునకు వచ్చెను-రాజు భటుని గొలువునకు రప్పించెను. శిష్యుఁడు వ్యాకరణము చదివెను-గురువు శిష్యుని వ్యాకరణము చదివించెను. మొద—

తక్కి-నక్రియారూపములను ప్రాచీనకావ్యములును శిష్టవ్యవ

హారమును శరణ మగును.

ఇది క్రియాప్రకరణము.

---

## కృత్ప్రకరణము

అచ్ఛికములుమాత్రమే యిందు విధింపఁబడును. కృత్ప్రత్యయములు పర మగునపుడు తఱుచుగా ధాతువులతుదివర్ణము లోపించును. కొన్ని యెడలఁ బూర్వవర్ణములకును లోపము గల్గును. కొన్ని యెడల నేలోపమును గాదు. మఱికొన్నియెడల నితరవర్ణము లాదేశము లగును. ఇట్టిమార్పు లన్నియు నాయాసూత్రముల కిచ్చుప్రథమోదాహరణములనుబట్టి గ్రహించునది విశేష మున్నచో నట్టిరూపములు నుదాహరింపఁబడును. అజాదిప్రత్యయములు పర మగునపుడెల్ల యచ్చులకు సంధి నిత్యము.

సూ:—భావాద్యర్థములయందు ధాతువులకంటె వచ్చుక్రియావిభక్తిభిన్నము లైనప్రత్యయములు కృత్తు లనఁబడును. ౧

సూ:—కృత్తులయర్థములను బ్రయోగవ్యవహారములవలనఁ దెలియునది.

ఉదా:—ఎఱుక-ఎఱుఁగుట-భావార్థకములు. మోఁక-ఏలిక-కర్త్రర్థకములు. మేఁత-వ్రాత- కర్మార్థకములు- ఇట్లే యర్థము లూహించునది.

సూ:—ఎఱుఁగు మొదలగువానికి 'క'వర్ణక మగును. 3

ఉదా:—ఎఱుఁగు-ఎఱుక. అరసున్న గూడఁబోయినది. ఇట్లు, మునుఁగు- మలఁగు-తునుఁగు- మొదలగువానికగును. ఆఁగు-ఆఁక ఇట్లు, వీఁగు-మూఁగు-, కడఁగు- కలఁగు-, కాఁగు- నలఁగు- మడఁగు- మొద—నడచు-నడక. ఇట్లు, పోవు-వంగు-అలుగు- మొలచు (మొల్క- మొక్క) మొద—వచ్చునకు 'రా' ఆదేశము, రాక.

కినియు-కినుక, ముదియు-ముదుక, ఇకారమునకు ఉకారము.

సూ:—కనుధాతువునకు 'క-ఇక-పు'-వర్ణను లాగమను లగును. అగుచోఁ దొలియచ్చునకు దీర్ఘ మగును. ౪

ఉదా:—కను, కానుక-కానిక-కానుపు.

సూ:—అణఁగు మొదలగువానికి 'కువ' వర్ణక మగును. ౫

ఉదా:—అణఁగు-అణఁకువ. ఇట్లు కలఁగు- ఎఱుఁగు-పెనఁగు-నలఁగు-మెలఁగు-లోఁగు- వేఁగు- మఱచు (మఱగు - పూర్వరూపము) మఱుఁగు-(పొలగు) పొలకువ.

సూ:—కలఁగు మున్నగువానికి 'ఇమి' ప్రత్యయ మగును. ౬

ఉదా:—కలుగు-కలిమి. ఇట్లు, ఓరుచు- వేలుచు- కూరుచు- నేరుచు-బడియు-బలియు-బ్రదుకు- మొద—ఒడ్డు-ఒడ్డిమి, తాలు-తాలిమి, కలుగునకు వ్యతిరేకార్థమున 'లే' ఆదేశము, ఇకారలోపము లేమి.

సూ:—చేయు మొదలగు కొన్ని ధాతువుల యువర్ణమునకు బిందు పూర్వక తవర్ణకము బహుళముగా నగును. ౭

ఉదా:—చేయు-చేఁత- ఇట్లు, మేయు-కోయు-గీయు-నేయు-పూయు-వ్రాయు-వ్రేయు-రోయు-కూయు-పోయు- మోయు- అలయు-తీయు-మ్రోయు-లాయు-మూయు- మొద—తిగుచధాతువు తిగియు-తీయు-అని మాఱినట్లు కనఁబడును- తీయు-తీఁత.

కొన్ని యనుటచే తెలియు-కలియు-కాయు-పాయు- మొదలగు వానికి 'త'వర్ణకము రాదు. బహుళ మనుటచే, ముడుచు - ముడుత, కలఁచు-కలఁత, మడచు-మడత, ఈఁదు-ఈఁత- మున్నగుచోట్ల ఇతర వర్ణములకు తవర్ణకము మాత్రము వచ్చును. కొలుచు-కొలత. ఉకారమునకు అకారము.

సూ:—[illegible] ౮

ఉదా:—ఆడు-ఆట. ఇట్లు, ఊరు-ఊఱడు-ఏఁకరు-తిపురు-తేరు-త్రిమ్మరు-పండు-వండు-పాడు-మండు- వేసఱు-వదరు;త్రిప్పు(త్రిప్పట,) చెమరు-(చెమట చెమ్మట) మొద—కొన్నిటికి 'ము'ప్రత్యయము వచ్చును. కూడు-కూటము, ఓడు-ఓటము-ఓట; అనుప్రయుక్తమైన 'ఆట'కు మువర్ణకము కొన్నిచోట్ల నగును. కోలాటము-మంద్రాటము, పోరాటము-పోరాట, సయ్యాట-గొండ్లాట, ఓటమి-కూటమి-రూపములును గలవు.

సూ:—పడు మొదలగు కొన్నిటికి 'టు'వర్ణక మగును. అగుచో ధాతువు తొలియచ్చునకు దీర్ఘమును దానిమీఁదివర్ణములకు లోపమును వచ్చును.

ఉదా:—పడు-పాటు, చెడు-చేటు, అడుచు-ఆటు, పొడుచు-పోటు కఱుచు-కాటు, వయిచు-వాటు, ఏయు-ఏటు, ఓడు-ఓటు, వ్రేయు-వ్రేటు, మఱుఁగు-మాటు, గీచు-గీటు. మొద—

సూ:—పిలుచు మొదలగువానికి 'పు'వర్ణక మగును. ౧౦

ఉదా:పిలుచు-పిలుపు-ఇట్లు, తలఁచు-వలచు- విడుచు-ఇంచు-సూయు-మేయు-అడుచు-ఏఁచు-ఏచు-కాచు- మోచు- కఱచు - పరచు వెఱచు-తోఁచు-గెలుచు-మెఱయు-త్రేఁచు-త్రోఁచు- పూఁచు-విఱుగు-పెనుచు- పొలుచు- ప్రోచు-అఱచు- మెచ్చు-వాచు-వంగు-చూచు-రాచు- తాఁచు- దోఁచు- దాయు- ఊడుచు-ఏడుచు- విడుచు- ముడుచు- మొద—కాచు-'కాయు' గాను, మోయు-'మోచు' గాను మాఱినవి.

సూ:—దించు మొదలగువాని ప్రేరణచువర్ణమునకు 'పు' వర్ణక మగును. ౧౧

ఉదా:—దించు-దింపు, దంచు-దంపు, ఇట్లు తెంచు-ముంచు-నంచు-తాఁచు-వేఁచు-కూర్చు-తెర్చు-పర్చు-నేర్చు-మార్చు-మడుచు

వార్చు-తార్చు-మొదలగువాని కగును,

సూ:—ఆవులించు మొదలగువాని చువర్ణమునకు 'త' వర్ణక మగును.

ఉదా:—ఆవులించు-ఆవులింత-ఇట్లు, ఇగిలించు-ఓకిలించు-ఓకరించు-కుళ్ళగించు-కొక్కరించు-వెక్కిరించు-కొప్పరించు-గిలిగించు-కౌఁగిలించు-పల్కరించు-కలవరించు-మొద—

సూ:—తిరియు మొదలగువానికి 'ప' వర్ణక మగును. ౧౩

ఉదా:—తిరియు-తిరిపము. ఇట్లు, మురియు-పొలయు-సొలయు-వలియు, కలియు-కలపము. మొద— కాని కలయు పొలయు...

సూ:—ఓపు మొదలగువానికి 'ఇక' వర్ణక మగును. ౧౪

ఉదా:—ఓపు-ఓపిక, అరయు-అరయిక, కూడు-కూడిక. ఇట్లు, అలయు-ఓడు-అంజు-అమరు-ఆడు-పొగడు-కలయు-కోరు-పొందు-పోలు-తేలు-చేరు-చల్లు-నమ్ము-అల్లు-తీఱు-బడలు-తూఁగునకు తూను-తూనిక. మొద—నమ్మిగ-ఓపిగ- ప్రాచీనరూపములు.

సూ:—అఱుగు మొదలగువానికి 'దల' వర్ణక మగును. ౧౫

ఉదా:— అఱుగు-అఱుగుదల, ఒప్పుదల-పట్టుదల- అచ్చుదల- తిరుగుదల-క్రమ్ముదల-హెచ్చుదల-తగ్గుదల-పాఱుదల-మొద—

సూ:—కోరు మొదలగువానికి 'ఇకి' వర్ణకమగును- ౧౬

ఉదా:—కోరు-కోరికి. ఇట్లు, విను-పోలు-మను-పూను, మొద-చూచునకు చూడు-చూడికి-మొద—

సూ:—ఏలు మొదలగువానికి 'బడి' వర్ణక మగును. ౧౭

ఉదా:—ఏలు-ఏలుబడి. ఇట్లు, కొను-కను-గిట్టు- చెల్లు-చేరు- తగులు-తీఱు-పెట్టు - మ్రొక్కు - వచ్చు-సాగు-దిగు, వచ్చుపోవులకు రా-పో లగును. రాబడి-పోబడి.

సూ:—చేరు మొదలగువానికి 'గడ' వర్ణకము నగును. ౧౮

ఉదా:—చేరు-చేరుగడ. ఇట్లు, మను-తీఱు- వేలు- ఏడు- మొద—

తిరుగు మొదలగు కొన్నిటితుదివర్ణము పోవును. తిరుగు-తిరుగడ, విఱుగు, విఱుగడ, తేయు-తేగడ, ఈఁగు-ఈగడ-మొ-

సూ:—నిలుచు-పోవు-వచ్చు-లకు 'కడ' వర్ణక మగును. ౧౯

ఉదా:—నిలుచు-నిలుకడ, పోవు-పోకడ, వచ్చునకు 'రా' రాకడ.

సూ:—కాచు మొదలగువానికి 'వు' వర్ణక మగును. ౨౦

ఉదా:—కాచు-కావు, కొలుచు-కొలువు, నోచ్చు-నోవ్వు-నోవు, పూచు-పూవు-పువ్వు, చచ్చు-చావు, ద్రుచ్చు-ద్రువ్వు, తడయు-తడవు, నిలుచు-నిలువు, మను-మనువు, ఇచ్చు-ఈవి-(ఈగి) మొద—రూపములనుబట్టి కార్యవిశేషములు తెలియునది.

సూ:—మాఱు మొదలగువానికి 'అక' వర్ణక మగును. ౨౧

ఉదా:—మాఱు-మాఱకము, అమ్ము-అమ్మకము. ఇట్లు, అద్దు-త్రోము-అంపు, పెంచు-పంచు-లచకారము పకారమగును-పెంపకము-పంపకము, వండు-డకారము టకార మగును. వంటకము.

సూ:—ఎండు మొదలగువానికి 'అ' వర్ణక మగును. ౨౨

ఉదా:—ఎండు-ఎండ, తునియు-తునియ-ఇట్లు, చదియు-పఱియు-పాయు-ద్రయ్యు-పిడుచు-మీటు-ముడియు-గీఱు-ఊఁదు-చేఁదు-కట్టు-చుట్టు-మొద—కాచు-కాయ-యకార మాదేశము.

సూ:—పెంచు మొదలగుకొన్నిటికి 'డు' వర్ణక మగును. అగుచో చకారయకారములకు పకారము వచ్చును. ౨౩

ఉదా:—పెంచు-పెంపుడు, మాయు-మాపుడు, ఆఱు-ఆఱుడు, ఇట్లు రాచు-దోఁచు-వేఁచు-దాఁచు-దంచు-చూచు; త్రోయు, దిగు-ఎక్కు-ద్రేలు-పీఁకు-అమ్ము-అల్లు-పాఱు-పిసుగు-ద్రొక్కు-తిరుగు - త్రొక్కు - దక్కు - ద్రోఁగు - వాఁగు - ద్రాఁకు-విఱుగు-మొద

సూ:—ఒప్పు మొదలగువానికి 'ఉ' ప్రత్యయ మగును. ౨౪

ఉదా:—ఒప్పు+ఉ=ఒప్పు. ఇట్టి కృదంతనామవాచకములు కొన్ని కలవు. ధాతుకృదంతములకు రూపభేదము కనఁబడదు. కార్యమునుబట్టి తెలియునది.

ఇట్లు, ఒసఁగు-అంటు-ఒఱగు-పట్టు-పెట్టు-కొట్టు-కట్టు-మెట్టు-పోరు-సాగు-పొంగు-హెచ్చు-తగ్గు-పొందు-మ్రొక్కు-చదువు-వెలుఁగు-తఱుఁగు-వణఁకు-బెదరు-ముదురు-కసరు-కొసరు--కులుకు-పలుకు-బడలు-కప్పు-తప్పు-పండు-పొగడు.

సూ:—తెలియు మొదలగుకొన్నిటికి 'వి' ప్రత్యయ మగును. ౨౫

ఉదా:—తెలియు-తెలివి, తనియు-తనివి, విరియు-విరివి, గెలియు-గెలివి (గెలియు ధాతువిప్పుడు కనఁబడదు) ఉలియునకు 'వు' వర్ణక మగును. ఉలివు- దీనివలెనే ప్రాచీనకాలమందు, తెలివు గెలివు-రూపము లున్నట్లు కనఁబడును.

సూ:—తగు మొదలగువానికి 'అవు' ప్రత్యయ మగును. ౨౬

ఉదా:—తగు-తగవు, నగు-నగవు, ఉఱు-ఉఱవు.

సూ:—కొన్ని యువర్ణాంతములకు 'ఇ' వర్ణక మగును. ౨౭

ఉదా:—చేయు-చేయి, వ్రాయు-వ్రాయి, కూయు-కూయి, గ్రొయ్యు-గ్రొయ్యి-(గోయి) మొద—

సూ:—'ఇ' వర్ణకము పర మగునపుడు దయ్యు-డయ్యు-నొచ్చు-పుచ్చు-లతుదివర్ణములకు పకారద్వయ మాదేశమగును. ౨౮

ఉదా:—దప్పి—డప్పి-నొప్పి—పుప్పి.

సూ:—అప్పగించు మొదలగుకొన్నిటికి 'అన' వర్ణక మగును. ౨౯

ఉదా:—అప్పగించు-అప్పన, ఉజ్జగించు-ఉజ్జన; గడించు-గడన. ఇట్లు, గట్టించు-దట్టించు- మన్నించు- వడ్డించు- వల్లించు- దీవించు-పాటించు; ఒడ్డు-ఒడ్డనము, ఒప్పగించు- ఒప్పనము- అంగీకార

మున ఒప్పన్నము. వఙ్గెన- దీవెన- రూపములుగు గలవు. వీచు చకారమునకు వకారము-వీవన.

సూ:—దువ్వు మొదలగుకొన్నిటికి 'ఎన' వర్ణక మగును. ౩౦

ఉదా:—దువ్వు-దువ్వెన, కందు-కందెన, ఈర్చు- ఈర్పెన, ఉబ్బు-ఉప్పెన- మొద — కృదంతరూపమును బట్టి ఆదేశము లూహించునది.

సూ:—విను-కను-లకు 'కలి' వర్ణక మగును. ౩౧

ఉదా:—వినుకలి కనుకలి.

సూ:—కొలుచు మొదలగుకొన్నిటికి 'వడి' ప్రత్యయ మగును. ౩౨

ఉదా:—కొలుచు-కొలువడి, గెలుచు-గెలువడి, నడచు-నడవడి, కలుగునకు వ్యతిరేకమున 'లే' వచ్చును-లేవడి.

సూ:—విలుచు మొదలగువానికి 'వ' ప్రత్యయ మగును. 33

ఉదా:—విలుచు-విలువ, ఆగు-ఆవ, కొదరు-కొదవ, నిలుచు-నిలువ, కుదురు-కుదువ, లోచు-లోవ-ఇదియేలోయమైనది. త్రోచు-త్రోవ, నడచు-నడవ, చొచ్చునకు చొరయగును-చొరవ, తగ్గునకు 'తక్క' వచ్చును-తక్కువ, ఎక్కు-ఎక్కువ, తెగు-తెగువ, ఇట్లే యూహించునది.

సూ:—ఎగుచు-దిగుచు-ల చువర్ణమున కర్థవిశేషముల- దు-వ -మతి-వర్ణకము లగును. ౩౪

ఉదా:—ఎగుడు-ఎగువ-ఎగుమతి, దిగుడు-దిగువ-దిగుమతి.

సూ:—కొన్నిటికి 'ఇలి' వర్ణక మగును. ౩౫

ఉదా:—అంకు-అంకిలి, ఒదుగు-ఒదిగిలి-ఒదిగిళ్ళు-అనిబహువచనమున వాడఁబడును.

సూ:—రాయు మొదలగువానికి 'ఇడి' వర్ణక మగును. ౩౬

ఉదా:—రాయు-రాయిడి-ఇది గ్రామ్యపత్రికలలో 'రాయడి' గాఁగనఁ

బడును. ప్రాము-ప్రామిడి, దోఁచు-పాయు-తుదివర్ణములకు పకార మాదేశము. దోఁపిడి-పాపిడి, పాపట యనియుఁ గలదు. తఱుచు-తఱిమిడి, ఇకారమాదేశము, కలియు-కలిమిడి-మకార మాదేశము.

సూ:—పొగడునకు 'ఇత' యగును. 32

ఉదా:—పొగడిత-ఇకారలోపము-పొగడ్త-

ఇది కృత్ప్రకరణము.

---

## ప్రయోగవిశేష ప్రకరణము.

* దేశభాషలకు మార్పు సహజ మగుటచేఁ దత్సమాచ్ఛికపదములలోను ధాతువులలోను గూడఁ గొన్ని నిజధర్మమునందును గొన్ని రూపమందును గొన్ని యర్థమందును మాఱినట్లు కవిప్రయోగముల వలనను శిష్టప్రయోగములవలనను దెలియుచున్నది. అట్టిప్రయోగవిశేషముల నెల్ల నిం దుదాహరించుటకు వీలు లేదు. అది నిఘంటుకారులపని. అయినను గొన్ని యిందు మచ్చుచూపుచున్నాను. మాఱిన యర్థములు మాత్రమే వక్కాణింపఁబడును. సహజార్థములను గోశములవలనఁ దెలియునది.

ఈప్రకరణమునఁ జూపఁబడుమాఱినశబ్దార్థము లన్నిటికిని గవి

---

* తక్కినదేశభాషలమాట యేల? మనభాషకుఁ బ్రకృతు లైనసంస్కృతప్రాకృతములలోనిబహుశబ్దజాలము కాలక్రమమున రూపమందును అర్థమందును గూడ నేవిధముగా మాఱినదో, దానికిఁ దరువాతిలక్షణకర్త లెట్లు లనుశాసనము చేసియున్నారో తెలిసికొన్నయెడల శిష్టవ్యావహారికములను అర్వాచీనకవిప్రయుక్తములు నైనశబ్దము లసాధువు లనెడివాదము పుట్టకపోవును.

ప్రయోగములు చూపకున్నను గవిప్రయుక్తములను బోలిన శిష్టప్రయుక్తములును గ్రాహ్యాము లగును.

సూ:—సహాయాదివిశేషణములు విశేష్యములు గూడ నగును. ౧

ఉదా:—సహాయము-స్వతంత్రము- ఉచితము-ఇష్టము- నష్టము-జ్ఞాపకము—అబద్ధము-వాఙ్మయము-క్రూరము-దారుణము- ఘోరము-సారస్వతము-శీతలము-స్థిరము-

„భీమార్జునులలావు పెంపును నీసహాయంబును గలుగుట కలుకరెట్లు, భార—తరుణుల కొక్కింతయును స్వతంత్రము గలదే, రాజశే—ఉద్ధవుఁడు వచ్చె నీతికినుచిత మెఱిఁగి, ఉ, హరి—ధృతరాష్ట్రుండు దాన యనుభవించుం గాని మీరిదారుణంబుఁ జూడక,—భీముండు గడున్ ఘోరము చేసెను, భార—క్రూరము, నృసింహ—శీతలము, సుస్థిరము, జ్ఞానవా—

జ్ఞాపకము చేసినావు—మాకిష్టములేదు—మంగ, జ్ఞాపకము-ఇష్టము-నష్టము-అబద్ధము—మొదలయినవి విశేష్యములుగా నిప్పటివారు పెక్కండ్రువాడిరి.

సూ:—అనుమానాదిశబ్దముల కితరార్థములు గలవు. ౨

అనుమానము, సంకోచము } సంశయము

వ్యాపారము, వర్తకము } కొనియమ్ముట

దాహము=దప్పిక

ముష్టి=బిచ్చము

భేషజము=డంబము

వారము=ఏడురోజులు

వర్తమానము=వార్త

చింతించు=దుఃఖించు

అబద్ధము=అసత్యము

సభికుఁడు=సభ్యుఁడు

జాడ్యము=రోగము

భాగ్యము=ధనసంపద

పూజ్యము=శూన్యము

దిక్కు=శరణము

అవసరము=అక్కఱ

ఉత్తరము=జాబు

ప్రియము=వెలయెక్కువది

శైలి=వాక్యరచనపద్ధతి

వర్తమానించు=వార్తపంపు

ధాన్యము=వడ్లు

మర్యాద=గౌరవము

సంగతి=వార్త-పని

ఇట్టివి వందలకొలది యున్నవి. కొన్ని ప్రయోగములు.

„పున మరియాడుచుండ ననుమానముతోడ సుఘ్నేష్ణఁజూచి, భార-విపణిపర్త్య, కంబుచేత జీవనంబు నడప. విష్ణు-చిం దాడఁగ ముష్టిఁ బెట్టి బహిరంగణభూమిని నిల్చి యుండఁగన్. హంస—ప్రియము చెప్పెద నను పెల్ల భేషజంబు, హరవి—నేఁ డీసభికుల్ కనుంగొనఁగ ని ట్లయితిన్ వగ నాకు వింతయే, భార—శౌరి యున్నాఁడు మామకౌస్యమున ననుచు సభికులకుఁ జెప్పె” జైమి—తక్క-న వెల్లనిప్పటి గ్రంథములలో నున్నవి.

సూ:—గోధూమాదులు వర్ణలోప వర్ణవికారాదులను జెందినవి. 3

ఉదా:—గోధూమములు-గోధుమలు, మహాదేవుఁడు-మహదేవుఁడు, యాయావరము-యాయవారము, వాసరము-వారము, మండపము-మంటపము, యౌవనము-యవ్వనము, యజమానుఁడు-యజమాని, మహారాజు-మహరాజు, మొద—ఇట్టివి సంస్కృతాభాసము లనఁబడును. కాని యిందు కొన్ని ప్రాకృతసమములు. ఇవి కొన్ని సంస్కృతపదములతో సమసించుటయుఁ గలదు. కొన్ని ప్రయోగములు.

„మహదేవుఁ డొక్క-ంత మసలి వే కాంచి, పండితా—మఱియును మును బెజ్జమహదేవి యనగ, బసవ—అని యక్క- మహదేవి యల్లమప్రభువు, ప్రభులిం-రం జిల్ల యాయవారంబు లెత్తి, హంస, అవ్వనములు దమపుయమై । యవ్వనమున నొకటి కొకటి నఱుముచు మిగులన్, పద్మ—నవ్వ్యమఁ జెక్కు- మీటి నలినస్ఫుటలోచన మాట లేలని। యవ్వనలక్ష్మికిన్ ఘటుఁడనైతినను గరుణింపు, భోజరా—” యజమానికి ముందుగ విందొనరించి, ఏలా—ఈశబ్దము నిప్పటివా రనేకులు వాడిరి. నామలింగానుశాసనమందు వాసర మర్థమున వారశబ్దము లేదు. తరువాత దానిశేషములోఁ జేరినది.

సూ:—చేరు మున్నగు కొన్నిశబ్దములును, వలదు మొదలగు కొన్ని క్రియలును రూపమున మార్పు చెందినవి. ౪

ఉదా:—చేరు-చేూరు-చారు, జెలగ-జేలగ-జలగ, సేలు-సాలు-శాలువు, జోమారు-జామారు, దయ్యము-దెయ్యము, బరదు-బెరదు, చలిది-చల్ది-చద్ది, కొలఁది-కొల్ది-కొద్ది, ఒద్ద-వద్ద, చవ్వ-చప్ప,

ములుకోల-మునికోల, కడప-గడప, నెమిలి-నెమలి, అవిక-ౘైక, గరిటె-గంటె, జేడ-జడ, మగ-మొగ, మొగ్గ-మగ్గ, కొంౘకచ్చు-కొంౘకంచు, చీల-సీల; వలదు-వల్దు-వద్దు, కలదు-కల్దు-కద్దు, వలయును-వలెను, మొద—

శిష్టవ్యవహారమందున్న రూపాంతరములు కవులు వ్రాసిరనుట కింకొకయుదాహరణము. బొట్టనవ్రేలు-బొటనవ్రేలు-బొట్టవ్రేలు-బొటవ్రేలు-బొట్నవ్రేలు-బొటమనవ్రేలు.

జలగ మొదలగువానికిఁ గొన్ని ప్రయోగములు.

„జలగ దిగిచినట్లు గొనఁగఁ జను నిల సొమ్ముల్, భార—మేలు కాంచి చద్దన్నము మెక్కి, సానం—కొద్దిగ నున్న నెన్నడుము, కూఁకటి కందక, అనిరు—వచ్చి యానరనాయకువద్ద నిలిచె, చిత్రభా—అచ్చుసలు, వద్ద తొలంగినసందు చూచి, వైజ—విడివడ్డ జైకతో, తారా—కల్పవృక్షగ్గయుఁబోలె నిప్పుడు సమంచిత పలిమ పయ్యెఁ జూడ్కికిన్, కాశీఖం—మొగతాళ ళ్కనఁటిన్ మిటారికపురంపు బల్కు గారాకు దీఁగమిన్, చంపూరా—వారికిఁ జెప్పనున్ మఱుఁగ దిది యంతట, బసవ—కద్దో లే దనెడినదుముకలదా చెలికిన్, సురా—శ్రీగావలె నంచఁ బోరితము” భార— దంత మర్ధముగల ‚పల్లు’ పన్నుగా వాడఁబడుచున్నది. ప్రయోగ మిప్పటిది. దానిపన్నులంగనఁబడు మాంసలేశమును. శ్రీకృ. భా—మునుఁగు ‚ములుఁగు’ గా నిందే ప్రయోగింపఁబడినది.

చారు-జామారు-జలగ-నంటిశబ్దములనుబట్టి అ-ఆ-లతోఁగూడి తాలవ్యము లైన చజలు తెలుఁగునఁ జేరిన వనియు, మాష్టీఁడు-శమాషా-శాలువు “నయసంధాయకచాతురి న్మెలఁగుశాణా వైలివా-రంగరా-” శాణా-మున్నగువానింబట్టి తెలుఁగున శవర్ణషకారములు గూడఁ జేరిన వనియు గ్రహించునది.

సూ:—కొన్ని ఎకారాంతములు అకారాంతము లైనవి. ౨

ఉదా:—పంచె-పంచ, వ్యాజ్యెము-వ్యాజ్యము, ముంజె-ముంజ, వదినె-వదిన, కపిలె-కపిల, కోరికె-కోరిక, మొలికె-మొలిక, తీఁగె-తీఁగ

పోలికె-పోలిక, చేరికె-చేరిక-మొద—

ఈపైశబ్దము లన్నియు నిపుడు అకారాంతములుగానే వాడఁబడుచున్నవి. ఇందు గొన్ని ప్రయోగసిద్ధము లనుట తెల్లము.

సూ:—మిద్దె మొదలగువాని తుదిఎకారము ఏకవచనమున వైకల్పికముగా అకార మగును. ౬

ఈక్రిందివి బహువచనమందు ఎకారాంతములే యగును.

మిద్దె- మిద్ది- మిద్దెలు. పెట్టె- పెట్టి-పెట్టెలు. నూనె-నూని-నూనెలు. మల్లె-మల్లి-మల్లెలు. లంకె-లంకి-లంకెలు. బిందె-బింది-బిందెలు. గిన్నె-గిన్ని-గిన్నెలు. పుస్తె-పుస్తి-పుస్తెలు. కంటె-కంటి-కంటెలు. తేనె-తేని-తేనెలు. గద్దె-గద్ది-గద్దెలు. గొత్తె-గొత్తి-గొత్తెలు'

ఇట్టి వూహ్యములు. మిద్దియ మొదలగువానిలోని ఇయ. ఎకార మైనపుడు మిద్దె మొదలగురూపములును, యకారము లోపించినపుడు మిద్ది మున్నగురూపములు నగును. కాని యకారలోప మేకవచనమందే నచ్చును. వైకల్పిక మనుపదము తరువాతిసూత్రముల కనువర్తించుచుండును.

సూ:—మఱికొన్ని ఎకారాంతములు రెండువచనములందును ఇకారాంతము లగును. ౭

ఉదా:—బూరె-బూరెలు, బూరి-బూర్లు; గారె-గారెలు, గారి-గార్లు; బోదె-బోదెలు, బోది-బోదులు; గాదె-గాదెలు, గాది-గాదులు; కోర్కె-కోర్కెలు, కోర్కి-కోర్కులు; ఇట్టి వూహ్యములు.

సూ:—చెలియ మొదలగుకొన్నిటితుదియవర్ణము లోపించును. ౮

ఉదా:—చెలియ-చెలియలు, చెలి-చెలులు ; సకియ-సకియలు, సకి-సకులు.

సూ:—కొన్నిటిలోని ఎకారము అకార మగును. ౯

| | | |
|---|---|---|
| ఉయ్యెల-ఉయ్యాల | సంపెఁగ-సంపఁగి | మెట్టె-మట్టె |
| పయ్యెద-పయ్యద | బోయెత-బోయతి | మురిపెము-మురిపము |
| నాఁగెలు-నాఁగలి | గొజ్జెఁగ-గొజ్జఁగ | వెలిపము-వలిపము |
| వడ్డెన-వడ్డన | సేలు-సాలు | మెయి-మయి |

ఇత్యాదులు- దీవన ప్రాచీనకృతులందును, దీవెన అర్వాచీన కృతులందు నున్నది. పైశబ్దములు కావ్యములలో నున్నవి.

"ఉయ్యెల-పయ్యెద-తాయెతు-లలోని మధ్యయకార మెత్వము గలది యని కొంద అనిరి కాని, అకారమధ్యము లగుటకును ప్రయోగము లున్నవి. ఇందు ఉయ్యెల శబ్దము, ఉయ్యేల-ఉయ్యల-ఉయ్యాల-ఉయాల-ఊయల-యనునట్లు బహువిధముగా మాఱినది.

" అచ్చరచెలువ లుయ్యాలచేరులు సేల, వైచి; కుప-ఉ, య్యలనూఁపుచుఁబె నపఁ దొడఁగె నావరశిశువున్, కళా-నిలువ్రటద్దముల గంటలయుయాలలు, పోడ-మానవేగమునఁ బయ్యదకొంగు సడలి" పోడ-బోయెత కొకప్రయోగ మున్నది. బోయెత తటి వేచి వింటఁ గదియించిన వేఁగురుఁజుక్క-యుంట, హ-నలో

సూ:—ప్రమాను మొదలగువానిలోని రేఫము లోపించును. ౧౦

ఈ రేఫలోపము కవిలాక్షణికసమ్మతమై కనవచ్చును.

"మాను మానుట తరువు నా మా ననంగ-వేల్ ప్రే లన నంగుళి యగు-పాయి ప్రొయ్యి నా నధిశ్రయణి వెలయు, సాంబని--ముసలిమానులు, వసు-శ్లేష, ఇత్యాదులు కలవు.

ఉదా:—ప్రమాను-మాను, క్రొత్త-కొత్త, ప్రాఁత-పాఁత, క్రోఁతి-కోఁతి, ప్రోగు-పోగు, ప్రాక-పాక, ప్రేము-పేము, త్రాడు-తాడు, త్రెంచు-తెంచు, త్రోలు-తోలు, త్రంపి-తంపి, మ్రొక్కు-మొక్కు, క్రుళ్ళు-కుళ్ళు, ప్రుచ్చు-పుచ్చు, ముగ్గు-ముగ్గు, మ్రబ్బు-మబ్బు, ప్రగ్గము-పగ్గము, మ్రోడు-మోడు, బ్రద్ద-బద్ద, క్రక్కు-కక్కు, పక్క-ప్రక్క,

ఇట్టి వెన్నోకలవు పైవానిలో ననేకములు రేఫరహితములై

కావ్యములఁ గనబడును. త్రాడు-త్రాసు- ప్రెగడ-ప్రేరేచు-ప్రేముడి-క్రమ్మఱు-గ్రక్కున- ప్రొద్దు- మొదలగుకొన్నిటిలోని రేఫము శ్రావ్యమగును గాని పెక్కుశబ్దములలోని రేఫము చెవి కింపుగా నుండదు. కావుననే యట్టివానిలోని రేఫము వాడుకలో నడు గంటినది.

సూ:—కరఁగు మొదలగువానిలోని అకారము ఉకార మగును. ౧౧

ఉదా:—కరఁగు-కరుఁగు పెనఁగు-పెనుఁగు నలకు-నలుకు
అరఁగు-అరుఁగు నడచు-నడుచు వెదకు-వెదుకు
తెఱఁగు-తెఱుఁగు జరగు-జరుగు అణఁగు-అణుఁగు
పలచు-పలుచు బోరన-బోరున వణఁకు-వణుఁకు.

ఇట్లు మాఱిన వనేకములు గలవు. వీనిలోఁ గొన్ని పూర్వకావ్యముల నున్నవి. ఇట్లు ఉకారమధ్యము లయినకొన్నిటికి అకారాదిప్రత్యయములు పర మగునప్పుడు ఉకార మకార మగును.

ఉదా:—వణఁకక-గొణఁగడు-అణఁగడు. మొ—

సూ:—చిలుక మొదలగువానిలోని ఉకారము అకార మగును. ౧౨.

ఉదా:—చిలుక-చిలక, ఇసుక-ఇసక, పలుక-పలక, చలువ-చలవ, ఇరువై-ఇరవై, తములపాకు-తమలపాకు, చులుకన-చులకన, అఱువై-అఱవై, పదునొకండు-పదనొకండు, పడుక-పడక, ఎలుక-ఎలక, పలుచన-పలచన. మొ—

సూ:—తీగ మొదలగువానిగకారము వకార మగును. ౧౩

తీగ-తీవ, తొగ-తొవ, అగు-అవు, పరుగు-పరువు, ఈగి-ఈవి, చిగురు-చివురు, త్రాగు-త్రావు, వేసఁగి-వేసవి, విసుగు-విసువు, ముగురు-మువురు, మిగులు-మివులు, తెగులు-తెవులు. మొ—

కొన్నిటివకారము గకార మగుటయుఁ గలదు- పవడము-పగడము. మొద—

సూ:—నాఁడెము మొదలగువాని డకారము ణకార మగును. ౧౪

నాడెము-నాణెము పుసుకు-పుణుకు వడఁకు-వణఁకు అడఁగు-అణఁగు ఇట్లు మిసుఁగుఁబు-పెడక-తడగము-జల్లాడము-పోఁడి మొద—

సూ:—మొగము మొదలగు కొన్నిశబ్దములం దొకయక్షరమునకు లోపమును దానివెనుకటియచ్చునకు దీర్ఘము నగును. ౧౫

మొగము-మోము, నెయ్యి - నేయి, తొయ్యలి - తోయలి, తెమ్మ-తేమ, నగము-సాము, నుయ్యి - నూయి, తలవరి-తలారి, మొక్క-మోక, చివుకు-చీకు, పెయ్య-పేయ, దివ్వియ - దీవియ, అయ్యె-ఆయె, తెప్ప-తేప, నువ్వు-నూవు, కున్న-కూన, నొవ్వు-నోవు- మొద—

సూ:—ఈకార్యము కొన్నితత్సమములందును గనవచ్చును. ౧౬

ముహూర్తము-మూర్తము, సహజము-సాజము, సహాయము-సాయము, సహవాసము-సావాసము, సహవాసి-సావాసి, గ్రహము-(గహము) గాము. మొ—

ఇవి తద్భవములు లనఁబడుచున్నవి. వరాహముద్రగలనాణెము వరాహము. దాని బహువచనరూపములు, వరాహములు-వరాహాలు. ఈకడపటి రూపము 'వరహాలు'గా మాఱినది. 'హా'లోపింపఁగా వరాలు. దీనినుండి ఏకవచనరూపము'వరా'యని వాడుకలోనికి వచ్చినది. కావ్యములకు నెక్కినది. దీనిమార్పు నంగీకరించినవారీక్రింది వానిసంప్రదాయము పరిశీలింతురు గాక.

ఒకటి-ఓటి, ఒకరాత్రి-ఓరాత్రి. వీనికి వాడుకయేకాదు ప్రయోగములు కలవు.

"ఓరాత్రిం గను జెప్ప వేయక మహోద్యోగంబునన్ ధీరశాతీఘోరంగర్యము, కాశీ—౭—౧౩౦—విష్ణుపదం బన్న విష్ణుకాలికిని।పేరోటి దై యున్నకారణంబునను, పండితా—సావాసి యనుటను—నావుడు సంతోషించిరి।సావాసులు వీరవచనచతురత సత్యా।దేవియు, ఉ. హరి—౩—౩౮.

సూ:—లోపించువర్ణ మనునాసిక మైనచో దానికి గుర్తుగా నరసున్న యుండును. ౧౭

మింగడ-మీఁగడ, దనుక-దాఁక, దుముకు-దూఁకు, మంగు-మాఁగు, లొంగు-లోఁగు, కలయంపి-కలాఁపి, పెండ-పేఁడ, ముంగ-మూఁగ, తలయంపి - తలాఁపి, మండెము - మాఁడెము, కుంకటి-కూఁకటి, మొద—

సూ:—మొకము మొదలగువాని కకారము గకార మగును. ౧౮

మొకము-మొగము, మెకము-మెగము, కడప-గడప, సిక-సిగ-నమ్మిక-నమ్మిగ, దాకలి-దాగలి, మచ్చిక-మచ్చిగ, సెక-సెగ, ఇఁక-ఇఁగ, క్రుచ్చు-గ్రుచ్చు, సకిన-సగిన, మొద—

సూ:—కొన్నిశబ్దములలోని ప- బ- వ- అనువర్ణములకు మకారము వచ్చును. ౧౯

సంపెట-సమ్మెట,ఇంపు-(ంబు)ఇమ్ము; రెబ్బ-రెమ్మ, గుంబము-గుమ్మము, గుబురు-గుమురు; మావిడి-మామిడి, నెవిలి-నెమిలి, కవియు-కమియు, తాఁబేలు-తామేలు, తంబళి-తమ్మళి, పంబఱ్ఱు-పామఱ్ఱు, మొద—

సూ:—కొన్నిటి వకారమునకు బకారముగాని పకారము గాని వచ్చును. ౨౦

వదనిక-బదనిక, వీరము-బీరము;చవ్వ-చప్ప,నొవ్వి-నొప్పి. మొ-

సూ:—కొన్నికొన్నిటి వకార హకారగకారములు ఇ ఈ ఎ ఏ లతోఁ గూడినపుడు యకారము లగును. ౨౧

| | | |
|---|---|---|
| బవిసి-బయిసి | సహితము-సయితము | ఓగిరము-ఓయిరము |
| అవిక-అయిక | సహించు-సయించు | మొగిలు-మొయిలు |
| కోవిల-కోయిల | కవిత-కయిత | వావింట-వాయింట. |

సూ:—కప్పురము-నిట్టరాడు మొదలగువానిలోని రెండవయచ్చు

లోపించును దానితో ద్విత్వవర్ణమును బోవును. ౨౨

ఉదా:—కప్పురము-క్రపము, నిట్టరాడు-నిట్రాడు, అబ్బురము-అబ్రము, పట్టణము-పట్నము, కట్టనము-కట్నము, కొట్టనము-కొట్నము, సీవరము-సీద్రము, కంటలము-కంట్లము, రావిరేక-రావ్రేక, కముజు-కంజు, రాటనము-రాట్నము, సెబ్బర-సెబ్ర, ఉంగరము-ఉంగ్రము, సంబరము-సంబ్రము, గొడ్డురాలు-గొడ్రాలు, కత్తిరించు-కత్రించు, పొత్తరము-పొత్రము, చప్పరము-చప్రము, నెత్తురు-నెత్రు, కట్టురాడు - కట్రాడు, గుండురాయి-గుండ్రాయి, మొద—

ఇవి యన్నియుఁ గావ్యములలోనివి. 'రా' పరమగునపుడు-దొడ్రా- గిడ్రా-పీఁడ్రా-ఇత్యాదులును బ్రయోగింపఁబడియున్నవి.

సూ:—బ్రదుకు మొదలగువానిదకారము తకారమగును. ౨౩

ఉదా:—బ్రదుకు-బ్రతుకు, మెదుకు-మెతుకు, వెదకు-వెతకు, ముదుక-ముతుక, ఉదుకు-ఉతుకు, గదుకు-గతుకు, చిదుకు-చితుకు, చదికిలు-చతికిలు-మొద—

సూ:—దక్కు మొదలగువానిదకారము డకారమగును. ౨౪

ఉదా:—దక్కు-డక్కు, దిగు-డిగు, దాఁగు-డాఁగు, దాయు-డాయు, దప్పి-డప్పి,దాపల-డాపల, మొద-డకారము వచ్చినరూపములు కావ్యములలో నుండును.

సూ:—ఏతము మొదలగువాని మువర్ణమునకు వెనుకనున్నయచ్చునకు దీర్ఘము వచ్చును. ౨౫

ఉదా:—ఏతము-ఏతాము, గోతము-గోతాము, పెండ్లము-పెండ్లాము, లాతము-లాతాము, మొద—

సూ:—తెంకాయ మొదలగువానితకారము టకారమగును. ౨౬

ఉదా:—తెంకాయ-టెంకాయ, గుంత-గుంట, జుత్తు-జుట్టు, తక్కు-

లాఁడి-టక్కులాఁడి, లొత్త-లొట్ట, తక్కు-టక్కు. మొద—

సూ:—చిన్న-ఉసుక-మొదలగువాని అకార ఉకారములు ఇకారము గాను, అలికిడి మొదలగువానిఇకారము ఉకారముగాను యథా ప్రయోగముగా మాఱును. ౨౭

| | | |
|---|---|---|
| చిన్న-చిన్ని | ఉసుక-ఇసుక | అలికిడి-అలుకుడు |
| పోలిక-పోలికి | నాలుక-నాలిక | కుత్తిక-కుత్తుక |
| నడత-నడితి | నొవ్వు-నొవ్వి | పాడి-పాడు |
| తెల్లము-తెల్లమి | పిచ్చుక-పిచ్చిక | పిల్లి-పుల్లి |
| తెంపు-తెంపి | జవ్వాదు-జవ్వాది | మొగిలు-మొగులు |

ఇట్టి వనేకములు వాడుకలోను కావ్యములలోనుగూడఁ గలవు.

సూ:—జూదము మొదలగువాని దకారము జకార మగును. ౨౮

ఉదా:—జూదము-జూజము-దేంద్ర-జేంద్ర, బూదు-బూజు, విరజాది-విరజాజి, విరవాది-విరవాజి-మొద—

సూ:—కొన్నిశబ్దముల మొదటిహల్లు లోపించును. ౨౯

హోరు-ఓరు, హెచ్చు-ఎచ్చు, హడపము-అడపము, హత్తు-అత్తు, హరిదళము-అరిదళము (అరదళము) పొందు-ఒందు, పొనరు-ఒనరు, పూను-ఊను, పొదవు-ఒదవు, నెగయు-ఎగయు, నగ్మిలి-అగ్మిలి, నీలుగు-ఈలుగు, నల్లు-అల్లు, వేర్పడు-ఏర్పడు, వేయు-ఏయు, చిగురు-ఇగురు, ఇట్టివి పెక్కుశబ్దములు కావ్యముల నున్నవి.

సూ:—మోపు మొదలగుకొన్నిశబ్దములమీఁది పెట్టు మొదలగుకొన్ని ధాతువులమొదటిహల్లు లోపించుటయుఁ గలదు. ౩౦

ఉదా:—మోపు+పెట్టు-మోపు+ఎట్టు=మోపెట్టు, ఇల్లే, బొబ్బ పెట్టు-బొబ్బెట్టు, తుడుపుపెట్టు-తుడుపెట్టు, త్రోపుపడు-త్రోపడు, ప్రోపుపడు-ప్రోపడు, ఊర్పుపోవు-ఊరోపోవు, ఊర్పు

పుచ్చు-ఊర్పుచ్చు, కన్నము వేయు- కన్నమేయు, గంతులు వేయు-గంతులేయు, తెరువుపట్టు- తెరువట్టు, తలఁబ్రాలుపోయు తలఁబ్రాలోయు, మొదలయినవి భారతాదులనున్నవి. ప్రయోగములు.

..మాయాధను విమ్ములఁ జేసిన మోపెట్టఁగఁ గొలఁదియె, భార-ఆ—బొబ్బెట్టు మృగము, ౬౦. భా—తుదుపెట్టు, సుక.సు-త్రోపడి యిరులుపటాపంచలై పా కెు,సును-త్రోపడు,శ. ర—శ స్త్రవారముల్ రాంద్రమైయూర్పు సండఁగనించి న్, నిర్వ-వార్ధి స్వామి యూర్పుచ్చె, శేష—రేద్యనము కన్నమేసి చరితంబున డక, చెన్నబ—గజిస్య-నమ్మాటనుగంతులేయున్, అప్పక-ఇండ్లలోపల గంతు రేయువారు, శశిరే—తలఁబ్రాలోయు తెలంగు, దశా—తెరువట్టి, జ్ఞానవా—పొద్దుచ్చు-కోపముట్టఁగా, రంగరా—దండమెట్టు-కస్తూ-శ—ఓరామ యెవరు యుసు రోసికొనిరొ,- మృత్యు—"బోబెట్టు- ఎత్తెట్టు-బొట్టెట్టు- చూపెట్టు- మెుఁగెట్టు-నొప్పెట్టు-కాపెట్టు-పట్టట్టు- మొ-వ్యావహారికములు-లఁగరేసి,|శీక్ర- —వానిని గద్దల కేసెద—ఉషా—

సూ:—త్రెగు మొదలగు వానితుదివర్ణములకు లోపమును మీఁది హల్లునకు ద్విత్వమును యథాప్రయోగముగా నగును. 3౧

ఉదా:—త్రెగన్ + కొట్టు= త్రెక్కొట్టు- త్రెగురూపాంతరము తెగు వసిద్ధము- తెక్కొట్టు, అడుగు+కొను=అడుక్కొను, ఎలుఁగు+ గొడ్డు=ఎలుగ్గొడ్డు-మొదలయినవి ప్రయోగసిద్ధములు. వీని వలెనే, కర్కాయ- కరక్కాయ, వెలఁగకాయ-వెలక్కాయ, వాకకాయ - వాక్కాయ, కొనుకొను - కొనుక్కొను, ఎగఁగొట్టు-ఎక్కొట్టు, మొద—శిష్టవ్యవహారములోనివి.

..ఎక్కి- కలహాశికన్నులఁ త్రెక్కొట్టిన వినక కలవు దీఅన్ మెక్కెన్. మా—జనని యడుక్కొని చదువుకోఁ బొమ్మన్న, వినక వేమను, హంస—మట్లు మా కెలుగ్గొడ్లు సుమ్ము, సారంగ—"

సూ:—వ్యతిరేకక్త్వార్థకముమీఁద 'ను' చేరుటయుఁ గలదు. 3౨

..ఆధారములేకను సంతానచ్ఛేదంబున వ్రేలెద, భార—ఆ-2-139. ఇది ప్పటిచుచ్చులో ..అ

కాఱడవిఁ బఱచుమృగములనూఱడకం దెగిచి డస్సి. భార-ఆది-4-18 మఱటిలేకనె వచ్చితి రదేమి కల్కన్న-ఉ. నై, అంగజవ్యాధులను మాన్పకం గరంబు-సారం, కాలు కదలింపలేకన్, నాలెమునడుగున-కవిజ—

రాక న్మానవు హానివృద్ధులు మహారణ్యంబులోఁ డాఁగినన్-భాగ: కోపంబు సనేవలాడ వినలేకను దేశభ్రమణవృత్తి-హంస, తడఁబడకం బోయి . సావధానము గాఁగన్-శివర, కనుగలవిల్లు నంటకయె ఖంగని ప్రోయుగుణంబు గంటిలేకనె చంద్రభా—ఇట్టిప్రయోగ లందందు గలవుకాని వీనికి విశేషవ్యాప్తి లేదు.

సూ:—అక్కడ-ఇక్కడ-ఎక్కడ-లకుఁ గ్రమముగా- ఆడ- ఈడ-ఏడ-రూపాంతరములు కావ్యప్రసిద్ధములు. 33

„పోవఁగ లే కాడ నాడఁ బోరలుమెకంబుల్, చంద్ర-ఏడకుఁ జనునో-దైవం బీడకుఁ దెచ్చెను, రాధామా—ఆడాడ సరిజేసు లాడ„ యయాతి—

సూ:—వంగ-టెంక-వెలఁగ-శబ్దములకు ‹కాయ' శబ్దము పర మగునపుడు తుదివర్ణము లోపించును. 34

ఉదా:—వంగ+కాయ= వంకాయ, టెంక+కాయ= టెంకాయ, వెలగ+కాయ=వెలంకాయ, అరసున్న నిండుసున్న యైనది. మునగశబ్దము వాడుకలో ‹ములగ' యైనది. కాడ పర మగుచో గలోపము నిండుసున్న-ములంకాడ. వార్తాకి యనఁబడు ములక వేఱు.

సూ:—‹దురుచు' దకారముమీఁది ఉకారము లోపించును. 35

ఉదా:—అదురుచు-అద్రుచు, ఎదురుచు-ఎద్రుచు, పదురుచు-పద్రుచు మొద—ఇట్టివి పూర్వకావ్యములఁ గలవు. ఈకార్య మితర శబ్దములందును గనవచ్చును. ఇగురుచు-ఇగ్రుచు, చిదురుపలు-చిద్రుపలు-

సూ:—కొన్ని శబ్దములతుదనుండుద్విత్వము లేని-ను-లు- రు-వర్ణముల ఉకారము హల్లు పర మగునపుడు లోపించును. 36

ఉదా:—మ్రానుపడె- మ్రాన్పడె, పలుమరు- పల్మరు, కారుకొను-కార్కొను, ఇట్లు వారల్‌వచ్చిరి. వత్తురార్యారు-మొద— అవ

సానమందును బహువచనలువర్ణముయొక్క ఉకారము లోపించును. వనితల్-వనముల్-మొ

సూ:—కొన్ని వ్యస్తపదములును సమస్తపదములును శబ్దపల్లవములును విశేషార్థము లిచ్చుచున్నవి. 32

ఉదా:—నయము= కుదురుట– బాగుపడుట, చెక్క-పక్క= పోఁక కాయబద్ద, మైల=మృతాశౌచము, కూర=కాయలు దుంపలు వండినశాకము, లవంగచూరు=సన్నముగాఁగ త్తిరించియుడుకఁ బెట్టినపోఁకబద్దలు, సీలిపండించు=అసత్యమాడు, కైంకర్యము చేయు=దొంగిలించు, పక్కవేయు=పండుకొను, కాగితము= జాబు (దత్తమండలముల) మొద—

సూ:—సడ్డించు మున్నగుకొన్ని ధాతువులు వ్యవహార ప్రసిద్ధములు.

ఉదా:—సడ్డించు=వంకరలెన్ను, సణుగు=వినఁబడకుండఁగా దూపించు, సాదించు=ఇతరులచేఁతలోఁ దప్పులెంచినిందించు, బోర్లించు=బిందెమొదలగువానిని దలక్రిందుచేయు, బిందించు= చినుకు, చిత్తకార్తె బిందించినది—ఈయర్థమందే ధూర్జటి “కన్య భిన్నింప దయ్యె-కాళ--” ప్రయోగించెను. వేయించు- కూరలు మొదలగువానిని వేగఁజేయు. ఇత్యాదు లూహ్య ములు.

సూ:—పూచు-కాచు-ధాతువులు యువర్ణాంతములు నగును. 3౯

ఇవి మోచు-గీచు-ధాతువులవంటివి. వ్యవహారసిద్ధములు.

ఉదా:—ఆమొక్క పూసినది. ఈచెట్టు కాసినది. అని వాడుక.

సూ:—బంగారము మొదలగు కొన్నిశబ్దముల రెండవదీర్ఘాచ్చు హ్రస్వ మగును. ౪౦

ఉదా:—బంగారము-బంగరము, బంగారు-బంగరు, దేవేరి-దేవెరి, పూజారి-పూజరి, తోడేలు-తోడెలు, మారేడు-మారెడు,

కౌమారుఁడు-కొమరుఁడు, కర్పూరము-కప్పురము, కకూ-
జితి-కక్కజితి-పలుమాఱు-పలుమఱు, మొద—

ఇట్టి వనేకములు కలవు. ఇందు పెక్కుశబ్దముల హ్రస్వరూప
ములు కావ్యములందు మాత్రమే యున్నవి.

సూ:—ఓయారము మొదలగు కొన్నిటి మొదటిదీర్ఘము హ్రస్వ
మగును. ౪౧

ఉదా:—ఓయారము-ఒయారము, జోహారు-జొహారు ఇట్లు, గూ
డారము-బేహారము వీడియము- వీటతాటము- కోలె- కూయి-
చేయి-బాజాఱు- మొద—

సూ:—దీర్ఘాంతము లైన కొన్నిదేశ్యములును అన్యదేశ్యములును
హ్రస్వాంతములు కావు. ౪౨

ఉదా:—కిటికీ-కుర్చీ-పల్లటీ- సీసా- బస్తా- బురకా- జిల్లా- గుమాస్తా-
జెండా-పరగణా-కొరడా-బాకీ-బస్తీ-గస్తీ- తగాదా- తమాషా-
జిలేబీ-పకోడీ-జుబ్బా-అంగరకా-తింగణా-శాణా-కాలేజీ- మొ.

సూ:—అనాదరముతోఁ జెప్పునపుడు ఆమ్రేడితముయొక్క మొదటి
హ్రస్వదీర్ఘాక్షరములకుఁ గ్రమముగా-గి-గీ-లగును. ౪౩

ఉదా:—రావణుఁడు గీవణుఁడు- అసురుఁడు గిసురుఁడు మొద—

హరియించుచున్ గిరి యంచు నేల చెడ మోహాంధుండవై, పుత్రకా, భాగ.
వాలిం గీలియు వాయు పుత్రు సరియే, నిర్వ—

సూ:—సంస్కృతశబ్దములందును వర్ణలోపవర్ణవ్యత్యయాదులు కన
వచ్చును. ౪౪

ఉదా:—పృథివి-పృథ్వి, నూతనము-నూత్నము, అంకూరము-అంకు
రము, కహ్లారము-కల్హారము, నాళికేరము-నారికేళము, గీర్వా
ణులు-గీర్వాణులు, లకుచము-లికుచము, మృత్స్న-మృత్స
పత్తనము-పట్టణము, అకూపారము-కూపారము, లిబి-లిపి

శైవాలము-శైవలము, పరిహాసము-పరీహాసము, వివాదము-
వీవాదము, (వాగ్వీవాదమింతేటికిన్-కాశీ-) మొ—
ఇట్టివి వేలకొలఁదిగా నున్నవి. కావున శబ్దజాలమునకు మార్పు
నైజ మని తెలియునది.

సూ:—మాండలికములు దేశ్యములే యగుట నప్రయోజ్యములు
కావు. ౭౫

ఒకజిల్లాలోనికొన్ని మాట లింకొకజిల్లాలోనివారికిఁ గ్రొత్తగా
నున్నను వానిని గ్రామ్యము లనరాదు. అట్టి వన్నియు దేశ్యములే.
కావున వేఱువేఱుజిల్లాలలోని వైనను దేశ్యములు ప్రయోగార్హము
లే యగును. ఇందుకు సమానార్థకము లైన వేఱువేఱుజిల్లాలలోని
కొన్నిపదము లుదాహరించెదను.

ఈక్రిందిగుంపులు పర్యాయపదములని గ్రహించునది.

ఎక్కువ-చాలా-సేనా-లావు-మస్తు; డబ్బు-కాసి-దుడ్డు-బొట్టు-
పైసా; పప్పు-బేడలు; చెక్కలు-వక్కలు-పోఁకలు; గేదె-బఱ్ఱె
ఎనుము; అద్దె-బాడిగ; గుంట-పిల్ల; జుత్తు-జుట్టు, ఇత్యాదు
లూహ్యములు.

## అన్యదేశ్యములు

సూ:—వాఙ్మయాభివృద్ధి కావశ్యకము లైనయన్యదేశ్యములు వ్యావ
హారసిద్ధములు గ్రాహ్యములు. ౭౬

సంస్కృతమందలియవ్యుత్పన్నప్రాతిపదికములలో ననేకములు
పరభాషలనుండి వచ్చిన వని తెలియుచుండఁగాఁ దెలుఁ గభివృద్ధిఁ బొందు
టకును, ఇది సర్వతోముఖ మయినసారస్వతము గాంచు టకు
ను గావలసినయన్యదేశ్యము లవశ్యగ్రాహ్యము లని వేఱుగాఁ జెప్ప
నక్కఱలేదు. కావున వాడుకలోఁ బాతుకొనిపోయినయన్యదేశ్యము
లేవి లేకున్న వ్యవహారము నడవదో యవియును సారస్వతము పెం

పొందుటకు గ్రహింపఁదగినపారిభాషికాదిపదములు నట్లే గ్రహింపఁ దగును. ఇంతకు మున్ను హిందూస్తానీభాషనుండి యనేకశబ్దములు నిజరూపముతో నెట్లు తెలుగునఁ గలిసినవో (కాగితము-కలము-సిరా-సెబాసు-కొరడా-కిస్తీ-) అట్లే యింగ్లీషునుండియు ననేకములు నిత్యవ్యవహారమునఁ బ్రవేశించి యున్నవి. వానికి సంస్కృతాంధ్రశబ్దములు కల్పించినను వానియర్థమును సరిగా నియ్యఁజాలవు. కల్పించినశబ్దములను బ్రజలు వాడరు. కావున ననివార్యములయినయట్టిశబ్దముల నట్లే గ్రహింపఁదగును. కల్పితశబ్దములు వ్యవహారదక్షములు కా వనుటకుఁ గొన్ని, కలెక్టరు=మండలకరగ్రాహి, రైలు=ధూమశకటము, స్టేషను=ధూమశకటస్థానము, పెన్సిలు=సీసపుఁగణిక- మొ—

ఉదా:—హిందూ—అసలు- ఫాయిదా- ఈనాము- జిరాయితీ-శిస్తు తీరువాయి- తయారు- వసూలు- అర్జీ- ఫిర్యాదీ- ముద్దాయీ-వాయిదా-జవాను-రోజు-ఖబురు- సిరస్తదారు-ఠాణా-ముఠా-కాటా-సవాసేరు-సలహా-సప్లై-సుమారు- మొద—

ఇంగ్లీషు-కలెక్టరు-రైలు-మైలు-రోడ్డు-లాంతరు-లాంపు-చిమ్నీ-కార్డు-కవరు-టిక్కట్టు-కాఫీ-ఫోటో-ఫర్లాంగు-వాచీ- సైకిలు-స్టాంపు- మోటారు-లాకు- మొద— పైనుదాహరింపఁబడిన రెండుభాషలలోని పదములలో ననేకము లిపుడు శబ్దరత్నాకరమున నున్నవి.

## అరసున్నలు-బండిఱాలు.

వీనిస్థితి మిక్కిలి యవ్యవస్థముగా నున్నది. పండితులుకూడ వీనిమెడ భ్రాంతిపడుచు శబ్దరత్నాకరము శరణముగా వీనిని బ్రయోగించుచున్నా రనుటయే వీనియవ్యవస్థతకును దురవగాహతకును దగిన తార్కాణము. ఆశబ్దరత్నాకర మైనను వీనినిజస్థితిని చక్కఁగాఁ దెలియఁజేయుచున్నదా? లేదు. శాసనములందును లిఖితపుస్తకముల

లందును ప్రాచీనముద్రితగ్రంథములందును గవచ్చు పెక్కుశబ్దము లీవిషయమున శబ్దరత్నాకరములో మఱియొకవిధముగాఁ గనవచ్చు చున్నవి. ఇందు కరసున్నలవిషయమై యొకదృష్టాంతము.

ఏఁగు-వేఁగు-వీఁచు; మూఁడు- వేఁకువ- తూఁపు- మొదలగు పెక్కుశబ్దములు సబిందువులై పూర్వగ్రంథములందు కనఁబడుచున్నవి ఇవి యన్నియు శబ్దరత్నాకరమున నిర్బిందువులుగాఁ గనఁబడుచున్నవి ప్రాచీనగ్రంథములలో నిర్బిందువులుగా నున్న-పరగు-తీగ- మొదలయి నయనేకశబ్దము లిందు సబిందువులుగా నున్నవి. కాలవాచక మైన నాఁడుశబ్దమును గొందఱు సబిందువుగాను మఱికొందఱు నిర్బిందువు గాను బ్రయోగించియున్నారు. అక్కఱనుబట్టి ప్రాసయందును శ్లేష యందును గొన్నిశబ్దములలోని యరసున్నలను గొందఱు విడిచిరి.

ఇట్లు నియమహీన మగుటంజేసి యర్ధానుస్వారవివేక మసాధ్య మగుటచేతను, ఈవిషయము పెక్కండ్రు పండితులు కూడి పరిశోధన చేసి నిర్ణయింపఁ దగినదగుటచేతను, పదునాల్గుసంవత్సరములనుండి వివాదగ్రస్తమై యున్నయీవిషయమునుగూర్చి యిద మిత్థ మని యిపుడు నిర్ణయించుట కవకాశములేక, వాదప్రతివాదములలోని సారాంశముల ననుసరించి నాయభిప్రాయ మించుక సూచించు చున్నాను.

౧. డుప్రత్యయనిమిత్తములు సంధినిమిత్తములు నైనయరసు న్నలు విడువఁదగినవి కావు.

ఉదా:—రాముఁడు-రాయఁడు-ఒకడు- వచ్చుచున్నాఁడు- ఉండుఁడు-
చేయఁడు-పోకుఁడు; చేయఁజూచెను. చూచుచుఁబోయెనుఁ.
వచ్చినఁజాలును. తాఁజదివె. మొద—

౨. దీర్ఘముమీఁది సిద్ధ మైనయరసున్న విడుచుట దోషము గాదు. పీంగు-పోండి-మూాండు-లోంగు- మేంక-కాంచు-పాంత- మొద

లగుపెక్కుశబ్దములలోఁ బూర్వము నిండుసున్న లే యుండెడివి.

వీఁగు నపారసత్వ...లోఁగిన పేర్మిశో సఖిలలోకములఁగా, వీఁడె ఖలుండు సర్వబాధ్యుండు, పోఁడిగ నగజశపశ్చైఖి। మూఁడుజగంబులను...బ్రాహ్మండము; కుమార—

ఇట్టిచోట్ల నండునిండుసున్నలు కాలక్రమమున నరసున్న లైనవి. కొందఱు తద్భవవాదులు మేషము—పీఠము—మున్నగు శబ్దములనుండి మేఁక-పీఁట-మున్నగు శబ్దములు పుట్టిన వందురు. ఆపక్షమున నరసున్నకు నిమిత్తమే కనఁబడదు. మఱికొందఱు పైశబ్దములు మూలద్రవిడమునుండి వచ్చిన వందురు. ఈపక్షమం దైనను వీనియుత్పత్తికి మూలము లైనధాతువులు తెలియునవ కాశము పోయినది. కావునను వీనిలోనినిండుసున్న చిరకాలము క్రిందటనే నగమై పోయి పలుకుబడిలోఁ బూర్తిగా నణఁగిపోవుట చేతను వ్రాఁతలోఁ గనవచ్చెడి యీయరసున్న వాదమునకే కాక నిజముగా వ్యుత్పత్తి సాధించుట కెంతమాత్రము నుపయోగపడక పోవుటచేతను ఇట్టివానిలోని యరసున్నను విడిచినను హాని లేదు.

ఉదా:—కోఁతి-పైఁడి-పాఁత-పాఁతఱ-ఆఁడుది- నాఁడు- పేఁడ-

డు-మూఁకుడు-మూఁగ-వాఁగు-తోఁచు-దాఁచు- ఈఁదు- కాఁ చు- వేఁచు-దాఁగు- రేఁగు- మొద—

పోఁగు-పోగు, నాఁడు-నాడు; తఱుఁగు-తఱుగు, వేఁచు-వేచు; ఇత్యాదులం దరసున్న యర్థభేదమును దెలుపును గావున నిది యావశ్యక మని కొందఱందురు.

అనేకార్థములు గల-కరము-బలము-ఈఁత-పోఁడిమి- మున్నగు పెక్కుశబ్దములను వాక్యములందు ప్రయోగించునప్పుడు కలుగనియర్థ సందేహ మరసున్న విడిచినంతనే సరూపములయిన శబ్దములయెడఁ గలుగునా? అది గాక వ్రాఁతలో నొకవేళ యర్థసంశయము వారిం చుట కరసున్న తోడ్పడు నని యంగీకరింత మన్నను, పలుకుబడిలో

లేనియరసున్న సంభాషణమం దెట్లాసంశయము వారింపఁగలుగును?
కావునఁ ద్వైవాదము నిరాధార మని కొందఱందురు.

3. కృత్ప్రత్యయ మైనతవర్ణకము నిమిత్తముగా వచ్చిన యరసున్న విడుచుటయు దోషము గాదు.

కోఁత- మేఁత- పోఁత- వ్రాఁత- మున్నగువానిలోని యరసున్న వలనఁ బ్రయోజన మేమియుఁ గనరాదు కావున వీనిని విడిచినను తప్పు లేదు. ప్రాచీనభాషాసంప్రదాయమునుబట్టి వీనియం దరసున్న వచ్చు నని కృత్ప్రకరణమునఁ జెప్పఁబడినది.

౪. తఱచుగా నిండుసున్నగా మాఱునట్టి హ్రస్వముమీఁది యరసున్న విడుచుటయుఁ దప్పు కాదు.

గరిఁటె-తఱుఁగు-వెఱఁగు-పెరుఁగు—మున్నగు పెక్కుశబ్దములలోని యరసున్న నిండుసున్నగా మాఱిన ట్లెక్కడనో కాని కానరాదు. కావున నిట్టియరసున్నను విడిచినను బ్రమాదము లేదు.

పద్యములు వ్రాయువారికి గణయతిప్రాసలయానుకూల్యమున రసున్నలు కావలెను. వచనము వ్రాయువారికి వానితోఁ బనిలేదు. సంభాషణములో నవి యున్నవో లేవో యెవరికిని దెలియరాదు. కాఁబట్టి యేశబ్దములలోని యరసున్నలు పద్యకావ్యముల నిండుసున్నలై ప్రయోగపడుచున్నవో యట్టిశబ్దములకు——వెలంది-వెలఁది, కడంక-కడక, తలంచు-తలచు, తొలంగు-తొలగు-అనునట్లుగాఁ బూర్ణబిందువు తోడిరూప మొకటియు నిర్బిందురూప మొకటియునుండు నని నిర్ణయించుకొనరాదా, ఒక్కఁడు-ఒకఁడు, కొమారుఁడు-కొమరుఁడు, ఎవత్తె-ఎవతె, యనునట్లు పెక్కుశబ్దములకు రూపాంతరములు లేవా, సంస్కృతములో - మంథనం-మథనం, తురంగః-తురగః, భుజంగః-భుజగః- అనునట్లు పెక్కుశబ్దములకు రెండేసిరూపములు లేవా, కన్న ములోఁ గొన్నిటికి సబిందు నిర్బిందురూపములు వేఱువేఱుగా

లేవా, ఇట్లు రూపద్వయ మంగీకరించినచో నుభయపక్షములకు మేలు కాదా, యని కొందఱందురు. సత్యమే. ఈపద్ధతి యుభయపక్షములకే కాదు భాషకే శ్రేయస్కర మగును గాని యట్టిశబ్దముల రెండు రూపములను నిఘంటుకర్తలు నిఘంటువులందు చూపవలసియుండును. అట్టి శబ్దకోశము నిర్మింపఁబడునంతవఱకును బద్యరచనకుఁ గావలసిన నిండుసున్నలతోడిరూపములకుఁ బూర్వకావ్యములే శరణ మగును గావున వచనకర్త లరసున్నలు విడిచినను వారియందు దోషారోపణము చేయుట యుచితము గాదని తోఁచుచున్నది.

శకటరేఫమునుగూర్చి సంజ్ఞాప్రకరణమున నించుక తెలిపియున్నాను. ఇది కూడ పూర్వమునుండియు నవ్యవస్థముగా నున్నదనుటకు, అథర్వణుఁడు మున్నగులాక్షణికులు రేఫము గలశబ్దములిన్నియనియు శకటరేఫముగల విన్నియనియు నిచ్చినసంఖ్యల నిందుదాహరించెదను. ఈక్రిందిసంఖ్యలు కొంచె మెచ్చుతక్కువగా నుండును.

| లాక్షణికులు | రేఫముగలవి | శకటరేఫముగలవి. |
|---|---|---|
| అథర్వణుఁడు | ౫౫౦ | ౫౦౦ |
| పెదతిరుమలాచార్యుఁడు | ౨౮౦ | ౩౦౦ |
| అప్పకవి | ౩౮౦ | ౪౩౦ |

పైలెక్క లొకదానితో నొకటి వేఱుపడునట్లే శకటరేఫమును నిర్ణయించు నితరలాక్షణికులసూత్రములును వేఱువేఱుమార్గములు త్రొక్కి ప్రాచీనకవిప్రయోగములకు విరుద్ధములగుచున్నవి. ఇంతకును గారణము ప్రాచీనార్వాచీనకవిప్రయోగములే యనుట విదితము. కవులు యతిప్రాసములకై రేఫఱకారములను దాఱుమాఱుచేయుచు వచ్చిరి కావుననే—మఱి-మరి, మెఱుఁగు-మెరుగు, మఱుఁగు-మరుఁగు, అనునట్లుగా ననేకశబ్దములు ద్విరూపము లైనవి. మఱికొన్ని లఘు

రేఫములు శకటరేఫము లైనవి. కావున దీనింగూర్చి కూడఁ బూర్వ గ్రంథములను జక్కఁగాఁ బరిశోధించినఁ గాని యిదమిత్థమని యిపుడు నిర్ణయింప వీలుపడదు. అయినను గొన్ని సూచనలు.

౧. సర్వనామవాచకములలో అందఱు-ఇందఱు-ఎందఱు-కొందఱు; ఆఱు-నూఱు; ఇద్దఱు, శబ్దములు మాత్రము శకటరేఫము కలవి. అఱువది-అఱువండ్రు లోనిది ఆఱుశబ్దమే.

౨. ద్విత్వ రేఫములు శకటరేఫములు - గుఱ్ఱము - ఎఱ్ఱని- మొ—

౩. క్రియాపదములచివర నుండు రేఫము శకటరేఫము కాదు. ఇచ్చిరి-వచ్చుచున్నారు-పోవుదురు-చేయఁగలరు-ఉంటిరి. మొ-

౪. ఇంకొకహల్లుతోఁ గలిసిన రేఫము శకటరేఫముగాదు-మ్రానుగుండ్రిన-వటు్రివ-చిదు్రిపలు.

౫. శకటరేఫ మింకొకహల్లుతోఁ గలిసినపుడు లఘురేఫ మగుట యర్వాచీనసంప్రదాయము, నూర్వురు-ఆర్గురు-పామ్రికి-మొ-తొంటివ్రాఁతలలో నూఱ్వురు- మొదలగురూపములే కనవచ్చును. పరిశోధనచేసి నిర్ణయించునంతవఱకును దక్కిన రేఫవివేకమునకు మహాభారతాదులేశరణము.

ఇది శ్రీహారితగోత్రాపస్తంబసూత్రాధీత సకలతంత్ర రామస్వామి శాస్త్రి పౌత్రుఁడును, శ్రీవెంకమాంబా శ్రీరామావధానిపుత్రుఁడును, విఖ్యాతకీర్తి శ్రీచర్ల బ్రహ్మశాస్త్రి గురువరకరుణాధీతపాణినీయుఁడును, సంస్కృతకవిజీవితాంధ్రదశరూపక భీష్మప్రతిజ్ఞాద్యనేక కృతి కర్తయునైన మల్లాది సూర్యనారాయణశాస్త్రి రచియించిన 'సూర్యనారాయణీయ' మనెడియాంధ్రభాషానుశాసనమందు ద్వితీయభాగము, సమాప్తము

# తప్పొప్పుల పట్టి

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు [పాఠణము కాదు. |
|---|---|---|---|
| 5 | 25 | హెచ్చుకుండాళ | హెచ్చుకుండాడ. ఉదా |
| 24 | 7 | యున్నది. | యున్నవి |
| 24 | 10 | మనవు | మనవు |
| 24 | 24 | ప్రత్యయములవర్ణాళ. | ప్రత్యయ లవర్ణాగ |
| 25 | 1 | నవర్గము | నవర్ణము |
| 27 | 3 | యాచ్ఛికము | యాచ్ఛికముల |
| 46 | 3 | కృష్ణరా- | స్వారంగ- |
| 90 | 10 | మహదమ | మహదమహ |
| 100 | 5 | ఇఱుతెఱ | ఇరుదెఱ- |
| 147 | 23 | కనంబడుచున్నది. కాని యిదితప్పుపాఠము-(అనిచదువు) | |
| 150 | 1 | వృష్టి వేదవు. | వృష్టి లేదవు. |
| 151 | 5 | సూ:— | * సూ:--ఇది చిన్నయసూరి |

మతము .ప్రాచీనమతము 113 పుటలోఁగ్రిందవివరింపఁబడినది.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 152 | | సూ. తర్థర్మార్థక | తద్ధర్మార్థక [ప్రాచీనము |
| 160 | 24 | అకారము. | అకారము. కాని కొలచు |
| 162 | 8 | మొద— | మొద-కానికొలయుప్రాచీనము |
| 63 | 12 | త్రోము- | తోము- |
| 177 | 20 | కరకాయ | కరకకాయ |
| 177 | 7 | ప్రమోగ | ప్రమోగము |
| 38 | 1 | గవచ్చు | గనవచ్చు |
| 11 | 21 | ఒకడు | ఒకఁడు |

---

